# నృత్తరత్నావళి

## ప్రథమ భాగము

శ్రీ జాయసేనాపతిగ్రంథమునకు
సాహితీవల్లభ వ్యాఖ్యానము

మహోపాధ్యాయ దర్శనాచార్య
లాక్షణికశిరోమణి సాహిత్యాచార్య
**శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ**
అభినవభారతి : గుంటూరు.

**శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి,**
తణుకు,



కృతిభర్త :

సాహితీవల్లభ, ఆంధ్రభోజ

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరి

## శ్రీ సాహితీవల్లభ, ఆంధ్రభోజ' కవిపండితవత్సల

# శ్రీ ముళ్లపూడి తిమ్మరాజచౌదరి మహాభాగాయ

### భా వో ప హా రః

౧ శ్రీమతే ధీమతే నిత్యం వాచా వైదగ్ధ్యహేతవే
భావోపహార ఏఽషోయం మాధవేన సమర్ప్యతే

౨ సౌజన్యం భవదీయ మాత్మసుభగం సంశ్రిత్యసాహిత్యకం
సౌహిత్యం తదుదారమిష్టమధురం సంభావ్యభావోత్తరం
ప్రజ్ఞాసంగతమాత్తసార మగజా సౌభాగ్యసంభూషితం
వాచావైభవమష్టగంధమధునా భావోపహారాయతే

౩ ఆంధ్రభోజాయ భావాయ సాహితీవల్లభాయతే
సాహితీవల్లభాభిఖ్యా వ్యాఖ్యాలంకృతసత్కృతిః

౪ నాట్యలోకకథాబద్ధ ధర్మద్వయ సమన్వితా
నర్తనాంగిక చారీణాం కరణానాం వివేచనీ

౫ అంగహార వివేకాయ ప్రక్రమంతీశివప్రియా
దేశీస్థానకరీతీనాం భ్రమరీణాం ప్రకాశినీ

౬ జనతారంజనే దేశీనృత్త శోభావిధాయినీ
దేశీలాస్యాంగ శోభాఢ్యా శిక్షారీతి సముజ్జ్వలా

౭ దేశీ పద్ధతి భావార్ద్రా సభాసభ్యగుణోత్తరా
నర్తకీబృందరూపాణాం సంభావన మనోహరా

౮ అపిస్వపరదేశీయాన్ నానావిధ కలానిధీన్
ప్రస్తుతస్తుతి వాచాలాన్నమ్యాన్విద్యావతోఽఖిలాన్

౯ మానయంతీ బహుజ్ఞాంస్తాన్కవీన్కీర్తి విధాయినః
మహారాజాధిరాజ శ్రీ గణపత్యుపలాలితా

౧౦ గుండమాత్యకృతోల్లాసా విదగ్ధపురుషాదృతా
సచేతఃకవి పాండిత్యవైదగ్ధ్య ద్యోతశోభితా

౧౧ జాయనాఖ్య సుధీసూక్త నృత్తరత్నావలీ కృతిః
మయాకౌండిన్య గోత్రేణ మాధవేన సమర్ప్యతే.

# సంస్కృతి.

శ్రీ కరుణశ్రీ

నిండు పున్నమరేయి పండు వెన్నెల హాయి
హసియించు కీర్తివైభవము వాఁడు
బృందారకోద్యాన మందారములపైన
విహరించు దాతృత్వ మహిమ వాఁడు
సాహితీలాస్యముల్ సౌహార్ద్ర సస్యముల్
పండించు బంగారు గుండె వాఁడు
సత్యసౌందర్యంబు నిత్యగాంభీర్యంబు
చిందించు పలుకు పసందు వాఁడు

"ముళ్లపూడి" మహాన్వయాంభోధి పూర్ణ
చంద్రుఁడాతఁడు, తిమ్మరాజేంద్రుఁ డతఁడు,
క్షణమొకండైన సఁగాని విశ్రాంతి లేని
"సత్యసాహిత్యనిత్య నిస్తంద్రుఁ"డతఁడు

ఆయన బుధులోహో!" యన
వ్రాయించెను వ్యాఖ్య "నృత్తరత్నావళి"కిన్
"జాయప"యే తన కృతు లం
దీయ మరల పుట్టె "సాహితీవల్లభుఁడై"

పొందు పఱిచిరి "అభినవానంద భరత"
దర్శనాచార్యులైన మాధవులు — నేఁడు
"నృత్తరత్నావళి"కి — సరిక్రొత్త వ్యాఖ్య —
పండితశ్లాఘ్య — సాహితీవల్లభాఖ్య.

అపుడా కాకతిచక్రవర్తి గజసైన్యాధ్యక్షుఁడై కూర్చె "జా
యపసేనాని" సుపర్వవాణి యుగమందా "నృత్తరత్నావళిన్".
తపనీయోజ్జ్వల తారహారమిది "ఆంధ్రశ్రీ" కువాగ్రంబులం
దపురూపమ్మగు వెల్గుచిందు నికముం "దా చంద్రతారార్కమై"

# స్వభాష

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారి జన్మదినోత్సవ సమయమున, నేను నా అనూదితమైన ఔచిత్యవిచారచర్చను, భావోపాయనముగా సమర్పించు నపుడు ఈనృత్తరత్నావళి ప్రశస్తి వచ్చినది. ప్రసక్తి కల్గినది. సాహితీవల్లభ గౌరవాభినందనాత్మకముగా సంకలనము పొందిన సాహితీవాల్లభ్యము ఆవిష్కరించునపుడు సాహితీవల్లభులు శ్రీ జాయసేనాపతి నృత్తరత్నావళీగ్రంథమును నేనాంధ్రమున వ్రాయుటను అభిలషించిరి. సూచించిరి. గుంటూరులోని సాహితీసదస్సమావేశమున నృత్తరత్నావళి నుపన్యసించు నన్ను శ్రీ చౌదరి గారు అభినందించి, గ్రంథమందించి, శాలువలిచ్చి. తాంబూలద్వయమిచ్చి, వ్యాఖ్యానమొనరింపు మనిరి. దీని నిట్లు వ్రాయ గల్గితిని. ఈ రచనలో మదరాసు విశ్వవిద్యాలయము ప్రొఫెసరు శ్రీరాఘవన్ పరిష్కరించిన ముద్రించిన రత్నావళీ గ్రంథము నాకు షడధ్వప్రక్రియగా సహకరించినది.

ఒకనాటి సాహితీసమితి సమావేశములో జాయన విశిష్టతను విని, నేను ఉత్సుకంపడితిని. నేటికి దీనినిట్లు ప్రకాశితము చేయగలిగితిని. నాకిందు సహకరించిన గ్రంథములు, నా కోశమున నున్న గ్రంథములు, నా హృదయ కోశమునకు, ప్రకాశ మిచ్చినవి. ఇది సుప్రకాశమైనది. నేనిదివరలో రచించిన ముద్రితాముద్రిత గ్రంథముల, సంవాదమును ఇందందుకొంటిని. ఈ గ్రంథ విశిష్టతను శ్రీరాఘవన్ చెప్పుటకు సమర్థులు. 'వారి భావరత్నములను కూర్చుకొని భావరత్నావళిలో నిరూపించితిని. ఆనాటి ఆంధ్రదేశీయమైన నాట్యసంపద విశేషించి ఆనాటి దేశీనృత్తసంపత్తి నేటికిని ఏనాటికైనను నాట్యసంవేదనము కలవారందరకు ఉపజీవ్యము, ఉపాదేయము నగును.

సాహితీవల్లభులు నా యీ సాహితీవల్లభవ్యాఖ్యా సంయుతమైన నృత్తరత్నావళీగ్రంథమును భావించి సంభావించి, భావోపహారముగా స్వీకరించుట సకలామోద కల్పసారముగా నున్నది. నాల్గధ్యాయముల గ్రంథమును ప్రథమ భాగముగా నిప్పుడు వెలువరించు చున్నాను. అనంతరమున్న నాల్గధ్యాయముల గ్రంథము రెండవభాగముగా ఆవిష్కృతము కాగలదు. భరతాభినవసమ్మతము లైన నాట్యధర్మ మార్గరీతి, విశేషములన్నియు నిందున్నవి. ద్వితీయభాగము దేశీనృత్త చారీవిశేషములు, శిక్షాపద్ధతి, నాట్యశాలావైభవము, సభాపతి

మర్యాదలు, మొదలగు వానితో నున్నది. మార్గదేశీయములు నృత్తరత్నావళిలో శ్రీజాయసేనాపతి వాచవైదగ్ధ్యశోభితములై గోచరించును. నాట్యసాహితీ ప్రియులు కవిసహృదయులు, విషయసమీక్షాచేతసులు, నటీనటులు, నర్తకీ నర్తకులు, ప్రాశ్నికులు, ప్రయోక్తలు అందరూ దీని నభినందింతురని నే నాత్మవిశ్వాసముతో నున్నాను.

ఈ గ్రంథమును ఇట్లు సర్వసుందరముగా ముద్రించిన శ్రీసురేంద్రనాథ సాహిత్యమండలి, శ్రీరాయల ముద్రణాలయము, వ్యవహర్తలందఱు విద్యాభిమానమున, విద్యావిదభిమానమున ముద్రింపుట అందఱ కామోదహేతువు. నాకత్యంత ప్రమోదకారణము మా కరుణశ్రీ సుకృతి చే నే నభినవానందభరితు నయితిని.

మాధవరామశర్మ.

---

# భావరత్నావలి

ఈ నృత్తరత్నావలీగ్రంథము మూడు మాతృకల యాధారమున సిద్ధ మయిన దని శ్రీరాఘవ పరిష్కర్తృ వచనము. పరిష్కృతాధారమున నా యీ గ్రంథము సిద్ధ మయిన దని నా వచనము. మూడు ప్రతులను చూచి చూచి సరిచూచి త్రుటితములు చూచి ఏకనిశ్చయమున పరిష్కరించి పరిష్కర్త నాకు ఆధారము కూర్చెను. పరిష్కర్తృ శ్రమఫలమును నే నందుకొని యిందు కూర్చితిని. సంస్కృతహృదయు డయిన పరిష్కర్త సంస్కృతగ్రంథము నిచ్చెను. నేను సాహితీవల్లభ సంధానించితిని. ఇందు లక్తై నన్నేమేని యనుడు. సంస్కృతపరిష్కర్తకు సర్వసంవాదములు సమర్పింపుడు. ఈ గ్రంథము నిట్లు పరిష్కరించుటకు శ్రీరాఘవన్ సహస్ర కరు డయ్యేను. నేను శతానందుడ నయితిని.

కల్యాణప్రభు శ్రీ సోమేశ్వరకృతి మానసోల్లాస మను అభిలషితార్థ చింతామణి, దేశీనృత్తవిషయ సహకారి యగు పార్శ్వదేవుని సంగీతసమయ సారము, కలాసేనాఖ్య కుంభకర్ణ కృతి నాట్యరత్నకోశము, సంగీతరాజము, సంగీతమీమాంస, వీరనారాయణ వేమభూపాల కృతి సంగీతచింతామణి, హరిపాలుని సంగీతసుధాకరము, రాజనారాయణుని సంగీతనారాయణము, వేద కృతి సంగీతమకరందము, దేవేంద్ర రచన సంగీతముక్తావలి, లాస్యపుష్పాంజలి, నృత్యనిరూపణము, నృత్యపుష్పాంజలి తులజరాజ కృతి సంగీతసారామృతము మొదలగు ప్రాచీనార్వాచీనము లయిన అముద్రిత గ్రంథములను శ్రీరాఘవన్ శతాక్షుడై చూచి దీని కీ యా కృతివిశేష మిచ్చెను. ముద్రితములను అముద్రితములను పరిశీలించి సంవాదవిసంవాదములను సమీక్షించి యింతగా జేసిన సరిష్కర్తను జాయసేనాపతియు గణపతిదేవుడును అభినందింతురు. నేను సంభావింతును.

శ్రీజాయసేనాపతి నృత్తరత్నావలీ నిర్మాత జాయాఖ్యుడు సేనాపతి గజసాధనికుడు. జాయ జాయన జ్యాయన జాయసేనాపతి నామప్రసిద్ధితో

నిందు గోచరించును. జాయసేనాపతి జాయచమూప జాయనార్య గజసైన్య నాథ జాయన దంతిసైన్యపతి జాయసేనాధినాథ నామము లిందే యున్నవి. మహారాజ గణపతిదేవుడు కలియుగము ౪౩౫౫ ఆనందసంవత్సరమున కాకతీయ రాజ్యము పాలించు నపుడు A. D. 1253–1254 గ్రంథావిర్భావము. జాయన దేశీనృత్తము ప్రచలిత మగుట పరిశీలించి రచించుట నృత్తరత్నావళిలో నున్నది.

కాకతీయు లాంధ్రరాజ్య స్థాపకులు. విశిష్ట సాంస్కృతికోద్యమ నిర్మాతలు. వేంగీచాళుక్యప్రభువులు నట్టివారలు కారు. గణపతిదేవుడు ఆంధ్రసామ్రాజ్య సంస్థాపకుడై మహారాజాధిరాజు అయినాడు. అప్పటి కృష్ణాతీరమున అయ్య వంశము వారి కన్యలను పరిణయమాడి వారి సోదరు డయిన జాయనను తన యధీనమున నుంచి సర్వవిషయముల సంతరిత వానిని జేసి చేయించి గజసైన్యాధ్యక్షు నొనరించెను. గుండూరు మండలము నందలి చేబ్రోలు గ్రామ మిచ్చెను.

కాకతీయప్రభువు డాలు దయిన జాయనను గుండామాత్య సఖీన మొనరించి కలాశ్లాఘనీయునిగా జేసెను. ఈ యంశ మీ గ్రంథమునందె కలదు. గుండామాత్య గన్నామాత్య విశేషములను చరితవిదులు చెప్పుదురు. తరువాతి కాలమున సాలుడు దయిన ప్రతాపరుద్రుని సమయమున నున్న గుండామాత్యు డీ గుండామాత్యు డగుట యారవార్త. గణపతిదేవుడు సారస్వతప్రభువు నయి నందున జాయసేనాపతి ఈ నృత్తరత్నావళి రచించెను. గీతరత్నావళి రచించి నట్లు నిందే కలదు.

కాకతీయప్రభువులు సంస్కృతవిద్వత్కవిపోషకులు. సర్వవిధ సంస్కృత మార్గనిర్మాతలు. నృత్తరత్నావళి గీతరత్నావళి ప్రతాపరుద్ర యశోభూషణము బాలభారతము నలకీర్తికౌముది కృష్ణచరితము సౌగంధికాహరణము కాదంబరీకల్యాణనాటకము మహాభారతనాటకము మొదలగునవి కాకతీయపాలక సమాదరముననె వెలువడినవి. జినేంద్రకల్యాణాభ్యుదయము అర్ధప్రతిష్ఠ వెలువడినవి. నీతిశాస్త్రముక్తావళి నీతిసారము క్రీడాభిరామము ప్రేమాభిరామము ఇప్పటివె. రాజరుద్రీయ శ్లోకవార్తికవ్యాఖ్య కాకతీయ చరితము మలయవతీ గద్యకావ్యము ఖండనఖండఖాద్యటీక మొదలగునవి

కాకతీయపాలనమున వెలసినవె. సోమనాథ తిక్కన మారన శ్రీనాథాదు లీ ప్రభువుల నాటివారె, ఇంక నెంద రెందరో కలరు.

ఆంధ్రప్రభువులు చిరకాలముగా నాట్య సంగీతములను సాదరముగ పోషించుటను అమరావతి నాగార్జున శిల్పములు చెప్పును. భరతాభినవులు సూచించిన పిండీబంధాదు లనేకము లాంధ్రదేశము నందలి శిల్పవిశేషము లలో సాక్షాత్కరించు చున్నవి. ఒక నా డాంధ్రపాలకులు నర్తకులకు నట్టు వలకు గాయనీగాయనులకు భూములిచ్చిరి. భవనము లిచ్చిరి. గ్రామము లిచ్చిరి, కాకతీయశిల్పములలో నానాటి కలాభిజ్ఞతయు గోచరించును. రామప్పదేవాయతనమున జాయన నిరూపితము లయిన కతిపయ భంగీ విశేషములును గోచరించును. అప్పటి నచటి విశేషముల నాంధ్రకవులు నుగ్గడించిరి. స్వయంభూదేవాయతనమునను గొన్ని కలవు. సోమనాథుని పండితారాధ్యచరితము పర్వతప్రకరణమున నృత్యసంకేతము లున్నవి. దేశీ నృత్తము లున్నవి. శివరాత్రినాడు శ్రీశైలమున వెడయాటలు చిందులు కోడంగి యాటలు జరుపుట సోమనాథకృతిలో నున్నది. జాయన చెప్పినవి తెలుగుపలుకులలో సోమనాథుడు చెప్పినవి సమముగా నున్నవి. దేశీలా స్యాంగము లీ గ్రంథమున కొన్నియె యున్నవి. పాల్కురికి పుస్తకమున నింక నున్నవి. అవి యాతని యానాటి సమీక్షాప్రసవములు. సోమనాథుని నాట్యదర్శనము సవిశేషముగా ననుశీలనార్హము.

వెడయాటలు, చిందులు, కోడంగి ఆటలు, బోడంగాటలు, పంచాశి పేరణి, బహునాటకములు, రెఖ, బహురూప, కరణములు, మెఱవణములు, గతులు, వెడ్డంగము, గడలపై ఆటలు, మ్రోకులపై ఆటలు, బొమ్మలాట, కోలాటము మొదలగునవి యెన్నియో సోమనాథుని పదములలో నలిగినవి. ఇట్టివి కొన్ని బసవపురాణమున నున్నవి. క్రీడాభిరామమున నున్నవి,

మాచల్దేవి నాట్యము, కుమారగిరి భావనము, బసవరాజీయ నాట్య శాస్త్రము, వేమభూపాలుని సంగీత చూడామణి, శ్రీనాథుని కాశీఖండములోని కర్పూరతిలకానాట్యము, సర్వజ్ఞసింగభూపాలుని రసార్ణవసుధాకరము సంగీత సుధాకరము మొదలగునవి యెన్నియు నానాటి నాట్యసంగీత దర్పణము.

గోపేంద్రతిప్పభూపాలుని తాలదీపిక తాలప్రబంధము చతురకల్లినాథుని సంగీతరత్నాకరవ్యాఖ్య కలానిధి, శ్రీకృష్ణదేవరాయ సమయమున వెలసిన లక్ష్మీనారాయణుని సంగీతసూర్యోదయము మొదలగునవి యా యా కాలముల నాటి ఆంధ్రుల నాట్యసంగీత వివేక నిదర్శనములు. చతురదామోదరుని సంగీతదర్పణము దేవన or దేవేంద్ర రచిత మయిన సంగీతముక్తావలియు నిట్టివి. రఘునాథనాయకుడు విజయరాఘవనాయకుడు తమ నాట్యసంగీత శక్తిని తమ తమ పాలనసమయములలో వ్యక్తము చేసిరి. ముడుంబ నరసింహాచార్యుని భరతసర్వార్థ సంగ్రహము సోమనార్యుని నాట్యచూడామణి శుద్ధసత్త్వవేంకటాచార్యుని అర్జునాది మతసారము ఇట్టి వన్నియు నట్టివి. ఇంక నిట్టి వెన్ని కలవో ?

యక్షగానములు క్షేత్రయ్యపదములు కూచిపూడి భాగవతుల రీతులు త్యాగరాజకృతులు మొదలగునవి నాట్యసంగీత లక్షణలక్షిత లక్ష్యములుగా నంతట నందరికి యాసక్తి సూచకములుగ నున్నవి. ఆ యా సమయములలో నా యా ప్రభువులు సహృదయులు వీని స్వరూప గౌరవ విస్తృతి నిదాన మయినారు. ఈ గ్రంథముల విషయ విశిష్టత వివేకపోషోచ్ఛలనము సంవాదవిసంవాదరీతి సర్వము తద్విదగ్రగామి శ్రీరాఘవన్ నిరూపింప సమర్థుడు. భరతకోశనిర్మాత శ్రీమానవల్లి సమర్థుడు. "కోశవాన్ ఆచార్య!" అని కదా! మా రాయడుశాస్త్రి సూక్తి.

భరత నాట్యవేద భూమిలో జాయన నృత్తరత్నావలి మాననీయ సంభావనీయ గ్రంథము. ఇందలి సూచీవిన్యాస మిట్లున్నది. ఇం దెనిమిది యధ్యాయములు కలవు.

౧. అధ్యాయము వర్తనవివేకమని దీనిపేరు. ఇందు ౭౪ శ్లోకము లున్నవి. గౌరీశివులస్తుతి గణేశస్తవము కలదు. నృత్తప్రశంస గ్రంథకృత్ప్రశంస గ్రంథప్రశస్తి యున్నది. నాట్యావతారము నిరూపిత మయినది. నాట్య లక్షణ మున్నది. నాట్యశబ్ద నిష్పత్తి అభినయశబ్ద వ్యుత్పత్తి అభినయభేదములు ఆంగిక వాచికాహార్య సాత్త్వికభేదములు నాట్య నృత్య నృత్తములు మార్గ దేశీ భేదములు లాస్య తాండవ రూపములు లాస్యాంగములు నిరూపితము లయినవి.

౨. అధ్యాయము అంగ నిరూపణ మని పేరు. ౩౪౭ శ్లోకములు కలవు. కొంత భాగము త్రుటిత మయినది. ఆంగికాభినయ విస్తరణ మిందున్నది. అంగప్రత్యంగోపాంగములు తద్భేదప్రభేదములు నిరూపితములు. సంయుతాసంయుత హస్తములు కలవు. శీర్షాదిపాదాంత కర్మలు కలవు. కరకర్మలు హస్తకరణములు హస్తప్రచారములు బాహుభేదములు నృత్తహస్తములు నిరూపితము లయినవి. అంతట నన్నిటికి లక్షణములు వినియోగములు నున్నవి.

౩. అధ్యాయము చారీ స్థానక మండల లక్షణ మని యీ యధ్యాయ సంకేతము. ౧౫౦ శ్లోకము లున్నవి. ఇందు పాదగతులు చారీవిధానములు వాని స్వరూపవివేకము వినియోగవిశేషము, పాదావస్థానరూప మయిన స్థానకము న్యాయచతుష్టయము ప్రవిచారములు వ్యాయామరీతి సౌష్ఠవావశ్యకత ఖర్వతామానము ధనుఃకరణములు సంక్లుప్తము లయినవి. ఆసనభేదములు సుప్తస్థానములు స్త్రీస్థానములు మండలముల లక్షణవినియోగము లుపయోగములు నిర్దిష్టములయినవి.

౪. అధ్యాయము కరణాంగహార వివేచనము. ౩౭౭ శ్లోకము లున్నవి. ఇందు కర పాద సంచారాత్మకము లయిన ౧౦౮ కరణములు, కరణసమూహాత్మకము లయిన ౩౨ అంగహారములున్నవి. రేచకములు నిరూపితము లయినవి.

ఈ యధ్యాయ చతుష్కమున మార్గరీతి యను భరతమార్గరీతి నిరూపిత మయినది. అనంతరము భరతానంతరము దేశసంప్రదాయములలో ననుగతములుగా వచ్చిన నానావిశేషముల నిరూపణ మున్నది. వీనికి దేశీరీతులని పేరు. పంచమాదులలో వీని ప్రతిపాదన మున్నది.

౫. అధ్యాయము దేశీస్థానకాదిలక్షణము. ఇందు ౧౦౬ శ్లోకము లున్నవి. దేశీలక్షణము నిరూపణము తదావశ్యకత ఆనాటి దేశీరీతి పోషక ప్రభు వయిన గణపతిదేవుని వర్ణన మున్నది. దేశీస్థానకములు ఉత్ప్లుతి కరణములు దేశీభ్రమరులు కలవు.

౭. అధ్యాయము దేశీ పాట చారీ లాస్యాంగ లక్షణము. ౧౬౧ శ్లోకము లున్నవి, దేశీపాదములు పాటమణులు దేశీచారులు దేశీలాస్యాంగములు గతులు సంకీర్ణగతులు కలవు.

౮. అధ్యాయము ప్రకీర్ణవిషయము. ౮౩౭ శ్లోకము లున్నవి. నృత్తారంభము శిక్షాపద్ధతి తదర్హ కన్య రంగభూమి శిక్షాదండిక నృత్తరహస్యము భావప్రాధాన్యము వాద్యపద్ధతి శుద్ధచిత్రభేదములు పుష్కరవాద్యము నిరూపితములు. సప్తమోత్తర భాగమున రంజనప్రధానము లయిన ఆసక్తిజనకము లయిన నృత్యరీతు లున్నవి. దేశీనృత్తభేదము లిచట నభివర్ణితము లయినవి. పేరణి సూడ నర్తనము రాసకము చర్చరి నాట్యరాసకము శివప్రియము చింతు కందుకనర్తనము భాండికనృత్తము ఘటిసని చారణనృత్తము బహురూపము కోలాటము గోండలి నిరూపితము లయినవి. నర్తకాదులు సంప్రదాయము బృందము కలవు. అధ్యాయాంతములో రంగశాలావైవిధ్యము ఆకృతి నాట్యమండపవర్ణనము సభాపతి సభ్యలక్షణములు నిరూపితము లయినవి.

౯. అధ్యాయము సాధారణవిషయకము. ౯౩ శ్లోకములు కలవు. ప్రేక్షాకాలము సభాపతి సమాగమనము పరివారము బృందవిన్యాసము ఆతోద్య మేలనము నర్తకీప్రవేశము యవనికాచతుష్టయము తదపసరణము నర్తకీబృంద కవి ప్రభృతులకు సమ్మాననము కలదు. గ్రంథ మింతటితో సమాప్త మగును.

ఈ నృత్తరత్నావలి ఆంగికమునె విస్తరించినది. వాచికమును ప్రతిపాదింప లేదు. రసభావములను చెప్పలేదు. కావ్య నాటక రచనా ప్రక్రియలను జూపలేదు. నృత్తమున కుపయోగించు సంగీతమును వాద్యమును నిరూపింప లేదు, గీతరత్నావలిలో నపేక్షితములను చెప్పితి నని జాయన యనెను. ఆ గ్రంథము లభింపలేదు.

నాట్యనృత్యరీతి రెండు సంప్రదాయముల నున్నది. ఒకటి మార్గసంప్రదాయము భరతప్రోక్తము వేరొకటి దేశి. అప్పటప్పట నా యీ దేశములు విలసిల్లి నట్టిది. జాయగ్రంథమున దేశీనృత్తనిరూపణమె ప్రాధా

న్యము వహించును. అయినను మార్గరీతి యుపేక్షితము కాదు. అపేక్షిత మయినంత సమీక్షిత మయినది. మార్గప్రతిపాదనమున లభించిన గ్రంథముల నన్నిటిని జాయన సమీక్షించెను. నాట్య సంప్రదాయమును సుబద్ధ మొనరించెను. భరతపూర్వతనుల భావములను గూడ నిబంధించెను.

భరతుడు నాట్యవేదమున ప్రతిపాదించిన ఆంగికవిషయముల నన్నిటిని నృత్తరత్నావలి అధ్యాయచతుష్టయమున ప్రతిపాదించినది. జాయ సేనాపతి భరతుని ఏబది పర్యాయములకు పైగా స్మరించి కీర్తించెను. భరతుని ముని యనెను. ఇతరుల ప్రామాణ్యసంవాదమును పంచాశదధికస్థలములలో కీర్తించెను. "ఆచార్యాః, ఏకే, అన్యే కేచిత్, పరే" పదములతో పరమతములను డెబ్బది స్థలముల కన్న నధికముగనె నిరూపించెను. కోహలుడు, తుంబురుడు, బృహద్దేశీకర్త యగు మతంగుడు ప్రస్తుతు లయినారు. దేశీవికసనమున మతంగుని మాన్యత మాననీయము. మతంగుని నాలుగు పర్యాయములు స్మరించి రెండు పర్యాయము లాతని భావముల నుల్లేఖించెను.

శ్రీమదభినవగుప్తుని అభినవభారతి తనకు సర్వవిధముల సహకరించుటను జాయనయు చెప్పెను. మనకును దెలియును. కీర్తిధరుడు ముప్పది మూడు పర్యాయములు భట్టతండు విరువదిమూడు పర్యాయములు సంస్మృతు లయినారు. చాలుక్యప్రభువు సోమేశ్వరు ననేకస్థలముల కీర్తించెను. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము జాయసేనాపతి నృత్తరత్నావలి సంవాదము కలవియె కాని గజసేనాధినాథు డా పేరులు పలుకనే లేదు. భరతుని భావభారమును తాను స్పష్టముగ గుర్తించినట్లు జాయ కాత్మనిశ్చయము కలదు. "ప్రోక్తం జాయచమూపేన మునే రాశయవేదినా" సమపాద చారీ నిరూపణములో హస్తసంఖ్యా నిరూపణములో అంగహారావస్థానములో నింకను గొన్నిటిలో భరతాశయ వేదిత్వమును స్పష్టము చేసెను. నాట్యవేదము నందలి యంగహారములలో నే యే కరణము లుండ దగునో తదవస్థాన మెట్లుండునో అభినవభారతి సూచించినను ఆశయవేది యింకను విశదము చేసెను. ముద్రిత భరతాభినవపంక్తి శోధనమునకును జాయగ్రంథము సహకారి. భరత గ్రంథ ప్రయుక్త పదసార్థక్య సమీక్షాపరాయణుడై జాయన ఆశయవేది యయ్యెను.

కోహలు డొకడు కీర్తనపాత్రు డయ్యెను. ఉత్తరతంత్రమున కోహలుడు శేషము చెప్పునని భరతుడె యనెను. ఉత్తరతంత్రము జాయపునకే అనుతంత్ర మయినది. ఆ అనుతంత్రమును జాయన చూచెనా? తుంబురుడును సంస్కృతుడు. ఆతడు భరతపుత్రు డని జాయన యనెను. భరత పుత్రనామములలో తుంబురు నామము లేదు. దేశీపద్ధతి నిర్మాతలలో మతంగుడు ప్రధానుడు. దేశీసంగీతము దేశీనృత్తము దేశీవాద్యము సర్వము మతంగబృహద్దేశి జాయబృహద్దేశి చూచి యుండును. ఆ భావములు కూర్చి యుండును.

భరతాభినవులు తండు నామమె సూచించిరి. జాయన భట్టతండువును పలుకును ౧౫ స్థలములలో భట్టతండు భావములను జాయన నిరూపించెను. జాయన తండునామమున ననవలసినవి యని భట్టతండునామమున కొంత యనెను. భట్టతండువు వ్యాఖ్యానము కలదట. భట్టతండుతో కీర్తిధరాచార్యుడును జాయన పేర్కొనిన వారలలో నున్నాడు. అభినవగుప్తుడును కీర్తిధరుని పేర్కొనెను. జాయన అభినవు డుదాహరించిన కీర్తిధరభావములు గ్రహించెనా? కీర్తిధరగ్రంథము చూచి యుదాహరించెనా? జాయన అంతట అభినవగుప్తునె యనుసరించును. కొన్నిట కీర్తిధరు ననుసరించుటయు గలదు. భరతుడు చెప్పిన నృత్తహస్త నామములను కీర్తిధరు డన్యనామముల వ్యవహరించెను. దీని నన్యమత మని యభినవు డనెను. కొన్నిట నేమియు ననలేదు. భరతుడు చెప్పకున్నను భరతభావ మని కీర్తిధరు డనిన కొన్నిటిని జాయన స్వీకరించెను. ఇట్టి విశేషములు చారీవిషయమున గూడ గలవు. ముఖ్యములయిన కరణముల విషయమున గూడ అభినవభారతి "ఊఁ" యనని కీర్తిధరభావములను జాయపతి పరిగ్రహించినాడు. ఇరువదియైదు కరణముల విషయమున జాయన కీర్తిధరునకె కీర్తి నిచ్చెను. ఇట్టి కీర్తిధరు డొక విశిష్టగ్రంథము రచించి యుండును. అది భరతగ్రంథవ్యాఖ్య కాదు. కాని కీర్తిధరగ్రంథము లభింప లేదు. సేనాపతికి లభించి యుండును. జాయన తరువాతవారును కొందరు కీర్తిధరగ్రంథము చూచి యుందురు. అంతగా నభిమానస్పదుడైన కీర్తిధరుని గూడ స్వతంత్రుడై జాయన "నాతిపేశలం" అనెను. ఇది అభినవప్రభావమా?

శ్రీశంకుకు డొక స్థలమున పరామృష్టు డయ్యెను. ఆతడు నాట్యశాస్త్రవ్యాఖ్యాత. ఆతని భావముల నభినవుడు నిరూపించినందుననె తెలిసినవి.

అర్ధనికుట్టక కరణ నిరూపణమున అభినవుడు చెప్పిన శ్రీశంకుకభావమునె జాయపతి సమీక్షించెను.

అభినవగుప్తుని ఒక్కపర్యాయము మాత్రమె జాయన నామమున వ్యవహరించెను. కాని భరతాభినవభావములె జాయన గ్రంథములో నున్నవి. అభినవగుప్తుని అభినవభారతి లోని పంక్తులను జాయన శ్లోకరూపమున కూర్చి నట్లంతట గోచరించును. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరపంక్తులు ననా మోల్లేఖమున నిందున్నవి. అంతకన్న నభినవ పద పాటము లిందు బహుల ముగా నున్నవి. అభినవభారతీ పంక్తి పరిశోధనమునకు జాయరచన చక్కగా సహకరించును. అభినవగుప్తుని వాక్యముల లోని భావార్ధమును గుర్తించుటకు జాయన రచన సహకరించుటయు నున్నది. జాయన రచనలో భరతానుసరణ కన్న అభినవభారతీ పదారాధనమే సమధికముగా నున్నదని గుర్తింప వచ్చును. ఆ యా హస్తముల నానావినియోగస్థలము లందు అభినవుని నిర్ణ యములనే జాయన స్వీకరించెను. కరణాంగహారముల లక్షణములను నిరూ పించుటలో భరత, అభినవుల పదములను కలియ గలిపి జాయన శ్లోకీకరిం చుటయు త్రికము చూచిన వారలకు గోచరించును. అభినవుడు చెప్పదలచిన దానిని చెప్పి చెప్పి "ఇత్యుపనిషత్" అనగా జాయన చూచి చూచి "రహస్య మిద మీరితమ్" అనెను. కరణలక్షణములను భరతుడు పరిమితముగా నిరూ పింపగా అభినవగుప్తుని విశదీకరణము జాయనకు సహకరించినది. అందు ననే సర్వము అభినవభారతినుండి జాయన గ్రహించుట స్పష్టముగా గోచరించు చున్నది.

అంగహారములలో, జాయపతి అభినవగుప్తచ్ఛత్రచ్ఛాయలో సంచ రించినాడు, అచట నది యత్యంత మావశ్యకము. రేచితాంగహారములో నుండ వలయు కరణముల నభినవుడు చెప్పెనని జాయపతి వ్రాసెను. భరతుడు స్పష్టముగ చెప్పక సూచించినాడని అభినవగుప్తుడు వివరించినవానిని జాయన సమగ్రముగ నందుకొనెను. కొన్నిపట్టుల అభినవగుప్తుని భావ ముటుంచి తనభావ మిదిగో! యనెను. కొన్నిపట్టులలో నభినవగుప్తుని భావము నున్నవిధముననే గ్రహించెనా? అనియు ననిపించును. ఇతరభావముల కాద నుటలోగాని అవుననుటలోగాని అభినవుని స్వాతంత్ర్యమును జాయ తనదిగా

జేసికొనెను. ద్విశతాధికస్థలములలో నభినవానుసరణమున జాయపతి బలము కలవాడనుట ఇంతటి గ్రంథము రచించుటకు సమర్థుడయినా డనుట యగును. అప్రతిక్షేప్యసిద్ధాంతము ననుసరించినా డనుట యగును.

సోమేశ్వరుని జాయపతి రెండుపర్యాయములు నామోల్లేఖమున కీర్తించెను. హస్తముల పరిగణనములో గోండలీ నృత్య నిరూపణములో సోమేశ్వరుని స్మరించెను. అనేకస్థలములందు నామోల్లేఖము లేకుండగనే సోమేశ్వరభావమును చెప్పెను. అన్యే, అపరే పదములచే కొన్నిస్థలము లందు సోమేశ్వరుడే భావనీయుడు. "అన్యతంత్రవిధాయినః" ఇది సోమే శ్వర సూచకము. సోమేశ్వరుడు పశ్చిమచాళుక్యప్రభుపు. కళ్యాణనగర మేలినరాజు అభిలషితార్థ చింతామణి రచించినవ్యక్తి. అదియే మాన సోల్లాసము. శార్ఙ్గదేవుడు పార్శ్వదేవుడు తమగ్రంథములలో దేశీరీతులు నిరూపించిరి. గోండలి, గొండలి నృత్యము సోమేశ్వరుడు తెలిసికొనినాడట. ఒక మహోత్సవమునాడు "భిల్లీ" వేషమున నృత్యమొనరించుచున నర్తకిని చూచి చిత్రగోండలీ విధానమును సోమేశ్వరుడు నిరూపించెను. మహారాష్ట్రభాషలో భిల్లీపదము గోండలీ పదమైనది. ఇంక నిట్లే కొన్ని అంశములను జాయన సోమేశ్వరునినుండి స్వీకరించెను. సోమేశ్వరుడు నిరూపించిన కతిపయవిషయ ములు భరతగ్రంథమున లేవు. అట్టివానిని జాయపతి మతాంతరము లనును. అంగోపాంగముల భేద నిర్ణయములలో మతాంతరము సోమేశ్వరునిదే. దేశీ పద్ధతులలోకూడ సోమేశ్వరానుసరణ మున్నది. దేశీస్థానకములు, ఉత్ప్లుతి కరణకములు, సోమేశ్వరుడు చెప్పుటను జాయ గుర్తించెను. ఇట్లే సోమేశ్వ రానుసరణ మున్నది. "అన్యాపరాది" పదములతో మరికొందరిని స్మరిం చెను. వా రెవ రెవరో తెలియుటలేదు. అభినవభారతిలో కొంతమంది అన్యే పరే పదవాచ్యులున్నారు. వారు నెవ రెవరో? అట్టివారి మతములు కొన్ని సంగీతరత్నాకరమున కలవు. పదునారు విధములుగా అన్యులు కీర్తితులైనారు. శార్ఙ్గదేవుడుకూడ వీరిలో నొకడగునా ?

నృత్తరత్నావళి, సంగీతరత్నాకరము రెండును అభినవభారతీ చ్ఛాయలో నున్నవి. జాయసేనాపతి కాకతీయ గణపతిదేవ సమయమున

నృత్తరత్నావళి రచించినాడు. శార్ఙ్గదేవుడు యాదవసింఘణ సమయమున సంగీతరత్నాకరమును రచించినాడు. 1247లో యాదవప్రభువు గతించెను. అప్పటికి రత్నాకర మావిష్కృతమై యుండును. 1254లో నృత్తరత్నావళి రచితమైనది. అదివచ్చిన పిమ్మటనే ఇదియు వచ్చినది. కాని దానిపేరిందులేదు. అప్పటిలో కాకతీయులకు యాదవులకు కల భావభేదములు కారణములై యుండవచ్చును. రత్నాకరానుసరణము రత్నావళిలో కనపడును. రత్నాకరము మనసులో నుంచుకొని జాయ తనగ్రంథమును రచించి యుండును. ఈభావములను సిద్ధపరచుటకు తగిన సన్నివేశములు రత్నావళిలో కలవు. రత్నావళీరత్నాకర వాదసంవాదములను బహుళముగనే చూడగలము.

ఈ రెండిటిని చూచు నపుడు పార్శ్వదేవుని చూడ వలయును, సంగీతసమయసారము ఆతని కృతి. దేశీలాస్యాంగముల నిరూపణములో జాయసేనాపతి సూచించిన విశేషములు పార్శ్వదేవసంవాదములో పరిశీలింప తగి యున్నవి. ఇతరులు చెప్పని దేశీలాస్యాంగములను నేను చెప్పుదు నని పార్శ్వదేవు డనెను. దేశీరీతులలో పార్శ్వదేవానుసరణ మున్నట్లు ఆ యా సాంకేతికపదముల వలన కూడ స్పష్ట మగును. ప్రేంఖణము నిరూపించుటలో పుష్పాంజలి నిరూపించుటలో జాయలో పార్శ్వదేవుడు కన్పించుచున్నాడు. దేశీనృత్తము నందు పాదవిన్యాసరూపము లైన పాటమణులు కలవు. దేశీనృత్త మొకపయోరాశి. ప్రేక్షకమనోహరము లగు కొన్నిటిని మాత్రమే దేశీప్రియుడు నిరూపించెను.

గజసాధనికుడు జాయనార్యుడు ఈ విధముగా నిందరి ననుసరించియు స్వాత్మనిశ్చయమున కొన్నిటిని చెప్పినాడు. "వయం, మన్మతమ్, స్వయం మన్యామహే, తన్న మన్యామహేవయమ్, ప్రోక్తం జాయ చమూపేన, మయాఖ్యాతాః, మన్మతమ్, బ్రూతే జాయచమూపతిః" ఇత్యాది వచనములు తన్ను గురించి తానే చెప్పుకొనెను. గీతరత్నావలిలో చెప్పవలయు వానిని చెప్పెను. గీతనృత్తములు రెండును ఆతని రత్నావళీరూపములు.

జాయసేనాపతి ప్రాచీనుల ననుసరించెను. అర్వాచీనులు జాయసేనాపతి ననుసరించిరి. నృత్తరత్నావలీ గ్రంథోపయోగమును అర్వాచీన

లోక మందుకొనక పోలేదు. ఇది దేవనాగరీ లిపిబద్ధమై ప్రచారము పొందెనది. ఉత్తరభారతమున దక్షిణభారతమున నిది వ్యాపించియె యుండును. సంగీతరాజమున కుంభకర్ణుడు నృత్తాధ్యాయమున నీ రత్నావలి నుపయోగించుకొనెను. వేమభూపాలుడు సంగీతచింతామణిలో మహారాటా ప్రభు వయిన తులజ సంగీతసారామృతములో రత్నావలీరీతుల ననుకరించిరి.

ఈ గ్రంథమున జాయపతి తన వైశిష్ట్యమును సూచించెను. ఇందున్న మార్గదేశీరీతులు రెండిటిలో జ్యాయన కన్పించుచునె యుండును. కరణము లంగహారనిష్పాదకములు. కరపాదాదులచె కరణములు నిష్పాద్యములు. కరణముల ప్రాధాన్యము గుర్తించిన యధిప్టులు కొన్ని దేవాయతనము లందు కరణములను శిలాఫలకము లందు నిర్మింప జేసిరి. అట్టి వచ్చటచ్చట నున్నవి. అన్నియు తగినంత సంవాదము కలవిగ చేవు. కరణములలో నుండవలయు కరపాదాదుల యవస్థితి యంతట సంపడించుట లేదు. కొన్ని భరతాభినవకరణలక్షణముల నున్నవి. భరతాదు లంగీకరించిన కరణక్రమమును మార్చి జాయన వేరువిధమున క్రమ మునిమానించెను. ఆ యా దేవాయతనములందు నృత్తగానములకు నియుక్తులయిన వారు, వారి వారి పాటవమున ప్రదర్శించిన కరణములు శిలాఫలకముల గూడుకొని యన్యాన్యరూపములు కలవయినవి. ఒక్కొక కరణమున నెన్నియో యవస్థానములు భంగివిశేషము లుండును గావున శిల్ప మొనరించు వారు ఒక్కొక యభిరుచివిశేషమున నొక్కొక యవస్థానము కూర్చియుండురు. కాకతీయరాజ్యము నందలి రామప్ప దేవాయతనమున గొన్ని సుందరశిల్పము లున్నవి. వానిలో కొన్ని కరణభంగులు కొన్ని దేశీరీతులు కొన్ని యవస్థానవిశేషములు జాయసేనాపతి నిరూపించిన లక్షణలక్షితములై యుండుటను గుర్తింపవచ్చును. సంపూర్ణముగా నొకకరణమును శిలాఫలకమున దర్శించుట కెచ్చటను సౌకర్యముండదు.

నృత్తరత్నావలిలో నానాటికి నభివ్యాప్తము లయిన దేశీరీతు లర్హ గౌరవమున నిరూపితము లయినవి. గణపతి పాలన సమయమున నభివ్యాప్తమయిన దేశీరీతిని జెప్పుదునని జాయన యనెను. భాషాసంవాదమున దేశీవికాసమును గుర్తింప వచ్చును. సంస్కృతానంతరము ప్రాకృతము దేశభాషల

కనుసంధానభాష యయినది. అపభ్రంశప్రాకృతము ప్రాభవము కలదై భరతా నంతరము నాట్యనృత్యానుసంధాన మొనరించిన వారల సంకేతవిన్యాసముల కాధార మయినది. భరతార్వాచీనులు తా మనుసంధాన మొనరించిన వాని నన్ని టిని ప్రాక్తనవిధానముల కనుసంధింప జేసిరి. కొందరు సంస్కృతాభిజ్ఞులు ప్రాక్తనవిధానముల కనుబద్ధములై యుండుట కర్వాచీనములకు సంస్కృత నామములను సిద్ధపఱచిరి. జాయసేనాపతి నవీనములగు దేశీవిధానములకు వేరు విభాగ మంగీకరించి నిరూపించెను. శార్ఙ్గదేవు డట్లొనరింపక అట్టి వానిని ప్రాక్తనముల కనుబంధరూపముననె కూర్చెను. ప్రాక్తన సంప్రదాయమున కనుబంధముగా నుండు నట్టి యనుసంధానము సార్వదైశికముగా మఱల జరుగలేదు, లోకానుసారమున నింకను వచ్చిన విశేషములను పరిష్కరించి రచయితలు కూర్చిరి. అది యదనుగా నవనవాయోజనములు వచ్చి చేరినవి. సోమేశ్వరాదు లిట్టి యనుసంధాతలు కొన్ని ప్రాక్తనముల కనుబద్ధము లయి నవి. కొన్ని వేరుగా నిలిచి "మేము" అనినవి. స్థానక కరణ భ్రమరి పాద పాట చారి లాస్యాంగ గతి విశేషములు సార్థక్యము వహించినవి, పేరణి రాసకములు చర్చరి శివప్రియ చింతు కందుక భాండిక చారణ బహురూప కోల్లాటములు దేశీరూపము లయినవి. జాయసేనాపతి యుతరసంవాదమున వీని స్వరూప మావిష్కరించెను.

మతంగుని బృహద్దేశి సంగీతమున దేశీవిధానముల పరిష్కరించి ప్రదర్శించినది. సంపూర్ణ బృహద్దేశీగ్రంథమున దేశీనృత్తములకు సంబంధిం చిన సర్వవిశేషములకు స్థానము కలదని నిశ్చయింప వచ్చును. సంగీతరత్నా కర వ్యాఖ్యానమున కల్లినాథుడు కోహలుని సంగీతమేరువు నుండి బాహువర్త నములను చాలకములను విస్తరముగా నిరూపించెను. ఆ సంగీత మేరు వేమ యినదో?. కావున సోమేశ్వరుని సంకలన గ్రంథమునుండి దేశీరీతిని గుర్తింప వలసి యున్నది. సాంకేతిక పదము లన్నియు సంస్కృతపదములై కన్పట్టు టయు కాలాంతరమున సంస్కృతేతరభాషాపదములుగ నుండుటయు గుర్తింప దగి యున్నది. భరతు డనకున్నను కోహలాదు లనినందున "చతుష్పంచా శచ్చారీణాం దేశీత్వం ద్రష్టవ్యం" అని కల్లినాథు డనెను. దేశభాషాభాషితము లయిన దేశీనృత్తరూపము లింకను నవనవములుగ నుండుటయు భావనీ యము. కొన్ని దేశీచారీనామములు ప్రాచీనపదములుగ నున్నను అందలి

హస్తపాదాదివిన్యాసములు వేరుగా భాసించుటయు గలదు. పాటమఋలు మధుప సంజ్ఞకములు దేశీచారులె యగు నని కోహలుడు భావించె నని కల్లినాథు డనును. దేశీచారుల కంతట మార్గచారీనామములె యున్నను భౌమాకాశ భేదము లట్లై యున్నను దాని రూపనిష్పత్తి భిన్న భిన్నముగ నున్నది. కలాత్మక ప్రయోగ ప్రవాహమున మార్గదేశీరూపముల పృథగ్వ్యాపత గుర్తించుట సులకము కాదు. మార్గదేశీ రూపములు వ్యామిశ్రము లైనవి కోహలునివని కల్లినాథుడు సూచించిన వానికి భరతసంకేతములు లేవు. నారదుడు దేశీగాన సంకేతములను కొన్నిటిని సూచించినాడట. అవి సామాన్య నియమానుగతముగ నున్నవా? దేశీనృత్తమున సార్థత్వమును సమీక్షింప రాదని దేశీభావు లనగలరు. భాషాపరిణామములు దేశీవిధానములలో సక్రమించి శనైః శనైః సంక్లుప్తములై సంగృహీతములై సహభావులై సిద్ధస్వభావములై సమాయోజితము లయినవి. దేశీప్రాబల్యము వలన నిట్టి వంగీకార్యములు కావలసి వచ్చినవి

దేశీభంగులు దేశీవలనములు వర్తనములు మార్గమార్గమునసె చేరినట్లయినవి. జాయన నిరూపించిన దేశీస్థానకములలో కొన్ని సోమేశ్వరాంగీకృతములె. కూర్మాసన నాగబంధములను జాయ వేరుగా జెప్పెను వీని నితరులును జెప్పిరి. మార్గస్థానకములకు కొన్నిట సామ్యము గోచరించును. కాని నిర్వచనము వేరుగా కన్పడును. కొన్ని స్థానకములు కరణాంతర్గతములుగ నున్నవి. దేశీస్థానకముల లోని సమసూచి ఖండసూచి విషమసూచి యనునవి కించిద్భేదమున మార్గమువలె భాసించును. ఇట్లే దేశీ చారీవిషయమున గూడ భావింప వచ్చును.

ఉత్ప్లుతికరణముల నిరూపించుటలో జాయన సోమేశ్వరు ననుసరించెను. ఇతరులును సూచించిరి. కొంత కొంత భేదము మాత్రము గోచరించును. ఉత్ప్లుతి కరణములలో అంచితములు అలగములు లోహడీ విధానములు కలవు. వాని పేరులు ప్రాకృతప్రభావితములు. భ్రమరీరీతులు మార్గపద్ధతిలోని కరణములను చారీరీతులను స్ఫురింప జేయగలవు. వానికి కొన్నిట యనుసంధానమున నీ నామభేదము కలిగిన దనిపించును. దేశీపాదములు సామాన్యముగా నన్నియు పాదకర్మప్రాయములు. మతంగుడు దేశీపాదములు నిరూపించెను. దేశీనృత్త సముద్రము నుండి కొన్ని పాటమఋల నుద్ధరించి

నిరూపించినట్లు జాయన చెప్పును. ఈ దేశీపాటములు భూతాడనమున గలుగు విశేషములు. ఇవి పాదనికుట్టన రూపములు. పాదనికుట్టనాఖ్య చారీ విశేషములకు మధుప సంజ్ఞ కలదు. మార్గచారీనిరూపణానంతరము దేశీచారీనిరూపణము తదనంతరము దేశీపాదములు నిరూపించుటయు రత్నాకర కర్త యాదరించెను. కావున వాని పరస్పరసంబంధము స్పష్టముగా నున్నది.

జాయసేనాపతి ౧౬ దేశీపాదములను ౨౮ పాటమణులను ౪౨ దేశీచారులను నిరూపించెను. సోమేశ్వర శార్ఙ్గదేవ పార్శ్వదేవులును అటుగానిటుగా వీని నంగీకరించిరి. దేశీపాదములను సోమేశ్వరుడు నిరూపింపకున్న నితరు లంగీకరించిరి. కొంత వ్యత్యాస మున్నది. కొన్నిట నామభేద మున్నది. మార్గప్రసిద్ధము లయిన నామములు దేశీవిషయమునను ప్రయుక్తము లయినవి. కాని భావభేదము కలదు. మార్గనామము లున్నట్లు మార్గలక్షణములు నామభేదమున దేశీరీతుల కాయోజితము లయినవి. అట నట నిది స్పష్టముగనె గోచరించును.

దేశీలాస్యాంగములు రంగరంజకములుగా నున్నవి. లాస్యాంగములను భరతుడు నిరూపించెను. నాటకశాస్త్రమున వీని కనుప్రవేశ మున్నది. భరతనిరూపిత మార్గలాస్యాంగములను జాయపతి మొదట నిరూపించెను. భోజుని శృంగారప్రకాశములో వీని రమ్యరూపము కలదు. గీతనృత్తములతో దేశీలాస్యసంబంధమును భోజుడె ప్రథమముగా నిరూపించెనా? పార్శ్వదేవుని స్పష్ట నిరూపణము జాయసేనాపతి నిరూపణమున కాధారమై యుండును. తాను తలచిన సంపూర్ణవిధమున వీనిని నిరూపించిన జాయపతికి రత్నాకర సూచితము లంతగా నావశ్యకముగా భాసించి యుండవు. భరతలాస్యాంగములకు దేశీలాస్యాంగములకు భేద మున్నది. భరతలోక్తములు నృత్యవిధానములకు మూలరూపములు, దేశీరీతులు. రంజనప్రధానములై చమత్కారమాసాదించు స్వభావమున నుండును. అందుననే వానిలో గీతము, లయ, వాద్యము వాదనోపకరణములు, నృత్యము, భంగివిశేషము, అవస్థానములు, సంపూర్ణ రేఖలు ఆంతరాళికావస్థానములు మొదలగు నవి కలవు. దేశీలాస్యాంగములు రసభావసముల్లాసమునకు, కళాత్మకసమీక్షా విధానమునకు తగియున్నవి. కావుననే ఈ విషయమున జాయసేనాపతి రచన ప్రత్యేకప్రాధాన్యము కలదై శోభాబహుళమై, సహృదయతర్పకముగా నున్నది.

ఈ లాస్యాంగములలో సౌష్ఠవము ముఖ్యము. ఇది కలది నర్తకి యగును, ఖర్వత సావధానముగా సమీక్షింప దగినది. స్థాపన ఆకర్షకమై నృత్తములోని యాద్యంతరమ్యతా సూచకముగనుండును. రేఖ అసాధారణ మైన రమ్యత నిచ్చును. అనలంకృత మైనను సాలంకృతముగా గోచరించు నేని రేఖ యున్నట్లు. డాల చాలి త్రికని ఢూకలి మొదలగునవి అన్నియు నాట్యపద్ధతికి శోభాసంపాదకములు. వీనిలోని కొన్నిటిని కొందరే చెప్పిరి. నృత్తారంభ సమయమున నర్తకి వాద్యానుకూలముగా బ్రవర్తించుట యావశ్యకము. ఇట్టి వానిలోని కొన్ని విధానములు దేశభాషలలో నధికముగా మార్పుపొంది యున్నవి. సుగీత వాద్యత సర్వసమ్మేళమున యోగ్యతాసంపాదనము లాస్యాంగముల కన్నిటికి శోభావిశేషములు సంపాదించునవి. ఉపు విధానము గతి సౌందర్య మిచ్చును. ఇంకను కోమలిక ఒయారము. నర్తకి నర్తనములోని విశిష్టతను సూచించునవిగా నున్నవి. మనోధర్మము లత్యంత మావశ్యకము. ముఖరసము ఆహార్యశోభానుతులముగా, భావప్రకటనానుకూల ముగా విశేషము సంపాదించునది శేవ, విహసి, ఢసక, నృత్యపద్ధతులలో లాఘవ చమత్కారములను సంపాదింప గలవు. ఖండనము నృత్త మొనరించిన నర్తకి సౌష్ఠవమును సూచింప గలదు. వేషభూషాదిత నర్తనారంభ ములో నెట్లుండునో నర్తనానంతరమున గూడ అక్లిష్ట వలె అమ్లాన వలె కాంతి కాంతగా నుండ వలెను. ఈ దేశీలాస్యాంగములలో రంజకతా విశేష మున్నది రమ్యత యున్నది. పాల్కురికి సోమనాథుడును. ముఖరసము సౌష్ఠవము లలి భావము, ధూకలి, ఝుంకలి, శేవ, విభ్రమ రేఖాదులను సాదరముగా నిరూపించెను. నృత్తరత్నావలీ కర్త లాస్యాంగముల నభివర్ణించుటయే గాక వాని వాని యాయోజనము వలన కలుగు దేశీనృత్తవిశేషములను సాభిలాషముగా జెప్పెను.

గోండలీవిధానమును సోమేశ్వరుడు నిర్మించెను. కల్యాణకటకమున నొకప్పు డొక భిల్లాంగన ఆటలాడినది. ఆ యాటను నియమానుసారమున పరిష్కరించి గోండలీవిధి యనెను. మహారాష్ట్రభాషలో భిల్లి గోండలి. గోండు జాతి వనిత యగును. ఈ గోండలీవిధిని జాయపతి కుండలి యనెను. గోండలి సంస్కృతమున కుండలి యయినది. గోండలి చిత్రగోండలిగా వ్యాపించి నానాభావ భావనమున కవకాశ మిచ్చినది. జాయన గోండలీనృత్తమును

వర్ణింపలేదు. రత్నాకరకర్త కొంతగా రూపము నిరూపించెను. సంగీతముక్తావలి గోండలి కుండలినీశక్తిగా భావించి దేశీనృత్తమునకును యోగప్రాభవము ప్రతిపాదించెను. దేవను డింకను భావించి శుద్ధగోండలి సంకీర్ణగోండలి భేదముల జెప్పి యిందు సంకులనృత్తము కూర్చి బహుపాత్రప్రకల్పిత మొనరించి యీ నృత్తాంతమున పిండీబంధయోజనమును జెప్పెను. గీత వాద్య తాల ప్రబంధమును జెప్పెను. జాయనయు నిరూపించెను.

పేరణీవిదానము విస్తృతముగా ప్రతిపాదిత మయినది. పేరణి ప్రేరణియై శైవసంబంధ శోభ కలది యయినది పేరణీనర్తకుని లక్షణములు భావనీయములు. ఇతరులు కొంతగా జెప్పగా జాయన యింతగా జెప్పెను. పేరణితో ననుయాయులును రంగమునకు వచ్చి పరివేష్టించి యుండుటయు నిందు గోచరించును పేరణి నృత్త కైవార ఘర్ఘర వికట గీతముల సంబంధమున రంజన మిచ్చును. ఇవి పంచాంగములు. వీని స్వరూపపరిష్కారమున కొంత భావభేద ముండవచ్చును. కైవారము ప్రాకృత పదము. ఇది కవిచారమని శార్ఙ్గదేవు డనును. ఘర్ఘర వాద్యమున నా రేడు రూపములు కలవు, వేమాదులు జాయన ననుసరించిరి. పేరణి పాదమున నీ చిరుగజ్జెల మ్రోత లుండుట యీ ఘర్ఘర విశిష్టత. తాలసహితములు రహితములు నయ్యు నివి రంజకములు, కొందరు తాలసహితముగనె యుండవలయు నందురు. వికటనృత్త మొకటి యున్నది. అది "వాగడ" మనిరి. మర్కట పిశాచాది హాస్యవేష సమాశ్రయము హాస్యకరము. పేరణివిధానము పశ్చిమభారతములో సౌరాష్ట్రములో తెలంగాణములో బాగుగా వ్యాప్త మయినట్లు రత్నాకరము రత్నావలి ఆరాధ్యచరితములు సూచింపగలవు. ప్రాచ్య భారతములో నామసంకేతమె కాని వ్యాప్తిసూచనము లేదు. శుభంకరుని సంగీతదామోదరము కాని, ఘనశ్యాముని సంగీతసారసంగ్రహము కాని, రఘునాథరథుని నాట్యమనోరమము కాని సరిగా చెప్పగలవి కాలేదు పేరణిలో అంగవిక్షేపబాహుల్య మున్న దనుట అభినయశూన్యత యున్నదనుట అనుట యగునా?

ప్రేంఖణమును జాయన చెప్పెను. పార్శ్వదేవుడు చెప్పెను. రత్నాకరము చెప్పలేదు, దేవుడు కొంతయె చెప్పెను. జాయన విశేషములు చెప్పెను ఉద్ధతము లయిన ఉత్ప్లుతి కరణాదు లిందున్న వనెను. ఈ ప్రేంఖణము

పేఖ్ఖణము ప్రేఖ్ఖణము నయినది. సంస్కృతమై ప్రేక్షణము నయినది. ఈ నృత్త మెటుత్పన్న మయినదో ఎట్లభివ్యాప్త మయినదో చెప్పుట యెట్లు? సంగీతముక్తావలిలో దేవనుడు ప్రేంఖణనృత్తము గీతశబ్ద ప్రబంధజన్య మని నానార్థరస సంపన్న మని నరనారీప్రవర్తిత మని విచిత్ర మని మహోహారి యని స్వేచ్ఛాకల్పితక్రమ మని యనెను. ఈ నృత్తవిషయమున నాయన చెప్పవలయు వానిని జెప్పెను.

రాసకము బృందనృత్యము పాలకాభిరుచ్యను సారమున పాత్రలుందురు. భరతుడు నాట్యవేదమున పూర్వరంగము చెప్పి పిండీబంధముల ననేకముల నిరూపించెను. వాని సంబంధ మిం దభ్యూహ్యము. పిండీబంధములలో విశేషముల వ్యాఖ్యానించుచు నభినవగుప్తుడు సజాతీయ విజాతీయ సమ్మేలనముల జెప్పెను. "నర్తకీ యోజ్య మయిన పరస్పరసంబంధమె పిండీబంధము. ఏకానాలావబద్ధ కమలయుగము వలె సజాతీయము, హంసవదన పరిగృహీత నాల నలినము వలె విజాతీయమును. గుల్మము శృంఖలికా శబ్ద వాద్యము నర్తకీత్రయ ప్రయోజ్యము. వేరొకటి లతాబంధము చతుష్టయ ప్రయోజ్యము. ఇది సజాతీయవిజాతీయాత్మకము వైచిత్ర్యసహము" అనెను. ఇంకను విశేషముల జెప్పెను. శారదాతనయుడు భావప్రకాశములో నింకను విశేషము సూచించెను. సంభూయనృత్తము గుల్మ మని, అన్యోన్యబంధనాత్మకము శృంఖల యని, పరస్పరాంగవేష్టనమున లతానృత్త మని, ఒక్కొకడు వెలిగానుండుట భేద్యకనృత్త మని యనెను. చాల నెమ్మదిగా నగునది గుల్మము, కొంత వేగ మున్న శృంఖల, మధ్యమరీతిలో నుండునది లత, అధికవేగమున నుండునది భేద్యక మనియు ననెను. పిండీబంధములకు యంత్రము భద్రాసనము శిక్షాయోగము మూల మని ప్రామాణికుల నిర్ణయము. ఈ విషయము భోజశృంగారప్రకాశమున నింకను గలదు. పిండనమున పిండి యని గుంభనమున శృంఖల యని, భేదనమున భేద్య మని, జాలవత్ లత యని జాయన నిశ్చయము. అవాంతరవిషయముల నిందు జాయపతి విస్తరింపలేదు. పురుషులు, నిం దుందు రనెను. నరనారుల యాహార్యమును సూచించెను. రంగప్రవేశము సూచించెను. చర్చరీరాగముల సంబంధమును దేశీగీత సంబంధమును సూచించెను. అం దుండువారి పునః పునః ప్రవేశనిష్క్రమణములను సూచించెను.

రాసకము గోపీకృష్ణుల రాసలీలాసూచకము. రాసము రసము నుండి వచ్చినది. రాసతాలము ననుసరించియు నున్నది. నూడగీతము రాస మున్నది. అది రాసతాలానుసారి. రాసకము లాసకము సంబద్ధములె. శృంగారప్రకాశము లోని భోజరాసకభావములు జాయరాసకములో నున్నవి. నాట్యరాసకము కొందరిలో చర్చరి యయినది. చర్చరీగానముతో పాత్రప్రవేశ ముండును. పోషకుల వీరశృంగారరీతులు బుతుకీర్తనము నుండును. మండలాకారమున నీ నృత్త ముండును. భోజు డింకను దీని విస్తరించెను రాసక నాట్యరాసకములు చర్చరితో నుండును. పదార్థాభినయాత్మకమై యుండును. హిందోలరాగ సంబంధ మందర కభిమతము. దండరాసకములో దండములు కోలాటపు కర్రలు నియతకృతిలో నిర్ణీతము లం దావశ్యకములు ఈ నృత్తమున దండములనే కాక చామరములు పట్టుదురు. చురకత్తులు పట్టుదురు. "దండచామరే ఛురికాదండకా" ఆ యా దేశీవిధానముల బట్టుదురు. పాత్రప్రవేశమున నొక చమత్కారప్రక్రియ యున్నది. మొదట నెనిమిది మంది వత్తురు. నలుగురు నలుగురుగా వారు వృద్ధిపొంది యరువది నాలు గగుదురు. రెండు బారులుగా నుందురు. ఇందు భోజభావములను గుర్తించుట మంచిది.

శివప్రియము శివాదేవిప్రియము శివదేవప్రియము నగును. ఇది శైవనృత్తము. శివోత్సవసమయముల ప్రదర్శనయోగ్యము. నానావాద్యము లున్నవి. శార్ఙ్గదేవుడును దీని జెప్పినాడు. ఇందలి వాద్యము పెద్దది, లోహనిర్మితము. సర్పాకృతి. ఇందలి వారి యాకృతి శైవదీక్షాకృతి. చిందు నృత్యము చిందు. జాయన చెప్పినట్లె వేమ దామోదర దేవనలు చెప్పిరి. చిందులు ద్రవిడవల్లభములు. జాతరలలో చిందు లున్నవి. పటహములు తప్పెటలు వినబడును. తిరుగుబాటుతో నుద్యమము పూనువారును చిందులు వేయింతురు.

కందుకనర్తనము కందుకఖేలనముగా కావ్యములలో నున్నది. దండి దశకుమారచరితములో "కందుకావతి" పేరు తెచ్చుకొన్నది. కందుకతంత్రమును కలదట! కామినీకర ప్రహారము కందుకభాగ్యము. ఆ యాటలో కరణ మధుర విహారము రమణీయము. కందుక మాడు నాడు పిల్ల నొక కవి వ్యానతరతాసక్తగా వర్ణించెను. ఆ కందుకమును చూచి కాముకు డొకడు

కందుకకృతిత్వము సంభావించెను. అవనమనోన్నమనములతో నాడు నపుడు నేలపై కందుకగతు లనేకవిధముల నుండును, కందుకనృత్త మొక ప్రౌఢ నాట్యము నగును. చారులలో గతులలో లాస్యాంగములలో నిది సంక్రాంత మగును. భాండికనృత్త మొకటి భావనీయము. పశుపక్షుల కూతలు కూయు వారు హాస్యకారులై లయానుగతముగా వర్తనము సల్పుదురు. ప్రభువుల చిత్తరంజన మున కుద్వేగశాంతికి మనఃపరావర్తనమున కిది యుపయోగించును. ఈ యనంతరము ఘటిస స్త్రీ నృత్తమును జాయన నిరూపించెను గాని యది విస్పష్టముగ లేదు. ఇది ఘటిస ఘడస ఘటస పదముల వ్యవహారము నిందున్నది. ఇందు ఘటిసుని స్త్రీ నృత్త ముండునా? అయిన ఘటిస శ్రీ ఘటిసస్త్రీ కావచ్చును. ఇందలి స్త్రీ చండాలవనిత మధురగాత్ర ఆధ్యాత్మిక తత్త్వకీర్తనము లాలపించును. చర్యాపదములు పాడును. హుడుక్కా వాద్యము స్కంధమున ధరించును. చుట్టును నారీనరులు చేరుదురు. వేణు వూదుదురు. వాద్యములు మోగింతురు. ఇది ప్రధానముగా స్త్రీనాట్యము.

చారణనృత్తమును ఇచట భావనీయము. ఇది గుజరాతమున ప్రసిద్ధము. ఉదాత్తు లాచరింతురు. దోధక నృత్తము ననుసరించిన గేయము లుండును. కుంభకర్ణుడు దీనిని దోధకనృత్త మనెను. ఇది లలితము సుద్ధ తమునై రంజకముగా నుండును. వామదేవీయమున నిది యున్నదట. బహురూపనృత్తము బహుగ్రంధములలో నున్నది. సంగీతమకరందము సంగీత సారము సంగీతకౌముది సంగీతదామోదరము సంగీతనారాయణము మొదలగు నవి దీని నిరూపించుటచే నిది దేశవ్యాప్తమై యుండును. నాటకీయపద్యములు భాషీయభాషణములు వాస్తవికతాస్ఫురణములు బహురూపములో నున్నవి. వేగముగ వేషము మార్చుట పాత్రోచిత పద్యపఠనము నానాభాషాభాషణము దీనిలో నున్నవి. నరులు నారు లిందు సహకరింతురు. దీనిలో సోమనాథుని సంవాదము నున్నది "క్రమమొంద బహునాటకము లాడువారు, లలితాంగ రసకలాలంకార రేఖ లలవడ బహురూప మాదెడు వారు" ఇవి పాల్కురికి వచనములు. ఆంధ్రదేశములోని పగటివేషముల వారు బహురూపులు.

కోల్హాట నృత్తము త్రాటిపై నడక గడపై సాము. బరువు మోతలు ఎత్తెగురుటలు ఇందున్నవి. జాయన చెప్పినంతగా శార్ఙ్గదేవుడు చెప్పలేదు.

విజయదశమి దసరా మహోత్సవములలో నివి భావితము లయినవి దోంబులు మెమ్మరు లీ యాట సాగించిరి.

ఇట్లు దేశీనృత్తములను జాయసేనాపతి చెప్పిచెప్పి సర్వసాధారణ విషయములను సముచితముగా నిరూపించెను. నర్తక ముఖరి ప్రతిముఖరి బృంద ముఖ్యగాయక లక్షణములను జాయపతి సంగతముగ ప్రతిపాదించెను. వేణువాదకులు మధురకంఠ లయిన మగువలు నుండవలయు వా రందరు బృందమున నుందురు. బృందసముదాయము సంప్రదాయమై ఉత్తమోత్తమ-ఉత్తమ-మధ్యమ-అవర-కనిష్ఠ భేదమున ప్రసిద్ధమై నియతవ్యక్తియుతమై యుండుటను జాయన విశదముగా ప్రతిపాదించెను.

ఇట్లింతగా జెప్పవలయు నది చెప్పి చెప్పి జాయసేనాపతి భరతాభిముఖుడై నృత్తశాలా వైభవము కీర్తించెను. శాలాత్రయము తద్యోగ్యత తద్రూపవైభవము సర్వము భరతభావప్రతిబింబము. రంగపీఠ రంగశీర్ష భాగద్వయ ప్రతిపాదనమున సమీక్షకులు భావభేదముల పెంచుకొనిరి. జాయన రంగశీర్షమె చెప్పెను. బహుజనపరివార ముండు రాసకాదుల కది యోగ్య మని భావించి యుండును. మహారాజ్ఞి మహారాజసమీపమున నుపవిష్టయై యుండుటను జాయసేనాపతి యంగీకరింప లేదు. అనంతరము సభాపతి సభ్యులు మాన్యులు ప్రేక్షాభవనమున నుపవిష్టులై యుండవలయు విధానము సూచిత మయినది. రంగశీర్షమున నాలుగు స్తంభముల సంవిధానముతో నొక మండప ముండుటను అచట యవనిక లుండుట నర్తకీద్వయము ప్రధాన నర్తకి యచట నుండుటను జాయన నిరూపించెను. ఇట్టి రంగశీర్షమున ప్రయోగము సుకర మని రమ్య మని జాయన భావించి యుండునో? రంగమున నుండవలయు యవనికల సౌందర్యము నిరూపిత మయినది. ఈ ప్రఘట్టమున నర్తకి యాహార్యము భావనీయము. సర్వాంగసౌష్ఠవాభివ్యక్తికి నేపథ్య మల్పముగా నుండవలయుటను అగ్నిమిత్రుని మాలవికను జూచి భావింపగలము.

నాట్యరహస్యమును జాయసేనాపతి సప్తమాధ్యాయమున సూచించినాడు. అది నాట్యప్రాణము. నృత్త గీత వాద్యముల సామరస్యము సభాపతి నాత్మపతిగా భావించుట ప్రేక్షకాభీష్టప్రయోగము సర్వము రసభావపర్యవసానము పొందుట భావనీయము.

ప్రయోగారంభమున గంభీర మయిన నాదపూరణము వాద్యప్రయోగము సర్వము నిరూపిత మయినది. ఇక నృత్తప్రయోగ మావశ్యకము. దాని నర్తకి చేయును. ఎట్లుగా చేయునో నిరూపితము కాలేదు. పూర్వనిరూపిత సంస్కారమున నది సర్వము భావనీయ మని జాయన భావించెనా? ఉః ప్రఘట్టమున నావశ్యకము త్రుటిత మయినదా? సహృదయత్వమున నృత్తసౌందర్యము సంభావించిన సభాపతి నర్తకి సమ్మాన మొనరించుట కవిగాయకాదులకు సమ్మాన మొనరించుట సర్వము భావనీయము. సభాపతి ప్రవేశమున ముఖ్యనర్తకి ప్రవేశమున జాయన సూచించిన విశేషము లానాటి సంప్రదాయములకు సూచకములుగా నున్నవి.

శ్రీ జాయపసేనాపతి యీ గ్రంథము నిట్లిట్లు రచనము చేయుట యభినందనీయముగ నున్నది. జాయన రచనాధికారము కల రచయిత. కవితా సౌందర్యము నిరూపించిన కవయిత. విషయబంధ రమ్యత సూచించిన ప్రబంధ తద్విదాహ్లాదకర మయిన నృత్తరత్నావలి రచించి విశిష్టతను వెలయించిన మేధావి.

ఇప్పటి కిట్లు నిరూపించిన దంతయు నృత్తరత్నావలీ గ్రంథభూమికార్థముగా శ్రీరాఘవన్ నిరూపించిన మహార్థమునకు సంగ్రహార్థము. శ్రీరాఘవరచన పెద్దది, నా యీ రచన చిన్నది. ఇట్టి రూపసిద్ధికి వలయు వానిసి సేకరించితిని. తద్భావసంవాదము పొందనివి యేమేని యున్నచో నవి నా భాషాగతములు. సాహితీవల్లభ రచన సర్వము రాఘవచ్ఛాయాబలసంపన్నమె. ఇంకను నే నేమేని యనుసంధాన మొనరించితినా? సంస్కృత గ్రంథభావము నా భాషలో ననుగత మగుటకు నే నేమేని యొనరించినచో నది నా సంస్కారసంవాదసంపన్న మని సహృదయులు సంభావింతురు.

అస్తు.

శ్రీ మాధవరామశర్మ

# శ్రీ సాహితీవల్లభ, ఆంధ్రభోజ
# శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరి
# వంశవైభవము.

ఆంధ్రదేశమునందు కమ్మవంశమునకు సంబంధించిన విశిష్టత చిరకాలముగా దేశమంతట ప్రసిద్ధముగా నున్నది. దేశసంరక్షణోద్యమములో భద్రతాపరిరక్షణములో నటునిటు సామరస్యసంధానములో కమ్మమహాజను లనేకవిధములుగా ప్రశస్తి సంపాదించినారు. ఆంధ్రసామ్రాజ్యవైభవమునకు కాకతివంశపాలకప్రభువులు హేతువనుటలో సర్వచరిత్రము నిదానము. కాకతీయాన్వయ మత్యర్కేందుకుల ప్రశస్తిక మని విద్యానాదుడు నిరూపించెను. ఒకప్పుడు క్షత్రియపాలకులలో కొందరయిన సూర్యచంద్రవంశమర్యాదానుయాయులు స్వసమకాలమున నన్యుల యొత్తిడి కొదిగి యుదాసీనులై యుండగా కాకతీయక్షత్రపాలకు లొత్తిడి నెదుర్కొని ధర్మనిష్ఠులై కర్మవీరులై యుండుటచే నత్యర్కేందుకుల ప్రశస్తికల వారయి కలవారయినారు. నాటి కాకతివంశమువారికి నేటి కమ్మవంశమువారికి కల సంబంధము చరిత్రసంవేద్యము. ధర్మి కర్మి వంశమువారలకు విశిష్టత యున్నది. అట్టి కర్మివంశగౌరవము కమ్మవంశ గౌరవమునకు నిదానము. కమ్మమహాజన వంశభద్రములయిన సంప్రదాయార్థము లింకనుండవచ్చును. స్వధర్మకర్మాసక్తులై దేశభద్రతకు తమ పాలనశక్తిని నీతిజ్ఞతను ప్రజ్ఞావిక్రమగుణసంపదను వెలయింపజేసిన కర్మవీరులు కమ్మవీరులు. వీరు కమ్మవారుగా తెలుగునాట ప్రసిద్ధులు. ఒకనాటి యలజడిలో జడిమ లేక ప్రవర్తించిన కమ్మవారి రక్షణ ధర్మమాంధ్రదేశ మంతట ధర్మకేతన మయినది. అట్లిప్పటి కమ్మవారు సంపద్వైభవసంపాదనము కన్న భద్రతావైభవసంపాదనమునకు రక్షణశిక్షణవైభవసంపాదనమునకు సాంస్కృతికవైభవసంధానమునకు యత్నించినారని శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరి గారిని గుర్తించి నప్పుడెల్ల గుర్తునకు వచ్చును.

ఈనాటి పశ్చిమగోదావరిమండలమున కమ్మవారి వంశములందు సుప్రసిద్ధ మయిన శ్రీ ముళ్లపూడి వంశము వారి విరిష్టత విశిష్టబంధువంశముల వారల కందరకు శ్లాఘాస్పదము. గోదావరీ తీరమున కమ్మవంశపు జమీందారుల కందరకు తణుకు నగరమున నున్న శ్రీ ముళ్లపూడి వంశము

వారిపై ప్రీత్యాదరము లధికముగా నుండుటలో శ్రీ ముళ్లపూడివారి వంశము నందున్న దైవీసత్త్వసంపద నిదానము. శ్రీ ముళ్లపూడివారి బంధువంశముల వారందరును సముదాత్తరీతి కల యుదారవ్యక్తులు. ఆ యా వంశముల వారి యాకార సౌష్ఠవము గుణసంపత్తి ధార్మికత మొదలగునవి యన్నియు శ్రీ ముళ్లపూడి వారిలో మూర్తములై గోచరించును. పెండ్యాలవారు యార్లగడ్డ వారు జాగర్లమూడివారు కాట్రగడ్డవారు చిట్టూరివారు నిడదవోలువారు బోళ్ల వారు యలమర్తివారు మొదలగు సర్వబంధువంశగౌరవ సమీక్ష శ్రీ ముళ్ల పూడి తిమ్మరాజు సమీక్షలో స్పష్ట మగును.

తణుకు పట్టణములో శ్రీ ముళ్లపూడి తిమ్మన్నగారు మంచి భూస్వామి. సర్వస్వామి. తణుకు పట్టణస్వామి. శ్రీ తిమ్మన్నగారి యాత్మీయత యానాటి పాలకులకును హర్షాస్పద మయినది. శ్రీ తిమ్మన్న జమీం దారుగారికి బావగారయిన దొమ్మేరు జమీందారు శ్రీ పెండ్యాల రాయుడుగారు వియ్యంకులు నయినారు. శ్రీ తిమ్మన్న జమీందారుగారికి పుత్రసంతానము లేకపోవుటయు నొక విశిష్టతకు హేతువయినది. పెండ్యాలవారి దౌహిత్రుడు శ్రీ ముళ్లపూడి తిరుపతిరాయుడుగారి కుమారుడు శ్రీ వెంకటరాయుడుగారు తిమ్మన్నగారికి దత్తపుత్రుడయ్యెను. ఆ శ్రీ వెంకటరాయుడుగారి కుమారుడే **శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు.** శ్రీ తిమ్మరాజుగారు ఈ యిరువదవ శతాబ్దారంభమున 10—10—1901 న జన్మించిరి. అప్పటి నుండి ప్రతివర్షము శరన్మాస మధికముగా పర్వదినమైనది. శ్రీ తిమ్మరాజు గారికి ప్రస్తుతము సప్తతి సంవత్సరములు. ఈ సప్తతి శరత్తులలో శ్రీ తిమ్మ రాజ సముల్లసితము లయిన విశేషము లసంఖ్యాకములు. శ్రీ తిమ్మరాజు జన కులు శ్రీ రాయుడుగారు వ్యవసాయాత్మిక బుద్ధివైశద్యము కల జమీందారు.

"సువర్ణపుష్పాం పృథివీం చిన్వంతి పురుషాస్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుం."

రాయడుగారి దృష్టిలో రత్నగర్భ రత్నగర్భయైనది. రాయడు సువర్ణ పుష్ప ములు పూయించెను. వంశసంపదలు విలసిల్లినవి. ఉండ్రాజవరము, లింగాల, త్యాజంపూడి తన జమీలో చేరినవి. సర్వసమయము లందు ధీరుడై రాయుడు రాముడయ్యెను.

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోను విజ్ఞాతుమర్హతి."

రాయడుగారి హృదయ గాంభీర్యము "కోనువిజ్ఞాతుమర్హతి." పామరులగు పనివారు వృద్ధులయినను తమసంతతి వారికి రాయడుగారి ఔదార్యమునే చెప్పికొని చెప్పికొని మురిసిపోవుట కలదు. శ్రీ రాయడు కుమారుడు శ్రీ తిమ్మరాజు. శ్రీ తిమ్మరాజు తండ్రి శ్రీ రాయడు. ప్రశస్త పితృమత్త్వము అట్టి పుత్రిత కతిపయవ్యక్తినిష్ఠమై యుపజీవ్య మగును. శ్రీ వేంకటరమణాంబా జాని శ్రీ తిమ్మరాజు పితృమాన్ అగుటయే కాదు పుత్రియు నయ్యెను. శ్రీ తిమ్మరాజు కుమారుడు శ్రీ హరిశ్చంద్రప్రసాద్ ప్రశస్తపితృమాన్ ఇక నీ వంశమున ఇట్టి పుత్రిత ఈదృశపితృమత్తతరతరముల రాజిల్లగలదని హరిశ్చంద్రప్రసాద్‌ను చూచినపుడు వారి పిల్లలను చూచినపుడు స్పష్టముగ మనసులో స్ఫురించును. ఇంతటి వైశిష్ట్యవైదగ్ధ్యములకు శ్రీ రాయడు హేతువా? శ్రీ తిమ్మరాజు కారణమా? శ్రీ హరిశ్చంద్రప్రసాదు నిదానమా? "ఇది ఇట్ల" నుట సువచము కాదు. భూతార్థముల కలిమి వర్తమానాంశముల వర్తనము ఒక్కొక వంశవైభవమునకు మూలము. అట్టి సర్వమూల మీ వంశమున కుదురుకొనినది. శ్రీ హరిశ్చంద్రప్రసాద్ ఆంధ్రప్రభుత్వ శాసన సభ్యుడయ్యెను. సర్వవ్యవహర్త యయ్యెను. దేశముల ప్రదేశముల విదేశముల తండ్రిపేరిట తాతపేరిట విద్యా వాణిజ్య వ్యాపార వ్యవహార వ్యాహార విహారాహారసంస్థలనేకములు నెలకొల్పుటలో నిపుణమతియయ్యెను. సర్వ హృదయములు హరిశ్చంద్రప్రసాద్ ప్రసన్నహృదయములో నున్నవి. సమ కాల సర్వజన సర్వశ్రీ హృదయములందు హసన్ముఖుడు ప్రసన్నముఖుడైన హరిశ్చంద్రుడు గోచరించును. ఈ వైభవము ఈ పుత్రవైభవమును శ్రీ తిమ్మ రాజుగారు స్వాత్మవైభవముగా స్వాత్మీయవైభవముగా సంభావించును. కాని ఇది సర్వలోకవైభవ మయినది. కృతకార్యు లయిన వీరవ్యక్తుల హృష్ట పుష్ట భావము నేత్రద్యుతులలో శోభించును. శ్రీ తిమ్మరాజుగారి నాలుగునేత్ర ములలో ప్రతిబింబితమయిన లోకాలోకము తుష్టిపుష్టి కలదై క్షణక్షణము కణకణము భాసించును.

శ్రీ తిమ్మరాజుగారి విద్యావ్యాసంగము అసహాయోద్యమారంభ పర్యంతమ యైనది. మహాత్మమహాభావములు తిమ్మరాజ వీరతాధీరతలకు పాఠము చెప్పినవి. అప్పటి మహాజాతీయ మహాపాఠశాలలో ప్రథమవిద్యార్థి

యైన శ్రీ తిమ్మరాజు నేటికిని విద్యార్థి ప్రాథమ్యము ననుక్షణ ముద్బోధిం
చును. శ్రీ తిమ్మరాజ నయనీతి బలము జయవాదము పెట్టుచు ఉపమండలా
ధ్యక్ష్యమును (తణుకు తాలూకా బోర్డు ప్రెసిడెంటు పదవి) మాండలిక సంఘ
సదస్యత్వమును (పశ్చిమగోదావరిజిల్లాబోర్డు మెంబర్‌షిప్) ప్రజారంజనము న
కర్పించినది. తణుకు పట్టణ సర్వాభివృద్ధికి తత్సంఘాధ్యక్ష్యము (తణుకు
పంచాయతిబోర్డు ప్రెసిడెంట్‌పదవి) వహించిన శ్రీ తిమ్మరాజుగారే సర్వ
హేతువు. తరతరములుగ సంక్రమించిన జాతీయ దేశీయ భావము తిమ్మరాజ
రాజనీతియై సర్వజనులకు విద్యాబుద్ధివృద్ధిరీతులకు నీతిరీతులను సంపాదించి
నది. శ్రీ తిమ్మరాజ విశాలహృదయము నందు ఉపాధ్యాయులు కవితాప్రజ్ఞులు
పాండితీప్రతిభులు చరిత చరితులు సహృదయ హృదయులు సర్వభావుకులు
సర్వభావములతో గోచరింతురు. సంస్కృతాంధ్రాంగ్ల హిందీ ప్రముఖభాషా
గ్రంథములు అతిసహస్రములు తిమ్మరాజవాసనా వాసితములైన అందర
కుద్బోధము లిచ్చునవి యైనవి. రాజ రాజన్యులు నెలకొల్పు దలపని మహా
గ్రంథాయతనము లోని ప్రతిగ్రంథము నందును తిమ్మరాజు శిరఃకంప
మున్నది. ఉత్తమరచనా ప్రకాశమునకై నవ్యానవ్యకావ్య ప్రకటనమునకై
రాయలముద్రణాలయ మున్నది. శ్రీ నరేంద్రనాధ సాహిత్యమండలియున్నది.

శ్రీ తిమ్మరాజుగారి ద్వితీయభార్య కాట్రగడ్డవారి కమలాదేవి యైన
సౌభాగ్యవతి శ్రీ కమలాదేవి. గుంటూరు మండలములోని ఇంటూరు నివాసులు
శ్రీ కాట్రగడ్డ శ్రీరాములుగారు తమపుత్రిక యైన శ్రీ కుంకుమశోభిత కమలా
దేవి గారికి శ్రీరామ లిఖించినది మొదలుగా నా శ్రీమతి వైదుష్యవాసితమతి
యైనది. శ్రీ కమలా శ్రీ తిమ్మరాజ కుమారుడు శ్రీ నరేంద్రనాధుడు. ఆ
నరేంద్రనాధుడు సురేంద్రనాథుడైనాడని శ్రీ కమలాతిమ్మరాజుల కన్నులు
నిత్యము స్విన్నములగును. ఈ వార్త యేనాటిదో యైనను ఈ నాటిదిగా
భావించి సజలనయనులై అనావేద్యవేదనులై పుటపాకప్రతీకాశాంతర్గూఢ
ఘనవ్యథులై యెల్లెల్లో అగుదురు. ఆ నరేంద్రనాథుడు లే వయసుననే ప్రజా
స్వామ్యసంభావనుడై ఓజస్వి తేజస్వి యయ్యెను. ఋషీవాలిలో విద్యార్థిగా
నున్నాడని ఆ కన్నవానిని ఆ చిన్నవానిని భావించి సంభావించి ఎంతగనో
ఉవ్వెత్తుగా హృదయము పొంగించుకొనిన శ్రీ కమలాతిమ్మరాజుల హృదయ
ములకు నిత్యసంవేదన మున్నది. కాని హరిశ్చంద్ర దర్శనము చంద్రదర్శ
నమై వారువ్విళ్లూరుదురు. ఆ నరేంద్రనాథ స్మృతి ప్రతీకమే శ్రీ నరేంద్రనాధ



అ మ ర జీ వి :

శ్రీ ముళ్లపూడి నరేంద్రనాధచౌదరి

సాహిత్యమండలి. శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి అనేక పండితులను కవులను అసాధారణముగా సత్కరించినది. అనేక గ్రంథములను ప్రకటించినది. నరేంద్రుని పేరిట మహాపాఠశాలలో మహాభవనమును వెలసినది. వీరి నందనుడైన నరేంద్రనాథుడు సర్వానందనుడైనాడు. శ్రీ హరిశ్చంద్రప్రసాద హృదయానందుడును నైనాడు.

నామసంస్కార మొక అద్భుతవైభవము. ఆనాటి శ్రీ హరిశ్చంద్రుని ధర్మపత్ని చంద్రమతీదేవి. ఈనాటి శ్రీ హరిశ్చంద్రుని ధర్మపత్ని శుభనామమును నదియే. శ్రీ తిమ్మరాజ జనకుడు శ్రీ రాయుడుగారు శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌ను నిత్య మెట్టి జాగరణముతో నుండవలెనో యుద్బోధించి సిద్ధభావుని చేసెను. రైసుమిల్లు, షుగర్‌మిల్లు, టెక్స్‌టైల్‌మిల్లు, ఎరువుల ఫ్యాక్టరీ, మెడికల్ కాలేజి, ఎడ్యుకేషనల్ ట్రస్టు, మెడికల్ ట్రస్టు, వైద్యాలయ నిర్మాణము, ఇండస్ట్రియల్ స్కూలు, ఇంజనీరింగుకాలేజి మొదలగుసంస్థల నిర్మాణ సంకల్ప బలమంతయు హరిశ్చంద్రప్రసాద్ భావబలము. ఈ భావబలమునకు భావఫలమయిన భావుకభావుని భావసంభారము హేతువు. ఈ భావభావకుని భావములో పూర్వ తనాద్యతన మహాభావుల మహాభావముల మేలి కలయిక యున్నది. అట్టి సర్వభావకుడు శ్రీమాన్ వేంకటరాయుడుగారు. శ్రీ వేంకటరాయుడుగారు శ్రీ హరిశ్చంద్రప్రసాదుగారి జ్యేష్ఠ తనయుడు. నయోపేతులు, వినయోపేతులు. తాతముత్తాతలనాటినుండి సాంప్రదాయికముగా వచ్చు ఆచార వ్యవహారముల కాశ్రయదాత దొమ్మేటి మేటిజమీందారు శ్రీ పెండ్యాల శ్రీరామచంద్ర వేంకటకృష్ణరంగారావుగారి జామాత. శ్రీ రంగారావుగారు శ్రీ తిమ్మరాజుగారి మేనల్లుడు, అల్లుడును. ఇట్లల్లుకొనని వైభవము కల వంశమున శ్రీ వేంకటరాయదుగారు ఉభయవంశ గౌరవప్రతిష్ఠా విశిష్టతలకు సంధాత.

"రూపం తదోజస్వి తదేవవీర్యం
తదేవ నైసర్గికమున్న తత్వం."

శ్రీ వేంకటరాయదుగారు, బి. కాం., పట్టభద్రులు, భాషారసికులు, సారస్వతహృదయులు. భావహరిశ్చంద్రత స్వభావ తిమ్మరాజత సర్వభావ వేంకటరాయత శ్రీ వేంకటరాయదుగారి సర్వసంపత్తి. ఆస్థాస్వాస్థలుకల యువశ్రీ వేంకటరాయదుగారు అక్కమాంబా టెక్స్‌టైల్సు మిల్లు సర్వేక్షణుడై క్షణక్షణ నవంనవభావుడై యుండుట తండ్రికి తాతకు అటువారికి ఇటువారికి

నిత్యమానందముగా నున్నది. వర్ధమానభావుడగు శ్రీమాన్ ధీమాన్ శ్రీ వేంకట రాయడుగారు రాజనీతి ప్రజానీతి లోకనీతి ఆర్థికరీతి సాంఘికరీతి పారిశ్రామిక ప్రగతి పరిశీలింపగల ప్రతిభాశాలి. ఈ రాయడుమూర్తిలో శ్రీ తిమ్మరాజు గారు ప్రాక్తనులను భావికాలమువారలను భావించి స్వాస్పంద సమ్మోదము వహించును.

శ్రీ తిమ్మరాజ భావవ్యూహము భావవేగముతో లోక మంతయు సంచారము చేయును. శిల్పసుందరమయిన శరీరసౌష్ఠవము కల శ్రీ తిమ్మ రాజ శిల్పాసక్తి ఆంధ్రానాంధ్ర మండలములలోని సర్వశిల్ప దర్శనభావమును నిత్య మతిశయింప చేయును. శ్రీ జాయసేనాని నృత్తరత్నావళిలోని నృత్త నృత్య భంగీ విశేషములు గుర్తించి గుర్తించి నృత్తరత్నావళిని కూడ లోకము గుర్తించునట్లు చేయవలెనని సంకల్పించెను. ఆ సంకల్పము నేటికిట్లు కల్పక కల్పకమై సఫల మయినది. కవిపండితులకు భాషారసికులకు చరితాసక్తి యున్నచో చరిత కాకృతి యేర్పడునని లోకమునకు వీరభావము కలుగునని తిమ్మరాజ భావము. తన మహా గ్రంథాలయములో తాను చదువని గ్రంథము లేదు ఏ పుస్తకము కావలె నన్నను వెంటనే గుర్తించుటకు శ్రీ తిమ్మరాజు గారు సహస్రనేత్రుడు సహస్రకరుడు. అభినందనీయ సచేతస్త్వముకల స్వశీలు నకు కవిపండిత సత్కారకాంక్ష సహజ సంవిద్ధర్మమనుట శ్రీ తిమ్మరాజ భావన మున కలుగును. కవిపండిత సహృదయులతో నెప్పుడు మాటలాడినను సాలోచనదృష్టితో నిత్యజిజ్ఞాసువులై భావసంచాలన మొనరించుచు భావసంవాద సంపాదనమునకు కృతయత్నులగు శ్రీ తిమ్మరాజ భావనలు లోకమున నధిక ముగ కావలసి యున్నారు. కవులకు పండితులకు భావవిశ్రాంతి యున్నచో నప్పటి యేకాంతతాసుఖితమతులై వారు నవ్యభవ్యసృష్టి యొనరింపగలరు. ఉద్రిక్తభావములతో వెలువడిన ఉద్యమములు నిలుకడకలవి కాలేవని యను భవమున గుర్తించి శ్రీ తిమ్మరాజుగారు లోకమున భాషాబలము తగ్గుటకు వగచి వగచి పునర్నవీకృతి కలుగచేయుటకై నిత్యము యత్నించును. నరేంద్రనాథ సాహిత్యమండలి పక్షమున ననేక గ్రంథములను వెలయింపచేసి యింకనట్లు చేయుటకు నిత్యము సానుసంధానుడగు శ్రీ తిమ్మరాజుగారు బహు శ్రుతసంపత్తికల భావవేది. జనులంతరసంస్కారములు కొందరిలో మాత్రమే యుద్బుద్ధములై కార్యశూరత్వము సంపాదింపగలవని వీరి వంటి వారిని చూచినప్పు డనిపించును. సాహితీతాపసులైన ఆలంకారికులు నాయకునకు

వలసిన లక్షణములను కొన్నిటిని నిరూపించిరి. ఆ నాయకగుణములు కల శ్రీ తిమ్మరాజుగారిని చూచినచో సమధికముగా నిరూపింపవలెనని యనిపించును. ధర్మవీరుడగు మానవుడు ఉత్తమమానవత్వమును దోషరహితమైన జీవనసంస్కృతిని ప్రకటమొనర్ప గలడు. సామదానభేద దండములను స్వసంస్కారసాధనములుగ చేసికొనిన చౌదరి ధర్మసంవిజ్ఞానము శ్రీ తిమ్మరాజుగారిలో చక్కగా నెలకొని యున్నది. "రచయితలు దినదినము వ్రాయవలెను. అట్లు నిరంతర రచన వారి భావప్రసారమునకు హేతువు." పండితగోష్ఠియే నాకు ముఖ్యము. కవి మానసము లందు సమధికముగా విశేషములావిర్భవింపగలవు. ఏదియేని కార్యావసరమునకై కవిపండితుల నుపయోగించుకొనుట యుక్తము కాదు. ప్రాథమికపాఠశాలల పరిస్థితి శోచనీయముగానుండ కుండునట్లు పరిశీలించుట యందరి కార్యము గ్రంథముల వలనయుపయోగమును లోకమందుకొనుటలేదు. అట్టి యత్న మావశ్యకము. అముద్రిత ముద్రణ మావశ్యకము. అవసరాపేక్షితరచన మత్యంత మపేక్షితము. ఉత్తమసాహిత్యప్రకాశనాభిలాష భూ ధన స్వాములకు కలుగచేయ వలసియున్నది. నాకు కర్తవ్యముద్బోధింపుడు. నన్నుపయోగించు కొనుడు." ఇట్లనగల ధర్మవీరు లెందరో అందరి సమాహారరూపముగా శ్రీ తిమ్మరాజు గోచరించును.

తండ్రిమాట అనినచో భయభక్తులు శ్రద్ధాయుక్తులు సక్తిరక్తులు కలిగి శ్రద్ధాళువై భావార్ద్రచిత్తతతో కరుణాత్మకవ్యక్తిగా గోచరించు శ్రీ తిమ్మరాజ సౌమనస్యము నిత్య మప్రధృష్య మభిగమ్యమునై యుండును. అనేక శక్తుల క్రోడీకారము జాయమానకటాక్షము కల వ్యక్తులలో భాసించును. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారు స్వయం వ్యక్తవ్యక్తి. నృత్తరత్నావలీ సాహితీవల్లభాకృతిస్వీకర్తృతా నిమిత్తముగా తమ భావసమావేశమునకు స్పష్టాకృతిని కల్పించుచున్నారు. శ్రీ హరిశ్చంద్రప్రసాదైకదృష్టియై శ్రీ తిమ్మరాజు చౌదరి జమీందారుగారు ఈనాడు సాహితీవల్లభతాసమాదర ప్రతీకముగా శ్రీ మాధవరామశర్మ సంకలితమయిన సాహితీవల్లభాంచిత నృత్తరత్నావలీ గ్రంథమును కృతిస్వీకార మొనర్చుట కుత్సుకులై యున్నారు. అస్తు.

---

## శ్రీ తిమ్మరాజుగారు

### కృతి పొందిన గ్రంథములు:

| గ్రంథము. | కవి. |
| --- | --- |
| 1. రాజానందము : | శ్రీ పండిత పెన్మెత్స సత్యనారాయణ రాజు |
| 2. బుద్ధగీత : | శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ |
| 3. కాకతి ప్రోలరాజు : | శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ |
| 4. ఆర్యచాణక్యుడు : | శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ |
| 5. ముసునూరి కాపయ : | శ్రీ మేదూరి కృష్ణమూర్తి |
| 6. కవిరాజు : | శ్రీ త్రిపురనేని రామస్వామి |
| 7. భవిష్య పర్వము: | శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి |
| 8. ఔచిత్య విచారచర్చ: | శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ |
| 9. సుబ్రహ్మణ్యేశ్వరశతకం: | శ్రీ ముసునూరి సూర్యనారాయణ |
| 10. కరిమింగిన వెలగపండు: | శ్రీ రావూరి భరద్వాజ |
| 11. కాకతీయ చరిత్ర : | శ్రీ కొత్త భావయ్య చౌదరి |
| 12. పశ్చిమ చాళుక్యులు : | శ్రీ కొత్త భావయ్య చౌదరి |

ఇంకనూ ఎన్నో యితర గ్రంథములు.

వీరి బిరుదములు :

సాహితీ వల్లభ, ఆంధ్రభోజ



నృత్తరత్నావలి ఆవిష్కరణ మహోత్సవము జరిగిన భవనము
శ్రీ ముళ్ళపూడి వెంకటరాయ మెమోరియల్ పోలీటెక్నిక్ - తణుకు.

# శ్రీ ముళ్ళపూడివారి వంశవృక్షము.



# జమ్ములమడక
# వంశవైభవము

శ్రీ ధీ సామరస్య శోభితులు శ్రీయుతులు మళ్లపూడి తిమ్మరాజు చౌదరి జమీందారువారు మా నాయన గారి సాహితీవల్లభాంచిత నృత్తరత్నావలి అను గ్రంథమును తమ భావసమున్నాన సమయమున సాదరముగా సంబహుమానముగా కృతిస్వీకారము చేయదలచుట మిక్కిలి మోదప్రమోద జనకముగా నున్నది. ఈ సందర్భసముచితముగా మా జమ్ములమడక వంశవైభవమును నిరూపించుట యుక్తము. గుంటూరు మండలములోని తెనాలి తాలూకాలో కోడితాడిపఱ్ఱు అగ్రహారము జమ్ములమడకవారి అగ్రహారముగా నాపరిసరమంతయు ప్రసిద్ధమయినది. ఆ అగ్రహారభూములలో కొన్ని భూములు జమ్ములమడకవారి విద్యాపాండిత్యవిశేషములకు చిహ్నముగా నున్నవి. మరికొన్ని కాట్రగడ్డవారి వదాన్యతా సూచకములుగా నున్నవి. కొన్ని గూటూరివారివి; మరికొన్ని మాచిరాజువారివి. కొండవీటి రెడ్డి ప్రభువులు పరిపాలించు సమయమున సర్వవిద్యాధికారిగా నున్న శ్రీనాథుడు జమ్ములమడకవారి విద్యావిశిష్టతలకు అభినందన బహుమానన పూర్వకముగా అగ్రహార మిప్పించెను. అది మొదలుగా మా వంశమువారు గ్రామాభిజనులకు తత్పరిసరములవారికి గ్రామాంతర సీమాంతర విషయాంతరముల నుండి వచ్చువారలకు విద్యాదాతలు అన్నదాతలు సర్వస్వదాతలునై ప్రసిద్ధిపొందినారు. జమ్ములమడక అను ఇంటిపేరు గ్రామనామ సంకేతముగా నున్నది. ఈనాడు కడప మండలములో నున్న జమ్ములమడక జనపదము ఒకప్పుడు ఈ వంశమువారి స్వజనపదమై యుండవలెను. వారు వారి వారి గౌరవమర్యాద లందుకొనుచు గుంటూరు మండలములోని పలనాటి సీమచేరి యుందురనుటకు అచటి జమ్ములమడక గ్రామము సాక్షి. శ్రీనాథ విద్యాధికారి గుర్తించిన నాటి నుండి తెనాలి తాలూకాలోని కోడితాడిపఱ్ఱు అగ్రహారము జమ్ములమడక వారి అగ్రహారమైనది. ఇంకను జమ్ములమడక కుటుంబములవారు కృష్ణామండలమేగిరి. కృష్ణాతీరము చేరిరి. గోదావరీతీరమున వసించిరి. పాండిత్యవాసితమైన పరిసరములందప్పటిలో జమ్ములమడక వారుండిరని తాతలుముత్తాతలు తాతల ముత్తాతలు చెప్పుకొను మాటలనూచానముగా చెప్పుకొనుచున్నారు. నేడును అట్లు చెప్పుకొనగలుగుట సంతోషాస్పదము.



కృతికర్త:

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ.

శ్రీ జమ్ములమడక సుబ్రహ్మణ్యేశ్వరులు నాల్గు తరములనాటి మనీషులు. వారి మూవురు పుత్రులలో తృతీయులు రామయ్యగారు. ప్రథముడు పీచువెంకయ్య. ద్వితీయుడు సుబ్బారాయుడు. మొదటి ఇద్దరు బంధుగౌరవములను పురస్కరించుకొని లౌకాత్మకవిద్యాసక్తులై గోదావరీతీరము చేరిరి. ఆ వంశములవారు నేడును కాకినాడలో నున్నారు. తృతీయులు శ్రీ రామయ్యగారు స్వజనపదాగ్రహారమునందే స్థిరప్రతిష్ఠులై యుండిరి. అప్పటిలో మా వంశపండితులవిద్యలు కాట్రగడ్డవారిని గూడూరువారిని మాచిరాజువారిని విద్యానందులనుచేసినవి. వారు మావంశమువారికి ఉపాయనముగా భూములనిచ్చిరి. గూడూరువారు మాచిరాజువారు పరిమితముగా పన్ను పుచ్చుకొనెడివారు. కాని ప్రతి వర్షవసంతసమాగతులై వేదికాపరిషత్తులలో మా వంశమువారికి కర్పూరచందనాంబర నీరాజన సత్కారము లర్పించెడివారు. కాట్రగడ్డవారిలో మరియొక విశేషము కలదు. (కాట్రగడ్డవారు ఇంటూరు వాస్తవ్యులు. శ్రీ తిమ్మరాజుగారికి అత్తవారి యింటివారు, వారి ఆడపడుచు శ్రీ తిమ్మరాజుగారి ధర్మపత్ని శ్రీ కమలాదేవి. "ఈ వంశమువారు పండితులు. మాకు పండిత పోషక గౌరవ మిచ్చినవారు. మేము వారి కుపాయనముగా నిచ్చిన భూములపై పన్ను స్వీకరింపము. వత్సరము వత్సరము వారిని సత్కరించుట మా అభిలాష" అని ప్రకటించిరి. ఈ ప్రకటనము అగ్రహారములోని యితరుల కీర్ష్యాజనకమని యనుటలేదు. మా వంశమువారి అభినందన సూచకమని అనుటయుక్తము. శ్రీరామయ్యగారు ధీస్వామియే కాక భూస్వామియు నై భూములలో పనిచేయువారల కందరకు గోస్వామియు నయ్యెను. పొలములో నాటువేయుటకు కోతకోయుటకు కుప్పవేయుటకు నూర్పిడిచేయుటకు కడియము కట్టుటకు మోపులు మోయుటకు జనుము కోయుటకు ఎన్ని ఎన్ని పనులకుగాని కూలికివచ్చు జనులందరు ముందుగా రామయ్యగారి పొలమునకు రావలసినదే. వచ్చి కూలి పని చేయుదురన్న మాటేగాని వారందరు అమరకోశము సంత చెప్పుకొనెడివారు. ఆంధ్రనామసంగ్రహము వల్లించెడి వారు. తెలుగు భారతములోని పద్యములను పలికెడివారు. వారు వర్ణము వ్రాయరు. అక్షరము చదువరు. కాని అన్నిటిని పల్కెడివారు. ఇది రామయ్య గోస్వామిత. ఆ పలికెడివారలలో అన్నివర్ణములవారు ఉండిరి. సధర్ము లుండిరి. విధర్ములుండిరి. అందరును జమ్ములమడక వంశధర్ములయిరి.

శ్రీ రామయ్యగారి కుమారులు మూవురు. వారిలో రెండవకుమారుడు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి. సన్యసించి శ్రీ వైరాగ్యానందభారతీస్వామి యయినారు పెద్ద కుమారుడు పెదవెంకటసుబ్బయ్య. మూడవ కుమారుడు కోదండరామశాస్త్రి. ద్వితీయుడైన వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి చిననాటినుండి సర్వవిషయములం దద్వితీయుడై ప్రకాశించెను. ఉపనీతుడయిన నాటినుండి ఊరి చెరువు దగ్గర మంచినీటిబావి సమీపమున సాయం ప్రాతస్సమయములందు సవనదీక్షగా సహస్రాధికముగా సావిత్రీజప మొనరించి స్వయంసంతుష్టు డయ్యెడివాడు. బ్రహ్మచర్య దీక్షితుడై భిక్షాటన మెరుగని వాడైనను 'భవతి భిక్షాం దేహి' యని విద్యాధ్యయన మొనరించినాడు. కావ్యనాటకాలంకారములను అద్దేపల్లి సోమనాథశాస్త్రి సమీపమున అభ్యసించెను. కాశీవిద్యావార్తలు చెవిని పడగా హృదయము దూరగా కాశీపట్టణము చేరి విశ్వేశ్వరదర్శన మొనరించి అన్నపూర్ణాదేవి యనుగ్రహము వడసి న్యాయవిద్యావ్యాసంగ మొనరించెను. తర్కవిద్యలో కాశీపట్టణమున కపజయము రానీయనని ప్రతిజ్ఞ పట్టిన శ్రీ కర్ణాటక సీతారామశాస్త్రిగారి సమక్షమున న్యాయవిద్యాపండితుడైన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి చండీవిద్యాపారంగతుడై మంత్రవిద్యాశ్రద్ధాళువై స్వాగ్రహారము చేరెను. సిద్ధాసనమునందు కూర్చొని వీరాసనమునం దుపవిష్టుడై పద్మాసనస్థితుడై సుఖాసన సంగతుడై బాలాసనలోలుడై సర్వయోగాసనాసక్తుడై విద్యార్థులకు విద్యార్థితను నేర్పి విద్యను నేర్పెను. తాడిపల్లి అగ్రహారము చిన్నది యయినను ఇరువదిమందికి పైగా ఇతర స్థలములనుండి వచ్చిన విద్యార్థులు వారములు నిర్ణయించుకొని భిక్షాటనము తెచ్చుకొని అవి ఇవి రుచింపవని యనుకొనినపుడు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి భవనముననే ఇష్టాన్నము మృష్టాన్నము స్వీకరించెడి వారు. శుశ్రూషలు చేసెడివారు. వ్యవసాయ మొనరించెడివారు. ఊరిలో నందరకు వలసిన విద్యలను ప్రబోధించెడివారు. ఆ యిల్లు ఒక చిన్న విశ్వవిద్యాలయము. సాయంసమయములందు శ్రీ రామయ్యగారు వీధియరుగుపై కూర్చుని భారతము పురాణములు పురాణము చెప్పెడివారు. ఊరిలో నందరు పాండితీవాసితులు. ఆగ్రామమున కప్పటిలో నెవరేని పండితులు వచ్చుటకైనను జంకెడివారు. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి రాత్రి సమయము అందు కూడ చదువుచు గోడవైపునకు తిరిగి పైకి లేవనెత్తిన జుట్టుపిలక గోడపై మసిగీటుతో గుర్తించి నిర్వాత

నిష్కంప దీపశిఖవలె శిఖకదలకుండునట్లు వర్ధించెదివాడని శ్రీ హనుమా యమ్మ మా నాన్న అమ్మ మా మామ్మ చెప్పగా తెలిసినది. విద్యాధ్యయన ములో నిది యెట్టి శిక్షణమో నేడందరకు కానబట్టదు. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి కావ్యములు నాటకములు అలంకార గ్రంథములు తర్కప్రకరణములు వాద గ్రంథములు అన్నియు పాఠము చెప్పెను. శబ్దమంజరి మొదలుగా వ్యుత్పత్తి వాదము వరకు నిత్యము పాఠము సాగెడిది అప్పటిలో విద్యార్థు లయిన బటాజులు కొందరు తాడిపట్లు "శాస్త్రులుగారు సాహితీచక్రవర్తులు" అని ప్రచారము చేసిరి. దశకుమారచరిత్ర, కాదంబరి మొదలగు గద్యగ్రంథములు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి 'శ్రీ' మొదలు "ఇతిశ్రీ" వరకు వచోవిధేయ ములై యుండెడివి. నైషధాంతకావ్యములన్నియు మల్లినాథవ్యాఖ్యా సహిత ముగా వారికి రసనాగ్రవర్తులై యుండెడివి. శ్రీశాస్త్రి ఏకసంధాగ్రాహి, ఆయన నిత్యతపస్వి, ఆయన సన్యాసియై "నివసేత్ పుత్రసంపది" యను న్యాయము ననుసరించి ఉండి కొన్ని చాతుర్మాస్యములు గడచిన పిమ్మట ఉపనిషత్పా రాయణ మాలించుచు ప్రశాంతముగా బ్రహ్మీభూతు డయ్యెను.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ఇద్దరు కుమారులు, ప్రథముడగు శ్రీ లక్ష్మినరసింహము ద్వితీయుడగు మానాన్న మాధవరామశర్మకు అన్నిటిలో ప్రథముడు. పితృకల్పు డయిన శ్రీ నరసింహుని యాదేశము ఈనాటికిని నిత్య ముపాదేయమై యున్నది. వీరిని కన్నతల్లి జగర్లపూడి వారి యాడబడుచు. వెంకటప్పయ్యగారి గారాబు కూతురు. శ్రీ జగర్లపూడి వెంకటప్పయ్యగారు తెనాలి దగ్గరనున్న పెదరావూరులో సర్వవ్యవహారము లందును పెద్దయైన అతిథేయుడు. ఈనాడు వెంకటప్పయ్యగారు లేరని ఆ గ్రామమునకు అతిథులే రారు. ఆనాడతిథులు బహుతిథులై పూజా సత్కారములు పొందిరి. ఆ మర్యాదలు తెలిసిన శ్రీ హనుమాయమ్మ ఇద్దరు కుమారులకు తల్లి. ఆమె పూజ ఆమెసేవ ఈ నాటికిని ఆ ఇద్దరకు నిత్యవిధి.

శ్రీ మాధవరామశర్మ తాతగారి దగ్గర అరుగుపై వెలిబూడిదలో అక్షరములను నేర్చుకొనెను. శ్లోకములు పద్యములు కంఠపట్టెను. వస పట్టిన పసగా తనకు వచ్చిన వాని నన్నిటిని వల దనువరకు విన్పించి విన్పించి గొంతెండినచో తల్లిసమీపమునకేగి పాలు త్రాగెడివాడు. పండ్రెండు సంవత్సరముల వఱకాతడట్టివాడే యనుట నేటికిని కంఠస్వరము వినగా

విశ్వసింపదగినదే యగుచున్నది. ఉపనయన మయిన నాటినుండి తాతదగ్గర కూర్చొని సహస్రసావిత్రిజపించి రామహృదయము పఠించి, రామహృదయు డయ్యెను. తండ్రిసమీపముననే సంస్కృతాభ్యాస మొనరించెను. అప్పుడు వారిదగ్గర కావ్యాలంకారాధ్యయనము చేయు శిష్యులు భుజములపై త్రిప్పుటలే అధికము కాగా తాతదగ్గర స్పష్టోచ్చారణముతో పురాణపాఠకుడు కాగా నాన్న దగ్గర విద్యాసక్తి యధికముకాలేదు. మొగసాలలోని కామధేనువు దగ్గర వత్సముతోడు వత్సముగా పాలు త్రాగుట పొలములో ఊచబియ్యము కొట్టు కొని తినుట వ్యవసాయపు పనులు చేయుట కమతగాండ్రతో కలసి తాటి కాయలకు ఈతకాయలకు పరుగులెత్తుట తాలింఖానాలో దిగి ఎట్టుమన్ను వేసికొని కసరత్తు చేయుట పెరుగన్నము తిని మీగడపాలు త్రాగి వెన్న ముద్దలు మ్రింగి నూకల నెయ్యి పుడిసిళ్ళుపట్టి వఱియు నవ్వుపెల్ల తిండి తిని అరుగు వరకు వ్యాయామము వ్యవసాయము చేసి పురాణపారాణముచేయు ఆనాటి మానాన్నకు చెడుగుడు ఆటలలో ఇసుక దోసిళ్ల పోతలలో స్ఫటికపు వినాయకుడు దొరకెను. విద్యాగణపతి లభించినది మొదలుగా వినీతుడై వివేకశ్రద్ధకల వాడయ్యెను. జీతములేని జీతగాండ్రకు పూరిపాకలలో ఆముదపు దీపముపెట్టి చదువులు చెప్పి తన కంఠమును వారి కంఠమున కిచ్చెను.

మొదటి యుద్ధమయినది. తురుమెళ్ల జార్జికారొనేషన్ స్కూలులో మూడవ తరగతిలో చేరి సంవత్సరమున్నర ఎ. బి. సి. డి లు నేర్చుకొనెను. ఎ. పి. పాత్రో ఆనాడు మదరాసు మంత్రిగా తురుమెళ్ల హైస్కూలుకు వచ్చినపుడు నాటకాభినయములో ఉపానందుడు భూమికధరించి రంగబహుమానము పొందిన మానాన్నను మంత్రి పాత్రో అభినందించినాడు. చిన్నవిద్యార్థికి సముచితము లయిన కలము, సిరాబుడ్డి, పుస్తకములు బహు మానములు వచ్చినవి. లెక్కలలో మాత్రము మార్కులు లెక్కకు రావు. మిగులు నన్నిటిలో నన్నియు లెంకకు వచ్చినవి బాలగంగాధరతిలక్ గతించినవార్త రాగానే విద్యార్థులు సమ్మె చేయుటలో మానాన్న ఇంగ్లీషుచదువు పూర్తి అయినది. యుద్ధానంతరపు కాటకపుదినములలో మాతాత దగ్గర విద్యాధ్యయనమున కెవ్వరునురాలేదు. నిత్యము మానాన్న యొకడే విద్యార్థి. మూడునెలల కొక కావ్యము చొప్పున కావ్యములు అన్నియు పూర్తి అయినవి

గద్యగ్రంథములను చంపూగ్రంథములను తాత చెప్పుట నాన్న చదువుట సర్వమవ్యాహతముగా సాగినది. ద్వారబంధముపై ఉన్న పుస్తకములలో రసగంగాధరము సాహిత్యదర్పణము చిత్రమీమాంస ప్రతాపరుద్రీయము సాహిత్యరత్నాకరము ఆనాటినుండి మానాన్నకు తలదిండు లయినవో గుండె దిండు లయినవో స్పష్టముగా నెవ్వరికీ తెలియదు. మా తాత ప్రశ్నించుట లేదు. మా నాన్న సమాధానించుట లేదు. నిత్యము గ్రంథములు చదువుట. అలంకార గ్రంథములలోని సర్వోదాహరణ పద్యములు మానాన్నకు వచ్చును. ఆనాడప్పచెప్పగలుగుట ఈనాడును సమధికముగా నుపయోగించుచున్నదని మానాన్న యనును. తెనాలిలో సంస్కృత కళాశాలయున్నది. సంస్కృత కళాశాలలో చదివి పరీక్షాబిరుదములు సంపాదించుట బాగుండునా? ఇట్టినిశ్చయమప్పటికిని బాగుగా కలుగ లేదు. కురుగంటి శ్రీరామశాస్త్రి న్యాయశాస్త్రాధ్యాపకులు మానాన్నకు తర్కప్రకరణగ్రంథములు చెప్పుట కంగీకరించిరి. వారి సమక్షమున శుశ్రూషయొనర్చి ప్రకరణగ్రంథములను చదివెను. కాశీపట్టణము విద్యాకేంద్రమనుట మాతాతగారి దగ్గర వినివిని కురుగంటివారి యింట భావవేగమున కూరట పొందలేక ఎవ్వరితోచెప్పక విద్యావ్యాసంగమునకై కాశీపట్టణమున కేగెను. ఆహారము లేక టిక్కెట్టు లేక నిద్రలేక అలసట లేక కాశీపట్టణమున కేగి గంగాస్నాన మాచరించి దశాశ్వమేధ ఘట్టములో పావిత్రీజప మొనరించెను. విద్యాధ్యయనమునకు తగిన సౌకర్యము ఆవయసులోనే కూర్చుకొనెను కాని అమ్మ నాన్న అన్నయ్యలు ఇల్లుకు తోడు నాలుగిండ్లుకట్టుకొని కాశీపట్టణము చేరి మరల నింటికి తీసికొనివచ్చిరి. నాన్న భావవేగి కాన యిల్లు పట్టలేదు. విజయనగరములో విద్యాకేంద్రమున్నదని కాశీపట్టణమె కలదని నవద్వీప మున్నదని శ్రీరాయుడుశాస్త్రి కలడని తెలిసి శతపోరు పెట్టి విజయనగరము చేరెను. మహారాజ సంస్కృత కళాశాలలో విద్యార్థిగా చేరెను. అయిదుసంవత్సరములు చదివి సాహిత్య విద్యాప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. చదువదలచినది తర్కము. చదివినది సాహిత్యము. అందువలననే శాస్త్రవ్యాసంగమునకు నిరంతర మారాటపడి ఎంతగా చదివెనోకాని చదువుసమయమునందే తిండిమాని మంచి వస్త్రముమాని గ్రంథములు తెప్పించెను, నిత్యము కంటికి గ్రంథములు కన్పించుచుండగా వాని వ్యాసంగము చేయుటకు తగిన శ్రద్ధ ఉండగా సామ

ర్థము సంపాదించుటకై సర్వగుడుసమాహారస్వరూపు డయిన రాయడుశాస్త్రి దరి చేరి చదువదలచిన చదువవలసిన సర్వము చదివెను. అప్పటిలో రసగంగాధరము కొంతగనే పాఠ్యముగా నిర్ణీతమయినది. సమగ్రముగా నది యంతయు మానాన్న చదివెను. అలంకార కౌస్తుభము చదివెను. వక్రోక్తిజీవితము చదివెను. అభినవభారతి చదివెను. వానికై కావలసినవి చదివెను. ఇట్లు మానాన్న శాస్త్ర వ్యాసంగము సర్వశాస్త్రసమాహారరూపమయిన సాహిత్యశాస్త్రమునందు లగ్నమయినది. అదిమొదలు రాయుడుశాస్త్రి గారున్నంతవరకు ప్రతి వత్సరము కొన్నినెలలు వారిదగ్గర నుండి ఏమి ఏమి చదివెనో ఎంత ఎంత చదివెనో ఆగురుశిష్యులకే తెలియును. ఆ వ్యాసంగఫలముగా మా యింటిలో నిన్ని గ్రంధములు చేరినవి.

విశ్వవిద్యాలయపరీక్షలలో ఉత్తీర్ణులయిన వారంపరు ఉన్నత పాఠశాలలలో మహాపాఠశాలలలో ఉద్యోగముపేరులో నధ్యాపకులుగా నుండి ద్రవ్యము సంపాదించుట కలవాటు పడిరి. మానాన్న భూధన సంపద లేని వాడైనను తత్సంపాదనమునకై యత్నింప లేదు. అట్లు యత్న మొనరించుటకై దైన్యము కావలెను. అది మానాన్నకు లేదు. దైన్యము లేకుండునట్లు చేసినది మాపెదనాన్న శ్రీ లక్ష్మీనరసింహము. తెనాలి సంస్కృతకళాశాలలో విద్యార్థులున్నారు. అధ్యాపకుడు కావలెను. వేతనము తీసికొనని అధ్యాపకుడు కావలెను. మానాన్న అచట అధ్యాపకుడై తాను చదివిన చదువని అలంకార శాస్త్రగ్రంథముల నధ్యాపనముచేసెను. అట్లు నిరంతరము కావలసిన వారి కక్కరలేని వారికిని నిరంతర మలంకారశాస్త్రాధ్యాపన మొనరించుట వలన ఇన్ని గ్రంథములు వ్రాయు భావవ్యూహము కలిగినదని మానాన్న నిరంతరము భావించును. తెనాలి కళాశాలలో పండ్రెండు సంవత్సరములు సాహిత్యాలంకార భాషాశాస్త్రాధ్యాపకుడుగా ఉపాధ్యక్షుడుగా ప్రిన్సిపాలుగా ఉద్యోగముచేసెను నెల్లూరు వేదసంస్కృతకళాశాలలో రెండు సంవత్సరములు సర్వాధ్యాపకుడుగా పనిచేసెను. ఆ పిమ్మట 1945 సంవత్సరమునుండి గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో సంస్కృతాంధ్ర భాషాధ్యాపకుడుగా నుండెను. మధ్యమధ్యలో కొన్నికొన్ని యుద్యోగములకై కొందరు కొందరు కొంత కొంత యత్న మొనరించిరి. మానాన్న మన సటు పోలేదు. ప్రస్తుతము గుంటూరు సంస్కృత కళాశాలలో ప్రాధ్యాపకుడుగా నున్నాడు.

నానావిధములగు గ్రంథములు వ్రాయ వలెనని చిరకాలముగా మా నాన్నకు సంకల్ప మున్నది. జగద్గురు శ్రీ కళ్యాణానందభారతీ మహాస్వామి సమక్షమున మంత్రవిద్యాదీక్ష స్వీకరించినప్పటినుండి గ్రంథరచనావ్యాసంగములకు సముచితము లయిన సంస్కార దోహదములు లభించినవి. నానావిధములగు గ్రంథములను రచించినాడు. కొన్నిమాత్రము ముద్రితము లయినవి.

1. శ్రీ:—మంత్రశాస్త్రగ్రంథము, శ్రీదేవీపూజావిశేషము, చక్రార్చనము జపవిధానము సూచించు గ్రంథము.

2. గీతాసూత్రనవతి:—గీతార్థము సూచించుటకు తొంబది సూత్రముల నెన్నుకొని వానికి తెలుగులో వ్యాఖ్యానము నిరూపించుట

3. నవరసగంగాధరము:—శ్రీ తాతారాయడుశాస్త్రిగారు కృతిపతి జగన్నాథ పండితరాయల రసగంగాధరమునకు వ్యవహారి కాంధ్రభాషలో విశదమైన వివరణము. మదరాసు ప్రభుత్వము ఉత్తమ సాహిత్యవిమర్శ గ్రంథమని తెలుగుభాషాసమితి పక్షమున మొదటి సంవత్సరము బహుమాన మిచ్చినది.

4. భక్తితంత్రము:—భక్తిసంప్రదాయముల నుద్బోధించు రమణీయమైన చిన్నగ్రంథము.

5. శ్రీకృష్ణజయంతి:— కృష్ణభక్తిస్వరూపమును నిరూపించునట్టి చిన్నగ్రంథము.

6. దేవీకథ:—దేవీభాగవతగత మయిన తత్వమును నిరూపించునట్టి సాంప్రదాయికమైన పౌరాణిక విమర్శగ్రంథము.

7. ఆంధ్రప్రతాపరుద్రీయము:—శ్రీ చల్లపల్లి రాజావారు కృతిస్వీకార మొనరించి సత్కరించిరి. ఈ గ్రంథము విద్యానాథుని ప్రతాపరుద్రీయ గ్రంథమునకు వ్యాఖ్యానార్థమును కలియకలుపుకొనిన వివరణప్రాయమయిన వ్యాఖ్యాన గ్రంథము.

8. ధ్వనిసారము:— కృతిస్వీకర్త శ్రీ శిష్టా సుబ్రహ్మణ్యశాస్త్రి. ఆనందవర్ధనధ్వన్యాలోకమునకు సంగ్రహాత్మక మయిన సంస్కృత రచన. సముచిత మయిన ఆంధ్రానువాదసహితము.

9. కావ్యప్రకాశము:—కృతిసమర్పణము శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రి. మమ్మటుని కావ్యప్రకాశమునకు ప్రామాణికము లయిన పది వ్యాఖ్యానముల సారరూపమగు వ్యాఖ్యావివరణము.

10. అలంకారసూత్రము:—కృతిస్వీకర్త శ్రీ కల్లూరు సుబ్బారావు. రాజానక రుయ్యకుని అలంకార సర్వస్వమునకు సంగ్రహాత్మక మయిన యనువాదము. అర్థాలంకారముల వివేచనమున ప్రామాణిక మయిన గ్రంథము.

11. సరస్వతీసామ్రాజ్యము:—కృతిస్వీకర్త శ్రీ చెన్నేటి విశ్వనాథము, మహాసరస్వతీదేవి స్వరూప తత్వ రహస్య విశేషములను సూత్రప్రాయముగా నివేదించు గ్రంథము. ఈ గ్రంథము సూత్రముగ మహాగ్రంథ మొకటి రానున్నది.

12. రసగంగాధరమణి:—పండితరాజ జగన్నాథ రసగంగాధర గ్రంథమును సుబోధ మొనరించుటకై నిరూపించిన గ్రంథము. లక్షణము లక్ష్యము సమన్వయము రూపముగా రసగంగాధరమునంతను పరిచయ మొనరించుటకు సమర్థ మయిన గ్రంథము.

13. నాట్యవేదము;—1, 2 భాగములు కృతిస్వీకారము శ్రీ బందా కనకలింగేశ్వరరావు, భారతప్రభుత్వ సంగీతనాటక అకాదమి సంభావితము. భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్యాన మయిన అభినవభారతిలోని సర్వార్థమును సంకలనము చేసికొనిన అత్యుత్తమ గ్రంథము 3వ భాగము ముద్రింపవలెను.

14. రసభారతి నాటకమీమాంస:—నాట్యవేదాంతర్గతమయిన పృథక్కృతరచన. రసభావచర్చాసుందరము నాటకతత్వసమీక్షా సమర్థము, సంధి సంధ్యంగములు తత్ప్రయోజనములు విశదముగా నిందున్నవి.

15. కల్యాణభారతి:—సంస్కృతశ్లోకాత్మకము, దీక్షాదేశికుల స్తుతి రూప మయిన శ్లోకముల సంగ్రహము.

16. ఔచిత్యవిచారచర్చ:—కృతి సుకృతి శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారు. క్షేమేంద్రుని గ్రంథమునకు అనువాదము, కవితాపేక్షితము లయిన నానావిధౌచిత్యముల లక్ష్యలక్షణసమన్వయ ప్రత్యుదాహరణ ప్రదర్శన పర మయిన సాహిత్యవిమర్శగ్రంథము.

17. శృంగారప్రకాశము:—కృతిస్వీకర్త. శ్రీ నర్రా గోపాలకృష్ణయ్య భోజరాజ వాగ్దేవీమంటప సాహితప్రకాశము. విశిష్టమయిన ఉత్తమగ్రంథము శృంగారమె రసము అను మహాగ్రంథము.

ఇంక సముద్రితము లయిన గ్రంథములు కొన్ని కలవు

18. భావప్రకాశనము:—శారదాతనయుని నాట్యసాహిత్య గ్రంథమునకు ఆంధ్రభాషావివరణము.

19. వక్రోక్తిజీవితము:—రాజానక కుంతకుని గ్రంథమునకు ఆంధ్రభాషామయ రచనము.

20. నాట్యసారము:—భరతనాట్యశాస్త్రములోని విషయములను నిర్దేశించు సంగ్రహగ్రంథము.

ఇంకను ఏకావళి, సాహిత్యరత్నాకరము, వామనాలంకారము— భామహాలంకారము—రుద్రటాలంకారము— నాట్యదర్పణము — భక్తిరసామృతసింధువు సాహిత్యసారము మొదలగునవి కలవు.

21. ఉపనిషత్కథావళి:—ప్రసిద్ధము లయిన యుపనిషత్తులలోని కథలు వాని తత్వము నిరూపించు గ్రంథము.

22. మాధవగీత:—భగవద్గీతా గ్రంథముపై అధ్యాయక్రమమున ఉపన్యాసాత్మక మయిన భాషాసుందరమగు రచన.

23. తత్వసంగ్రహము:—సర్వవిధ మతధర్మములను దర్శనవాదములను నిరూపించు గ్రంథము.

24. తంత్రాలోకము:—తంత్రవిజ్ఞాన సర్వస్వమని అనదగిన శ్రీమదభినవగుప్తుని తంత్రాలోక గ్రంథభావమును నిరూపించు గ్రంథము.

25. చతుష్షష్టి:—అరువదినాల్గుకళలను నిరూపించు కలాశాంతిరమ్యమయిన రచన.

26. గీతాభావప్రకాశము—భగవద్గీతావ్యాఖ్యానాత్మకము లయిన ఆరు వేల శ్లోకముల తాత్పర్యరూపగ్రంథము.

ఇంక నీ విధముగ తంత్ర దర్శన సాహిత్య విషయములపై వ్రాయుటకు సంకల్పించిన గ్రంథములు మరికొన్ని కలవు, స్వసమకాలమున రచయిత లందరు పరిచితులే కావున కొందరి గ్రంథములకు ఎన్నదగిన పీఠికలు వ్రాసిరి. వానిపై అభిప్రాయముల నిచ్చిరి. ఇట్టివి శతాధికముగానున్నవి. తెలుగునాట ప్రచారములో నున్న నానావిధములగు పత్రికలలో రచించి ప్రకటించిన వివిధములగు వ్యాసములును శతోత్తరముగా కలవు. నానావిధములయిన రేడియోప్రసంగములును వందకుపైగా సున్నవి. ఇట్టివిధముగా నిరంతరము గ్రంథవ్యాసంగ మున్నది వ్యాసంగమునకు తగిన విధమున బహుళముగా గ్రంథములను సంపాదించుటచే వివిధములయిన గ్రంథములింటినిండ నున్నవి. సంస్కృతాంధ్ర హిందీగ్రంధములు కన్నడమరాటీ గ్రంథములు సంఖ్యాధికముగా కలవు. మరాటీ కన్నడము ఇంగ్లీషు బెంగాలి భాషాగ్రంథములు పరిమితముగా కలవు. ఆంధ్రదేశమందంతట నానావిధములయిన సభారంగములందు సంస్కృతాంధ్రభాషలలో ఉపన్యసించుటచే వారు వారిచ్చిన సమ్మానపత్రములును బహుళముగా నున్నవి. ఇప్పటికీ బిరుదములను గుర్తించి భద్రపరుప గలిగితిమి.

| | | | |
|---|---|---|---|
| 1) | దర్శనాచార్య | 7) | నవవిద్యానాథ |
| 2) | సాహిత్యాచార్య | 8) | సాహిత్యభారతీతీర్థ |
| 3) | శాస్త్రవిశారద | 9) | వాగ్మిప్రవర |
| 4) | లాక్షణికశిరోమణి | 10) | అభినవానంద |
| 5) | సాహిత్యసమ్రాట్ | 11) | సాహిత్యవాచస్పతి |
| 6) | మహోపాధ్యాయ | 12) | పండితపరమేశ్వర |

ఆంధ్రదేశములోని సారస్వతపరిషత్తులలో మానాన్నగారికి బాగుగా పరిచయము కలదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ఉస్మానియాసర్వాలయమునకు సంబంధించిన సంస్కృతాంధ్రపరీక్షారీతులతో సంబంధము కలదు. ఆంధ్రవిశ్వవిద్యాలయము అకడమికు కౌన్సిలు సభ్యత్వమిచ్చి సంభావించినది. ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమి మొదటి పర్యాయమె సభ్యత్వమిచ్చి ఆదరించినది. దక్షిణదేశములో ఆల్ఇండియా ఓరియంటల్‌కాన్ఫరెన్సు జరిగినపుడు సంస్కృతవిశ్వపరిషత్తు జరిగినపుడు మానాన్నగారు ఆయా సభలకు వెళ్లి

తమ విశేషమును ఆమోదింపచేసినారు. జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు శారదాపతక మిచ్చి సువర్ణకంఠమాల నిచ్చి వైదుష్య మభినందించి బంగారు శాలువ నిచ్చి అనుగ్రహించినారు. శ్రీచక్ర మిచ్చినారు శ్రీ పుట్టపర్తి శ్రీ సత్యశాయి బాబా భగవాన్ మానాన్నను ప్రసన్న హృదయమున ఆదరించుట మాకు నిత్యామోదమయినది.

మా అమ్మ వేదాంతం వంశమువారి ఆడపడుచు. ఆమెపేరు శ్రీ కామాక్షి హైమవతీదేవి. అమె కూడా స్వయంపండిత. మా అమ్మ రేడియోప్రసంగములు సభోపన్యాసములు కూర్పగా "చతుర్దశి" అను పుస్తకము సిద్ధమై ప్రకాశితమయినది. మా పితరులకు మేము నలుగురము సంతానము: ౧. కుమార మాధవరామ విద్యార్థి, ౨. భవభూతి, ౩ భామతి, ౪. శ్రీమతి. ఇట్టిది మా వంశవైభవము. ఇట్లనుబంధముల నింకను చేర్చినచో ఔచిత్యము శోభింపదు. శ్రీ తిమ్మరాజుగారి సహృదయతా వ్రతీకముగా కృతిస్వీకారసభ జరుగుట మాకందరకు మోదావహముగా నున్నది. దివంగత యయిన మా అమ్మయు సమ్మోదము పొందగలదు.

శ్రీ భవభూతి శర్మ, M. Sc.
A. C. College, Guntur.

---

# ప్రశస్తి

"సాహితీవల్లభ" "ఆంధ్రభోజ" శ్రీ మన్నెపూడి తిమ్మరాజుగారు కమ్మరాజ వంశీయులు, సాహితీ అభిమానులు, చారిత్రిక పురుషులు, చరిత్రసృష్టలు. వారికుమారులు శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారు పారిశ్రామిక ప్రముఖులు, సాహితీ పరాయణులు. ఈ జనక నందనులు మా తణుకు గ్రామమునకు ఒకరు సాహిత్యమునకు, రెండవవారు పరిశ్రమలకు వన్నె తెచ్చిరి. రెండును అక్షరములే ఒకటి మనోవికాసము నొందించును, రెండవది శరీరమునకు పుష్టినిచ్చును.

కాకతీయులు కమ్మ వంశీయులు అని పౌరాణికాధారములు గలవు. సమాన వంశాభిమానమా! అన్నట్లు శ్రీ సాహితీవల్లభులు శ్రీ కాకతీయ ప్రభువు శ్రీ గణపతిదేవ మహారాజుల గజసేనాధ్యక్షుడయిన శ్రీ జాయ సేనాపతి సంస్కృతభాషలో రచించిన "నృత్తరత్నావళి"ని అనువాదముగా రచించిన శ్రీ మాధవరామశర్మగారి "సాహితీవల్లభా" అను వ్యాఖ్యానరూప కృతి కన్యను పరిణయమాడిరి. అనేకములయిన కృతికన్యలను స్వీకరించియు వార్ధకములో జాయసేనాపతి విరచిత "నృత్తరత్నావలీ" వ్యాఖ్యను శ్రీ తిమ్మరాజుగారు పరిగ్రహించుట పండితుల కందఱకు ఆనందము కలిగించుచున్నది. కాకతీయుల కాలములో పెక్కు సంస్కృత గ్రంథములు

వెలువడినట్లును, శ్రీ భోజుని కాలములో మహాకవులచే సంస్కృత గ్రంథములు వెలువరింప బడినట్లును, ఆంధ్రభోజుని కాలములో పెక్కు గ్రంథములు—సాహితీవాల్లభ్యము—ప్రథమ భాగము—ఆర్యచాణక్యుడు బుద్ధచరితము, నరేంద్రుడు మొదలగునవి వెలువడినవి.

సాహితీ వాల్లభ్యము ప్రథమభాగము 80 మంది పండిత ప్రకాండులు, డాక్టరేట్ బిరుదము గల విశ్వవిద్యాలయము నందలి యుపన్యాసకులచే విరచితములయిన వ్యాసకళాఖండముల సంపుటి. ద్వితీయభాగము సుమారు వందమంది మహాకవులచేతను, మహా పండితుల చేతను విరచితమయిన శాస్త్రీయ వ్యాస కళా ఖండముల తోను, స్వీయ కవితలతోను విలసిల్లుచున్నది. ప్రథమభాగము ముద్రితమై శ్రీ తిమ్మరాజుగారిని వరించినది. ద్వితీయ భాగము కూడ ముద్రితమగుచున్నది. ఆమెకును యుక్త వయస్సు వచ్చినది. శ్రీ సాహితీ వల్లభులను పరిణయమాడు ముహూర్తమునకై రుక్మిణీ దేవివలె పరితపించుచున్నది. ఆంధ్రభోజుల చరితాభిమానము, సాహిత్యాభిరుచి మిక్కిలి ప్రశంసనీయములు.

కృతికర్తయగు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు 'సాహిత్యాచార్య'; లాక్షణిక శిరోమణులు. వీరు శతాధిక గ్రంథములను సంస్కృత గ్రంథములనుండి ఆంధ్రభాషలోనికి అనువాద మొనరించిరి. వీరి కృతి సంస్కృతములో క్షేమేంద్ర విరచిత మయిన ఔచిత్యవిచారచర్చకు అనువాదము. దీనిని 10 సంవత్సరముల క్రిందట శ్రీ తిమ్మరాజుగారు కృతిస్వీకార మొనరించిరి. అప్పటి సభాధ్యక్షులయిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, పండిత ప్రకాండులును "సాహితీవల్లభ" అను బిరుదము శ్రీ తిమ్మరాజు గారికి నొసంగి వారి ఋణము తీర్చుకొనిరి. ఆ సాహితీవల్లభ బిరుదము నృత్తరత్నావళికి వ్యాఖ్యారూపాంతరమున సుదృఢమయినది.

కాళిదాసునకు పూర్వము భరతాచార్యుడు సంస్కృత భాషలో నాట్యశాస్త్రము రచించెను. నాట్యరీతులు రెండురీతులుగ నున్నవి. మార్గకవిత, దేశికవిత యను కవిత్వము రెండువిధములుగా నున్నట్లు, మార్గసంప్రదాయము, దేశిసంప్రదాయములని నాట్యమున గూడ రెండు రీతులు గలవు. మార్గసంప్రదాయమే భరతాచార్య విరచితము. దేశిసంప్రదాయము అప్పటప్పట నానాదేశముల విలసిల్లినట్టిది. ఈ జాయసేనాపతి గ్రంథమున దేశీయనృత్తనిరూపణమే ప్రాధాన్యము వహించినది.

వాల్మీకి విరచిత రామాయణమున "వధూ నాటక సంఘైశ్చ" అని చెప్పుటచే క్రీస్తుపూర్వమే స్త్రీలు నృత్యనాట్యగీతులలో అభిజ్ఞ రాండ్రని తెలియుచున్నది. కావున భారతదేశములో ఆదికావ్యము యొక్క కాలమునుండి నృత్తశాస్త్రాభిజ్ఞత కలదని చెప్పక తప్పదు. అట్టి నాట్యశాస్త్రమును ఆంధ్రభాషలోనికి అనువదించిన శ్రీ సాహిత్యాచార్యులు కృతికర్తయగు శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మ గారిని, కృతిభర్తయగు "సాహితీవల్లభ" "ఆంధ్రభోజ" శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారిని భగవంతుడు ఆయురారోగ్యై శ్వర్యములనిచ్చి రక్షించుగాత యని ప్రార్థించుచున్నాను.

బ్రాహ్మీభూషణ:—పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రి

# నృత్తరత్నావలి

## ప్రథమభాగ విషయసూచిక.

---

కంపితము—పార్శ్వాకంపితము. ౬౭- ఉపాంగములు — దృష్టివిశేషములు—రసదృష్టులు—స్థాయిదృష్టులు — వ్యభిచారిదృష్టులు — రసదృష్టులలో శృంగారదృష్టి—హాస్యదృష్టి--రౌద్రరసదృష్టి—కరుణరసదృష్టి—వీరరసదృష్టి—అద్భుతరసదృష్టి—బీభత్సరసదృష్టి-భయానకరసదృష్టి—శాంతదృష్టి. ౭౪—స్థాయిదృష్టులు. ౭౫—స్నిగ్ధదృష్టి—హాసదృష్టి-క్రోధదృష్టి—దీనదృష్టి—దృప్తదృష్టి—సవిస్మిత—జుగుప్సిత—భయదృష్టి. ౭౬—సంచారిదృష్టులు—శూన్యదృష్టి—మలినదృష్టి—శ్రాంతదృష్టి—లజ్జాన్వితదృష్టి—గ్లానదృష్టి—శంకితదృష్టి—విషాదినిదృష్టి—ముకులదృష్టి—కుంచితదృష్టి—అభితప్తదృష్టి—జిహ్మదృష్టి—లలితదృష్టి—వితర్కితదృష్టి — అర్ధముకులదృష్టి — విభ్రాంతదృష్టి — విప్లుతదృష్టి—ఆకేకరాదృష్టి— వికోశదృష్టి—త్రస్తదృష్టి-మదిరాదృష్టి.౮౩-తారాకర్మలు - భ్రమణము - వలనము-పాతము-చలనము-సంప్రవేశనము - వివర్తనము - సముద్వృత్తము-నిష్క్రామము-ప్రాకృతము-౮౭-దర్శనభేదములు - సమము-సాచి-అనువృత్తము-ఆలోకితము-విలోకితము - ప్రలోకితము - ఉల్లోకితము-అవలోకితము.౮౫-పుటకర్మలు-ఉన్మేషము-నిమేషము - ప్రసృతము-కుంచితము-సమము-వివర్తితము-నస్ఫురితము-విహితము వితాడితము.౮౭-భ్రూకర్మలు-ఉత్క్షేపము-పాతనము -భ్రుకుటి-చతురము-కుంచితము-రేచితము -సహజము.౮౮-నాసాకర్మలు-నత-మంద-వికృష్ట-సోచ్ఛ్వాస-వికూణిత-స్వాభావిక.౯౦-అధరకర్మలు - వివర్తనము-విసర్గము-వేపనము-వినిగూహనము-సందష్టకము-సముద్గము. ౯౩- ఆస్యకర్మలు—ఆయతము-రేచితము-వృత్తము-వికాసి. ౯౪ - కపోలకర్మ - కుంచితము-కంపితము-ఫుల్లము-క్షామము- పూర్ణము- సమము- ౯౫-చిబుకలక్షణము-కుట్టనము-లేహనము - భిన్నము - ఖండనము- చుక్కితము-సమము-సందష్టము-౯౮-హానులక్షణము - వ్యాదీర్ణ - శ్వసిత - చల-సంహిత-స్ఫురిత, వక్ర. ౧౦౦ జిహ్మకర్మ, ఋజ్వీ, సృక్కానుగ,

పార్శ్వమండల–ఉరోమండల–ఉరఃపార్శ్వార్ధమండల–ముష్టికస్వస్తిక, నలినీపద్మకోశ, అలపద్మోల్బణ, లలిత, వలిత ములు ౧౯–౨.

హస్తలక్షణము, వరదాభయహస్తములు, వక్షోలక్షణము, సమ, ఉద్వాహిత, ఆభుగ్న, నిర్భుగ్న, ప్రకంపితములు, ౧౯౬, పార్శ్వ లక్షణము, వివర్తిత, అపసృత, ప్రసారిత, సమున్నత, నతములు, ౧౯౭. జఠరకర్మ, క్షామ, స్వల్ప, పూర్ణములు, కటిలక్షణము, రేచిత, కంపిత, భిన్న, నివృత్త, ఉద్వాహితములు, ఊరుకర్మలు –౨౦౧, కంపన, వలన, స్తంభ, ఉద్వర్తన, నివర్తనములు, జానుకర్మలు –౨౦౩, ఉన్నత, వివృత, నమ్రి, అర్ధకుంచిత, కుంచిత, సంహిత, సమములు, జంఘాకర్మలు –౨౦౫, పరివృత్త, నత, క్షిప్త, ఆవర్తిత, ఉద్వాహిత ములు, మతాంతరము, భ్రమిత, నిసృత, కంప, తిరశ్చీన, బహిర్గత ములు, పాదలక్షణము –౨౦౮, సమ, అగ్రతలసంచార, కుంచిత, ఉద్ఘట్టిత, అంచితములు, అన్యమతము, తాడిత, ఘట్టితోత్సేధ, ఘట్టిత, మర్దిత, అగ్రగ, పార్ష్ణిగ, పార్శ్వగ, సూచీసంజ్ఞక, అంగుళీపృష్ఠగ, తలాహతి, పాదాంగుళీలక్షణము –౨౧౩, ఉత్క్షిప్త, కుంచిత, స్తబ్ధ, అవక్షిప్త, స్వభావజ, అనంగుష్ఠయుత, అంగుష్ఠసంయుతములు, అంగుష్ఠము త్రివిధము, –౨౧౬.

౩. **తృతీయాధ్యాయము : ౨౧౯–౩౦౬ చారీస్థానకమండలలక్షణము.**

చారీపదవ్యుత్పత్తి –౨౨౧, చారీలక్షణము, చారీస్వరూప వివేకము, స్వరూపభేదనామములు, భూచారులు, ఆకాశచారులు, సమపాద, స్థితావర్త, జనిత, స్యందిత, అవస్యందిత, బద్ధ, శకటాస్యా, విచ్యవ, ఏలకాక్రీడిత, చాషగతి, ఉత్స్యందిత, అడ్డిత, సమోత్సరిత మత్తల్లి, మత్తల్లి అధ్యర్ధిక, ఊరూద్వృత్త –౨౪౦.

ఆకాశచారులు—అతిక్రాంత—పార్శ్వక్రాంత—అపక్రాంత—సూచి—మృగప్లుత—భుజంగత్రాసిత—అలాత—ఆవిద్ధ—నూపురపాదిక—ఆక్షిప్త—భ్రమరి—దండపాద—విద్యుద్భ్రాంత—ఊర్ధ్వజానువు—ఉద్వృత్త—డోలాపాద—ఇదం తాత్పర్యం—౨౫౨.

స్థానములు—౨౫౬. వైష్ణవస్థానము—సమపాదము—ఆలీఢస్థానము—ప్రత్యాలీఢము—౨౬౩. న్యాయములు—భారతము—సాత్వతము—వార్షగణ్యము—కైశికము—౨౬౬. ప్రవిచారములు—వ్యాయామనిర్వర్తనము—ఖర్వాత—చతురశ్రలక్షణము—ధనుఃకరణము—ఆసనవిధి—౨౭౩. సుప్రస్థానములు.౨౭౬.సమప్రసారిత—ఉద్వాహిత—వివర్తిత—నత—ఆకుంచిత—స్త్రీస్థానములు—౨౭౮. ఆయతము—అవహిత్థము—అశ్వక్రాంతము—గతాగతము—వలిత— మోటితము—వినివర్తితము—ప్రోన్నతము.

మండలములు ౨౮౬. భౌమమండలములు—ఆకాశమండలములు—భ్రమరమండలము—ఆస్కందిత—పిష్టకుట్ట—చాషగత—అడ్డిత—ఏలకాక్రీడిత—అధ్యర్ధ—ఆవర్తము—శకటాస్య—సమోసరిత—ఆకాశమండలములు ౨౯౫. సూచీవిద్ధమండలము—అతిక్రాంత—దండపాద—అలాత—విచిత్ర—విహృత—వామబంధ లలితసంచర—క్రాంతమండల—లలితము.

౮. అధ్యాయము ౩౦౭—౪౮౬ కరణాంగహార వివేచనము.

కరణలక్షణము—కరణనామములు—అష్టోత్తరశతకరణలక్షణములు—తలపుష్పపుటము—క్రాంతము—భిన్నము—సమనఖము—అంచితము—శకటాస్యము—కటిచ్ఛిన్నము—ఘట్టితము—నికుట్టకము—లలితము—వలితము—లీనము—స్ఖలితము—చక్రమండలము—నివేశము—

స్వస్తికము-సూచీకరణ-సూచీవిద్ధ-అర్ధసూచి-వక్షఃస్వస్తిక-ఉన్మత్త-అర్ధరేచిత-అర్గల-అర్ధస్వస్తిక. ౩౪౧ ఆవర్తి-పృష్ఠస్వస్తిక-వర్తిత-భుజంగాంచిత-విష్కంభ-విక్షిప్త-దండపేచిత-అర్ధమత్తల్లి-మత్తల్లి-మస్ఖలిత-లోలిత-ప్రేంఖోలిత-నితంబ-ఊర్ధ్వజాను-పార్శ్వనికుట్టిత-పార్శ్వక్రాంత-అతిక్రాంత అపక్రాంత-నికుంచిత-విద్యుద్భ్రాంత-కటిభ్రాంత-ఉరోమండల-సన్నట-వినివృత్త-నివృత్త-అర్ధవిద్ధ-గరుడప్లుత-లలాటతిలక-దోలాపాత-తలవిలాసిత. ౩౬౫. తలసంస్ఫోటిత-తండపక్ష-ఆక్షిప్తరేచిత-జనిత-ఉపసృత-ఉద్వృత్త-అవహిత్థ-నిశుంభిత-విక్షిప్తాక్షిప్త-ఆక్షిప్త - భుజంగత్రస్తరేచిత - మండలస్వస్తిక - దండపాద-పాదాపవిద్ధ-భుజంగత్రాసిత-విష్ణుక్రాంత-స్వస్తికరేచిత-ఏలకాక్రీడిత-సంభ్రాంత-సింహాకర్షిత-సర్పిత-నాగాపసర్పిత - పార్శ్వజాను - వృశ్చికరేచిత-లతావృశ్చిక-వైశాఖరేచిత-హరిణప్లుత - దిక్స్వస్తిక-గజక్రీడిత-చతుర-కటీసమ-మయూరలలిత - అలాత - సింహావిక్రీడిత - కుంచిత - వృశ్చిక - వ్యంసిత - పరివృత్త - వివర్తిత - రేచకనికుట్టిత - ఊరూద్వృత్త-వృశ్చికకుట్టిత - తలసంఘట్టిత - దండసూచి - భ్రమర-నూపుర-ఘూర్ణిత-వృషభక్రీడిత-కరిహస్త - వలితోరు-గృధ్రావలీన-అర్ధనికుట్టన-గంగావతరణములు-౪౧౦

అంగహారములు : ౪౧౩. అంగహారప్రయోగప్రకారము, ౪౧౮. కరణసంకలనము-మాతృక-కలాపము-ఖండకము-సంఘాతకము-అంగహార నిర్వచనము ౪౨౧ అంగహారనామములు - అంగహారలక్షణము, స్థిరహస్తము, పరిచ్ఛిన్నము, పార్శ్వచ్ఛేదము, అపరాజితము, పర్యస్తము, భ్రమరము, విద్యుద్భ్రాంతము, వైశాఖరేచితము, మదవిలసితము, ఆలీఢము, మత్తాక్రీడము, అపసర్పిత, వైశాఖరేచిత, సూచివిద్ధ, ఆక్షిప్త, పార్శ్వస్వస్తిక, ఆచ్ఛురితములు. ౪౪౫.

గతిమండలములు, విష్కంభము, పరావృత్తము, అపవిద్ధము, మదస్ఖలితము, సంభ్రాంతము, ఆక్షిప్తరేచితము, రేచితము, ౨౫౭. జాయసూచితకర్ణములు, అభినవగుప్తభావములు, ౨౬౧. విష్కంభాపసృతము, అలాతము, ఉద్వృత్తము, అర్ధనికుట్టము, ఉద్ఘట్టితము, వృశ్చికాపసృవము, స్వస్తికరేచితము, పరివృత్తకరేచితము, ౨౬౫. అంగహారము లనంతములు, అంగహారనియమములు, మానతాళాదివిశేషములు, అంగహార సంఖ్యానియమము, రేచక స్వరూపము, ౨౭౦. పాదరేచకము, కటిరేచకము, హస్తరేచకము, గ్రీవారేచకము, పాదరేచకము.

---

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచితా

# నృత్తరత్నావలీ

## ప్రథమోఽధ్యాయః



ఆశిషః

మౌలిం స్వేదజలార్ద్రకుంతలమురః పూర్వాదికోష్ణ స్తనం
శ్రోణీముచ్ఛ్వసదంశుకాం పులకితే పార్శ్వే ప్రకంపౌ కరౌ
స స్తంభం చరణద్వయం చ ముదితో గౌర్యాశ్శివః కౌతుకా
త్తత్తన్నృత్తకలోచితాంగ కథన వ్యాజైః స్పృశన్ పాతు వః ౧

శ్రీ మాధవరామ శర్మ విరచిత
సాహితీవల్లభవ్యాఖ్య

నృత్తరత్నావలి సేయం సాహితీవల్లభాంచితా
సదా భావ్యా సదారాధ్యా సాహితీ వాసితాంతరైః

సాహితీవల్లభాఖ్యేయం వ్యాఖ్యాఽభిఖ్యామనోరమా
ప్రఖ్యోపాఖ్యావిధారమ్యా రస్యతాం రసితాంతరైః

భరతాది సమారంభ సుబ్రహ్మణ్య గురోర్మమ
స్వానందాభినవస్యాస్తి సంప్రదాయవిశుద్ధతా

శ్రీవర్ణ తత్త్వ సంక్లుప్తమహార్ణజ్యోతిరైశ్వరం
ఉమాదేవీమహం నౌమి వర్ణసుశ్లిష్ట విగ్రహం

శ్రీగణపతిదేవస్య నృత్తరత్నావలీ ప్రియా
శ్రీకాకతీయ రాజశ్రీ పాలకస్య సచేతసః
సాహితీవల్లభస్య శ్రీకమలా లాలితశ్రియః
సాహితీవల్లభవ్యాఖ్యా తిమ్మరాజస్య వల్లభా

శ్రీ నృత్తరత్నావలీ గ్రంథకర్త "గ్రంథారంభమున సముచితేష్టదేవతా స్తవ మొనరింపవలె" నను భారతీయ సముదాచారము ననుసరించువాడై ప్రథమమున శ్రీశివస్తుతి యొనరించుచున్నాడు. శ్రీగౌరీదేవిశిరమును ఉరమును నితంబమును పార్శ్వములను కరములను చరణద్వయమును కౌతుకమున ముదితుడై స్పృశించు శివుడు మనల నందరిని రక్షించుగావుత. ఇందు గౌరీదేవి యొక్క ఆ యా నృత్తకలాసముచితము లయిన అంగములను నిరూపించి చెప్పు వ్యాజమున స్పృశించుట నిరూపిత మయినది. అనురాగమున నా యా యంగముల స్పృశించుటయు శివున కభీష్టము. అది యాతని కౌతుకము. అందుననె యాతడు ముదితుడు. సంతుష్టుడు అట్లు ముదితుడు మనల రక్షించుగావుత. దేవీసమక్షమున దేవుడు నృత్తకలోచితము లయిన యంగములను నిర్దేశించుచున్నాడు. శిరోహస్తములు ఉరఃపార్శ్వములు కటీపాదములు ఆరును నృత్తమున అంగములు. దేవికి నృత్తకలను ఉపదేశించు దేశికుడై మహాదేవుడిందు గోచరించు చున్నాడు. ఇందు దేవదేవుల యనురాగము నృత్తకలానురాగము భాసించుచున్నది. శివదేవుడు సమీపమున నుండి దేవికి కలాసక్తి కలుగజేసినాడు. శివు డట్లుండుటయే దేవీభావమున నిర్వార చమత్కారమును గలుగజేసినది. దేవి యట్లుండుటయు శివున కట్టి చమత్కారకౌతుక ముదయించినది. దేవీమౌళి శిరము స్వేదజలార్ద్రకుంతలము. దేవి యురము పూర్ణాధిక

ముగా నున్నతుచము. దేవి కటి పై వస్త్రము ప్రిదిలి సడలి విడిబడి యుల్లసనము కలదై నది. పార్శ్వములు పులకితము లయినవి. కరములు కంపితము లయినవి. పాదము లట్టె సంస్తంభము కలవయినవి. సన్నిధిమాత్రముననె యట్లు కాగా శివుడును ముదితుడై కుతుకియై స్పర్శాసక్తుడై యనుభావతుష్టు డయినాడు. గౌరియు నట్టిదె యయినదని ప్రతీయమాన మగును. దేవీదేహమున కలాస్థానము లను స్పృశించుటయు భావనీయము. ఇందలి శివస్తుతి సముచిత మును. ఈగ్రంథమున నృత్తకలాతత్త్వము నిరూపితము కా నున్నది. అట్టి కలాదేవుడు స్తుత్యుడయినాడు. దేశికుని దేశనముననె నృత్తకల రాణింపవలయుట నృత్తకలాసంప్రదాయము. నృత్త కలాంగషట్క మిందు సూచిత మయినది. నృత్తకలాసక్తులమగు మనకును నృత్తకలోచితాంగముల సముల్లాసము శివశక్తిసమావేశ మున కలుగును. అట్టి శివుడు అట్లు రక్షించు గావుత.

వామే భావాభినయసుషమాలంకృతాం లాస్యభంగీం
అర్ధేఽన్యస్మిన్నుదితడమరుం బిభ్రతస్తాండవం చ
స్వస్వక్షేత్రవ్యవహృతకరా లోకదత్తావధానాః
శంభోః కాంతాకలితవపుషో దృష్టయః పాంతు యుష్మాన్ ౨

అర్ధనారీశ్వరరూపమున నున్న శివుని దృష్టులు మిమ్ము రక్షించు గావుత. శివుడు వామభాగమున భావాభినయశోభాలం కృత మయిన లాస్యభంగి ధరించి యున్నాడు. దక్షభాగమున వాద్యవిశేషమగు డమరుకము కల తాండవము ననుసరించు చున్నాడు. అట్లున్న శివుడు; అనగా లాస్యతాండవముల నున్న శివుడు లాస్యతాండవానుకూలముగా నానాస్థానములందు ప్రస రించు హస్తవిన్యాసములను సావధానముగా నవలోకించుచున్నాడు. ఇట్లు హస్తవిన్యాసముల నవలోకించుటలో సావధానము లయిన

శివుని దృష్టులు రక్షించు గావుత. నృత్యము నృత్తము అను రెండును సుకుమార ముద్ధతము నని రెండువిధముల నుండును. ఇందు సుకుమారము లాస్య మని, ఉద్ధతము తాండవ మని వ్యవహార మున్నది. లాస్యమును స్త్రీలు ప్రయోగింతురు. దేవికై దేవు డుపదేశించినాడు. స్త్రీపురుషుల భావమునకు లాస మని వ్యవహారము. అట్లు భావార్థ మగునది లాస్యము. లాస్యము కామోల్లాసము కలిగించును. తాండవమును పురుషులు ప్రయోగింతురు. శివుని సూచనమున తండువు భరతునకు ప్రబోధించి నందున తాండవ మయినది. లాస్యము తాండవమును నృత్తహస్త ప్రయోగములతో నుండును. నృత్తహస్తముల మేళనమున కరణములు, కరణముల కలయిక వలన అంగహారములును కలుగును. లాస్యము నందు మృదువుగా నుండు అంగహారముల ప్రయోగ ముండును. తాండవమున ఉద్ధతములగు అంగహారముల ప్రయోగ ముండును. ఇట్టి లాస్యతాండవప్రయోగమున ప్రసరించు హస్త విన్యాసావలోకనమున శివదృష్టులు సావధానముగా నున్న వని భావము. హస్త మెటుగా ప్రసరించునో యా విభాగముననె దృష్టి యుండవలయు నని నాట్యశాసనము. దృష్టి ననుసరించి మనః ప్రసారము నుండును. కాంతాకలితశరీరు డయిన శివుని నాట్య దృష్టులు ఇట్లు నిరూపితము లగుట ప్రకృతరచనా సముచితముగా నున్న దని భావింప దగును.

దేవ్యా లీలాలలితమధురం లాస్యముల్లాసయంత్యా
యః శృంగారో రహసి పురతః పత్యురావిష్కృతస్తం
వీర్యాన్నృత్తైర్వికటగతిభిర్వ్యంజయన్ కుంజరాస్యః
శంభోర్దేవ్యా విదధదధికం పాతు వో మంజుహాసం

లలితమధురముగా లాస్య ముల్లసింపజేయు దేవి పతి యగు మహాదేవుని సమక్షమున రహాస్యస్థలమున ఏకాంతమున నే

శృంగారము నావిష్కరింప జేసినదో యా రహఃశృంగారమును వికటము లగు గతివిశేషములు కల నృత్తములచే తన సామర్థ్యమున నభివ్యంజనము చేయుచు దేవికి దేవునకు మంజుహాసము నధికముగ సంపాదించు గజాననుడు మనలను (మిమ్ము) రక్షించుగావుత. ఇట్లీ శ్లోకమున గజాననస్తుతి యున్నది. గజాననుడు విఘ్నేశ్వరుడు. విఘ్నేశస్తుతి సర్వవిఘ్ననివారక మయినందున దేవీదేవుల స్తుత్యనంతరము విఘ్నేశస్తుతి సముచితముగా నున్నది.

నృత్యము నృత్తము అనునవి రెండును లాస్యతాండవ రూపమున ద్వివిధము. సుకుమారముగా నొనరించు నృత్యనృత్తములకు లాస్య మను వ్యవహారము కలదు. లాస్యము మధుర మని తాండవ ముద్ధత మని వ్యవహారము. దేవి లీలాలలితముగ మధురముగ లాస్య మొనరించుచు దేవుని ఎదుట తన శృంగార రతి భావమును ప్రకటించినది. హృదయావష్టంభముతో నున్న రాగ భావములను స్త్రీలు సుకుమారావయవ విన్యాసములతో లాస్యభంగి సుందరముగ నిరూపింతురు. అట్టి దేవీ రహః శృంగారమును దేవీ దేవుల యెదుట గజాననుడు వికట గతి విన్యాసములు కల నృత్త విశేషములతో ననుకరించుటచే దేవీదేవులకు మృదుల మయిన మంజుహాసము కలిగిన దని వర్ణించుటచే సుకుమారహాస ముత్పాదింప జేయుటకు వికట గతి విశేషము సమర్థ మగునని సూచితము. గజానను డట్లొనరించు చుండగా దాని చూచు దేవీదేవులకు తమ రతిభావము స్మృతికి వచ్చుటయు తన్నిమిత్తముగా హాస ముదయించినదనియు నిందు సంభావ్యము. నృత్తవిధానములలో "గజాననపిండి" యను నొక విశేషము కలదు. అది యన్యానుకరణాత్మకమై హాస ముత్పాదింప జేయుటకు సమర్థము. ఇందు

చతుర్థపాదమున త్రుటిత మయిన భాగము భావానుసారమున నిరూపిత మయినది.

నృ త్త ప్ర శం సా

( దేవస్య శంభోర్జగదా) త్మనోఽపి
సదాశివాద్యాకృతిభేదయోగే
యత్కౌతుకం కారణ మాహు రాప్తా
నృత్తం న తత్కస్య భవేత్సుఖాయ.

నృ త్త ప్ర శం స

ఈ శ్లోకమున ప్రథమపాదములో పాత మున్నది. ఇందు నృత్తప్రశంస కలదు. స్వ సంవిత్ప్రకాశమాను డగు శివుడు విశ్వ జగద్రూపుడయినను సదాశివాదుల ఆకృతిభేదమును పొందుటలో నానావిధ విశిష్టకౌతుకము కలవా డయినాడు. అట్టి ఆ దేవుని కౌతుకమే నృత్త మావిర్భవించుటలో కారణ మైన దని యథార్థ వదను లైన ఆప్తు లనుచున్నారు అట్టి ఆ నృత్తము ఎవనికి సుఖము నాపాదింపదు? స్వమహిమ ప్రతిష్ఠితు డైన శివుడు అష్టమూర్తియై జగదాకృతి కలవాడై నాడు సదాశివాది భేదములను పొందినాడు. ఇట్లు బహుభేదప్రభిన్ను డగుటలో శక్తి పరిస్పందమే హేతువు. శక్తి సాహచర్యమున స్పందితు డైన శివుని స్పందవిశేషములన్నియు విశ్వ, విశ్వసృష్టి నిదానములైనవి సిసృక్షు కల శివుని నృత్తమహార్థమే సర్వవిశ్వము. శివాది స్తంబ పర్యంతము ముప్పది యారు తత్త్వములు కలవు. సదాశివుడు అఖండ మండలాకారుడైన విశ్వరూపుడు. కావుననే సదాశివాద్యాకృతి భేదము లన్నియు పరమశివునకు సంబంధించినవే. ఇందు శివుని నృత్తమే, నృత్త మొనరింప వలె ననెడి కౌతుకమే సర్వకారణ మైనదని ఆప్తుల ఉపదేశ వచనము.

ఈ విశ్వమంతయు శివుని నృత్తకల. అట్టి ఈ నృత్తము సర్వవ్యక్తు లకు స్వాత్మసుఖము సంపాదింప గలదు. అనేకవిధము లగు నృత్త సంప్రదాయములలో సదాశివసంప్రదాయమును కలదని నాట్య విదుల ఆశయము.

(యన్నృత్తం శివయా శివేన చరితం) న్వప్రేయసీభిస్సమం
గోపాలోపి పితామహోపి చ గిరాం దేవ్యా యదభ్యస్యతి
తస్యైతస్య సమస్తలోకనయనానందామృతస్యందినో
నృత్తస్యాద్భుతసంపదో మధురి (మోద్గారః కథం వర్ణ్యతే) ౫

నృత్త ప్రశంసా పర మయిన ఈ శార్దూలవిక్రీడితములో మొదటి పాదమున చివరి పాదమున కొంతభాగము త్రుటిత మయి నది. శివ గోపాల బ్రహ్మదేవులు తాను ప్రేయసీసహితముగా నృత్యాభ్యాస మొనరించినా రను భావ మిందు సంగతపరచుట సము చితము. ఏ నృత్తమును శివాదేవితో శివదేవు డాచరించెనో, ఏ నృత్తమును తన ప్రేయసీమణులతో గోపాలదేవు డభ్యసించెనో, ఏ నృత్తమును గిరాందేవితో పితామహదేవు డభ్యసించెనో అట్టి సమస్తలోక నయనానంద సుధను ప్రసరింప జేయు అద్భుత సంపత్తితో కూడుకొనిన యీ నృత్తమునకు సంబంధించిన మధురి మాతిశయ మెట్లు వర్ణితము కాగలదు?.

ఈ శ్లోకములో నృత్తసంప్రదాయపరంపర నిరూపిత మయినది. పార్వతీ పరమేశ్వరు లాదిప్రవర్తకులు. దాని నను సరించి లక్ష్మీనారాయణులు పరిపోషము సంపాదించినారు. వాణీ హిరణ్యగర్భులు సృష్టపరిపుష్ట నృత్తమహార్థమును గుర్తించి సర్వవేద గర్భిత మయిన తద్భావమును శాస్త్రీయముగా వెలయించుటకు

నాట్యవేదము నిరూపించినారు. ఇట్టి యీ నృత్తము సర్వజనులకు చాక్షుషయజ్ఞమై నేత్రానంద మాధానించినది. అట్టి దాని నెట్లు వర్ణింపగలము? సంప్రదాయసమాగత మయిన యీ నృత్తమును నాట్యవేదానుసరణమున నిరూపించుటయె యుక్తకార్యము.

కల్హారై రనవాప్తచంద్రకిరణాశ్లేషై రలబ్ధాంబుదై
రలికులై రప్రాప్తపుష్పాసవైః
సామ్యాలాపదశామమూని దధతే నేత్రాణి, యేషాం పురః
శశ్వన్నావతరత్యుదారసుషమా నృత్తప్రయోగక్రమాః ౬

ఇందును రెండవపాదారంభమున పాతమున్నది. ఉదార శోభాసుందరము లయిన నృత్తప్రయోగక్రమములను దర్శింపని వారి నేత్రములు చంద్రకిరణాశ్లేషము లేని కల్హారములతో, అంబుద సంబంధము పొందని నెమలి కన్నులతో, పుష్పాసవము పొందని తుమ్మెదల పిండుతో సామ్యావస్థను పొంద వలసి వచ్చును. చంద్ర కిరణ ప్రసారము లేకున్న కలువలకు వికసనము లేదు. మేఘముల సంబంధము లేకున్నచో బర్హిబర్హములకు విస్ఫారము లేదు. పుష్పాసవాస్వాదము లేకున్నచో తుమ్మెదలకు శోభ లేదు. నృత్త దర్శనము లేకున్నచో నారీనర నేత్రములకు సౌందర్యము లేదు. ఈ గ్రంథానుసంధానము లేకున్నచో సహృదయులకు హృదయానందము లే దనియు నిం దభివ్యంగ్య మగును.

ఉద్యద్యౌవనసౌరభాం మృదుతనుం ప్రస్నిగ్ధగీతస్వనాం
నానాభావ రసాఢ్య లాస్య నిపుణాం బింబాధరాం నర్తకీం
లబ్ధ్వా రాజపురందరస్య సతతం నిర్విష్ట సర్వేంద్రియా
(గ్రాహ్యానంద రసీకృతస్యక) ఇవాస్వాదో వినోదాంతరైః

అతిశయించిన యౌవనపరిమళము కలిగిన శరీరసౌకుమార్యము కల ప్రసిద్ధ గీతస్వనము కల నానా భావరస పరిపూర్ణ మయిన లాస్యమున నైపుణ్యము కల బింబాధర యయిన నర్తకిని ఆదరించు రాజేంద్రునకు సర్వేంద్రియసంగ్రాహ్య మయిన యానంద రసాత్మకునకు ఇతరము లయిన వినోదాంతరములచే గలుగు నాస్వాద మేమి కలదు? సర్వసౌందర్యము కల సుందరనర్తకి సావధానముగా నొనరించు నృత్తవిశేషమున గలుగు రసానంద మత్యుత్తమము. ఇతరములగు వినోదము లిట్టివి కావు. రంజనసామర్థ్యము కల సంపన్నుడగు రాజేంద్రుడు సుందర లలనా లాస్యమున సర్వేంద్రియ సంతర్పక మగు రసానంద మనుభవింప గలడు. దీనిలో నృత్త మొనరించు నర్తకి సంపాదింప వలయు విశేషములును సూచితము లయినవి. యౌవనము, మృదు వగు దేహము, గీతస్వనము, రస భావపర మగు లాస్యము అనునవి నర్తకీసంపాద్యము లగు ఆవశ్యక విశేషములు. ఇట్టి యీ విశేషములలో నాట్యసంపత్తి సూచకము లయిన ఆహార్య - ఆంగిక - వాచిక - సాత్త్వికములు నాలుగును సూచితములు. దేశపాలకుడుగా నుండు రాజు విశిష్టనర్తన మొన రింప గలవారి నాస్థానమున నియమింప వలయుటయు నిందు సూచి తము కాగలదు. పూర్వశ్లోకములలో వలె నిందును తురీయ పాదారంభమున త్రుటి యున్నది. అయినను భావార్థము సంగత మయినది.

నిత్యం నాట్య కలావిలాస కుతుక ప్రాగ్భార విశ్రాణన
ప్రౌఢాహంకృతి (నా తరంగిత) ముదో ధన్యా ధరిత్రీశ్వరాః
శృంగారే విరతిం న యాంతి లఘుతాం ధైర్యే వినోదే క్లమం
మానే గ్లానిమనాదరం వితరణే కీర్త్యావనాస్థామపి. ౮

ధరిత్రీశ్వరులు నిత్యము నాట్యకళావిలాసమున కౌతుకము కలవారై ఆ నాట్యసంపద అతిశయము లోకమున కందింప వలె నని పూర్ణవిశ్వాసము కలవారై సంపూర్ణానందముతో నుందురు. అట్టి ప్రభువు లందరు ధన్యులు. నిరంతరము నాట్యవిద్యావిశ్రాణనమే వారి వ్రతము. వారు శృంగారమున విరతి పొందరు. ధీరత్వమున లఘుత్వము పొందరు. వినోదమున శ్రమను పొందరు. అభిమానమున గ్లానిని పొందరు. దాతృత్వమున అనాదరమును చూపరు. వారలకు కీర్తిలో ననాస్థ లేదు. అట్టి విశేషముల నన్నిటిని సంపాదింప గల నాట్యకళాసంపదను ప్రసరింప జేయుటలో వారత్యంత మాసక్తులు. కళావిలాసము నందు శృంగార మున్నది, ధీరత్వ మున్నది, వినోద మున్నది, మానిత ఉన్నది, వితరణ మున్నది, కీర్తి యున్నది. అన్నియు గలిగిన నాట్యసంపదను లోకమున ప్రసరింప జేయుటకై ధరిత్రీశ్వరు లాసక్తు లగుటచే ధన్యులు.

సంసారే భవతి ప్రధానమమితైర్లభ్యం శుభైర్మానుషైః
జన్మాస్మిన్ క్షితిపాలతా నిరవధిః శ్రీరత్ర కాన్తం వపుః
ఏతస్మిన్ ముఖమిన్దుసున్దరమిహ స్నిగ్ధా విశాలాయతా
దృష్టిస్తాం సఫలీకరోతి రమణీలాస్యావలోకోత్సవః ౯

ఈ విశ్వసంసార మందు శుభంకరము లగు నానామానుష జన్మలచే పొంద దగిన జన్మ అత్యంతము ప్రధాన మైనది. అట్టి మానవజన్మ కల్గినను అందు నిరవధిక మైన క్షితిపాలత్వ ముండుట శుభసంపత్తి. అందును సంపద యుండుట జన్మపరిపాకము. అందును మనోహార మగు శరీర ముండుట పూర్వఫలము. ఇంక నందును ఇందు సుందరముఖముండుట, అందును స్నిగ్ధము విశాలము ఆయత మైన దృష్టి యుండుట శుభసంపత్తి విశేషము. అట్టి యిష్ట విశిష్ట దృష్టిని

రమణీయరమణీ లాస్యావలోకోత్సవము సఫలము చేయును. మానవులు దృష్టి కలవారైనందులకు రమణీ లాస్యావలోక మొనరించుటయే విశిష్టఫలము. నానాప్రాణులలో మానవజన్మ ముఖ్యము. అందు రాజత్వము ముఖ్యము అందు సంపత్తి ముఖ్యము. సుందర దేహము ముఖ్యము. దేహమున ముఖము ముఖ్యము. అందును దృష్టి సర్వముఖ్యము. అట్టి దృష్టిసాఫల్యమునకు లాస్యదర్శన మావశ్యకము. ఉత్తరోత్తరము సారరూపార్థమున నిరూపించి, లాస్యమే సాఫల్య సంపాదకమని నిరూపించుట ఇందు ప్రధానాంశము.

భగవత్పాద శంకరుడు వివేకచూడామణి గ్రంథములో, నరజన్మదుర్లభ మని, పుంస్త్వము, విప్రత్వము, వైదికధర్మమార్గపరత్వము, విద్వత్త్వము ఉత్తరోత్తరము సారరూప మని చెప్పెను. ఇంకను ఇట్లు చెప్పెను, "ఆత్మానాత్మవివేచనము, స్వానుభవము, బ్రాహ్మీస్థితి, ముక్తి శతకోటిజన్మపుణ్యపరిపాకములచే కాని కలుగవు." అని. అట్లే వీనిలో ముఖ్యముగా రమణీలాస్యము నిర్దేశింప దలచెను గావున దాని ప్రాధాన్యసూచనకై యిట్లు సారరూపార్థమును వివేచిత మొనర్చెను.

క్షితౌ రత్నచ్ఛాయా ఫలనముదకే వీచిలలితం
శిఖిన్యర్చిః ప్రేంఖా సహజగతి వైచిత్ర్యమనిలే
తటిత్క్రీడా వ్యోమ్నిత్యకృతకసుభగః పఞ్చసు పరః
ప్రవిష్టో భూతేషు ప్రభవతి హి నృత్తస్య మహిమా ౧౦

నృత్తమహిమ పంచభూతములందును ప్రసరించి యున్నది. భూమిలో రత్నకాంతుల ప్రతిఫలనములో నృత్తమున్నది. జలములో

తరఙ్గలలితముగా నృత్త మున్నది. అగ్నిలో జ్వాలాప్రేంఖణ రూపముగా నృత్త మున్నది. వాయువు నందు సహజ గతి విచిత్రతతో నృత్త మున్నది. ఆకాశ మందు విద్యుదుల్లసన రూపముగా నృత్త మున్నది. ఇట్లు పంచభూతము లందును నిరతిశయ స్వరూపమున అకృతకముగా నృత్త ప్రభావము ప్రసరించి గోచరించు చున్నది. నానావిధము లైన అంగోపాంగముల అభినయ మొనరించు నపుడు పంచభూతముల అనుకరణము ప్రసిద్ధముగా నున్నది. రత్నానుకరణమున తరఙ్గానుకరణమున, జ్వాలామాలానుకరణమున గతి సుందరతాస్వరూపమున, విద్యుదున్మేషణతా ప్రకారమున నానాభినయములు ప్రసిద్ధము లైనవి. సర్వభూతాత్మకుడైన శివుడు తన నృత్త మహార్థప్రసారముననే విశ్వవిశ్వమును సృజించినాడు. కాబట్టి నృత్తాతిరిక్తముగా జగమున నే అంశమును లేదు. సర్వ ప్రపంచమును నృత్తప్రశంసాతిశయమును సాక్షాత్కరింప జేయుచున్న దనియే భావము.

ధర్మం దేవా ధరణిపతయో దద్యురర్థం ప్రసన్నాః
తస్త్రీవర్గః స్పృహయతి కలాప్రౌఢిభంగీవిధేయః
విద్వద్గోష్ఠ్యాం బహువిధ ప్రక్రియా వర్ణనాభిః
కీర్తిం తస్మై దధతి వివిధాం యేన నృత్తం ప్రయుక్తం. ౧౧

ఈ శ్లోకమున నృత్తప్రవృత్తి నిదర్శిత మగును. దేవతలసురులు రాజులు కుటుంబులు బ్రహ్మర్షులు అందరు నృత్తమునకాశ్రయముగ నుందురు. వారియందరి వృత్తాంతము నిట ప్రదర్శించును నృత్తనాట్య ప్రదర్శనమున దేవతలు ప్రసన్నులగుదురు. ధర్మమనుగ్రహింతురు. నాట్యనృత్తములలో నొక్కొకచో ధర్మ మున్నది అర్థ మున్నది. శమ మున్నది. వినోదమున్నది. సర్వమున్నది. నృత్త

ముస ప్రసన్నులయిన ప్రభువు లర్థమిత్తురు ధర్మప్రవృత్తులకు ధర్మ మున్నది. అర్థప్రవృత్తుల కర్థమున్నది. కామోపసేవులకు కామ మున్నది. సంపన్నులకు విలాస మున్నది కలా ప్రౌఢ భంగిపిధేయ మయిన వనితావర్గము నృత్త మభిలషించును. కలాలలిత మయిన కామినీ వర్గము కలారమ్యభంగి భావించి విధేయముగ నుండును. విద్వాంసు లిందు వైదుష్యము భావింతురు. విద్వద్గోష్ఠీరసికు లందరు బహువిధము లయిన గుణప్రక్రియల వర్ణనములతో నృత్త మాదరింతురు. దీనిచే నబుధులకు విబోధ ముదయించును. ఇట్లు దేవులు భూదేవులు ప్రభువులు దేవపాలకులు జనపాలకులు వనితలు బహుశ్రుతు లందరు నృత్తవిద్యా ప్రవృత్తి ప్రయుక్తి ప్రసక్తులచే యశోభాజను లగుదురు. ఇట్లుగా నానావస్థాంతరాత్మకము నానాభావోపసంపన్నము నయిన నృత్తము నాట్యము హితోపదేశజననము విశ్రాంతిజననము లోకోపదేశజననము నయినందున నృత్తము ప్రయుక్తమయినది.

ఇట్టి యీ నృత్తమున దేవులు ధర్మ మిత్తురు. ధరణీపతులు ధన మిత్తురు. విద్వాంసులు ప్రశంస నిత్తురు. ఈసర్వము భావించి తరుణీలోకము కలాప్రౌఢి నారాధించును విధేయ మగును. ఈవిధముగా నీ శ్లోకభావార్థము గుర్తించుట సముచితము.

## గ్రంథకృత్ప్రశస్తిః

అభ్యాసాద్భరతోక్తిభంగిషు బహువ్యాఖ్యావశేషు క్రమాత్
సంవాదాద్గురుసంప్రదాయసుహృదాం శంభోః ప్రసాదాదపి
జ్ఞాత్వా శాస్త్రరహాంసి నిర్మితమిదం వ్యక్తం మహార్థాన్వితం
న స్యాత్కస్య హితాయ శాశ్వతయశస్సంరక్షణం లక్షణం ౧౨

ఈ నృత్తరత్నావలి గ్రంథనిర్మాణములో తన యత్న విశేషమును శ్రీజాయసేనాపతి యిందు నిరూపించుట భావనీయము. మహార్థాన్వితముగా నీగ్రంథము నిర్మిత మయినది. వ్యక్తముగా నిట్టిది నిర్మిత మయినది. ఇట్టి యీ గ్రంథ మెవరికి హితము నాపాదింపదు? శాశ్వతముగా యశస్సంరక్షణమె దీని లక్షణము. నాట్యవేదమును సాంప్రదాయికముగా తెలసికొని నిర్మించిన భరత ముని సూక్తి విశేషములందు నిరంతరాభ్యాసము సంపాదించి దీని రచించితిని. భరతోక్తుల లోని యభ్యాసమనగా, నిరంతరానుసంధా నము. భరతుడు నిరూపించిన యంగోపాంగాభినయముల ననుకరింపజేసి నిశ్చితార్థము నసందిగ్ధముగా గ్రహించుట. ఇట్టి యభ్యాసమున భారతీయానుభవము కలుగును. అనుక్తములు లోకసంగ్రాహ్యము లని, ఏవంప్రాయముగా నితరము లభ్యూహ్యము లని భరతు డనుటచే నట్టి వానిని సమాలోచన మొనరించి అభ్యాసాను సంధానమున ఈ గ్రంథకర్త యిందు నిబంధించెను. ఇంక నీ గ్రంథమున నానా విధవ్యాఖ్యాప్రాయ గ్రంథముల పరిశ్రమయు హేతువు. వ్యాఖ్యాతలు భిన్నభిన్న భావముల సూచింతురు. వాని సమన్వయమున నొక నిశ్చితభావము గ్రహింప వలసియుండును. ఇట్టి దంతయు శ్రమా వహము. అయిన నీ గ్రంథనిర్మాణమున కదియు నావశ్యక మయినది. ఇట్లు నిర్మిత మయిన నీ గ్రంథ మన్యసంవాదము కలది కాకున్నచో నుపాదేయము కాక పోవచ్చును. కాని యిందు సర్వసంవాద మున్నది. గురువుల సంవాదము కలదు. సంప్రదాయ సంవాదము కలదు. సహృదయ మిత్రుల సంవాదమును గలదు గురుసంప్రదాయ సుహృత్సంవాద మని మూలమున సమస్తవచనమున నింక నర్థ మభివ్యక్త మగును. గురువులు శాస్త్రోపదేష్టలు. నాట్యనృత్తాచార్యు లును గురువులు. అట్టివారి సంప్రదాయములు వేరు వేరుగా నుండవు.

ఉన్నను భరతసంప్రదాయము పరిష్కారకముగ నుండనే యున్నది కదా! గురుసన్నిధిలో నృత్తశిక్ష పొందకున్నను సాంప్రదాయికముగా నృత్తోపదేశము లేకున్నను సర్వము గ్రహించి యభినందింప గల యాస్వాదింప గల సహృదయు లుందురు. సహృదయ తర్పణ మున్ననే నృత్తము నృత్తమగును. అట్టి సుహృన్మణుల భావ సంవాదమును గూడ గ్రహించి యీ గ్రంథము రచించితిని.

వీని యన్నిటికన్న మిన్నయగు విశిష్ట హేతువు కలదు. అది శంభుప్రసాదము. స్వయంభూదేవ ప్రసాదము. అసలు నృత్త దేశికుడు శంభుదేవుడు ఆ శంభువే భరతాదులకు నాట్యప్రత్యయదాత. ఆతడే తన గ్రంథసంధాన శక్తి సంధాత. ఇట్లు చతుర్ముఖ మయిన సంవాద చాతురశ్రమున శాస్త్రరహస్యముల నన్నిటిని దెలిసి మహార్థాన్విత మయిన యీ గ్రంథము ఈ నృత్తము నిర్మిత మయిన దనుట వ్యక్తము ఇట్లీ గ్రంథము ప్రమాణప్రతిపన్నము. ఈ గ్రంథ సమాలోచన మొనరించు వారీ సంవాద సమన్వయ సరణిని సాక్షాత్కరించుకొన గలరు. వారందరు దీని వలన సముచితహితము పొంద గలరు. ఇది హితోపదేశజననము కదా! ఇట్టి లక్షణ సంపత్తి వలన నిది సర్వులకు సముపాదేయము. శాశ్వతయశస్సంరక్షణము. గ్రంథకర్తకు గ్రంథార్థ సంవాద దాతలకు నిది శాశ్వతముగా యశస్సంరక్షక మగును.

ప్రేక్ష్య ప్రజ్ఞామతిశయవతీం స్వామిభక్తిం చ హర్షాత్
ఆకౌమారాద్ గణపతినృపో జాయనం యం సమర్ప్య
గుణ్డామాత్యే సకలసుమనస్సేవ్యమానే జయన్తం
వాచాం పత్యౌ హరిరివ కలాశ్లాఘనీయం వ్యనైషీత్ ౧౩

ఓరుగల్లు ప్రభువు కాకతీయరాజ్యసంధాత శ్రీ గణపతి దేవనృపాలుడు ఈ గ్రంథకర్త యగు జాయసేనాపతిని ఇంతటి సమర్థునిగా చేసెను. జాయసేనాపతికి సమధికమైన ప్రజ్ఞావైదుష్యము కలదు. నిరతిశయమైన స్వామిభక్తి యున్నది. ఇట్లు స్వభావోచితమైన విశేషమును గణపతిదేవప్రభువు చక్కగా సమీక్షించెను. హర్షము పొందెను కౌమారవయసు నుండి జాయసేనాపతిని చక్కగా అర్చించెను. పోషించెను. ఆ సమయమున సకలసుమనస్సేవ్యమానుడగు గుండామాత్యుడు కలడు. ఆతడు సర్వసమర్థుడై యుండగా జాయసేనాపతిని కలాశ్లాఘనీయునిగా నొనర్చెను. ద్యులోకమున దేవేంద్రుడు సర్వసమర్థుడైన వాచస్పతి యుండగా కుమారుడైన జయంతుని కలాశ్లాఘనీయు నొనర్చినట్లే జాయపతిని గణపతి దేవుడు సర్వకళాశ్లాఘనీయునిగా నొనర్చినాడు

నృత్తరత్నావళి వంటి కళాశ్లాఘనీయ గ్రంథసంధానమున రచయిత కూడ కళాశ్లాఘనీయుడు కావలెను. జాయపతి అట్టి వాడయ్యెను. కళాశ్లాఘనీయుడైన ఆశయదాత యున్నపుడే అట్టి గ్రంథమావిష్కృత మగును గణపతిదేవుడు కళాశ్లాఘనీయుడు వాచస్పతి దేవగురువు. సకలదేవసమారాధ్యమానుడైనట్లు కాకతీయ రాజ్యమున గుండామాత్యుడు సకలసచివసమారాధ్యుడయ్యెను తన గణపతిదేవుడు భూలోకప్రభువు. దేవలోకప్రభువు దేవేంద్రుడు అటు వాచస్పతి కలడు. ఇటు గుండామాత్యుడు కలడు ఇద్దరును సకలసుమనస్సేవ్యమానులు. దేవేంద్రునకు జయంతుడు కళాశ్లాఘనీయుడైన కుమారుడు. భూమీంద్రునకు జాయసేనాపతి పుత్రికల్పుడు. గణపతిదేవు డాదరింపగా, గుండామాత్యుడు వాచస్పతిగా నుండగా శ్రీ జాయసేనాపతి కళాశ్లాఘనీయుడైనాడు.

జిత్వా శౌర్యేణ పృథ్వీం జలనిధిరశనాం సుస్థిరీకృత్య లోకం
సఙ్గీతస్యోపభోగే సకుతుకమనసః స్వామినః శాసనేన
తస్యాభీష్టస్య భాస్వన్మణిముకురనిభం నృత్తలీలాయితస్య
ప్రాజ్ఞోఽసౌ శాస్త్రమేతద్రచయతి చతురం నృత్తరత్నావలీతి ౧౪

ఇట్లు కళాశ్లాఘనీయుఁడైన గజసాధనికుఁడైన శ్రీ జాయసేనాపతి శ్రీమన్మహారాజాధిరాజ శ్రీగణపతిదేవ మహాప్రభు శాసనము ననుసరించి నృత్తరత్నావళీ అను పేరు గల చతురమగు శాస్త్రము రచనము చేయుచున్నాఁడు. శ్రీగణపతిదేవుఁడు అసాధారణ మగు తన శౌర్యవిశేషముచే సముద్రరశన యగు భూమి నంతయు జయించి లోకమును నిరపాయముగా సుస్థిరముగా నొనరించి సంగీతోపభోగాసక్తుఁ డయ్యెను. సంగీత మనగా నాట్య గీత వాద్యముల సమాహారము. గీతరహితముగా నాట్యనృత్తము లుండవు. వాద్యము లేక గీతనృత్తములు శోభింపవు. వాద్య కైవల్యము సారస్య మీయదు. కావున గీతనృత్తవాద్యమేళ నాత్మక మగు సంగీతమున తదాస్వాదమున తదుపభోగమున తదుపయోగమున ప్రభు వాసక్తుఁడై జాయసేనాపతిని ఆజ్ఞాపించెను. ప్రాజ్ఞుఁడగు జాయపతి నృత్తలీలాయితమైన గణపతిదేవు నభీష్టమునకు భాస్వన్మణిదర్పణసమాన మైన ఈ శాస్త్రమును రచించెను ఇది చతుర మగు శాస్త్రము. గణపతిదేవుని అభీష్టమునకు ఇది శుభ్రమణిదర్పణ బింబిత మైన రూపము. ఇట్టి మణిముకురములో ఆ గణపతిదేవుని సంగీతాభిలాషము ప్రతిబింబితమై సాక్షాత్కరించును. ఇట్టి ఈ గ్రంథమునకు నృత్తరత్నావళి అని పేరు.

కవీనాం (పండితానాం సుహృదాం) నృత్తకలావిదాం
నృత్త రత్నావలీ రాజ్ఞాం చిత్తకైరవ కౌముదీ ౧౫

నృత్తకలారహస్యము గుర్తించిన కవులకు పండితులకు సహృదయులకు ప్రభువులకు ఈ నృత్తరత్నావలి చిత్త కైరవ కౌముది కాగలదు. కవులు తమ కావ్యకవితారచనమున నృత్త కలా ధర్మమర్మములు గుర్తించి విశేషముల నిబంధించుట యావశ్యకము. వారీ గ్రంథగత విశిష్ట విషయముల చూచి చిత్తములకు వికసనము సంపాదింప గలరు. ఆ యా రసభావములను నిబంధించు సమయమున ఏ యే అంగప్రత్యంగముల చలనముల వర్తనముల విశేషము లావశ్యకములో వీని వలన గుర్తించి నిబంధింతురు. వారల చిత్తములకు ఇందలి విశేషములు సముల్లాసము సంపాదింపగలవు. కైరవములకు కౌముది వికసన మిచ్చినట్లు కవి చిత్తములకీ గ్రంథము విస్ఫారము సంపాదించును. శాస్త్రీయముగా నృత్తకళారహస్యములను గుర్తించిన విద్వాంసు లగు పండితులు స్వరూపవిమర్శ యొనర్చి, లక్ష్యలక్షణముల సమన్వయము సంపాదించి తత్సముచిత మైన చిత్తసముల్లాసము సంపాదించిన ఈ గ్రంథము నభినందింప గలరు. ప్రాచీనాచార్యగ్రంథముల నిరూపితము లైన నృత్తవిద్యావిశేషములు ఇం దే విధముగా సంక్లిప్తము లైనవో పండితులు గుర్తించి చిత్తసంతోషము సంపాదింప గలరు. అట్లే నృత్తకళాదర్శనాస్వాదములచే రసభావ సంపత్సముల్లాసము సంపాదించు సహృదయులు ఆ యా అభినయములు రసభావాస్వాదమున కెంతగా నుపకరించినవో సహకరించినవో స్వానుభవమున సాక్షాత్కరించు కొన గలరు. ఆ యా వినియోగవిశేషములును యథానుగతముగా నిరూపితము లైన వని సంభావించి చిత్తానందము పొంద గలరు. కవులవలె పండితులవలె సహృదయులవలె నృత్త కళాతత్త్వజ్ఞు లైన రాజేంద్రులు కవి పండిత సహృదయులు స్వాను

భవమున సాక్షాత్కరించుకొన్న సంవిదుల్లాసము కన్న సమధికముగా స్వాత్మసంతుష్టులు కాగలరు. ఇట్లే నృత్తరత్నావళీ గ్రంథము ఆ యా విశిష్టు లందరకు చిత్త కైరవ కౌముది యగును.

ఆగత్య బ్రహ్మలోకాదిహ భరతముని: శాస్త్రమేతన్మదీయం
దృష్ట్వా భూయః కృతాదౌ ప్రసృమరపులకవ్యఞ్జితాన్తః ప్రమోదః
ఆశ్చర్యం పశ్యతేదం కథమధిగతవానాశయం మే సమగ్రం
స శ్రీమాన్ జాయసేనాపతిరితి నియతం వక్ష్యతేఽగ్రే మునీనామ్ ౧౬

భరతముని నాట్యవేదనిర్మాత. బ్రహ్మలోకమునందున్నాడు. బ్రహ్మసన్నిధిలో నాట్యవేదమును గుర్తించెను గావున తత్సన్నిధానమున తద్విశేషములను సమీక్ష యొనరించు చుండును. నా ఈ గ్రంథవిశేషము విని యుండును. నా యీ శాస్త్రము సమీక్ష చేసి యుండును. బ్రహ్మలోక మందున్న భరతుడు బ్రహ్మసూచనమున బయలు వెడలి భూలోకమునకు వచ్చి నా యీ శాస్త్రమును సమగ్రముగా సంభావించి బాగుగా ప్రసరించిన తన దేహము నందలి పులకలచే నంతఃప్రమోదము నభివ్యఞ్జన మొనరించు వాడై మునుల సమక్షము నందు అవశ్యముగా పలుక గలడు. ఈ కలియుగమున ఈ నా గ్రంథము ఆవిష్కృత మగుచున్నది. ఇచట నిప్పటి వారు ఎట్లేని గుర్తింతురు. కలియుగము వారు గుర్తించురీతికిని కృతయుగము వారు గుర్తించు రీతికిని చాల వ్యత్యాయ ముండును. ఈ కలి పోగా కృతము వచ్చును గదా! ఆ రాబోవు కృతయుగములో మును లందరు భరతుని చేరి నా యీ నృత్తరత్నావళిపై భరతభావమును తెలిసికొన గోరుదురు. అప్పుడు భరతు డవశ్యముగా నిట్లు చెప్పును. "శ్రీమాన్ జాయసేనాపతి

నా ఆశయమును సమగ్రముగా గుర్తించినాడు. ఆత డెట్లు గుర్తించి నాడో యిది ఆశ్చర్యముగా నున్నది. చూడుడు! మీ కందరకు నా భావము విశదమే కదా! నా భావమే సంపూర్ణాకారమున నిందున్నది.'' అని ఆత డనితీరును.

శ్రీ జాయసేనాపతి స్వగ్రంథరచనమున స్వసంతుష్టుడై భరత నాట్యవేద నిరూపితార్థమునే తాను నిరూపించిన ట్లాత్మవిశ్వాసము పొంది యిట్లీ శ్లోకము రచించినాడు. ఇందు గూఢముగా నిం-యు నున్నది. భరతుడు ఇట్టి శాస్త్రమున ఆదిప్రవక్త. ఆతని భావము వ్యాఖ్యాతలు సరిగా గ్రహించి యుందురా? శార్ఙ్గదేవుడు కల్లినాథుడు, సోమేశ్వరుడు సాయణుడు మొదలగు వారైన భరతభావమును గుర్తించి యుందురా! నేను భరతునిభావము సరిగా గుర్తించితిని. ఇట్లు నేననుటయే కాదు. నా సమసమయము వారు ఇట్లు గుర్తింపక పోవచ్చును. ఇట్లే కలికాలము వారును ఇట్లే గుర్తింపక పోవచ్చును. కాని కలిగతింపగా సత్యయుగ మన్న కృతయుగము రాగా భరతుడు నాట్యవిదులగు మునులకు నా గ్రంథ దర్శనమున స్వసంతుష్టుడై యిట్లు చెప్పితీరును. నా యీ గ్రంథము భరత గ్రంథ సంవాదము కలది అనుటయే సారాంశమైనను ఇట్లీ వక్రోక్తి రమ్యముగా నిరూపించుట జాయసేనాపతి స్వచ్ఛంద సుందరమైన రీతి.

మమ వాఙ్నర్తకీ నూనం వర్ణకాఙ్గైర్మనోహరైః
కరోతి శాస్త్రరఙ్గేఽస్మిన్ లక్ష్మనృత్తమతిస్ఫుటమ్ ౧౭

నా వాక్కు అనెడు నర్తకి మనోహరము లగు వర్ణకాంగము లతో నున్నదై యీ శాస్త్రమనెడు రంగమున నతిస్ఫుటముగా లక్ష్మనృత్త మొనరించును. ఇందు రూపకాలంకార మర్యాదాను

సారమున నిరూపిత మయిన యంశమున ప్రకృతార్థ మప్రకృతార్థము గోచరించును. అందు ప్రకృతార్థ మిట్లు భావింప దగియున్నది. నా వాక్కు మనోహరము లగు వర్ణముల సంకలనమున నున్నదై యీ నృత్తశాస్త్రమున నతిస్ఫుటముగా లక్షణము నిరూపించును. అప్రకృతార్థ మీ విధమున స్వీకార్యము నర్తకి మనోహరములగు నంగములతో నున్నదై రంగమున నతిస్ఫుటముగా నృత్త మొనరించును. అతిస్ఫుటముగా నృత్త మొనరించు నర్తకి శాస్త్రీయముగా సర్వ నృత్తములను గురు సవిధమున శాస్త్రీయముగా శిక్షణమున నభ్యసించి యుండుట యావశ్యకము. ఆమె సర్వావయవములు మనోహరముగా నుండుటయు నావశ్యకము. ఇట్టి యావశ్యకములను భావింపగా రచయిత విశేషములును గోచరించును. లక్షణము నిరూపించు నాతడు శాస్త్రవిదులయిన గురువుల సమీపమున సాంప్రదాయికముగా తత్తద్విశేషములను గ్రహింప వలెను. సమర్థము లయిన వర్ణపదముల సన్నివేశముతో నత్యంతము స్ఫుటముగా నిరూపింప వలెను. అట్టి సామర్థ్యమంతయు జాయపతి కున్నదనుట స్పష్టము.

## నృత్తకాలః

త్యాగోద్వాహ మహాభిషేక నగరీ వేశ్మ ప్రవేశోదక
క్రీడాసు ప్రియసంగమ వ్రత మహాదానాత్మజోత్పత్తిషు
యాత్రా పర్వ పరీక్షణోత్సవ జయానందప్రతిష్ఠేహిత
ప్రాప్తిష్వభ్యుదయాయ నృత్తముచితం స్యాద్దేవపూజాదిషు. ౧౮

నృత్త మొనరించుటకు విహితము లయిన సమయముల సంకేత మిందున్నది. కతిపయ యుక్తసమయము లందే నృత్త మాచరింపవలెను. నిషిద్ధసమయము లందు నృత్త మాచరింపరాదు

త్యాగము వివాహము మహాభిషేకము నగర ప్రవేశము భవన ప్రవేశము జలక్రీడ ప్రియసంగమము వ్రతము మహాదానము పుత్రోత్పత్తి యాత్రాసమయము పర్వదినము పరీక్షణము ఉత్సవము విజయసమయము ఆనందసమయము ప్రతిష్ఠా సమయము ఇష్టప్రాప్తి దేవపూజ మొదలగు సమయములలో సముచిత మయిన నృత్త ప్రయోగ మభ్యుదయ సంపాదక మగును. ఇంక నిట్టి సమయ విశేషముల నౌచిత్యాను సారమున గుర్తించి నృత్త ప్రయోగ మొనరింప వలెను.

## నాట్యావతారః

పూర్వరంగప్రయోజ్యత్వాన్నృత్తం నాట్యోపకారకం
తతో నాట్యస్య వక్ష్యామి సంక్షేపాదిహ లక్షణం
వైవస్వతేఽంతరే హ్యస్మిన్ పురా త్రేతాయుగే కిల
లోకేఽస్మిన్నరిషడ్వర్గనిఘ్నే సుఖితదుఃఖితే
పురందరముఖా దేవాః పప్రచ్ఛుః కమలాసనం
దృశ్యం శ్రవ్యం చ సర్వేషా మిచ్ఛామః క్రీడనీయకం
ఇతి విజ్ఞాపితో దేవై ర్భావయన్ సార్వవర్ణికం
వేదేభ్యస్సారమాదాయ నాట్యవేదం ససర్జ సః
పశ్యన్నథ మనుష్యాణాం చాతురీమాంగికాదిషు
శిక్షయామాస చ మునిం భరతం మానసాత్మజం
తేన చాధ్యాపితాః పుత్రాః శాండిల్యప్రముఖాః శతం
తైస్సార్ధమప్సరోభిశ్చ శక్రధ్వజమహాదిషు
నాట్యవేదప్రయోగోఽయం మునినా సంప్రవర్తితః ౧

## నాట్యావతారము

భరతముని నాట్యవేదములో నిరూపించిన నాట్యావతార కథాభాగమును జాయసేనాపతి ఈ నృత్తరత్నావలిలో ఇట్లు నిరూ

పించు చున్నాడు. పూర్వరంగమున ప్రయోగింప దగినది కావున నృత్తము నాట్యమున నుపకరించును. కావున నిచట నాట్యమునకు సంబంధించిన లక్షణమును సంక్షేపముగా నిరూపింతును. నాట్యము నకు సంబంధించిన విస్తృతలక్షణము నాట్యవేదము నందే కలదు. దాని నిందు సంగ్రహముగా నిరూపింతును.

పూర్వము వైవస్వత మన్వంతరమున త్రేతాయుగము నందు ఈ లోకము కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడు అరిషడ్వర్గ మునకు లోనయినది. సామాన్యముగా లోకు లందరు కామలోభాది దూషితు లయినారు. సుఖిత దుఃఖితు లైనారు. గ్రామ్యధర్మమున ప్రవర్తించినారు. సాంప్రదాయిక ధర్మములను విడనాడినారు. తాత్కాలికములు అపతాత్కాలికములు నయిన ధర్మములనె అనుసరించు వారయినారు. ఆ సమయమున దేవేంద్రాది దేవతలు లోకసంగ్రహోపాయ మాలోచించు వారై కమలాసను డగు బ్రహ్మదేవు సమీపమున కేగి సర్వము విజ్ఞాపనము చేసిరి. ఈవిధముగా నడిగిరి. బ్రహ్మన్! సర్వజనులకు దృశ్యము శ్రవ్యము నయిన క్రీడనీయకమును మే మభిలషించు చున్నాము. అట్టి క్రీడనీయకమును నాట్యప్రయోగమును మాకు ప్రసాదింపుడు. ఇది దేవేంద్రాదుల కాంక్ష. కృతయుగము సత్త్వ ప్రధానము కావున జనులు ధర్మపరాయణు లగుదురు. త్రేతాయుగ మున జనులు రాజసులు. దుఃఖము పోవలె నని సుఖము కావలె నని కోరుదురు. కృతయుగమున క్రీడనీయకాభిలాష ముండదు. వారు ఏకాంతసుఖితులు. ఏకాంతదుఃఖితులకును క్రీడనీయకాభిలాష ముండదు. త్రేతలో జనులు సుఖితులు దుఃఖితులు నగుదురు. అట్టి వారికే క్రీడనీయకాభిలాషము. ఇట్టి క్రీడనీయకము దృశ్యము

శ్రవ్యము కావలెను. దృశ్య మనుట హృద్య మని శ్రవ్య మనుట వ్యుత్పత్తిప్రద మని భావము. ఇట్లు ప్రీతిప్రదము వ్యుత్పత్తిప్రదము నగుచో జనులు ధర్మాసక్తు లగుదురు. నాకలోకమునకు రాకపోకలు కావింప గలుగుదురు. దైవమానుషసర్గములు పరస్పరోపకారముతో నుండునవి కాగలవు. కాన నిదికావలెనని యింద్రుని కాంక్ష.

ఇట్లు విజ్ఞాపితు డయిన బ్రహ్మ వేదముల నుండి సారముగ సంగ్రహించి సర్వవర్ణముల వారికిని ఉపయోగించు నాట్యవేదమును నిర్మించెను. నాట్యవేదమున పాఠ్యము కలదు. గీతము కలదు. అభినయములు కలవు రసములు కలవు. వీనిని ఋక్సామయజురథర్వణముల నుండి సంగ్రహించెను. సార్వవర్ణికముగ నాట్యవేదము నిర్మించెను. సర్వశ్రావ్యముగ నిర్మించెను. వేదోపవేదములతో సంబంధ ముండునట్లు నాట్యవేదము నిర్మించెను. వేదవ్యవహార మందర కందదు. ఈ నాట్యవేద మందర కందును. సుకుమారమతులకును ఇది వ్యుత్పత్తి ప్రదము లోక వేదజ్ఞుడగు బ్రహ్మ సర్వశ్రావ్యమయిన నాట్యవేదము నిర్మించెను. ఇట్లు నిర్మించి తన మానసపుత్రుడయిన భరతమునిని చూచి నాట్యవేదము బోధించెను. భరతునకు శాండిల్యాదులు వందమంది పుత్రులు కలరు. మనుష్యులకే ఆంగికాద్యభినయము లందు చాతుర్య మున్న దని బ్రహ్మగుర్తించెను. నటులు కావలసిన వారు గ్రహించిన దానిని ధారణ మొనర్ప గల వారు కావలెను ఊహాపోహ సమర్థులు కావలెను. సభలలో భయపడని వారు కావలెను తగిన దేహసౌష్ఠవము కలవారు కావలెను. గ్రహణమున ధారణమున జ్ఞానమున ప్రయోగమున శక్తి కలవారు కావలెను. దేవతల కిట్టి శక్తిలేదు. నాట్యకర్మలో దేవతలకు

యోగ్యత లేదు. వా రెట్లనుసరింతురు? అట్టి శక్తి యోగ్యత కల వారు మానవులె. ఇట్లు దేవేంద్రుఁడును భావించెను. బ్రహ్మ భరతునకు నాట్యవేద ముపదేశించెను. భరతుడు తన పుత్రశతమునకు నాట్యవేద మధ్యాపనము చేసెను. ప్రయోగము నేర్పెను.

శాండిల్యాది పుత్రు లందరు భరతశిష్యులై సర్వము గుర్తించిరి. అందరు ప్రయోగపరు లయినారు. తమ యోగ్యతకు తగిన విభాగము ననుసరించి ప్రయోగాసక్తు లయినారు. భారతి సాత్త్వతి ఆరభటి అను మూడు వృత్తులను అనుసరించి మొదట భరతుడు శిష్యులచే నాట్యము ప్రయోగింప జేసినాడు. భారత్యాది వృత్తులతో కైశికీ వృత్తిని గూడ కూర్ప వలెనని బ్రహ్మ సూచించెను. కైశికీ ప్రయోగమునకు స్త్రీలు కావలెను. బ్రహ్మ మంజుకేశి మొదలగు ఇరువది నలుగురు అప్సరఃకన్యలను సృజించి భరతున కిచ్చెను. వా రందరు నాట్యాలంకారచతురలు. లీలావిలాసాదులు కలవారు. శోభా కాంతులు కూడిన వారు. ఇట్టి వారలె ప్రయోగార్హలు మునికన్యక లిందు తగరు. మంజుకేశి మొదలగు అప్సరః కన్యలను భరతుడు స్వీకరించి యథోచితముగ శిక్షణ మిచ్చి కైశికీ వృత్తిని కూడ ప్రయోగించెను. ఇంద్రధ్వజోత్సవము మొదలగు సమయములలో ప్రయోగించెను. ఇట్లు భరతుడు నాట్యవేద ప్రయోగమును ప్రవర్తింపజేసెను.

దేవేంద్రుని పతాకోత్సవ సమయమున విజయోత్సవ సమయమున భరతుడు బ్రహ్మ సూచనానుసారము నాట్యప్రయోగ మొనరింప జేసెను. ఆ ప్రయోగమున "దైత్యులు సురనిర్జితులు" అగుట యున్నదని దైత్యులు క్షోభము పొందిరి. అదృశ్యరూపులై విఘ్నము లాపాదించిరి. నటించు వారలకు వాక్చేష్టా స్మృతి స్తంభము కలిగినది. దేవేంద్రు డది గుర్తించి తన ధ్వజము పటి

దైత్యదేహములు జర్జరము లగు నట్లు చేసెను. అది జర్జరప్రయోగము. జర్జరము నాట్యప్రయోగరక్షకము. బ్రహ్మ సామప్రయోగమున దైత్యులను శాంతింప జేసెను. బ్రహ్మ సూచనానుసారమున విశ్వకర్మ నాట్యగృహము నిర్మించెను. నాట్యవేద ప్రయోగమిట్లు సంప్రవర్తిత మయినది.

### నాట్యలక్షణం.

లోకస్య చస్వభావో యః సుఖదుఃఖ విమిశ్రితః
నాట్యం తస్యానుకరణం చతుర్ధాభినయాత్మకం ౧౯
స్పందనార్థతయా ధాతోః నటేః సాత్త్వికపూరితం
రసాశ్రయం చ తద్జ్ఞేయం వాక్యార్థాభినయాత్మకం
అభి పూర్వాత్ ణీఞో ధాతోరచి కర్తరి యోజితే
ప్రయోగమాభిముఖ్యం యత్ నయత్యభినయ స్తతః
శాఖయాంగై రుపాంగైశ్చ ప్రయోగేణ విభావయన్ ౨౦
అర్థాన్బహువిధాన్ ప్రాపయన్నేవాభినయో మతః

నాట్యలక్షణము.

ఈ శ్లోకములలో నాట్యలక్షణము, నాట్య శబ్దనిష్పత్తి అభినయ శబ్దనిష్పత్తి అభినయ లక్షణము నిరూపిత మగును. లోకస్వభావ మంతయు సుఖదుఃఖములతో విమిశ్రితమై యుండును. అట్టి లోకస్వభావమునకు నాట్య మనుకరణము. ఉత్తమ మధ్యమాధమ మానవుల కర్మసంశ్రయముగా నుండి నాట్యము హితోపదేశ జననముగా నుండును. శ్రమార్తి శోకార్తులకు విశ్రాంతిజననము గా నుండును. సుఖదుఃఖానుగత మయిన లోకస్వభావ మంతయు ఆంగికాద్యభినయ సమేతమై నాట్య మను పేరు గల దగును. ఇట్లభినయాత్మక మగు నాట్యము నాల్గు విధములు. సుఖము దుఃఖము నాట్యమున లోకవిలక్షణముగ నుండును. సర్వసాధారణముగా భాసించును. విచిత్రసుఖరూపమున నుండును.

## నాట్యపదవ్యుత్పత్తి.

"నట-అవస్పందనే" అని అవస్పందనార్థమున నట ధాతువు కలదు. ఆ ధాతువునుండి నాట్యపదము వ్యుత్పన్న మయినది. అవస్పందన మనుట కించిచ్చలన మని యర్థము. కాన సాత్త్వికాభినయము లధికముగా నుండు నని గోచరించును. నాట్య మొనరించు వారు నటు లగుదురు. నాట్యము రసాశ్రయము. వాక్యార్థాభినయాత్మకము. వాక్యార్థము పదార్థముల సముదాయరూపము. విభావాదుల సమ్మేలనమున గలుగునది రసము. నృత్యము పదార్థాభినయాత్మక మని భావాశ్రయ మని నృత్య మొనరించు వారలకు నర్తకు లని వ్యవహారప్రసిద్ధి. విభావాదులు పదార్థ స్థానీయములు రసము వాక్యార్థ స్థానీయము. ఇందు సాత్త్వికాభినయ బాహుల్యము కల నాట్య ముండును. భావమున ఆంగికాభినయ బాహుల్యము కల నృత్య ముండును. నాట్యనృత్యముల కన్న వేరుగా నృత్తము కలదు. నృత్తము తాలలయాశ్రయము. ఈ చెప్పిన విధ మంతయు దశరూపకానుసారి. ఇందలి విశేషము లుత్తర గ్రంథమున విశదీకృతము లగును. నాట్యము సాత్త్వికాభినయము ఆంగికాభినయము వాచికాభినయము ఆహార్యాభినయము అను చతుర్విధాభినయములతో నుండును. అంతటను అభినయ మున్నది. అభినయ మన నేమో నిరూపింప వలసి యున్నది.

## అభినయశబ్దనిష్పత్తి.

అభి పూర్వక మయిన "ణీఞ్" ధాతువునకు కర్త్రురూపార్థమున అచ్ ప్రత్యయము కూర్పగా "అభినయ" పదము నిష్పన్న మగును. "ప్రయోగం ఆభిముఖ్యం నయతి- అభినయః" నాట్య

ప్రయోగమును అభిముఖముగా నుండు నట్లు చేయునది గావున "అభినయము" అనుట యుక్త మని అభినయపద వ్యుత్పత్తి వలన లభించు నట్టి యర్థము. సాత్త్వికాదులలో నంతట "అభినయము అభినయము" అని యన నేల? అభినయ పద వాచ్య మేమి? అది దేని నందించును? దేనిని పొందించును? ఆ పద ప్రవృత్తి నిమిత్త మేమి? ఇట్లభినయ విషయమున ప్రశ్న లుదయించును. వీనికి సమాధానముగా నిది సంభావనీయము. నాట్యవేదమున యభినయ విషయమున నిట్లున్నది. "అభిపూర్వస్తు ణీఙ్ ధాతు రాభిముఖ్యార్థ నిర్ణయే యస్మాత్పదార్థాన్నయతి తస్మాదభినయః స్మృతః" అభిపూర్వక మగు ణీఙ్ ధాతువున కాభిముఖ్యార్థనిర్ణయమున అచ్ ప్రత్యయము రాగా "అభినయ" పదము నిష్పన్న మయినది. అభినయము పదార్థాత్మకము లయిన యర్థములను తద్గతము లయిన భావములను సహృదయుల సమాస్వాదమున కందించును. సహృదయుల హృదయములు అభినయాకృష్టము లగును. ఆ హృదయములు భావముల నాస్వాదించు నవి యగును. పదార్థాత్మకములుగా నున్న భావములు సహృదయాస్వాద్యములై రస ముల్లసింపజేయ గలవు. ఇంతటి ప్రక్రియను సంపాదించుటకు అభినయములు సమర్థము లగును.

అభినయ పద భావమును వేరొక విధమున గూడ భావింపవలెను. శాఖాంగోపాంగ సంయుక్త మయిన యభినయము ప్రయోగమున నానార్థములను సవిశేషముగా భావింప జేయును. బహువిధము లగు నర్థముల నధిగమింప జేయును. విభావింప జేయునది నానార్థములను పొందించునది కావున అభినయ మనుట సమ్మతము. అభినయమున శాఖ అంగము ఉపాంగము అను పిశేషములు కలవు.

అట్టి శాఖాంగోపాంగములతో కూడుకొనిన యభినయము సౌష్ఠవము కల దగును. చక్కగా ప్రయోగమున ప్రసరించినదై నానార్థములను భావింప జేయ గలదు. మహార్థ మొకటి యున్నను అవాంతరములను భావింప జేయునది యగును. అభినయము పదార్థస్థానీయము లగు భావములను భావింప జేయునదై వాక్యార్థస్థానీయ మగు రసమును భావింప జేయగలదు. ఈ యభినయమున అంగములుగా ఉపాంగములుగా జెప్ప దగినవి యనేకములు కలవు.

అభినయభేదాః

ఆంగికో వాచికాహార్యే సాత్త్వికశ్చేత్యసౌ పునః
చతుర్ధా కలితో యత్ర సర్వం నాట్యం ప్రతిష్ఠితం. ౨౩

అభినయభేదములు.

ఆంగికాభినయము వాచికాభినయము ఆహార్యాభినయము సాత్త్వికాభినయము అని అభినయము నాలుగు విధములు. ఈ యభినయ చతుష్టయము నందు సర్వనాట్యము ప్రతిష్ఠితమై యున్నది. భేద బాహుల్యము నాట్యమున సంగతమై యున్నది. నాట్యము సముదాయరూపము. నానాభేదము లిం దుండును. అయినను స్వస్వరూపమున ప్రతిష్ఠితమై యుండును. ఆగంతుకములుగా వచ్చి కలియు వానికి నాట్యము స్వాత్మరూప మీయ గలదు. అప్పుడు భేదములలో నుండు నవి యన్యలై యుండవు. అన్నియు నాట్యమున నాట్యాయితములై సుప్రతిష్ఠితము లగును.

ఆంగికాభినయః

తత్రాంగికో భవేత్ అంగై ర్నిర్వృత్తః, స పునస్త్రిధా
శారీరో ముఖసంజాతశ్చేష్టయా చ వినిర్మితః
శాఖయాంగై రుపాంగై శ్చరచితః పరికల్పితః

శారీర స్త్వత్ర ముఖజః కేవలోపాంగ నిర్మితః
చేష్టాకృత స్తు చేష్టాభిః స్థానాసనగతాదిభిః
శాఖాంకురశ్చ నృత్తం చ ప్రధానం తేష్వనుక్రమాత్
శాఖ్యాస్యా న్నృత్త హస్తానాం వైచిత్ర్యాత్మ వివర్తనా ౩౦
అంకుర స్సూచనారూపో భూత వాక్యైక గోచరః
భవిష్య ద్వాక్యవిషయః స తు సూచేతి కథ్యతే
నృత్తం నాత్రోచ్యతే పశ్చా త్ప్రపంచేనాభిధాస్యతే

### ఆంగికాభినయ లక్షణము.

అంగములచే నిర్వర్తితమగు అభినయ మాంగికాభినయ మగును. ఆయాంగికాభినయము త్రివిధము. శారీరము, ముఖజము, చేష్టాకృతము. శరీరమున గలుగునది శారీరము. ముఖమున గలుగునది ముఖజము. చేష్టచే నిర్మిత మగునది చేష్టాకృతము. వీనిలో శారీర మనునది శాఖ. అంగములు ఉపాంగములు ప్రత్యంగములు అను వానిచే ప్రదర్శిత మగును. ముఖజాభినయము కేవల ముపాంగములచే నిర్మిత మగును. చేష్టాకృతమను మూడవ యభినయము స్థానాసన గతాదులచే నిర్మితమై భాసించును. ప్రధాన భేదము లంగములు. అంగముల యంగము లుపాంగములు. శారీర ముఖజ చేష్టాకృతములు మూడును శాఖాంగోపాంగ సంయుతములై భాసించుటను అభినయ భావుకులు దర్శించిరి. ఇందు శాఖాంగోపాంగములు శారీర ముఖజ చేష్టాకృతములకు వేరు వేరుగా సమన్వయము పొందుట నిరూపిత మయినది.

ఈ యాంగికాభినయమునకు సంబంధించి మూడంశములున్నవి. అవి నాట్యవస్తువు లని ప్రసిద్ధి కలవి. శాఖ, అంకురము, నృత్తము అను మూడును ఇందు ప్రధానములు. వీనిలో శాఖ యనునది నృత్త హస్తములకు సంబంధించిన విచిత్ర వర్తనము.

"ఆంగికస్తు భవేచ్ఛాఖా" ఆంగికము శాఖ యగునని భరత సూచనము. నృత్తమునకు సంబంధించిన నానావిధము లగు హస్త విశేషములను విచిత్ర విధానమున వర్తింప జేయుట శాఖ యని గుర్తింపదగును. అంకురమను రెండవది సూచనా రూపము. ఈ సూచనము భూతకాలమునకు సంబంధించిన వాక్యము లందు ముఖ్యముగా గోచరించును. ఇట్లే భవిష్య ద్వాక్య విషయమునగును. "భూత వాక్యైక గోచరః భవిష్యద్వాక్య విషయః" అను రెండును సూచా స్వరూప నిరూపకములు. మూడవది యయిన నృత్తము నీప్రసంగమున నిరూపించుట లేదు. ఉత్తరగ్రంథమున నది విస్తృతముగా నిరూపితము కాగలదు.

వా చి కా భి న యః.

వాగాత్మా వాచికో ద్వేధా సంస్కృత ప్రాకృతాశ్రయః
నామాఖ్యాతాదిభి ర్భేదైః అయం విస్తర మశ్నుతే 38

వా చి కా భి న య ము.

వాచికాభినయము వాగాత్మకము. అది రెండు విధములు. సంస్కృతాశ్రయము ప్రాకృతాశ్రయము నని. ఈ వాచికాభినయము నామాఖ్యాతాది భేదములచే విస్తరము పొందును. వాచికాభినయము నందలి పాఠ్యము సంస్కృత ప్రాకృతాత్మకముగా రెండు విధములు. వాచికాభినయమునకు సంబంధించిన భేదములు నాట్యానుప్రాణకములు. వాచికము ఆంగికమునకు విషయ సమర్పకము. కావున ప్రాణ కల్పము వాచికాభినయము, వాగభినయము. "వాగేవాభినయః" వాక్కే యభినయము. "వాచి యత్నస్తు కర్తవ్యః" వాక్కునందు యత్నమొనరింప వలెను. ఇది నాట్యమునకు తనువు. ఆంగికాహార్య సాత్త్వికములు వాక్యార్థమునె సూచించును. "వాగ్ధి సర్వస్య కారణం వాగేవ విశ్వాభువనాని."

సంస్కృతాశ్రయ మయిన వాచికము ఛందోవృత్త లక్షణాది రూప ముగా నున్నది. సంస్కృత పాఠ్యము శాస్త్ర ప్రసిద్ధము, ప్రాకృత పాఠ్యము తద్విపరీతము. సంస్కృతాశ్రియ మయిన వాచికమున నామాఖ్యాతాది భేదములు కలవు.

నామము — ఆఖ్యాతము — నిపాతము — ఉపసర్గము
తద్ధితము — సమాసము — సంధి — విభక్తి.

ఈ యెనిమిది నామాది నిర్వర్త్యములు. సంధివిభక్తినియుక్త ములు. వీనిని అభినవభారతి యన్యవిధమున నిరూపించినది.

ఆగమము — నామము — ఆఖ్యాతము — ఉపసర్గము — తద్ధితము
నిపాతము — సంధి — వచనము - విభక్తి — ఉపగ్రహము.

ఈ దశకము వాచికాభినయము నిర్వర్త్యంప జేయగలదు. ప్రాకృతవాచికమున నామ భాగాదు లన్నియు శాస్త్రవిహితముల కన్న విపరీత రూపములు. ఈ ద్వివిధ వాచికము చాతుర్వర్ణ్యసమా శ్రయముగా నుండును. ఆంధ్రద్రవిడాది దేశములందును భాషా సంస్కారము సముచితముగా నుండునేని తత్తదిచ్ఛానుసారముగ ప్రయోక్తలు ఆ యా దేశభాషల నుపయోగింప వచ్చును. సంస్కృ తాపభ్రంశమునకు భాష యని, భాషాపభ్రంశమునకు విభాష యని సంకేతము కలదు. భాషాభేద సంకేతము లన్నియు నిదర్శ నార్థము నిరూపితములు. కావున పైశాచ్యాది భాషలను గూడ నిబంధింప వచ్చు నని కొందరి భావము. మాగధి, ఆవంతి, ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లీక, శకార, ఆభీర, చండాల, శబర ద్రవిడ, ఆంధ్ర దేశజ భాషలు కూడ విభాషా సంకేతమున వ్యవహరింప దగినవె. ఇట్లనేకవిధముల వాచికాభినయము విస్తృత మయినవి. ఇట్టి విశేషములను నాట్యవేదమున గుర్తింప వచ్చును.

### ఆహార్యాభినయః

నైపథ్యస్య విధానం స్యాదాహార్యః స చతుర్విధః
పుస్తభూషాంగ రచనా సజీవః పరికల్పితః
తత్ర శైలవిమానాది నాట్యే యద్యత్ప్రదృశ్యతే
తత్తత్పుస్త ఇతి జ్ఞేయః స చ త్రేధా విధీయతే
ఆదిమః సంధిమస్తత్ర మధ్యమో వ్యాజిమః స్మృతః ౪౦
అంతిమశ్చేష్టిమస్తేషాం క్రమాల్లక్షణ ముచ్యతే

### ఆహార్యాభినయము.

నైపథ్యవిధానమునకు ఆహార్య మని పేరు. అది నాలుగు విధములు. పుస్తము, అలంకారము, అంగరచన, సజీవము (సంజీవము) అని నాట్యమున నిరూపితము లగు శైల యాన విమానాదులు "పుస్తము" అను సంకేతము కల వగుచున్నవి. పుస్తనైపథ్య మను నిది మూడు విధముల నున్నది. సంధిమము, వ్యాజిమము, వేష్టిమము (చేష్టిమము) అని. మొదటిది సంధిమము, మధ్యమము వ్యాజిమము, అంతిమము వేష్టిమము.

నాట్యశుభము నాట్యసిద్ధి నభిలషించు వారు ఆహార్యమున యత్న మొనరింప వలెను. ఆహార్యమునకు ప్రాధాన్య మున్నది. ఇది సర్వోపజీవ్యము. "ప్రయోగః సర్వ ఏవాయ మాహార్యాభినయే స్థితః" నాట్యప్రయోగ మంతయు ఆహార్యాభినయమున కూడి యున్నదని నాట్యవేదము, సర్వము ఆహార్యాధీనము. నైపథ్యసాధనము సంగతముగా నున్నప్పుడే ఇతరము లయత్నముగా నభివ్యక్తి పొందగలవు. ఆహార్యము సమస్తాభినయచిత్రమునకు భిత్తి వంటిది. కావున నిందు ప్రయత్న మావశ్యకము. ఇక సంధిమాదుల స్వరూపము నిరూపితము కాగలదు.

## పుస్తాదిభేదాః

కిలింజచర్మ వస్త్రాద్య సంధానాః తత్ర సంధిమః
సూత్రాకర్షాదిభిర్వ్యాజై ర్నిర్వృత్తం వ్యాజిమం విదుః
జతు సిక్థాది సంబంధాత్ చేష్ట్యతే యస్స చేష్టిమః
యేనాలంక్రియతే దేహః సోలంకారః ప్రకీర్తితః
స చాభరణమాల్యాత్మా చతుర్ధాభరణం బుధైః
ఆవేధ్య బంధనీయాఖ్య ప్రక్షేప్యారోప్య భేదతః
కర్ణభూషణమావేధ్యం కుండలాభరణాదికం
బంధనీయం తు విజ్ఞేయం శ్రోణీసూత్రాంగదాదికం
నూపురప్రముఖం క్షేప్యం హారాద్యారోప్యమిష్యతే
సా భవేదంగరచనా యదంగై రంగవర్తనం
యే చ వర్ణాః సిత శ్యామ రక్త పీతాః స్వభావజాః
ఏతేషాం సంకరాద్భేదాః జాయంతే బహవః పునః
సజీవః ప్రాణినాం రంగే ప్రవేశః పరికీర్తితః
ద్విచతుశ్చరణౌ పాదరహితశ్చేతి స త్రిధా
ద్విపాదాస్తత్ర విజ్ఞేయాః దేవ మానుష పక్షిణః
చతుష్పాదాస్తు పశవః పాదహీనా భుజంగమాః

## పుస్తాదిభేదము.

పుస్తము అను నైపథ్యము నందలి సంధిమ, వ్యాజిమ, వేష్టిమ (చేష్టిమ) ములు, భూష యను నలంకారనైపథ్యము నందలి ఆవేధ్య, బంధనీయ, ప్రక్షేప్య. ఆరోప్య భేదములు, అంగరచన నైపథ్యము, సంజీవ నైపథ్యము ఈ శ్లోకములలో నిరూపిత మగును. నాటకసంశ్రయ మయిన పుస్తమునకు సంబంధించిన సంధిమ మీ విధము గా నుండును. కిలింజచర్మవస్త్రాదుల సంధానమున నిర్మితరూపము సంధిమమగును. భూర్జ వేణుదలాదికమునకు కిలింజ మని పేరు. భాస

నాటకమున కిలింజ హస్తి ప్రయోగ మున్నది. సూత్రాకర్షణము మొదలగు వ్యాజములచే యంత్రాదికములచే నగునది వ్యాజిమ మగును. లక్కమైనము మొదలగు వాని సంబంధమున చేష్టిత మగునది చేష్టిమ మగును. నాట్యవేదమున నిది వేష్టిమ మని వ్యవహృత మయినది. "వేష్ట్యతే చైవ యద్రూపం వేష్టిమః సతు సంజ్ఞితః" వేష్టనముచే రూప మాపాదించిన నది వేష్టిమ మగును. ఈ వేష్టిమమె యిందు చేష్టిమముగా నిరూపిత మయినది.

దేహము నలంకరించునది యలంకారము. అలంకారము ఆభరణ మాల్యాది రూపముగా నుండును. మాల్యాదులకు సంబంధించిన నానావిధ సమాయోగ మలంకారము. సమాయోగ మనునది యోజనము. నానాసమాయోగము అంగోపాంగవిధి కలది. శిరో హస్తాద్యంగములలో లలాటాంగుల్యాద్యు పాంగములలో నీ సమాయోగ ముండును.

ఆభరణాత్మక మయిన అలంకారము నాట్యమున నాలుగు విధములు. ఆవేధ్యము బంధనీయము, ప్రక్షేప్యము, ఆరోప్యము అని కర్ణభూషణ మావేధ్యము వేధ= కుట్టుట. కుండలాభరణాదికములు కర్ణాభరణములు. కటిసూత్రము అంగదము మొదలగునవి. బంధనీయములు. నూపురాదులు వస్త్రాదులు ప్రక్షేప్యము లగును. హారాదు లారోప్యములు.

సిత నీల పీత రక్త వర్ణములచే అంగవర్తనము. అంగములకు రంగుల పూతపట్టించుట అంగవర్తన మను నలంకార మగును. వర్ణము లలో సితశ్యామ రక్త పీతము లను వర్ణములు స్వభావసిద్ధము లయిన వర్ణములు వీని సంబంధ సాంకర్యము వలన బహుభేద

ములు కలుగును. ఇట్టి వన్నియు సంయోగజన్యము లయిన వర్ణములు వర్ణద్వయ సంబంధమున కలుగును మఱికొన్ని యుపవర్ణములు. ఇవి బహువర్ణ మిశ్రణమున గలుగును స్వాభావ జన్యము లగు వర్ణములచే నంగవర్తన మొనరింప వలెను. సంయోగజము లయిన వర్ణము లనేకవిధములు కారండవ పాండువర్ణ పద్మవర్ణ హరితవర్ణ కషాయవర్ణ గౌరవర్ణములు వర్ణవిధానము గుర్తించి యంగవర్తన మొనరింప వలెను. పాత్రధారణమున నెట్టి యాకృతి యుండునో యట్టి యాకృతిని వర్ణవిధానమున సంపాదింప వలెను. వేషముచే వర్ణముచే సంభావితు డగును వ్యక్తిపరభావము నాశ్రయించును. జీవుడు స్వస్వభావమును విడనాడి అన్యదేహమునకు సంబంధించిన స్వభావమును దేహాంతరమున పొందుచున్నాడు అట్లే పాత్రధారణ మొనరించువాడు పాత్ర స్వభావమునే పొందును. అంతే వర్ణవిధాన ముపకరించును.

ప్రాణులకు రంగమున ప్రవేశ మొందుటకు సజీవ మని పేరు. ఈ సజీవ విధానము త్రివిధము ద్విచరణము, చతుశ్చరణము పాద రహితము నని. దేవ - మానుష - పక్షులు ద్విపాదములని పశువులు చతుష్పాదము లనిసర్పములు పాదహీనములని గుర్తింప వలెను.

ఇచట నీ విషయము సంప్రధార్యము. సంధిమ వ్యాజిమ చేష్టిమములు పుస్తభేదములు కదా। సంధివ్యాజ చేష్టలచే సిద్ధ మగుట యని భావము. సంధ్యాదిపదముల కట్టి యర్థమున "ఇమప్" ప్రత్యయమును శబ్దవిదులు స్మరింతురు. మాల్యాభరణాదు లయిన యలంకారముల సమాయోగము అంగోపాంగముల సంబంధించి యుండును. శిరోహస్తాదు లందును లలాటాంగుల్యాదు లందును వీనిని కూర్ప వలెను. మాల్యవిధానమున వేష్టిమ వితత - సంఘాత్య - గ్రంథిమ - ప్రాలంబిత భేదము లున్నవి.

ఆభరణము లనేకవిధములు. చూడామణి మకుట - కుండల మోచక - కీల - ముక్తావలి - హర్షక - సూత్రిక - వేత్రిక - అంగులి ముద్ర - హస్తలి - వలయ - రుచక - చూలిక - కేయూర - అంగద త్రిసర - హార - మాల - తలక - సూత్రికములు. వీనిని జాతి వయో వస్థా భేదమున ధరింప వలెను. దేవతలకు, పార్థివులకు, స్త్రీలకు నియతమయిన విధాన మున్నది. ఈ నామములు వాని స్వరూప మావేదింప గలవు.

శిఖాపాశము - శిఖావ్యాలము - పిండీపత్రము - చూడామణి - మకరిక - ముక్తాజాలము - శీర్షజాలక - కందక - శిఖిపత్ర - వేణీపుచ్ఛ - దోరక - లలాటతిలక - కర్ణిక - కర్ణవలయ పత్రకర్ణిక - కుండల కర్ణముద్ర - కర్ణోత్కీలక - దంతపత్ర - కర్ణపూర - తిలక - పత్రలేఖ - త్రివణి - నేత్రరంజన - అధర రంజన - దంతరాగ - ముక్తావలి - వ్యాల పంక్తి - మంజరి - రత్నమాలిక - రత్నావలి - సూత్రకము - ద్విసరము - త్రిసరము - చతుస్సరకము - శృంఖలిక - అంగద - వలయ - మణిజాల - ఖర్జూరిక - సోచ్ఛిత్తిక - కలాపి - కటక - శంఖ హస్తపత్ర - పూరక - ముద్ర - అంగులీయక - తలక - మేఖల - కాంచిక - రశన - కలాప - నూపుర - కింకిణీక - ఘంటిక - రత్నజాలక - కటక - పాదపత్ర - అంగులీయక అంగుష్ఠతిలక - అలక్తకరాగ -

నాట్యప్రయోగమున బరువుగల భూషణము లుపయోగింప రాదు. భూషావివేక మనేకవిధముల గుర్తింప వలెను. దివ్యస్త్రీ నాగస్త్రీ మునికన్యా మానుషీ విశేషముల గుర్తించి యలంకారముల కూర్ప వలెను. ఇట్లే పురుషులకు సంబంధించిన యలంకారముల నూహించునది.

## సాత్త్వికలక్షణం.

పరస్య సుఖదుఃఖాదిభావైర్యద్భావనం భవేత్
తత్రాంతఃకరణాసక్తిరత్యంతా సత్త్వమిష్యతే ౨౧

సాత్త్వికస్సత్త్వనిష్పాద్యైర్భావైర్జాతస్య చాష్టధా
స్తంభ ప్రస్వేద రోమాంచాః స్వరభేదస్సవేపథుః
వివర్ణతాశ్రుప్రలయా ఇత్యేతే సాత్త్వికాస్స్మృతాః
ఏషామభినయానాం న ప్రపంచోఽత్ర ప్రదర్శితః

## సాత్త్వికలక్షణము.

సత్త్వము వలన గలుగు భావములు సాత్త్వికములు. స్తంభ ప్రస్వేదాదులు సాత్త్వికభావములు. వీనినే సాత్త్వికము లననేల ? ఇతరభావములు సత్త్వము లేక అభినీతము లగునా ? సర్వభావములకు మూలము సత్త్వము. సత్త్వశాలియె భావముల నభినయింప గలడు సత్త్వశీలి యగు సామాజికుడె భావముల నాస్వాదింప గలడు. అంతట సత్త్వసామాన్య మున్నది కదా! ఇట్టి యాశంకా నివారణ మున కిది చెప్పవలెను. సాత్త్వికము లందె సత్త్వ మున్నది. సత్త్వ మనునది మనఃప్రభవ మయిన యొక విశేషము. ప్రాణాత్మక మయిన వస్తుతత్త్వమునకు సత్త్వ మని పేరు. మన స్సంకు లగ్న మగును. పరునకు సంబంధించిన సుఖదుఃఖాది భావములచే గలుగు భావనము నందు అత్యంత మంతఃకరణా సక్తి యుండుటను సత్త్వము అన వలెను. సత్త్వసంపాద్యము లగు భావములచే గలుగునది సాత్త్విక మని భావము సత్త్వగుణ మధికముగా నుండుట వలన ప్రాణివస్తువునే సత్త్వ మందురు "పరగత సుఖదుఃఖాది భావనయా భావితాంతఃకరణత్వం సత్త్వం" పరగతము లయిన సుఖదుఃఖాదుల భావనమున అంతఃకరణము భావిత మగుట సత్త్వమను వ్యవహారము పొందును.

రత్యాదిచిత్తవృత్తు లన్నియు ప్రాణభూమిలో ప్రసారము పొంది నవై నేత్రజలాది రూపమున విలక్షణములై యవభాసించును రత్యాదుల విభావ సంపదయె యిం దాస్వాద్య మగును ఇట్టి యీ సాత్త్వికము అష్టవిధము

స్తంభము — ప్రస్వేదము — రోమాంచము — స్వరభేదము
వేపథువు — వైవర్ణ్యము — అశ్రువు — ప్రలయము.

అను నీ యెనిమిది సాత్త్విక భావములు. ఇట్టి సాత్త్విక భావాభినయ మిచట విస్తృతముగా నిరూపిత మగుట లేదు. రసవినియోగములో దీనికి సముచిత మగు వ్యవస్థ యున్నది.

### నృత్య నృత్త నాట్య - మార్గ దేశి లక్షణం.

ఇదానీం ప్రకృతం నృత్యం యథాలక్షణ ముచ్యతే
భవేద్భావాశ్రయం నృత్యం పదార్థాభినయాత్మకం
గాత్రవిక్షేపణార్థత్వాన్నృత్యే బహుల మాంగికం
వివిధేన విలాసేన క్షేపో విక్షేప ఇష్యతే॥
నాట్యవేద ప్రవృత్తత్వాన్మార్గితత్వాన్మహర్షిభిః
సద్భిస్సంచారితత్వాచ్చ మార్గమాహురిదం బుధాః
నృత్యం శ్రీగదితాది స్యానాట్యం తన్నాటకాదికం
గీతవాద్యాది మిలితం లయమాత్ర సమాశ్రయం
అంగవిక్షేపణం నృత్తం భవేదభినయోజ్ఝితం
నాట్యేహ్యభినయే ఛిద్రప్రచ్ఛాదనఫలం హి తత్
ఏతద్దేశీ తు విఖ్యాతం తత్తద్దేశజనేచ్ఛయా
అస్యాచార్యో మృడానీశః యతస్సంధ్యాసు నృత్యతా
మయాపీదం స్మృతం నృత్త మిత్యుక్తం చంద్రమౌలినా

నృత్య నృత్త నాట్య — మార్గ దేశీలక్షణము.

నృత్యము నృత్తమునాట్యముల స్వరూప వివేచన మిచట గలదు. వీనిలోని వానికి మార్గ దేశీ వ్యవహారము కలుగుటయు ఇచట నిరూపిత మగును. ప్రస్తుతము నృత్య స్వరూపము యథాలక్షణముగా నిరూపిత మగును. నృత్యము భావాశ్రయము పదార్థాభి నయాత్మకము. నృతీ-గాత్ర విక్షేపే -గాత్రవిక్షేపార్థమున నృతి ధాతువు కలదు. నృతివలన నృత్యపదము వ్యుత్పన్న మయినది. నృత్యము నందు ఆంగికాభినయము బహుళముగా నుండును. గాత్రములు, అవయవములు వాని విక్షేపము వివిధ విలాసమున విక్షేపము వివిధము లగు భావముల విలాసములను విశిష్టముగా సూచించుట విక్షేప పదార్థము. ఇట్టి నృత్యమును మార్గ మని యందురు. నాట్యవేదమున ప్రవర్తిత మయినందున, మహర్షులు మార్గణ మొనరించి నందువలన సమర్థులగు యోగ్యులచే సంచారిత మయినందువలన నిది మార్గము అను పేరు కల దయినది. శ్రీగదితము మొదలగు ఉపరూపకములు నృత్యరూపమున జెప్పగినవి పదార్థాభినయాత్మకము లయిన ఉపరూపకములు పదునెనిమది కలవని కొందరు పరిగణించిరి. నృత్య భేదము లగు నివి వింశతి విధము లని భావప్రకాశనమున శారదాతనయుడు నిరూపించెను. వీని కొందరు నామాంతరముల వ్యవహరించిరి. సంవిధాన క్రమ మొకవిధమె. అందు భేదము లేదు. నృత్య భేదము లేడు కల వని కొంద రనిరి. వాసిని వారు భాణము అను రూపకముతో సమముగా సంభావించిరి.

తోటకము — నాటిక — గోష్ఠి — సల్లాపము
శిల్పము — డోంబి శ్రీగదితము — భాణము
భాణి — ప్రస్థానము — కావ్యము — ప్రేక్షణము
నాట్యరూపకము — రాసకము — ఉల్లోప్యకము —హల్లీసము

దుర్మల్లిక — కల్పవల్లి — మల్లిక — పారిజాతకము-నాటకము మొదలగు నవి రూపకములు. అవి నాట్యమని వ్యపదేశింప దగి యున్నవి.

నాటకము — ప్రకరణము — ప్రహసనము

భాణము — డిమము — వ్యాయోగము

సమవాకారము — వీథి — అంకము — ఈహామృగము

నృత్త మనునది మూడవది. ఇది గీతవాద్యాదులతో గూడి యుండును. లయను మాత్రమే యాశ్రయించి యుండును. దీనికి తగిన యంగవిక్షేప ముండును అభినయ మిం దుండదు. గీతము నందలి సర్వసంచారమునకు వాద్యము నందలి వరుసలకు ద్రుత మధ్య విలంబిత రూపము లయిన లయప్రక్రియలకు తగిన విధమున అంగవిక్షేప ముండునే కాని అందు ఎన్నదగిన భావసూచన మేమియు నుండదు. కావుననే యిది అభినయోజ్ఝిత మనుట. నృత్త మిట్టి దయినను కొంత ప్రయోజనము కలదు. నాట్యమున అభినయమున నేవేని వెలితి విధానములు ఛిద్రములు ఉన్నచో వానిని ప్రచ్ఛాదనము చేయుటకు, కప్పిపుచ్చుటకు నృత్త ముపకరించును. నృత్తము ఛిద్రప్రచ్ఛాదనఫల మని యనుటయె కాని యిది పూర్ణతాసంపాదకము. రంజన మిచ్చునది ఉల్లాస మిచ్చునది యగును. ఈ నృత్తము దేశీవిధాన మని ప్రఖ్యాత మయినది. తత్తద్దేశజనుల యిచ్ఛానుసారమున నిది యుండును. నృత్తమున కాచార్యుడు మృడానీశుడు = పరమశివుడు, సదాశివుడు. సంధ్యాసమయము లందు సదాశివుడు నృత్త మొనరించును. భరతుడు సర్వ వృత్తి సహితముగా నాట్యము సిద్ధపరచి త్రిపురదాహము అను రూపకము నిర్మించి తన శిష్యులచే ప్రయోగ మొనరింప జేయుట కొకప్పుడు యత్నించెను. బ్రహ్మ సూచనానుసార

మున కైలాసోద్దేశమున శివ సమక్షమున నాట్యప్రయోగము జరిగినది. అది చూచి శివుడు—"మయాపీదం స్మృతం నృత్తం" అనెను. నేనును నృత్తము స్మరించుచున్నా నని యని సమీపమున నున్న పరివారములోని తండువును చూచి, "భరతునకు ఆ నృత్తవిశేషము సూచింపుము' అనెను. తండువు చెప్పగా భరతుడు నృత్తమహార్థము గుర్తించి నాట్యవేదమున నిరూపించెను. ఆ విషయాంశము నిచట అనుసంధానింప వలెను.

## లాస్య తాండవ లక్షణం.

లాస్య తాండవ భేదేన ద్వయమేతద్ద్విధా పునః
సుకుమారం తయోరాద్యం భవేదపరముద్ధతం
భావః స్త్రీపుంసయోర్లాసః తదర్ధః తత్ర సాధు వా ౨౦
లాస్యం మనసిజోల్లాసహేతు మృద్వంగహారవత్
దేవ్యై దేవోపదిష్టత్వాత్ప్రాయస్త్రీభిః ప్రయుజ్యతే
గేయపదం స్థితపాఠ్యం ఆసీనం పుష్పగంధికా
ప్రచ్ఛేదకస్త్రిమూఢాఖ్యం సైంధవాఖ్యం ద్విమూఢకం
ఉత్తమోత్తమకాభిఖ్య ముక్తప్రత్యుక్తాభిధం ౨౫
లాస్యాంగాని దశైవాత్ర తేషాం లక్ష్మాభిధీయతే

## లాస్య తాండవ లక్షణము.

పూర్వము నిరూపించిన నృత్యము నృత్తము అను రెండును రెండు విధము లగును. లాస్యము - తాండవము నని. లాస్యము సుకుమారముగా నుండును. తాండవము ఉద్ధతముగా నుండును. వీని రూపముల నిట్లు గుర్తించునది.

౧. సుకుమార మగు నృత్యము లాస్యము.
౨. సుకుమార మగు నృత్తము లాస్యము
౩. ఉద్ధత మగు నృత్యము తాండవము
౪. ఉద్ధత మగు నృత్తము తాండవము

రెండువిధము లగు లాస్యములు రెండువిధము లగు తాండవములు నృత్యనృత్తముల వలన లభ్యము లగుచున్నవి. "సుకుమారం ద్వయమపి లాస్యం ఉద్ధతం ద్వితయమపి తాండవం" అని దశరూపకమున గలదు. సుకుమారముగా నుండు రెండును లాస్యమని, ఉద్ధతముగా నుండు రెండును తాండవ మని వ్యవహారము. ఇట్టి లాస్యతాండవములు రెండును నాటకాదులలో నుపకరించు నవి కాగలవు. ఒకచో నృత్యము అవాంతర పదార్థాభి నయరూపమున నుపకరించును. భావాశ్రియ నృత్యమునకు పదార్థాభినయాత్మకత యున్నది కదా! నృత్తము శోభాహేతువుగా రూపకములలో నుపకరించుట యున్నది.

శాస్త్రీయ మగు నృత్యమున కోమలభావములను ఉద్ధత భావములను ప్రదర్శించుటకు వేరు వేరు విధానముల సమాశ్రయణ మున్నది. కావుననె లాస్యము సుకుమార మని, తాండవము ఉద్ధత మని వ్యవహారము కలిగినది. ఇట్టి రీతి దేశియగు నృత్తమున గూడ గలదు. లోకనృత్తము లలో ఉద్ధత కోమల విధానములు గోచరించుచునే యున్నవి.

స్త్రీపురుషులకు సంబంధించిన యనురాగాత్మక మయిన భావమునకు లాస మని పేరు. తదర్థ మగు విధానము లాస్యమగును. స్త్రీపురుషుల రాగభావమును వృద్ధి పొందింప జేయుటయె లాస్యము యొక్క భావము. అట్లె స్త్రీపురుషుల లాసాఖ్య భావమున యోగ్యత కల విధానమునకు లాస్యమని వ్యవహారము. కాగా "లాస్యము మనసిజోల్లాస హేతువు" అని నట్లయినది. కామభావము నీ లాస్యము సముల్లసింప జేయునది యగును.

ఇట్టి యీ లాస్యము కోమలము లయిన అంగహారములతో గూడి యుండును. అంగహార మనుట నాట్యాభిధానమున నొక సాంకేతిక మయిన పారిభాషిక మయిన విశేషము. ఆంగికాభినయమున ననేకవిశేషములు నిరూపితములు గా నున్నవి. హస్తపాదాదుల యభినయ విన్యాసములు కొన్ని కూడియున్నచో "కరణము" అను వ్యవహారము కలుగును. ఇట్టి కరణము లనేకములు కలవు. అయినను నూటయెనిమిది కరణములను నాట్యవేదము నిరూపించినది. కొన్ని కరణములను సముచితముగా గూర్చి యభినయించిన నది యొక అంగహార మగును. అంగహారము లనేకములు గలవు. అయినను ముప్పది రెండు అంగహారములను నాట్యవేదము పరిగణించినది. హారములు = హర ప్రీతి సంపాదకములు. అంగములచే ననగా నంగాభినయ విశేషములచే హరునకు ప్రీతి సంపాదకములగు విశేషము లంగహారము లగును. ఈ యంగహారము లను శివుడు ప్రయోగించినాడు. శివానుకరణమున శివదేవియు అంగహారముల నభినయించినది. శివుడు ప్రదర్శించిన యంగహారము లుద్ధతములు కాగా శివదేవి ప్రదర్శించిన యంగహారములు సుకుమారములు కోమలములు మృదువులు నయినవి. కాగా లాస్యమున మృద్వంగహారము లుండు ననుట సంగతము కాగలదు.

శ్రీ గౌరీదేవికి శ్రీ శివ దేవు డుపదేశించినాడు. ఆ యుపదేశమున దేవి లాస్య మనుసరించినది. కావున సామాన్యముగా స్త్రీలె లాస్యమును ప్రయోగింతురు. పురుషులును స్త్రీవేషము ధరించి సుకుమారముగా లాస్య మనుసరించుటయు నుండును. ఈ లాస్యమునకు సంబంధించిన యంగములు పది యున్నవి. వానికి లాస్యాంగము లని పేరు. ఆ లాస్యాంగముల పేరు లిట్లున్నవి.

గేయపదము— స్థితపాఠ్యము - ఆసీనము
పుష్పగంధిక—ప్రచ్ఛేదకము - త్రిమూఢకము
సైంధవము — ద్విమూఢకము — ఉత్తమోత్తమకము
ఉక్తప్రత్యుక్తము —

ఈ పది లాస్యాంగముల లక్షణములు నిరూపితము లగును.

### లాస్యాంగలక్షణం.

యత్రాసన సుఖాసీనాస్తంత్ర్యాతోద్య సంయుతం
గాయంతి గాయనీశ్శుష్కం తద్గేయపదమిష్యతే
ఆసనస్థా వదేద్యత్ర ప్రాకృతం విరహే వధూః
మన్మథానలతప్తాంగీ స్థితపాఠ్యం తదుచ్యతే
చింతాశోకాన్వితం సర్వైః వాద్యైరభినయైరపి
హీనం యత్రాస్యతే తస్మాత్ ఖ్యాతమాసీన సంజ్ఞయా
నృత్తం గీతం చ వాద్యం చ యత్ర నానావిధం భవేత్
పుంవచ్చ వివిధాశ్చేష్టా నార్యాస్సా పుష్పగంధికా
ప్రచ్ఛేదకో భవేద్యత్ర జ్యోత్స్నా సంతాప విహ్వలాః
కామిన్యో యాంతి నిర్వ్యలాస్స్వపరాధానపి ప్రియాన్
నాట్యం పుంభావభూయిష్ఠం సమవృత్త విభూషితం
అనిష్ఠురశ్లక్ష్ణపదం యత్ర స్యాత్తత్త్రిమూఢకం
పాత్రం వంచితసంకేతం నాట్యం పాఠ్యేన చోజ్ఝితం
భాషా చ సైంధవీ యత్ర తద్జ్ఞాస్తత్సైంధవం విదుః
ముఖప్రతిముఖోపేతం చతురశ్ర పదక్రమం
శ్లిష్టభావరసం యత్తద్వైచిత్ర్యార్థం ద్విమూఢకం
విచిత్రశ్లోకబంధం యన్నానారససమాశ్రయం
ఉత్తమోత్తమకం తత్స్యాత్‌లీలా భావ మనోహరం
సాధిక్షేపైః పదైర్యుక్తం చిత్రగీతార్థయోజితం
కోపప్రసాదసంజాత ముక్తప్రత్యుక్తకం విదుః

## లాస్యాంగలక్షణము.

౧. గేయపదము :- గాయనీమణు లాసనము లందు సుఖాసీనలై తంత్రీవాద్యముల సంబంధము కూడి యుండునట్లు శుష్కముగా గాన మొనరింతురేని గేయపద మగును. గేయపదము కావ్యమున గాని ప్రయోగమున గాని సంగతముగా నుండును. అనుకరణీయ మగుటచే నిది శుష్కముగా నుండున దని భావము. గాయనులె గేయపదము ప్రయోగింప వలెను. రూపకపాత్రి లట్లు చేయరు. ఆసనము లందు సుఖాసీనలై గాన మొనరించుటయు నిం దావశ్యకము. నేపథ్యమున గాన మొనరించుట తగదు. గేయమున కిది స్థానము కావున గేయపదము. ప్రియుని గుణములతో గూడుకొనిన గేయమును గాయని గాన మొనరించుట యిం దుండునని కొందరి భావము. ప్రయోగసంగత మయిన గేయపదము సామాజికరంజక మగును. ఈ గేయపదము నందు గాన సమయమున త్ర్యశ్ర చతురశ్రాది తాల సంపదయు నుండును.

౨. స్థితపాఠ్యము :- విరహవివశురా లయిన వధు వాసనమున నున్నదై మన్మథానల తప్తావయవయై ప్రాకృతమును పలుకు నేని స్థితపాఠ్యమగును. "ఆసనస్థా" యనుట ఆసనమున నిలబడినదై యని భావము. ఆర్త్రరస మయిన ప్రాకృతపాఠ్యము పఠించుట స్థితపాఠ్యము. లాస్యమున గూడ దేవతా నరపతి రంజన ప్రాయ మయిన పాఠ్య ముండును. ఆసనమున నిలబడి యుండియు ఉపవిష్టురాలి వలె పాఠ్యపఠన మొనరించుట రంజన మిచ్చును వియోగిని ఆర్త్రరసముగా పఠించుట యనునది యావేశము నవశత్వమును సూచించును. గేయపదము నందు వలె తాలగతి యుక్తము కాదు.

౩. ఆసీనము:- చింతాశోకాన్వితముగా కేవలము కూర్చొని యుండుటకు ఆసీనము అని పేరు. వాద్యములు గాని యభినయములు గాని యిం దేవియు నుండవు. అవయవముల ప్రసారమేనియు నుండదు. అత్యంత శోకావేశమున్నపు డభినయము లుండవు. అతిసుకుమార మగు కాకలీప్రాయ మగు గీతాలాపము మాత్రమె యుండుట నూహింప వచ్చును. ఇది కరుణములో నుపకారి. రంజనమున సహకారి. చింతాశోకాది సమన్విత మనుటచే అధఃశయనము నిధ్యానము అధోముఖత్వము స్రస్తగాత్రత యుండు నని భావము.

౪. పుష్పగంధిక:- దీనికే పుష్పగండిక యనియు వ్యవహార మున్నది. నానావిధము లగు నృత్తములు గీతములు వాద్యములు పుష్పగంధికలో నుండును. పురుషులకు వలె వివిధము లగు చేష్ట లుండును. స్త్రీలు పురుష చేష్టాశ్రయమున పర్యాయప్రయోగ మనుసరింతురు. నారి నర వేషము ధరించి సఖీవినోదమునకై లలిత మగు సంస్కృతము పఠించును. నర వేష ధారణము లేకుండగనే పుంచేష్టలతో నుండుటయు నిందున్నది.

౫. ప్రచ్ఛేదకము:- వెన్నెల వలని సంతాపమున విహ్వాల లయిన కామినీమణులు, ప్రియు లపరాధ మొనరించిన వా రయినను లజ్జారహితలై సంచరించుట ప్రచ్ఛేదక మగును. ప్రియ విరహమున వ్యథ పడు వనిత జ్యోత్స్నా సంచార మొనర్చుచు ఛాయాదర్శనమున ప్రియుని భావించి హర్షాతిశయమున ప్రియాసంసక్త యగుటయు ప్రచ్ఛేదకము. అట్లే పానగోష్ఠీ సమయమున ప్రియుని రూప భావనమున ప్రియుడు మదిరలో ప్రతిబింబించి నట్లుగా భావించి సంసక్త యగుటయు ప్రచ్ఛేదకము. ఇట్లే దర్పణ ప్రతిబింబిత

ప్రియభావనము, జల ప్రతిబింబిత ప్రియభావనము వనితకు ప్రహర్ష మాపాదింప గలదు. ఇట్టి విచిత్రతను భావించి కవులు, ప్రతిబింబ నము వలన గలిగిన ప్రహర్షము ప్రణయకోప ప్రసాదనసమర్థ మగు నట్లు వర్ణించిరి. ప్రిచ్ఛేదకము లందు వెన్నెల యధికముగా నుప కరించును. లోకమున సర్వదా సంపూర్ణ చంద్రోదయ ముండదు. ప్రచ్ఛేదకానుసారమున సర్వకాలము లందును పూర్ణచంద్రమండల ముండునట్లు కవులు వర్ణింతురు. రసోపయోగి యగు కాలవిశేష మును అలౌకికముగ వర్ణించుటను కావ్యవిదు లంగీకరింతురు.

౬. త్రిమూఢకము:- పురుషభావాధిక మయిన నాట్యము, సమవృత్త రచనా విధానములతో విభూషితత్వము. అనిష్ఠురములు శ్లక్ష్ణము లయిన పదముల పొందిక త్రిమూఢకమున నుండును. ఈ లాస్యాంగములో నాయకు డపరాధ మొనరించినవాడు కాగా నాయిక విషణ్ణయై ద్వేషించును. నవనాయిక ప్రథమ ప్రణయ మయి నందున లజ్జావ్యథిత యగును. ఇట్లు మూఢుర మోహ మి దుండును. నాయక వచనము లనిష్ఠురములుగనె యుండును. ఇందు రసోపయోగి గుణా లంకారము లావశ్యకములు.

౭. సైంధవము:- ఇదియే సైంధవకము. సంకేత మేర్పరచి వంచన మొనరింపగా నొక వ్యక్తి ప్రాకృత వచనములతో పలుకుచు నువ్యక్తము లగు కరణములతో వ్యవహరించుట సైంధవకము. కరణముల సంబంధమె కాని యిచటి నాట్యమున పాఠ్యసంబంధ మేమియు నుండదు. సింధుదేశ భాషాశ్రయము సైంధవము. సైంధవభాష రంజనాధిక్యమున రసోపయోగి, రసోచిత సంకేతము భ్రష్ట మయినను వీణావాద్యాద్యుపకరణములతో గూడినదై రసవ్యక్తినిదాన మగుటయు నిం దుండునని భావింపవచ్చును

౮. ద్వియూఢకము:— ముఖ ప్రతిముఖ సహితము చతురశ్ర పదక్రమము శ్లిష్ట భావ రసోపేతము వైచిత్ర్యార్థ ద్వియూఢక మగు నని సామాన్యార్థము. లాస్యాశ్రయ మగు ఈ కావ్యమున నాయికానాయకుల కిద్దరకు వ్యామోహము వర్ణిత మయినచో ద్వియూఢక మగును. ఇద్దరు నాయికల వ్యామోహ మున్ననిదియె. ఇందుండిద్దరు పరస్పర మెదురుగా నుండి గతిపరిక్రమము కలవా రగుదురు. లోకగతులలో నిట్టి తాలానుసారిగతి యుండదు. ముఖ ప్రతిముఖ సంపత్తి యిం దొక రమణీయతను సంపాదించును. మొదట సామాజికులకు ముఖ మభిముఖగా నుంచుట అనంతరము ప్రతిముఖ విధానమున లాస్యాంగము నభినయించుట యిందు ముఖ్యము. చతురశ్రానుసారముగా నాలుగు దిశల పరిక్రమించుచు రంజనము కలుగ జేయుటయు నిందు ముఖ్యము. ఇట్టి క్రమణమున వైచిత్ర్యము కలుగుట ప్రయోజనము. శ్లిష్టభావమున నభినయించు చిత్తవృత్తి రసప్రాప్తి స్ఫుటత సంపాదించును. ముఖ ప్రతిముఖ పదములను ముఖసంధి ప్రతిముఖసంధి పరముగా నన్వయింప రాదు.

౯. ఉత్తమోత్తమకము. దీనిలో విచిత్ర శ్లోక బంధ ముండును. నానా భావరసముల కిది యాశ్రయము. ఇది లీలాభావ మనోహరము అని మూలార్థము. కావ్యమునకు కావ్యభాగమునకు ఉపరంజన మిచ్చు విధానమున, వినేయులకు హృదయ సంవాద మాపాదించుటలో లాస్యాంగము లుత్తమములు. అందు నిది యుత్తమ మగుటచే ఉత్తమోత్తమకము. సర్వ మిందు రస పర్యవసానము పొందును. రస సంశ్రయ మనుటచే అసాధారణము గు రసమున కాశ్రయ మని భావము. ఇందలి శ్లోకఘటనా విధానములు వివిధములు విచిత్రములు నై యుండును లీలా హేలా హావ భావములచే నిది దీప్తత

కలదిమై భూషిత మగును. ఈ లీలా హేలాదులలో అక్షి భ్రూ విశారాదులు గ్రీవా రేచితములు లలితాభినయాత్మకములై రక్తి సంపాదకము లగును.

౧౦. ఉక్తప్రత్యుక్తము: సాధిక్షేప పదములతో గూడు కొనినదై చిత్రగీతార్థముల నాయోజిత మయినదై కోప ప్రసాద సంజాత మగు నిది ఉక్తప్రత్యుక్త మగును. లక్షణ వాక్యము నీ విధమున నీ క్రమమున భావించుట యుక్తము. కోప ప్రసాద జన్యము సాధిక్షేప పదాశ్రయముగా నుండు ఉక్తవచనము ప్రత్యుక్త మగును. ధ్రువాగానము లోని యంశము నాట్యాంశమున మేళనము పొంది యుండును. భిన్నములుగా నుండు వాచ్యఖండలకములు రసావేశ మహిమాతిశయమున సమన్వయము పొందును. మాటకు మాటగా పలికిన పలుకు లన్నియు కోప ప్రసాదాక్షేపములతో నున్న నయి నను రసావేశమున రస్యములై భాసించును.

చిత్రపదభావికానభ్యుపగమః

యత్ర ప్రియాకృతిం దృష్ట్వా వినోదయతి మానసం
మదనానల తప్తాంగీ తచ్చిత్రపద ముచ్యతే
దృష్ట్వా స్వప్నే ప్రియం యత్ర మదనానల తాపితా
కరోతి వివిధాన్ భావాన్ తద్వై భావికముచ్యతే ౧౧౦
కేచిత్ తద్ద్వయం ప్రాహు స్తన్న మన్యామహే వయం
అంగాని దశ చైవేతి మునినా యత్ప్రకీర్తితం

కొందరు చిత్రపదము భావికము నను రెండు లాస్యాంగ ముల నధికముగా నంగీకరించిరి. వానిని మేమిం దంగీకరించుట లేదు.

చిత్రపదము:— మదనానల పరితప్త యగు నొక వనిత ప్రియుని యాకృతిని చూచి మానసము వినోద పెట్టు కొనుట చిత్ర పదము.

భావికము:— మదనానల పరితప్తయగు నొకవనిత స్వప్న మున ప్రియుని జూచి వివిధభావములతో నుండుట భావికము.

ఇట్లీ రెండిటి నంగీకరించుట యుక్తము కాదు. లాస్యము దశాంగ మని దశవిధ మని ప్రసిద్ధి. తద్విరోధము సముచితము కాదు. ఈ ద్వయమున నుపయోగ మేనియు లేదు. లాస్యాంగ ద్వారమున గలుగవలసినది దశాంగముల వలననే గలుగు చున్నది. సర్వవిధ వైచిత్ర్య విశేషములు దశవిధముల వలననె గలుగు చుండగా వీని నంగీకరింప వలసిన యావశ్యకత లేదు. నాట్యవేదమున భరత ముని లాస్యాంగములు పది యని చెప్పుటచే నీ రెండు నప్రమాణ ములు. మునివచనాతిక్రమము యుక్తము కాదు.

తాండవం.

ఉద్ధతం తు మహేశస్య శాసనాత్తండునోదితం
భరతాయ తతః ఖ్యాతం లోకే తాండవ సంజ్ఞయా
ప్రాయో నిర్వర్త్యతే పుంభిరంగహారైస్తదుద్ధతైః
ప్రయోగస్తూచ్యతే తద్జ్ఞైః తస్యోత్సాహాదిగోచరః ౧౧౪

తాండవము.

మహేశ్వరుని శాసనమున తండువు భరతునకు ఉద్ధతమును నిరూపించినాడు. అందువలన లోకమున తాండవ మని పేరు గలిగి నది. తండునిరూపితము తాండవ మయినది. తాండవమనగనె యుద్ధత నృత్యమునే లోకము గుర్తించు చున్నది. తండు వుద్ధతమునె

నిరూపించి నందున తాండవ ముద్ధతమని లోకము భావించినది. సామాన్యముగా నీ తాండవమును సుకుమారతె ఉద్ధతము లగు అంగహారములచే నిర్వర్తింప జేయుచున్నారు. తాండవవిదులగు వారును తాండవ ప్రయోగ ముత్సాహాది గోచరముగ నుండునటనే చెప్పుచున్నారు.

కాని యంగహారములలో సుకుమారము లగునవి కలవు. కరణము లన్నియు నుద్ధతములు కావు. సుకుమార కరణము లున్నవి. సుకుమారము లగు నంగహారము లున్నవి. స్త్రీలు మాత్రమె ప్రయోగింప వలసిన కరణాంగహారము లున్నవి. శంకు నిరూపిత మంతయు నుద్ధతము కాదు. ప్రయోగ ముత్సాహాదిగోచరముగా నున్నదని తాండవము నట్లు లోకము భావించినది.

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ
గజసాధనిక శ్రీ జాయసేనాపతి
విరచితే నృత్తరత్నావల్యాం
నర్తనవివేకో నామ
ప్రథమోఽధ్యాయః

ఆంధ్రభోజ సాహితీవల్లభ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ
భావసాధక శ్రీమాధవరామశర్మ
విరచిత సాహితీవల్లభాఖ్యవ్యాఖ్య
నర్తనవివేకము
ప్రథమాధ్యాయము

# నృత్తరత్నావలీ నర్తనవివేకము



*



శ్రీ

శ్రీ జాయ సేనాపతి విరచితా

# నృత్త రత్నావళీ

## ద్వితీయాధ్యాయః



### నాట్య నృత్య నృత్తాంగాని.

సనాట్యయో రథాంగాని వక్ష్యంతే నృత్య నృత్తయోః
శిరో హస్తావురః పార్శ్వే కటీ పాదౌ చ షట్ క్రమాత్
గ్రీవా దోః కుక్షి పృష్ఠోరు జంఘాః ప్రత్యంగకాని షట్
విలోచన భ్రూ నాసోష్ఠ కపోల చుబుకాని షట్
ఉపాంగాన్యథ వైతేషాం భేదాన్ వక్ష్యే సలక్షణాన్ ౫

### సాహితీ వల్లభ.

నాట్య సహితము లయిన నృత్య నృత్తముల అంగము లీ యధ్యాయమున నిరూపితము లగును. నాట్య సంగ్రహ మారు విధముల నున్నది. "షడంగో నాట్యసంగ్రహః"

శిరము — హస్తములు — ఉరము — పార్శ్వములు
కటి — పాదములు షడంగములు.

వీనికి సంబంధించిన ఉపాంగములు ప్రత్యంగములు వేరుగా గలవు. వాని నిరూపణము నావశ్యకము.

గ్రీవ — బాహు — ఉదర — పృష్ఠ — ఊరు — జంఘలు అను నారును ప్రత్యంగికములు. వీని కవాంతర భేదములును గలవు అవియు నిరూపితము లగును.

నేత్ర - భ్రూ - నాస - ఓష్ఠ - కపోల - చుబుకములు అను నారును ఉపాంగములు. వీని లక్షణ వినియోగములును ప్రతిపాదింపబడు లగును. లక్షణసహితముగా వీని యొక్కొక్కటి భేదములను ఇకపై నిరూపించెదము.

## శిరోభేదాః

ఆకంపితం కంపితాఖ్యం ధుతం విధుతమంచితం
పరివాహితమాధూతం అవధూతం నిహంచితం
అధోముఖం పరావృత్తముత్క్షిప్తం లోలితం శిరః
త్రయోదశవిధం నృత్తం మునినా సముదీరితం ౯

## శిరోభేదములు.

భరతుడు నాట్యవేదమున నిరూపించిన విధమున శిరోభేదములు పదమూడు. ఇచట నిరూపితము లగుచున్నవి. వాని నామసంకేతము లిట్లున్నవి.

ఆకంపితము — కంపితము — ధుతము — విధుతము
అంచితము — పరివాహితము — ఆధూతము — అవధూతము
నిహంచితము— అధోముఖము—పరావృత్తము—ఉత్క్షిప్తము
లోలితము — ఇవి శిరోభేద నామములు.

## శిరోలక్షణం

సకృదాకంపనా దూర్ధ్వ మధశ్చాకంపితం శనైః ౧౦
ప్రశ్నోపదేశ నిర్దేశ సంజ్ఞాదావ్ తదిష్యతే
తదేవ బహుశస్తూర్ణం కంపనాత్కంపితం విదుః
వితర్క రోష విజ్ఞాన ప్రతిజ్ఞా తర్జనాదిషు

మందం సంచారితం తిర్యక్ శిరో ధుత ముదీరితం
పార్శ్వావలోకనాశ్చర్య నిషేధానీప్సితాదిషు
తదేవ శీఘ్రతాం నీతం శిరో విధుత మీప్సితం
పీతమాత్రాసవ త్రస్త శీతార్త జ్వరితాదిషు
ఈషదానమితం పార్శ్వే శిరో జ్ఞాతవ్య మంచితం
మత్తమూర్ఛిత రోగార్త చింతాపర్యాకులాదిషు
పార్శ్వాత్పార్శ్వం శిరో నీతం పర్యాయైః పరివాహితం
విచార విస్మయామర్ష హర్ష లీలాదిషు స్మృతం
ఏకవారం సముత్క్షిప్తం తిర్యగాధూత ముచ్యతే
ఆత్మసంభావనా గర్వ పార్శ్వస్థోర్ధ్వావలోకనే
అధస్తాత్సకృదాక్షిప్త మవధూతం నిగద్యతే
తదావాహన సందేశ సంజ్ఞాలాపాదిషు స్మృతం
గ్రీవాంచితా సముత్క్షిప్తా యత్రాంసౌ తన్నిహంచితం
తదేతత్స్త్రీభువాం గర్వ బిబ్బోక లలితాదిషు
అధోగత మవాచీన స్థితానన ముదాహృతం
అభివందన మందాక్ష విషాద ప్రముఖేషు తత్
యత్రాననం పరాచీనం తత్పరావృత్త మిష్యతే
పశ్చాద్విలోకనానిష్టోద్విగ్నాస్యాపనయాదిషు
ఉచ్చైరున్ముఖ ముత్క్షిప్తం భవే దంచిత కంధరం
ప్రాంశు వ్యోమాగ్ర సూర్యేందు తారాద్యుల్లోకనేషు చ
శిరో లోలిత మాఖ్యాతం సర్వతః పరిలోలనాత్
మద మూర్ఛా గద స్వప్న గ్రహగ్రస్తాదిషు స్మృతం

శిరోలక్షణము

పైన నిరూపించిన శిరోభేదములు పదుమూడింటికి ఇందు లక్షణములు నిరూపితము లయినవి. వాని వినియోగములును ప్రతిపాదితము లయినవి. ఏ యే సమయమున నే యే భావమున ఏ యే శిరోవిశేషములు ప్రయోగము పొంద దగినవో తన్నిరూపణ

౪. విధుతము:- ధుతశిరముననే శీఘ్రత్వ మున్నచో విధుత శిరము అగును. వేగవేగముగా రేచన మున్నచో విధుతశిర మగును. విశేషముగా ధుతము విధుతము. ధూఞ్ ధాతువునకు కంపన మని యర్థము. శిరమునకు విశేషముగా కంపన మున్నపుడు విధుతము. మద్యము త్రాగి నంత మాత్రమున నిది కలుగును. ఇతరులు భయము పెట్టినపుడు కలుగును. భయపీడితునకు గలుగును. చలిగాలి వలన చలి వేయు నపుడు కలుగును. జ్వరితు డయి నప్పుడు నిది కలుగును ఈ సమయములందు విధుత శిరమునకు వినియోగ మున్నదని భావము.

౫. అంచితము:- శిరము కొంతగా పార్శ్వమునకు వంగి యున్నచో నది యంచితశిరము అనదగును. అంచితశిర మనగా నతగ్రీవముగానున్న శిరము అని భావము. మెడ కొంతగా పార్శ్వ భాగ మునకు వంగి యుండ వలయును మత్త-మూర్ఛిత-రోగార్త చింతా పర్యాకుల భావముల నభినయించు నప్పు డీ యంచితశిర ముపకారి యగును. చింతాభినయములో నంచిత మావశ్యకము. చిబుకమును చేతితో ధరించి యుండు నపుడు అంచిత మున్నది. శంకిత దుఃఖితాభినయము లందును అంచిత ముండు నని కొందరి భావము.

౬. పరివాహితము:- ఒక పార్శ్వము నుండి మరియొక పార్శ్వమునకు వరుస వరుసగా శిరము మరలించినచో నది పరివాహిత మగును. పర్యాయశః శిరము పార్శ్వగత మగుట ఒకమారు ఒక్కొకమారు శిరము ప్రక్కకు వంపుగా దిరుగుట. ఒక మారటు ఒరుగుట మరియొక మారిటు ఒరుగుట యున్ననే శిరఃకర్మ

యగును. కేవల మటుగాని కేవల మిటుగాని యొరుగుట కాక అటు నిటు నొరుగుటయె వివక్షితము. దక్షవామ భాగముల కొదుగులు. ఇట్టి భావమె మూలములోని "పర్యాయైః" పదము వలన విశద మగును. మండలాకారముగా శిరమును పరిభ్రమింప జేయుట పరివాహిత మని కొందరు భావించిరి అది రుచిరము కాదు.

విచార–విస్మయ–అమర్ష–హర్షలీలాది విధానములలో నీ పరివాహితశిరము వినియోగము పొందును. కార్యసాధన నిర్దేశములో నీ పరివాహిత మిష్టము. విహృత మను శృంగారభావావిష్కరణమున నీ శిరఃకర్మ యుపయుక్తము ప్రియానుకరణాత్మక లీలార్థమున నిది సంగతము. శిరఃకర్మాదుల వినియోగ రీతు లన్నియు పురుష సంబద్ధములు కావు అన్నియు స్త్రీ సంగతములును గావు వాని వానిని యథాసంభవముగ గుర్తించుట యుక్తము.

౨. **ఆధూతము:**– ఒక పర్యాయము శిరము నడ్డముగా నెగుర వేయుట ఆధూతము. ఆధూతమునె ఉద్వాహిత మనుటయు గలదు. పై భాగమున కొక పర్యాయము శిరము నెగుర వేయుటను గూడ ఆధూత మని ఉద్వాహిత మని యనిరి. ఈ లక్షణభేదములను యథాసంగతముగా భావించునది. ఆత్మసంభావనములో నిది విని యుక్త మగును. గర్వప్రదర్శనమున నుపకారి. ప్రక్కనున్న వారిని జూచుటలో ఊర్ధ్వావలోకనమునను నిది యుపయుక్త మగును. ప్రక్క నున్న వానిని పైగా జూచుట కిది యావశ్యకము. తన గొప్ప దనమును తాను సంభావించు నప్పు డిది యుండును.

౩. అవధూతము: క్రిందుగా నొక్క పర్యాయము శిర మూపు పొందిన అవధూత మగును. ఊపుగా శిరమును దిగువ భాగమున కాక్షిప్తము చేయుట ఆవాహనము. సందేశము సంజ్ఞా

లాపాదులలో నీ శిరఃకర్మ యుండును. తానేమేని చెప్పదలచి సమీపమున నున్న వానిని దగ్గరకు రమ్మనుటలో, ఎదిరి వాని కాదేశ మిచ్చుటలో అవధూత ప్రయోగము సముచితము.

౯. నిహంచితము :- అంచితముగా నుండు గ్రీవారీతి భుజములు సముత్క్షిప్తము లగుట యున్నచో నిహంచిత శిరఃకర్మ యగును. స్త్రీలు మాత్రమె నిహంచిత శిరఃకర్మ నుపయోగించుట సముచితము. దీనిని పురుషులు ప్రయోగింప రాదు. పూర్వనిరూపితములు కేవలము స్త్రీలకు అను నియమము లేదు. స్త్రీలకు పురుషులకు నవి యుక్తములు. నిహంచితము స్త్రీలకే. "స్త్రీణాం ఏతత్ప్ర యోజ యేత్" అని నాట్యవేదము. ఇందు నందుననే "తదేతత్ సుభ్రువాం" అని యనుట. స్త్రీలకు సంబంధించిన గర్వ బిబ్బోక లలితాదులలో నిహంచితమునకు వినియోగ మున్నది. బిబ్బోక కిలకించితాది వినియోగ స్థానము లన్నియు స్త్రీల శృంగారభావము లయి నందున పురుషుల కందు ప్రయోగాధికారము లభింపదు. ఈ నిహంచిత మునె నికుంచిత మందురు. బిబ్బోకము లలితము అనునవి స్త్రీల శృంగారభావములు. వీని స్వరూప మన్యత్ర నిరూపిత మగును.

౧౦. అధోగతము :- ఆనన మవాచీనముగా నున్న అవాఙ్ముఖ ముగా నున్న అధోగత మను శిరోభేద మగును. అభివందన సమయమున లజ్జాభావాభినయమున దుఃఖానుభవమున శిరము అధోగత మగును. స్తంభదుస్తంభములలో శిరము అధోగతముగ నుండుటను కొందరు అభిమానించిరి.

౧౧. పరావృత్తము : ముఖము వెనుకకు తిరిగి యున్నచో పరావృత్తము అను శిరః కర్మ యగును. ముఖాపహారణమున ఇది ఉపకారి. వెనుకకు చూచు నపుడు ఇది సహకారి. అనిష్టము

సూచించు నపుడు ఉద్విగ్నతను వ్యక్తము చేయు నప్పుడు ముఖమును దాచుకొనవలసి యున్నపుడు ఇది వినియుక్త మగును. ఒక పర్యాయము వామభుజము నుండి మెడమలచి వెనుకకు చూచుట. మరొక పర్యాయము దక్షిణభుజము నుండి ముఖము మలచుట. శ్రోణీ పరిసరము లందు వ్రేలాడు కేశపాశాది దర్శనమున ఇది ప్రయుక్తమై రమ్య మగును. ఔన్ముఖ్య నిగుడ మెడ మగుడ మడమ చూచుటలో పరావృత్తము స్పష్టమగును.

౧౨. **ఉత్క్షిప్తము** :- శిరము ఉన్ముఖముగా నుండగా మెడ చాచి నట్లుండగా ఈ శిరఃకర్మ యగును. కొంచెముగా పైకి లేచనెత్తుట ఉత్క్షిప్తము. పొడవైన వానిని చూచు నపుడు ఆకాశమును దర్శించు నపుడు సూర్య చంద్ర నక్షత్రములను దర్శించు నపుడు ఉల్లోకనము ఉండు గావున ఉత్క్షిప్తము అయినది. కొన్ని నామ నిర్దేశములు స్పష్టార్థములుగ నుండును. ఈ పదము అట్టిది.

౧౩. లోలిత ము. :- శిరమును అంతటా లోలన మొనరింపగా బాగుగా భ్రమింపజేయగా లోలితము అను శిరఃకర్మ యగును. శిరము ఏకస్థానమున నుండక అనవస్థితముగ అంతటా భ్రమణము పరిభ్రమణము కలది అయినపుడు ఈ పరిలోలిత కర్మయగును. మదము కలిగినపుడు మూర్ఛ వచ్చినపుడు రోగము పట్టినపుడు స్వప్నము వచ్చినపుడు భూతావేశము కలిగినపుడు లోలిత శిరఃకర్మ యుండును లోలనము ఉన్నందున శిరస్సు పరిలోలిత మగును.

ఇట్టి పదుమూడు శిరఃకర్మలు నిరూపితములైనవి.

అన్య భేదాః

ఏభ్యోఽన్యే బహవో భేదా లోకాభినయ సంశ్రయాః
తేచ లోకస్వభావేన ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః
ఇత్యుక్తం మునినా యత్తదనుతంత్రవిధాయిభిః
కల్పితాః కతిచిత్ భేదాః బ్రూమస్తానపరానపి

ఈ చెప్పిన వాని కన్న నానావిధములగు భేదములను కొందరు అంగీకరింతురు. అవన్నియు లోకాభినయమును అనుసరించి యున్నవి. లోకాశ్రయము లైన విశేషములను లోక స్వభావము ననుసరించి గుర్తింపవలెను ప్రయోగింప వలెను. ప్రయోక్త లావిధముగా గుర్తించి లోకాభినయముల ప్రకారముల లోని శిరఃకర్మలను ప్రయోగింప వచ్చును. ఇట్టి భావమును భరత ముని నాట్యవేదమున సూచించెను. భరతుని అనుసరించి నాట్య తంత్రమును అనుసరించిన భావుకులు ఇంకను నానా శిరఃకర్మలను పరిగణించిరి. అట్లు పరిగణితము లైన యితరము లైన శిరోభేదము లను కూడ నిరూపించుట యుక్తము.

సమం నైరాజితం తిర్యక్నతం తిర్యఙ్నతోన్నతం ४० 
పార్శ్వాభిముఖమున్నీతం సకంప పరివాహితం
సకంపధుత సామాన్యదుద్ధుతం పార్శ్వకంపితం
పార్శ్వాకంపిత మిత్యేకాదశ భేదాః ప్రకీర్తితాః

నాట్య తంత్రి విధాతలు ఈ చెప్పిన త్రయోదశ కర్మల కన్న అధికముగా పదునొకండు శిరః కర్మలను పరిగణించిరి. వానిని నామ సంకేతమున నిర్దేశించి లక్షణము చెప్పుటయు విని యోగము ప్రదర్శించుటయు యుక్తముగనుండును. వాని పేరులు ఈ విధముగ నున్నవి.

సమము — నైరాజితము - తిర్యక్నతము
తిర్యఙ్నతోన్నతము - పార్శ్వాభిముఖము - ఉన్నీతము
సకంపపరివాహితము - సకంపధుతము - ఉద్ధుతము
పార్శ్వకంపితము - పార్శ్వాకంపితము.

### అన్యశిరోభేదాః

ప్రకృతిస్థం సమం ప్రోక్తం యతో భేదా వినిస్సృతాః
తత్స్యాత్సమనఖ ధ్యాన స్వభావాభినయాదిషు ౪౫

ప్రదక్షిణక్రమేణైవ యత్రారాత్రికవద్భ్రమః
నైరాజితం నృపాదీనాం తత్స్యాన్నీరాజనావిధౌ
తిర్యక్నతం యథార్థాఖ్యం చింతాపీడాదిషు స్మృతం
తిర్యఙ్నతోన్నతం తద్వత్సుభ్రువాం విభ్రమాదిషు
పార్శ్వాభిముఖమన్వర్థ సంజ్ఞం పార్శ్వప్రలోకితే ౫౦

ఉన్నీతం సకృదున్నీతే పృచ్ఛాదౌ సముదీరితం
కంపితేన సమాయోగం సంప్రాప్తే పరివాహితే
లాస్యే తాలలయే ప్రోక్తం సకంపపరివాహితం
సకంపధుతమప్యేవం ——— జనైః కృతం
ధుతమే వేద్ధుతం కించిదుత్తానితముఖం భవేత్ ౫౫

కందుకోల్లాలనాందోల సంచారాది ప్రలోచనే
కంపితాభ్యంచితాభ్యాం స్యాదర్ధం పార్శ్వముఖం యదా
స్యాత్పార్శ్వకంపితం పార్శ్వాకంపతం చ క్రమాత్తదా
ప్రశ్నతాలలయోల్లాస హాస్యాదౌ తద్ద్వయం మతం

### అన్యశిరోలక్షణములు.

౧. సమము:- ప్రకృతిస్థ మగునది సమ శిరఃకర్మ. దీని నుండియే భేదములు వెలువడినవి. ధ్యానాభినయ స్వభావాభినయము లందిది వినియోగము పొందును.

౨. నైరాజితము :— నీరాజన మిచ్చు విధమున ఆరాత్రికము త్రిప్పు విధమున శిరము ప్రదక్షిణ క్రమముననే సంచలిత మయినచో నైరాజిత మగును. రాజ గురు దేవాదులకు సమర్పించు నీరాజనా విధానమున నిది వినియుక్త మగును.

౩. తిర్యక్తతము :- అడ్డముగా సాగిన శిరము తిర్యక్తతము. ఆ పదమే యీ యర్థము నిరూపించును. ఇది చింతా పీడాదు లం దుపకరించును.

౪. తిర్యఙ్నతోన్నతము :- అడ్డముగా సాగి వంగి పైకి సమున్నతముగా సాగు శిరము తిర్యఙ్నతోన్నతము ఇది కేవలము వనితల విభ్రమాదులలో విలాసరీతులలో ప్రసరించును. ఇది పురుషులకు గాదు.

౫. పార్శ్వాభిముఖము :- పార్శ్వమున కభిముఖముగా నుండు శిర మని యన్వర్థనామము. పార్శ్వ విలోకనమున నిది యుపక రించును.

౬. ఉన్నీతము :- ఒక పర్యాయము శిరమును పైకి యెత్తుట, ప్రశ్న యడుగుటలో నిది విని యుక్త మగును.

౭. సకంపపరివాహితము :- శిరఃపరివాహము ప్రసారము కంపితముతోను కూడు కొనిన దయినచో సకంపపరివాహిత మగు ననుట సార్థకము. లాస్యవిధానమున తాల లయ విధానమున నీ శిరఃకర్మ యుపకరించును.

౮. సకంపధుతము :- కంపముతో కూడుకొనియుండునట్లుగా సాధారణజను లొనరించు శిరోధూననము సకంపధుత మను శిరఃకర్మ యగును.

౯. ఉద్ధుతము:- ధుత మగు శిరమె కొంత యుత్తానిత ముఖ మగు నేని యుద్ధుత శిరఃకర్మ యగును. బంతియాట లాలనము ఆందోలనము మొదలగు వాని సమాలోచనమున నీ శిరఃకర్మ సహకరించును.

౧౦. పార్శ్వకంపితము:- పార్శ్వముఖముగా నుండి సగముగా కంపిత మయిన పార్శ్వ కంపిత మగును.

౧౧. పార్శ్వాకంపితము:- పార్శ్వముఖముగా నుండియు కంపితము కాక అంచితముగనె శిరముండు నేని పార్శ్వాకంపిత మగును. ఈ రెండు శిరఃకర్మలును ప్రశ్న — తాలలయ — ఉల్లాస హాస్యాదులలో వినియుక్తము లగును.

ఈ పదునొకండు శిరఃకర్మలు లోకతంత్రాను సారములని నాట్య తంత్రవిదు లనిరని యున్నదే కాని ఎవరీ కర్మల నిరూపించిరో ఎందు నిరూపించిరో మూలము కానవచ్చుట లేదు. అసాంప్రదాయికముగా లోకమున వ్యాపించిన విశేషములను సమీక్షించి శాస్త్రీయత సంపాదించుట యుచిత మని నాట్యవేదమున భరతు డనెను. అట్టి భావమున నీ జాయపతి లోకమున నున్న వాని నిట్లు శాస్త్రీయముగ పరిష్కరింప దలచుకొనెను. ఇట్టి విశేషము లింక నీ గ్రంథమున గలవు.

## ఉపాంగములు.

నాట్యసంగ్రహముగా నెన్నదగిన శిరో — హస్త — వక్షః పార్శ్వ — కటి — పాదములలో నింతవరకు మొదటి దయిన శిరమునకు సంబంధించిన భేదములు లక్షణములు వినియోగములు ప్రతిపాదితములయినవి. ఇటుపై శిరమునకు సంబంధించిన అంగములగు

నేత్ర - భ్రూ - నాసిక - ఓష్ఠ - కపోల - చిబుకములను ఆరు ఉపాంగములను నిరూపింపవలెను. వాని నిరూపణ మయినచో శిరోవిశేషము లన్నియు నిరూపించి నట్లగును. కావున నిచట మూలములోని విలోచన పదముచే దృష్టియొక్క విశేషములను సంకేతించుట యావశ్యకము. శిరమునకు నేత్రమునకు సంబంధసూచకమగు వచనము గ్రంథములో త్రుటితమయి యుండవలెను. ఇందు అనేక స్థలములలో గ్రంథపాతమున్నది. అట్టిస్థలములందనుగతముగానుండవలయు విషయములను నాట్యవేదమునుండి గ్రహించుట యుచితము.

## దృష్టి విశేషములు.

దృష్టి విశేషము లన్నియు ముప్పదియారు "షట్‌త్రింశ దేతా దృష్టయః" వీనిలో రస దృష్టు లెనిమిది. స్థాయి దృష్టు లెనిమిది. సంచారి దృష్టు లిరువది. రసములందు రస దృష్టులు స్థాయి భావము లందు స్థాయి దృష్టులు సంచారు లందు సంచారి దృష్టులు నియతములై యున్నవి. వీనిలో ముందుగా రస దృష్టు లిందు సంకేతితము లయినవి. స్థాయి దృష్టులు సంచారి దృష్టులు సంకేతితము లయినవి.

కాంతా హాస్యాంచితా చైవ రౌద్రీ చ కరుణాంచితా ౨౦
తథా వీరాద్భుతే స్యాతాం బీభత్సా సభయానకా
రసోత్పత్తి క్రమేణాష్టౌ మయోక్తా రసదృష్టయః
స్నిగ్ధా హృష్టా తతః క్రుద్ధా దీనా దృప్తా సవిస్మితా
జుగుప్సిత భయాంచితే స్థాయిష్వేవం దృగష్టధా
శూన్యా లజ్జాన్వితా శ్రాంతా విషణ్ణా మలినాభిధా ౨౧
శంకితా ముకులా మ్లానా కుంచితా లలితా తథా
అభితప్తార్ధముకులే విభ్రాంతా సవితర్కితా
ఆకేకరా వికోశాఖ్యా జిహ్మ త్రస్తాఽథ విప్లుతా
మదిరా చేతి దృష్టీనాం వింశతి ర్వ్యభిచారిషు.

౧. రసదృష్టులు

కాంత - హాస్య - రౌద్ర - కరుణ - వీర - అద్భుత - బీభత్స - భయానక.

౨. స్థాయిదృష్టులు

స్నిగ్ధ - హృష్ట - క్రుద్ధ - దీన - దృప్త - విస్మిత - జుగుప్సిత - భయానక.

రసోత్పత్తి క్రమమున రస దృష్టులు నిరూపితములు. రసాను క్రమమున నుండు స్థాయి భావ క్రమానుసారముగా స్థాయి దృష్టులు నిరూపితములు.

3 వ్యభిచారిదృష్టులు.

శూన్య - లజ్జాన్విత - శ్రాంత - విషణ్ణ - మలిన - శంకిత - ముకుల - మ్లాన - కుంచిత - లలిత - అభితప్త - అర్ధముకుల - విభ్రాంత - వితర్కిత - ఆకేకర - వికోశ - జిహ్మ - త్రస్త - విప్లుత - మదిర.

అను నీ యిరువది దృష్టులు వ్యభిచారి భావము లందు సంగతములగు దృష్టి విశేషములు. ఇక వీని లక్షణ వినియోగములు నిట్లు గుర్తించునది.

రసదృష్టయః

హర్షోత్పన్నా ప్రసాదోత్థా కామం కామవశా వశా ౭౦
శృంగారేఽభిమతా కాంతా భ్రూక్షేపా పాంగ సంగతా
చింతా భ్రాంతాల్పతారా దృగాకుంచిత పుటా క్రమాత్
కక్షాదిస్పర్శపాతాదౌ హాస్యే హాస్యా హి సంగతా

ఈ రెండు శ్లోకములు శృంగార దృష్టిని హాస్య దృష్టిని నిరూపించుచున్నవి. అనంతరము రస దృష్టులను స్థాయి దృష్టులను వ్యభిచారి దృష్టులను నిరూపించు శ్లోకములు త్రుటితము లయినవి. ఇచట గ్రంథపాత మధికముగా నున్నది. ఇచట లుప్తము లయిన విషయాంశములను నాట్యవేదము నుండి నిరూపించుట సముల్లేఖించుట సముచితము.

ఈ కాంతాదు లెనిమిది రస దృష్టులు ఆయా రసములకా యా దృష్టు లనుగతములు. కాంతాది నామములె వాని స్వరూపము కొంత చెప్పగలవు. అయినను లక్షణ కథనమున విశేష స్వరూపము గోచరించును. ఈ కాంతాదులు శృంగారాదులకు సంబంధించి యున్నవి. రసమునకు క్రమనిర్దేశములో విశిష్ట భావమున్నది. రసము వలన రసాంతరము నిష్పన్నమగుట రసములలో నున్నది. దృష్టి వలన దృష్ట్యంతర ముత్పన్నమగుట దృష్టులలో లేదు. అందుననె భరతు డనిర్దిష్ట క్రమముననె దృష్టులను నిరూపించినాడు. ఈ దృష్టులలో శాంత దృష్టి లేదు. స్థాయి భావ దృష్టులలో శమ దృష్టిలేదు. లక్షణము లేదు. సంకేతము లేదు. ఇట్టి నిర్దేశమున నొక భావ విశేష మవభాసించును.

సంచారి దృష్టులలో మొదట నమంగల ప్రాయమగు శూన్య దృష్టి యున్నది. వ్యభిచారి భావముల పరిగణనములో మొదట నమంగల ప్రాయమగు నిర్వేద మున్నది. అమంగల ప్రాయమును గూడ ప్రథమమున నిరూపించుటచే నిర్వేద మొకప్పు డొకచోట స్థాయిత్వము పొందగలదని సూచిత మగును. అందుననె నిర్వేద స్థాయికమగు శాంతమను నవమ రసము కలదని భరతు డనుట సంగతము. దృష్టులలో మొదట శూన్య దృష్టి నిరూపించు

టలో గూడ ఇట్టి భావమునె గుర్తింప వచ్చును. ఇట్టి విషయ వివేకము నాట్యవేదమున రసమీమాంసా ప్రఘట్టమున నిరూపిత మయినది.

స్థాయి దృష్టి సంకేతము రస సృష్టి లక్షణమును సుగమ మొనరింపగలదు. కావుననే రస దృష్టి సంకేతానంతరము స్థాయి దృష్టి సంకేత మున్నది. దృష్టి విధాన ప్రసక్తిలో సామాన్య దృష్టుల నన్నిటిని సంకేతించుట యుక్తము. అవి యన్నియు భావ మూలములు కదా!

దృష్టు లన్నియు ముప్పది యారు. ఇట్లనుటచే న్యూనాధిక సంఖ్యానివృత్తి కలుగును. ప్రత్యభిజ్ఞా దర్శనమున నంగీకరించు షట్త్రింశత్తత్త్వములకు వీనికి సంబంధము లేకున్నను సంఖ్యా సాదృశ్యము దానిని స్మృతికి దెచ్చును. రసదృష్టి రసమయ సన్నివేశ సౌందర్యము నావిష్కరించును. స్థాయి దృష్టి రసీభావ యోగ్యత నావిష్కరించును. ఇతర దృష్టులు భావావిష్కారమునకు సమర్థములు.

ఈ దృష్టి విధాన మంతయు నానా భావ రసాశ్రయము. చిత్త వృత్త్యాత్మకము లయిన భావ రసములు సముల్లసితములై సంవిన్మార్గము లయిన నానేంద్రియము లందు విచిత్రతత నాపాదింప గలవు. ఇట్టి విచిత్రిత చక్షుః పరిజ్ఞా దర్పణమున సమధికముగా సంక్రాంత మగును. అది యంతయు దృష్టుల యదృష్టము. వీనిలో నొక్కొకచో నొక్కొక చమత్క్రియకలదు. అయిన నింతమాత్రమె యిది యను వ్యవస్థలేదు.

౧. శృంగారదృష్టి:- కాంతదృష్టి హర్ష సముత్పన్నముప్రసాద జన్యము. మిక్కిలి కామవశము అవశము నయిన దృష్టి కాంతదృష్టి యగును. ఈ దృష్టి శృంగారమున నభిమతము. ఈ దృష్టిలో

భ్రూక్షేపము, అపాంగములు సంగతములై యుండును. ఇష్ట ప్రాప్తి వలన గలిగిన హర్షమును కాంతదృష్టి సూచించును. మనఃప్రసన్నతను సూచించును. అత్యంతము మన్మథ భావముతో నుండును. ప్రణయ హేతుకము లయిన కోపామర్షములు కూడ దీనిచే వ్యక్తము లగును. ఇది శృంగార సంగత మనుట నాట్య హృదయుల కిష్టము. కేవల దృష్టి మాత్రమున నిది శృంగార సంగము కలది కాదు. తారా కర్మలు పుటకర్మలు శిరఃకర్మలు దీనికి సహాకారముగా నుండవలెను. ఇట్లై యున్నిట గ్రహింపవలసి యున్నది.

౨ హాస్యదృష్టి :- చిత్రిముగా నుండును. భ్రాంతముగానుం డును. చిన్న చిన్న కన్ను పాపలతో నుండును కన్నుపుటము లాకుంచితములగును. ఇట్టివన్నియు నిందు క్రమముగా కూడుకొనును. కక్ష భాగములు స్పృశించుట మొదలగు వాని గూడుకొనిన హాస్యమున నీ హాస్యదృష్టి యుండును. కను పుటములు క్రమముగా నాకుంచితము లగుట తారక లల్పములు విభ్రాంతములు వ్యాకులము లగుట యిందలి ధర్మములు. కుహకాభినయమున నిది యుపకారి, వంచన మొనరించుటలో మోసగించుటలో మాయ చేయుటలో పరిహాసించుటలో నిది సహాకారి. కపట వికృత విధానములు హాస్య ప్రాణములు. కావున దృష్టిలో గూడ కపట కృత్రిమరీతులుండును.

ఇటుపై గ్రంథపాత మధికముగ నున్నది. లుప్త గ్రంథములలోను అవశిష్ట రసదృష్టులు - స్థాయి దృష్టులు - సంచారి దృష్టులు, దృష్టుల వినియోగములు తారాకర్మ-దర్శన ప్రకారములు పుటకర్మ భ్రూకర్మ - నాసాకర్మ విశేషము లుండవలెను. వాని విషయ పరిజ్ఞానమునకు నాట్యవేద ద్వితీయ భాగము అభినవ భారతీ వివృతిఅభినవ భాష్యము నుండి కొంత వ్రాయుట యావశ్యకమయినది.

౩. రౌద్రరసదృష్టి :- రౌద్రీ. రౌద్రరసమున రౌద్రీదృష్టి సంగతము. ఇది క్రూరము రూక్షము అరుణము ఉద్వృత్తము పుటములు తారకలు నిష్టబ్ధము లగును. క్రోధావేశమున తారకలు అట్టే కదలక యుండును. భ్రుకుటీ కుటిలముగ నుండుట యీ దృష్టి క్రియ రసదృష్టు లందరియం దేకవిధముగ నుండవు. వారి వారి సత్త్వభేదమున నవి వేరువేరుగా నుండును.

౪. కరుణరసదృష్టి :- కరుణ. ఈ దృష్టిలో కనుల పై పుటలు వ్రాలి యుండును. కన్నులు బాష్పములతో గూడి యుండును. తారకలు దుఃఖ మంథరములు. దృష్టి నాసాగ్రానుగతము. ఇట్లున్న దృష్టి కరుణ దృష్టి. ఈ దృష్టిలో ని విశేషములై కాక ఇతరములు నుండును. ఉపాత్తము లగు నివి ముఖ్యము లని భావింప వలెను.

౫. వీరరసదృష్టి :- వీర. వీరదృష్టి దీప్తము వికసితము క్షుబ్ధము గంభీరము. రెండు తారకలు సమముగా నుండును. వీర రసము లోని భేదముల ననుసరించి వీరదృష్టులు కూడ భేదములు కలవి యగును. ఇట్లే యితర రసాశ్రయ దృష్టు లందును పరిగ్రాహ్యము. ప్రయోగ మొనరించు నటుడు తత్తద్భావావేశము మనసునకు దెచ్చుకొని మనో వేగమును నిగ్రహించుకొని దృష్టి సంక్రాంత మొనరించి నప్పుడే రసదృష్టులు వెలువడును.

౬. అద్భుతరసదృష్టి :- అద్భుత. ఇందు పక్ష్మాగ్రము లాకుంచితము లగుట తారక లాశ్చర్యము కలవై యుద్వృత్తము లగుట యుండును. దృష్టి సౌమ్యముగ నుండును. ప్రాంత భాగము లందు వికసితమై యుండును.

౭. బీభత్సరసదృష్టి :- బీభత్స. ఇందు కనుపుటము లపాంగములు కుంచితము లగును. తారకలు తిరుగును. ఉపప్లుతములగును.

చెదరుగా నుండు. కను ఱెప్పలు సంశ్లిష్టములు స్థిరములు నగును. జుగుప్సావహ మయిన వస్తువును చూచినపుడు పత్మ్రపుటాపాంగ తారకలు సంకోచము కలవై బీభత్సదృష్టి నీయగలవు. హాస్య బీభత్సములలో బాహ్య దృశ్యములు వికాస వికారముల గలిగించును. వికాసాత్మకవృత్తి సోల్లాసముగా చేష్టానుగత మగును. వికాశాత్మక వృత్తి చిత్త సంకోచము కూర్చును. సర్వ చేష్టల సంపత్తి మనోవ్యాపార పురస్సర మనుట అవిస్మార్యము.

౮. భయానక రసదృష్టి :- భీతదృష్టి. ఇందు నేత్రపుటములు ప్రోద్వృత్తము లగుట గిర గిర తిరుగుట యుండును. ఒకప్పుడట్టి నిశ్చలము లగును. తారకలు స్ఫురించును. తారాపుటకర్మలతో గూడు కొనిన దృష్టి భయము సూచించును. చకితముగా నుండును. ఇది భీత దృష్టి.

ఇవి యన్నియు రసజన్య దృష్టులు. వీనిని రసము లందే వినియోగింప వలెను. "రసజాస్తు రసేష్వేవ" ఇతర దృష్టులకును రసము లందు ప్రయోగ ముండును. ఈ దృష్టి విశేషములకు ఇతరము లందు ప్రయోగము ఉండదు.

శాంత దృష్టి.

"నాసాగ్రాసక్తా నిమిషా తథాధోభాగ చారిణీ
ఆకేకర పుటాచైవ శాంతా దృష్టి ర్భవేదసౌ"

శాంత రసమునకు శాంత దృష్టి నాట్య వేదమున పాఠాంతర శ్లోకమున నిరూపిత మయినది. రెప్పపాటులేని యీ దృష్టి నాసాగ్రగతమై క్రింది భాగమునకు సంచరించునదై ఆకేకరపుటములతో నుండును.

## స్థాయి దృష్టులు.

స్నిగ్ధ హృష్టాది స్థాయి దృష్టులలో నుద్దిష్ట మయిన క్రమమున నియత భావ మున్న దన నక్కర లేదు. శృంగారము సర్వ ప్రాణి సులభ మగుటచే రతి సర్వ వ్యక్తుల కపరిహార్యమగుటచే రతి దృష్టి యయిన స్నిగ్ధ దృష్టిని మొదట నిరూపించుట యుక్తము కావచ్చును.

౧. స్నిగ్ధదృష్టి:- ఇదియె రతిదృష్టి. ఇందు నడిమి భాగము వికసనముతో మధురముగా నుండును. కనుపాపలు చిరునగవుతో నుండును. సాభిలాషముగా నుండును. ఆనందాశ్రువులతో నుండును. స్నిగ్ధమై చిక్కనై మనోహరముగా నుండును. ఇది రతిభావజన్య మగు దృష్టి.

౨. హాసదృష్టి:- ఇది హృష్టదృష్టి. హసితగర్భము చంచలము. తారకలు కన్నులు చికిలింతలతో నుండును. కన్ను తెరచుటలు మూయుటలు, రెప్ప మూతల సందుల నుండి దాగుడు మూతల చూపులు, తొంగి తొంగి చూపులు, కొక్కిరింపు చూపులు హృష్ట దృష్టులు.

౩. క్రోధదృష్టి:- క్రుద్ధ. ఇందు కను బొమలు కుటిలములై కూడు కొనును. బొమముడి సమరీతిలో నుండక చిడిముడిపాటు కూడి వక్రముగ నుండును. దృష్టి రూక్షము తీవ్రము కనుపుటములు స్థిరములుగా నున్నను తిరుగుళ్లు పడును. తారకలు గిర్రున తిరుగును.

౪. దీనదృష్టి:- ఇది శోకదృష్టి. నేత్రముల పై రెప్ప కొంతగా జారి యుండును. తారకలు కొంత కొంత బెదరి వ్యగ్రములగును. ఈ దృష్టిపరిసారము మందము.

౫. దృప్తదృష్టి:- ఉత్సాహదృష్టి. ఇది సత్త్వము స్పష్టము చేయును. అంతర్బలము వ్యక్తము చేయును. మనోబలము సూచించును. దేహదార్ఢ్యమును స్ఫురింప జేయును. తారకలకు నిలుకడ యుండును. కన్ను విప్పారి యుండును. ఈ దృష్టి స్థిరము వికసితమును.

౬. సవిస్మిత:- విస్మయదృష్టి. తారలు గిర గిర తిరుగుట యుద్వృత్తము లగుట. కన్నులు విమలములుగా నుండుట యీ దృష్టి రూపము. కనుపుటలు హర్షముతో నుండును. ఒకప్పు డతికి కొన్నట్లున్నవై నష్టములుగా నుండును. వికసనముతో నుండును. ఈ రీతి సర్వము విస్మయసూచకము.

౭. జుగుప్సిత:- జుగుప్సాదృష్టి, ఇందు కనుఱెప్పల రీతి సంకోచముతో నుండును మూతలు పడి యుండును. పక్ష్మపుటములు విప్పారవు తారకలు మీలనము పొందును రెప్ప లల్లా ర్పధికము జుగుప్సలో చిత్తసంకోచము కలుగగా పుట సంకోచమున దృష్టియు సంకోచముతో నుండుట స్వాభావికము.

౮. భయదృష్టి:-భయాంచిత ఇందు నేత్రముల యుభయ పుటములు విప్పారి విస్ఫారితములై యుండును తారకలు భయ కంపితములు, భయదృష్టి నడిమి చూపులో నిలబడదు. తారకలు మధ్యభాగమున నుండక అటు నిటు చెదరి పోవును. భయాన్వితులు నేరుగా జూడ జాలరు.

దృష్టివిదు లీ దృష్టుల నిట్లే గుర్తించిరి. రసదృష్టులుస్థాయి దృష్టులు సామాన్యముగా నేకవిధమున నుండుటను లక్షణవాక్యము

సూచించును. అయినను రసదృష్టులు స్థాయిదృష్టులు అని వేరుగా నిర్దేశించుటయె సముచితము. స్థాయి దృష్టులలో తారాకర్మలు పుటకర్మలు బహుళముగా నుండవు. రసదృష్టులలో నుండును. విభావ కర్మలు బహుళముగా నుండుట లేక పోవుటలు రసభావ దృష్టులు భేదహేతువులు. స్థాయి దృష్టులలో రసీభావమునకు దగిన చిక్కణ ధర్మ ముండదు. వలసినంత స్నిగ్ధతయు నుండదు. రస దృష్టులలో నది యుండును.

## సంచారి దృష్టులు.

సంచారి దృష్టులకు నియతవిషయ మున్నది. ఒక్కొక దృష్టి కొక్కొక వినియోగ మిష్టము. అయిన నదియె నియతము కాదు. అది ప్రచురము. ఆ దృష్టి నా విధమున నా విషయమున వినియోగించిన సహృదయులు రమ్యతను భావింతురు. సంచారి భావములు ముప్పదిమూడయినను సంచారిదృష్టు లిరువది యనియే సంఖ్యాతము లయినవి. ఈ దృష్టులును ముప్పదిమూడన వచ్చును, అన లేదు. రసములు తొమ్మిది యయినను రసదృష్టు లెనిమిది. స్థాయి భావములు తొమ్మిది యయినను స్థాయి దృష్టు లెనిమిది. తొమ్మి దన లేదు. సంచారిదృష్టు లిరువదియె యనెను. ఇతరము లిందంతర్భవించు నని భావము. సంచారిదృష్టుల స్వరూప మిట్లుం డును.

౧. శూన్యదృష్టి :- ఇందు కను పాపలు కను పుటములు ఎగుడు దిగుడుగా నుండవు, దృష్టి కంప రహితము. దృష్టిలో లక్ష్య మేమియు నుండదు. శూన్య దర్శనము బాహ్యార్థముల నీ దృష్టి గ్రహింపదు. ఈ దృష్టి క్షామము నిరుత్సాహము ఇట్టిదిది శూన్యదృష్టి. చిత్తము

నందలి చింత నీ దృష్టి సూచించును. చింతానూ చకదృష్టులు నానా కలవు. వానిలో నిది గణనీయము.

౨. మలినదృష్టి:- ఇందు పక్ష్మములు ఱెప్పలు కదలును. కనుపుటము లత్యంతము ముకులములై యుండవు. నేత్రాంతములు మలినములుగా నుండును. కనుతారలు విభ్రాంతములు. మనసు లోని సాలోచనత నిది సూచించును.

3. శ్రాంతదృష్టి:- ఇందు శ్రాంతి యున్నది. శ్రమ విశేషమున పక్ష్మపుటములు మ్లాన మ్లానములుగా నుండును. ఈ దృష్టి క్షామ క్షామము తారలు దిగజారి యుండును. చల ప్రచలములు కావు మందకొడిగా నుండుట గుర్తింప వలెను. శ్రమవలని యార్తిలో స్వేదో దయమున నీదృష్టి ప్రయోగ ముండును.

౪. లజ్జాన్వితదృష్టి:- ఇందు పక్ష్మాగ్రములు కుంచితము లగుట, దిగువభాగమునకు వంగినట్లు వ్రాలినట్లు దిగజారిన ట్లుండుట, తారకలు త్రపావశమున నధోగతము లగుట యుండును. లజ్జావిని యోగమున నిది లలితముగ నుండును.

౫. గ్లానదృష్టి:- ఇందు కనుబొమ్మలు కనుపుటములు కను రెప్పలు వాడియుండును. శిథిల శిథిల మంద మంద సంచార ముండును. కను తారలు శ్రమ సంచలనము పొందును. అవి నేరుగా సూటిగా చొచ్చుకొనవు.

౬. శంకితదృష్టి:- శంక యుదయించినపుడు భావము నందు స్థిరత యుండనట్లు ఈ దృష్టియందును స్థైర్యముండదు. కించిచ్చలముగా నుండును. ఒకింత స్థిరముగా నుండును. ఒకప్పుడు నేరుగా సూటిగా నెదురుగా సాగును. ఒకప్పు డడ్డముగా నాయతముగా ప్రసరించును.

ఒకప్పుడు తారలు మూఢముగా నుండుటయు మరి యొకప్పుడు చెదురు తనమున నుండుటయు నిందు సహజము.

౭. విషాదినిదృష్టి:- ఇందు పుటములు విస్తీర్ణములు ప్రాంతములు పర్యస్తములు తారలు నిష్టబ్ధములుగా నుండును. విషాదోదయమున నీదృష్టి యుండును. "విషాదార్థే విషాదినీ"

౮. ముకులదృష్టి:- ఇందు పక్ష్మములు సగము సగము స్ఫూర్తము లగును. సమాశ్లిష్టము లగును. ఊర్ధ్వపుటములు ముకులనము పొంది యున్నట్లుండును. తారలు సుఖోన్మీలనమున నుండును. కన్ను తెఱచుట సుందరముగ నుండును. సుఖార్థ సన్నివేశములో ముకుల దృష్టి మోహనము.

౯. కుంచిత దృష్టి:- కనుపుటము లాకుంచితము లగుట పక్ష్మాగ్రములు నికుంచితము లగుట, తారకలు కుంచితములై యుండుట దృష్టి సముల్లాసమున నుండక సన్న మవసన్నముగా నుండుట కుంచిత దృష్టి స్వరూపము. అసూయితుల సనిష్టుల జూచినపుడీ దృష్టి యుండును. దుష్ప్రేక్షము చూడ వలసి యున్న నిదియె, అక్షివ్యథా వ్యాకులితుల దృ సంకుచితమె కద.

౧౦. అభితప్తదృషి:- వ్యథలో నిది కలుగును. ఇందు తారాసంచారము మందమందము. కనుపుటములు ప్రచలితములు. పరితాప సంప్లుతముగా నుండు నీ దృష్టి చింతలో నభిఘాతములో నభితాపములో వినియుక్తమగును.

౧౧. జిహ్మదృషి:- ఇది లంబిత మలసము. పుటములు కుంచితములు. నిరీక్షణములు ఎడగా పెడగా మెల మెల్లగా నుండును. దృష్టి

నిగూఢము తారలు గూఢములు. అసూయలో జడతలో నలస తలో నిది వినియుక్త మగును. అసూయ జడత అలసత మూడును మూడు విధములు. ఈ దృష్టి యొకటి మూట వినియుక్త మయిన తత్సమయ రీతినీతుల ననుసరించి యిందు విశేషము గుర్తింప వచ్చును.

౧౨. లలితదృష్టి :- ఇది మధురము. ముచ్చటగా నుండును. ప్రాంత భాగములు కుంచితములై యుండును. కనుబొమ లెగుర వేయుట యుండును. చిరునగవుల కలయిక యుండును. కన్నుల చికిలింతలె యిందలి స్మితసాహిత్యము నిరూపింప గలవు. ఇందు మన్మథవికారము లున్నవి. ప్రేమకాంక్షావిశేషము లున్నవి. స్మిత మున్న దని భావ మున్న దని లలితదృష్టి యంతట శృంగారగంధి కాదు. వినియోగవిషయమె దీని నిరూపించును.

౧౩ వితర్కితదృష్టి :- సందేహమున నానాకల్పనము లోన రించుట వితర్కము. వితర్కము వలన కనుపుటము లుద్వర్తితము లగును. తారక లుత్ఫుల్లము లగును. దృష్టి యధోగతమై వికాస ముతో విచారముతో నుండును. నానావిధముగా నూహించు నపుడు సంకల్ప వికల్పములు మనసులో పొడకొని నపుడు వివిధము లగు ఊహాపోహ లుదయించి నప్పుడు వితర్కితదృష్టి ప్రయోగ మావశ్య కము.

౧౪. అర్ధముకులదృష్టి :-దీనిలో పక్ష్మములు సగము సగము వికాసము పొందును. కనుపుటములు హ్లాదవశమున ముకులము పొందును. తారకలు లులితము లగును. అంత స్మిత ముండును. గంధ స్పర్శప్రభృతు లాహ్లాద మొదవింపగా నీ దృష్టి కలుగును.

౧౫. విభ్రాంతదృష్టి:— భ్రాంతచిత్తు డయిన వాని కీ దృష్టి కలుగును. నేత్రము లుత్ఫుల్లములు వికసితములు విస్తీర్ణములు నగును. తారకలకు నిలుకడ యుండదు. దృష్టి భ్రమవ్యాకులము. ఇపు డిట్లయినది. ఇంక నేమగునో? యని దృష్టి శంకాతంకములతో నుండును. ఆవేగసంభ్రమవిభ్రమములలో నిది వినియోగము పొందును.

౧౬. విప్లుతదృష్టి:— ఇందు కనుల పుటములు ప్రస్ఫురితములు స్తబ్ధములు పతితములు నగును. ఈ ధర్మములు మఱల మఱల గలుగును. చాపలమున విప్లుత ముపకారి ఉన్మాదమున సహకారి. దుఃఖమున సహచారి. ఆర్తిలో మరణములో దీని వినియోగ మున్నది.

౧౭. ఆకేకరాదృష్టి:— ఇందు కనుపుటములు కొలకు లాకుంచితము లగును. అరమూతలతో కనులు సంగతము లగును. తారలు మరల మరల వ్యావృత్తము లగును. దూరాలోకమున విచ్ఛేదప్రేక్షితమున నిది యుపకరించును. ఆగి యాగి చూచుట కీ యరమూతలుండవలెను. చూచుటకు వలను పడని వానిని చూచుట కీ వంపు చూపుపకారి.

౧౮. వికోశదృష్టి:— కనుపుటములు కోశములు విడిపడి యుండుట, దృష్టి సంఫుల్లముగా నుండుట, నిర్నిమేషముగా నుండుట, తార లనవస్థితములై యుండుట యిందలి విశేషములు. ఇది యొక విధముగ విస్ఫారితదృష్టి విబోధగర్వామర్షమతులలో నిది వినియుక్తమగును.

౧౯. త్రస్తదృష్టి:— ఇందు భయము వలన కనుపుటములు తిరుగుళ్లు పొందును. తారకలు కంపోత్కంపములు కల వగును

దృష్టిమధ్యభాగములు సంత్రాసమున ఉద్వృత్తగా నుండును. "త్రస్తా త్రాసే" భయము నభినయించుట కిది యావశ్యకము.

౨౦. మదిరాదృష్టిః— ఇందు కనుమధ్యము లాఘూర్ణితములు నేత్రాంతములు క్షామ క్షామములు, అపాంగములు, వికసితములు నగును. ఇది మదిరాదృష్టి. మద్య మద కృతమయిన విశేషము మూడు విధములు. తరుణ మదము మధ్య మదము అధమ మదము నని. తరుణమదకృత మదిరాదృష్టి నిరూపితము. మదకృత సన్నివేశము లలో మదిరాదృష్టి యుపకారి. "మదిరా చ మదేష్వితి" మధ్యమ మదములో కనుపుటము లాకుంచితము లగుట తారకలు లులితము లగుట యుండును. ఇది మదాభినయనమున నుపకారి. అధమమద దృష్టి సనిమేషము ఒకప్పు డనిమేషము ఒకప్పుడు క్రిందు చూపు నుండును. ప్రకృతిభేదము ననుసరించి దృష్టిభేద ముండును.

ఇటుపై రసదృష్టులకు భావదృష్టులకు సంబంధించిన తారాకర్మలు—పుటకర్మలు—భ్రూకర్మలు నిరూపణీయములు.

తారాకర్మలు ౯.

భ్రమణ — వలన — పాత — చలన — సంప్రవేశన —
వివర్తన — సముద్వృత్త — నిష్క్రామ — ప్రాకృతములు.

౧. భ్రమణము:— కనుతారలు కనుపుటముల లోభాగమున మండలాకారముగ ప్రవర్తించుట భ్రమణము. వీరరౌద్రము ములలో వినియోగము.

౨. వలనము:— ముక్కోణముగా దృష్టి సంచార ముండుట వలనము. వీరరౌద్రములం దుపకారి.

౩. పాతము:- దృష్టి జారుట దిగువకు సాగుట పాతము. పాతమె పాతనము. "పాతనం కరుణే కార్యం" కరుణమున పాతన ముపయోగించును.

౪. చలనము:- తారలు కంపించుట చలనము. చలనమె సంచలనము. భయానకమున నుపకారి. భయమున అనవస్థితముగా తార లుండును.

౫. సంప్రవేశనము:- గ్రుడ్లు లోనికి ప్రవేశించుట. హాస్య బీభత్సము లందు వినియోగము.

౬. వివర్తనము:- కటాక్షదృష్టి యుండుట వివర్తనము. దృష్టి సారించి యుప్పళించుట. శృంగారలజ్జాప్రసక్తిలో నిది సహాక రించును.

౭. సముద్వృత్తము:- తారలు సమున్నతము లగుట ఉద్వృ త్తము లగుట సముద్వృత్తము. వీరరౌద్రము లం దిది యుపకారి.

౮. నిష్క్రామము:- సారించిన కను తార మరల నిష్క్ర మించుట నిష్క్రామ మనెడు కర్మ. వీరరౌద్రములలో నిది యుండును.

౯. ప్రాకృతము:- స్వభావజన్య మయిన తారా కర్మ ప్రాకృ తము. పై నిరూపించిన రసభావములలో గాక శేషభావములలో ప్రాకృత ముపకరించును.

ఈ తారాకర్మ లన్నియు లోకక్రియాశ్రయములై స్వభావ సిద్ధములుగా నున్నవి. దీని గుర్తించి రసములలో భావములలో తారాకర్మలను యోజనము చేయవలయును. "స్వభావసిద్ధమేవైతత్ కర్మ లోకక్రియాశ్రయం" లోకాశ్రయముగా వీని విజ్ఞానము స్పష్ట

మగును కాని సంస్కారాపేక్ష యుండును. స్వభావసిద్ధ మనుట సత్యమె కాని స్వభావ మాకస్మికముగ రాదు. సంస్కారబలముననె స్వభావము రాణించును.

దర్శనభేదములు.

దర్శన ప్రకారము లెనిమిది కలవు.

సమము - సాచి - అనువృత్తము - ఆలోకితము -

విలోకితము - ప్రలోకితము - ఉల్లోకితము - అవలోకితము

దర్శనవిధి సర్వభావరసాశ్రయము. ఒకే దృష్టి ఒకే భావమునకు ఒకే రసమునకు నియతము కాదు. రసభావముల విషయమున దృష్టి యనియతమును గాదు. హృదయగత స్ఫురణ మచట నాగక బహిఃస్ఫురణము పొందు నపుడు నానాదర్శనస్వభావము పొందును. సమ-సాచ్యాదు లన్నియు నేకరసమున సంగతములు కావచ్చును. సమయానుసారమున నా యా రసభావములలో నిపి వినియోగము పొందును.

౧. సమము:- తారలు సమముగా నుండునట్లు సౌమ్యభావమున జూచుట సమదృష్టి. ఇందు ప్రసన్నత గోచరించును. భావస్థితి గోచరించును. ఎదుట నున్న వారి భావమును అవక్రముగా యథాస్థితముగా గుర్తించు నేర్పు కలుగును. సమదర్శనములో భావములకు ఒడుగుడుకు లుండవు.

౨. సాచి:- ఈ దర్శనమునకె సాచీకృత మని పేరు. ఈ దృష్టిలో తారలు పక్ష్మాంతర్గతములుగా నుండును. తిర్యక్ప్రవృత్తి మయిన చూపుండును. ముబ్బంగుల చూపయినను మూడు భావముల సూచింపదు. ఒకే భావమును సూచించును. లజ్జ గోచరించును. ఆలోచనము భాసించును. భావస్వీకృతి భాసించును.

౩. అనువృత్తము:— రూపనిర్వర్ణనముతో గూడిన దృష్టికి అనువృత్త మని పేరు. ఇందు భావానువృత్తియు నున్నది. అటు నిటు దృష్టి చలనము వలనము పొందును.

౪. ఆలోకితము:— సహసాదర్శించుట. భావగత మయిన వేగక్రియ కిది నిదర్శనము. ఉబలాటము ఉద్వేగము దీని వెనుక నుండును.

౫. విలోకితము:— వెనుకకు తిరిగి చూచుట. చూచుట కుత్సుకంపడి అటుపోవు వ్యక్తి యిటుగా గ్రీవావలనమున గాని కటిసంవలనమున గాని వక్షఃపరివర్తనమున గాని చూచుట విలోకితము.

౬. ప్రలోకితము:— పార్శ్వభాగములతో జూచుట. ఆ పార్శ్వమున కీ పార్శ్వమునకు మాటిమాటికి దృష్టిసారించుట. తన భావగత యస్థిరత యితరుల భావమనముల నాకర్షించి యుద్దీపింప జేయుట ప్రలోకితార్థము.

౭. ఉల్లోకితము:— కనుబొమ లెగుర బెట్టి పైకి పైపైకి చూచుట. ఇం దాలోచన మున్నది. ఆవేగగ్రసన మున్నది. ఆశ్చర్య మున్నది.

౮. అవలోకితము:— ఇదియు నుల్లోకితము వలె నుండును. ఉల్లోకితమున పరిమిత లక్ష్యము, ఇందు విశాలమగు లక్ష్య ముండును.

పుటకర్మలు.

ఈ దర్శనవిధి ననుసరించిన పుటకర్మలు తొమ్మిదివిధములు.

ఉన్మేష – నిమేష – ప్రసృత – కుంచిత – సమ – వివర్తిత – సస్ఫురిత – పిహిత – వితాడితములు.

వీనిలక్షణములు ఈ విధమున నున్నవి.

౧. ఉన్మేషము:- కనుపుటముల విశ్లేషమునకు ఉన్మేషమని పేరు. పుటములు విడి బడి విస్ఫారితములై దూరదూర మున్నప్పు డున్మేషము. క్రోధమున నిది యుపకారి.

౨. నిమేషము:- కనుపుటముల సమాగమము. పుటములు దగ్గర దగ్గర చేరుట. క్రోధోపకారి.

3. ప్రసృతము:- పుటముల యాయామము. విస్ఫార కుండగనె దైర్ఘ్యము కల వయినపుడు ప్రసృతము. విస్మయవీరహర్షములం దుపకారి.

౪. కుంచితము:- ఆకుంచితము లయిన పుటము లుండుట పుటము లప్పళించుట కుంచితము. అనిష్టదర్శనమున అనిష్టగంధ రస స్పర్శాదులలో నిది యుపకరించును.

౫. సమము:- స్వాభావికరీతి. శృంగారమున సహకరించును.

౬. వివర్తితము:-కనుపుటములు బాగుగా త్రిప్పుట యున్నచో వివర్తిత మగును. క్రోధమున నుపకారి యగును.

౭. సస్ఫురితము:- స్ఫురితమె సస్ఫురితము. పుటములు స్పందము కల వయినచో స్ఫురిత సంజ్ఞ కల వగును. ఈర్ష్యా భావాభినయమున నిది యుపకారి.

౮. పిహితము:- పుటములు స్థగితము లగుట మూతలు పడుట పిహిత మగును. సుప్తములో మూర్ఛితములో వాయువు వీచునపుడు ఉష్ణత కూడినపుడు ధూమవ్యాప్తిలో వర్షపాతములో అంజన కృతార్తిలో నేత్రరోగమున పిహితకర్మ యున్నది. కనుపుటము లతో స్థగనమె యిచట వివక్షితము. అరచేతి మూతలు తగవు.

౯. విశాడితము:— కనుపుటము లాహితము లగుట, పుటము లల్లార్చుట, దిగజారి టపటప లాడుట వితాలితరూపము. దీనినే కొందరు విలాసిత మనిరి.

ఇప్పటి కిది యంతయు తారపుటముల విధానము. రసభావము లందు వీని వినియోగమును సూచిత మయినది. వీని కార్యానుగత మయిన భ్రూకర్మ నిరూపణీయము.

భ్రూకర్మలు.

భ్రూకర్మ లేడు విధములు.

ఉత్క్షేపము - పాతనము - భ్రుకుటి - చతురము - కుంచితము-
రేచితము - సహజము.

వీని లక్షణము రసభావప్రయోజన మిూ విధముగా నున్నది.

౧. ఉత్క్షేపము:— కనుబొమలను రెండిటిని పై కెత్తుట యుత్క్షేపము. రెండు బొమలను సమకాలమున నెత్తవచ్చును. ఇట్టి దొక రీతి. ఒకటొకటిగా నెత్తుటయు సమ్మతము.

౨. పాతనము:—అధోముఖముగ బొమలను దింపుట పాతనము.

౩. భ్రుకుటి:— భ్రూమూలములను పై కెత్తుట.

౪. చతురము:— కనుబొమలు కొంతగా నుచ్ఛ్వాసముపొందుట వలన మధురముగా నాయతముగా నుండుటను చతుర మందురు.

౫. కుంచితము:— ఒక బొమకాని రెండు బొమలుకాని మృదు భంగము కలిగి యుండుట కుంచితము.

౬. రేచితము:— ఒకే కనుబొమను లలితముగా వలితముగా నుత్క్షేపింప జేయుట రేచితము.

౭. సహజము:— స్వాభావిక మయిన భ్రూకర్మ సహజము.

వీని రసభావప్రయోజనము రమ్యము. ఒక బొమ నెత్తుటకు రెండు నెత్తుటకు ప్రయోజన మున్నది. ప్రతినియత భావ మున్నది. కోపము వితర్కము హేల లీలలను గోచరింప జేయుటకు ఒక భ్రూసముత్క్షేప మావశ్యకము. అస్లే దర్శనమున శ్రవణమున నిది యావశ్యకము. విస్మయహర్షములలో రెండు బొమల నెగురు వేయుట యుక్తము. పాతనములో నీ విశేషము లున్నవి. అసూయ జుగుప్స కలిగి నపుడు హాసములో నాఘ్రాణించుటలో పాతన మావశ్య కము. దీప్తము లయిన క్రోధస్థానములలో భ్రుకుటి రచన యుక్తము. "క్రోపో యత్ర భ్రుకుటిరచనా" భ్రుకుటి సర్వకర్మసామాన్యముగా నున్నను దీప్తములగు వానియందె యుండుట యుక్తము. చతురభ్రూ కర్మ కొక విశిష్టత యున్నది. ఆ కర్మ చతురము. కావున నిదియు చతురము. లలిత శృంగారమున సౌమ్యసుఖస్పర్శలో విలాసమున నిది యుపకారి. స్త్రీపురుషుల సంలాపము లందును చతురకర్మ యావశ్యకము. కుంచితకర్మ స్త్రీలకు సంబంధించిన కుట్టమిత మోట్టాయిత కిలికించితాది శృంగారభావములలో నుపకారి. "నృత్త యోజ్యం తు రేచితం" రేచితకర్మను నృత్తమున నుపయోగింప వలెను. అనావిద్ధభావములలో స్వాభావికమును ప్రయోగింప వలెను. ఇట్టిది సర్వము భ్రూకర్మ.

నాసాకర్మలు.

నాసాకర్మ లారు కలవు సాధారణముగా ఆ యా కర్మసంకే తములుగా నున్న నామములు లక్ష్యనామములుగ నుండియు లక్షణ స్వరూపములను నిరూపింప గలవు. అయినను లక్షణము సూచిం చుట యొకానొక యాపేక్షిక మయిన యంశమును స్పష్టము చేయును.

అంతట నిర్దిష్ట మాత్రమె తత్తల్లక్షణము కాదు. నిర్దిష్టాంశము లక్షణ స్వరూపమునకు సూచకము.

నాసాకర్మ నామములు:

నత — మంద — వికృష్ట

సోచ్ఛ్వాస — వికూణిత — స్వాభావిక

వీని లక్షణ వినియోగము లిట్లున్నవి. నిర్దిష్టమాత్రమె లక్షణము కానట్లు ప్రదర్శితము మాత్రమె వినియోగమును కాదు.

౧. నత:— ముక్కుపుటములు మాటి మాటికి శ్లిష్టము లగుట నతనాసిక. మదాతిశయమున నున్న వనితల యనురోధములో నిది యుండును.

౨ మంద:— నాసిక నిభృతము. నిర్వేద — ఔత్సుక్య — చింతా భావములలో శోకమున నిది యుండును.

౩. వికృష్ట:— నాసిక ఫుల్లితపుట పుటపుటము లిందు విస్ఫారి యుండును. నాసారంధ్రములు స్పష్టగోచరము లగును. తీవ్ర గంధమున నిది యుండును. శ్వాస - రోష - భయాదులలో నిది వినియుక్త మగును.

౪. సోచ్ఛ్వాస:— ఈ నాసిక మారుత మాకర్షించును. అట్లే విడుచును రౌద్రమున వీరమున ఇష్టఘ్రాణమున మధురగంధమున ఉచ్ఛ్వాసవిధానమున నీ నాసికాప్రయోగము నాట్యవిధి.

౫. వికూణిత:— నాస సంకుచితము. జుగుప్సలో నసూయిత ములో నిది యుపకారి.

౬. స్వాభావిక:— నాసిక సమముగా నుండును. వినియోగమున సూచింపని శేష భావముల నన్నిట స్వాభావిక నాస యుండును.

ఇంతవఱకు దాదా పెనుబది శ్లోకముల భావమును నాట్యవేదము నుండి యిచట వ్రాయవలసి వచ్చినది. ప్రస్తుతాపేక్షిత భావము ఈ గ్రంథమున గూడ నన్నిశ్లోకములలో నుండవలెను ఇట్లై గ్రంథపాత మున్న ఇతరస్థలము లంచును అభ్యూహింపవలసి యుండును.

అధరకర్మ

వివర్తనం విసర్గశ్చ వేపనం వినిగూహనం
సందష్టకం సముద్గంచ కర్మ షోఢాధరే స్మృతం
క్రియతే యత్తిరశ్చీనం తద్వివర్తనముచ్యతే
వేదనానాదరాసూయాహాసితప్రముఖే మతం
విసర్గః స్యాద్వినిష్క్రాంతిర్వ్యాఽలక్తాదిక రంజనే
బిబ్బోకే చంచలాక్షీణాం సంభోగే వల్లభార్పణే
వేపనం కంపనం శీతం భీ రోషార్తి జపాదిషు
వినిగూహనమాస్యాంతర్గతిః ప్రాణగతేషు తత్
బలాచ్చుంబతి కాంతే చ క్రోదే బాలమృగీదృశాం
సందష్టం దశనైర్దష్టం కథ్యతే క్రోధకర్మసు
ఉత్తరేణ సహోద్గత్య సముద్గమభిధీయతే
ఫూత్కృతావనుకంపాయాం చుంబనే లాలనేపి చ

అధరకర్మలు

అధరకర్మ లారు కలవు.

వివర్తనము — విసర్గము — వేపనము — వినిగూహనము
సందష్టకము — సముద్గము

౧. వివర్తనము:— అధరము నడ్డముగా పట్టుటకు వివర్తన మని పేరు. ఈ యధరము వేదన-అనాదరము-అసూయ-హాసితము మొదలగు వాని యందుండును. క్రింది పెదవికి అధర మని పేరు. ఈ వివర్తనమును వివర్త మనియు [illegible] వికూణన మొనరించుట వివర్తము. అరుణాధర మెదురుగా నుండుట కాక లోనికి మడిచి యుంచుట వికూణనము. వంకరగా నుండు నట్లు చేయుట అధరాకారము స్పష్ట మొనరింపక కొంత లోనికి బిగించి వినియోగ సౌకర్యానుసారమున ఎడ పెడ లాగింపు బిగింపు కలుగునట్లు చేయుట యిం దావశ్యకము. అప్పు డధరము వంకర టింకరగా నుండ వచ్చును అపుడు హాస్యమో అవజ్ఞయో గోచరించును.

౨. విసర్గము:— అధర రాగమున కగు రంజనమున వినిష్క్రాంత మగుట విసర్గమను నధరకర్మ యగును. వినిష్క్రమము వినిష్క్రాంతి. రాగారుణముగా గోచరించు నధరమును లోనికి నిష్క్రమించునట్లు చేయుట వినిష్క్రమ మగును. నాలుకతో నధర మాకర్షించి తనకు తానే యాస్వాద మొనరించుట, ఉత్తరోష్ఠముతో నధరోష్ఠమును లోనికి నొక్కుట విసర్గ మగును. స్త్రీల విలాసమున బిబ్బోకమున నిది యుపకారి. విలాస బిబ్బోకములు చంచలాక్షుల శృంగారభావములు. సురతప్రక్రియలో గూడ విసర్గ మున్నది. వల్లభు డర్పించు సురతమున అధరాస్వాదనము మధురము మంజులము గావున నీ విసర్గ మను అధరకర్మ యుండుట గుర్తించునది.

3. వేపనము:— వేపనమె కంపనము. ఉన్నట్లుండి కదలుట. అటు నిటు కదులుట సవ్యాపసవ్యసిద్ధా సంచలనము. శీతములో భయములో రోషములో జపాదులలో కంపనము కల యధరము

వినియుక్త మగును. క్రింది దవడ కదులుట వేపనము కాదు. అదురు పాటు కల యధరమునసె యీ కంప ముదయించి గోచరించును. అప్పుడే వినియోగ విషయ భాన ముండును.

౪. వినిగూహనము:– ఆస్యాంతర్గతి ముఖము లోనికి జేరుట వినిగూహన మగును. ఇది విలాస బిబ్బోకము లందు వినియుక్త మగును. వినిగూహన మాయాస విధానమున గూడ నున్నది. ఈ ఆయాస మరతకృతము సురతకృతము కా వచ్చును. ఇం దధర మంతర్విక్రాంత మగును.

౫. సందష్టకము:– ప్రియుడు హఠాచ్చుంబన మొనరించు నపుడు లేత కన్యలకు కోపము రాగా దశన దష్ట మయిన యధరము సందష్టాధరము. ముని పన్నులతో తనకు తానె యధరము నొక్కుట క్రోధకర్మలలో సందష్ట ముపకారి యగును. ఆత డా విధముగ జేయు నపు డధర మం దీయక తానై తన యధరము పట్టుటలో నానె కోపము స్ఫురించును.

౬. సముద్గము:– ఉత్తరోష్ఠముతో గూడుకొని యధర ముబ్బెత్తుగా నుండుట సముద్గము. గాలి నూదునప్పటి ఫూత్కార ములో ననుకంపలో తానె ముద్దు ననుకరించుటలో "ప్పుం ప్పుం" అనుచు లాలన మొనరించుటలో సముద్గము వినియోగము పొందును

ఇట్టివి భరతనాట్యవేదమున నిరూపితము లయిన ప్రసిద్ధము లగు నధరకర్మలు. కొందరింకను నాలుగు అధరకర్మలను నిరూపించిరి.

## అన్యకర్మాణి

చతురోఽన్యానపి బ్రూమో భేదానుక్తాన్మతాంతరే
ఆయతో రేచితో వృత్తో వికాసీ తుర్య ఉచ్యతే
ఉత్తరేణాన్వితో దీర్ఘః ఆయతః కథితః స్మితే
చలనాత్ సృక్కదేశస్య రేచితః స్థిరవిభ్రమే
యదా ముకులితావోష్ఠౌ నాసికోపాంత గామినౌ
తతో వృత్తస్మృత స్తద్జ్ఞైరవజ్ఞా పరిహాసయోః
వికాసీహసితేయోజ్యఃకించిల్లక్ష్యోత్తరద్విజః

## అన్యకర్మలు

మానసోల్లాస మను నాట్యగ్రంథమును రచించిన సోమేశ్వరుడు, సంగీతరత్నాకరము రచించిన శార్ఙ్గదేవుడు ఈ నాలు గధర కర్మలను నిరూపించిరి. ఇట్లు మతాంతరమున ప్రసిద్ధము లయిన వానిని గూడ నిందు నిరూపింతుము. సోమేశ్వరుడు భరతుడు నిరూపించిన యధరకర్మలను నామాంతరములతో నిర్దేశించెను. ఆతని భావమున సముద్గము ముకులము, వివర్తితము కూణితము, విసర్గము ప్రసారితము, కంపితము వేపిత మయినది. అధికముగా నిరూపించిన వాని నామము లిట్లున్నవి.

### ఆయతము - రేచితము - వృత్తము - వికాసి.

వీని లక్షణ వినియోగముల నిట్లు గుర్తింప వచ్చును.

౧. ఆయతము:- ఇదియే దీర్ఘము. అధరోష్ఠ ముత్తరోష్ఠముతో కూడినది యయినచో నది యాయత మను నధరకర్మ యగును. ఇది ముసి ముసి నవ్వు ననుకరించు స్మితమున వినియోగము పొందును.

౨. రేచితము:— సృక్క దేశము యొక్క చలనమున రేచిత మగును. సృక్కము నోటి చెలివి భాగము. చెలివిభాగముల కదలికతో కూడిన యధరము. ఈ కర్మ స్థిరవిభ్రమమున నుపకరించును.

౩. వృత్తము:— ముక్కు దగ్గరకు చేరిన పెదవులు ముకుళితములై యున్నచో వృత్త మగును. ఇది అవజ్ఞలో పరిహాసములో నుపయోగించును.

౪. వికాసి:— పైపన్నులు కొంచెము కన్పడు నట్లుగా నధరము కూర్చినచో నది వికాసి యగును. దీనిని హాసితమున నుపయోగింపవలెను. పన్నులు కొంచెముగా కన్పడు నట్లు నవ్వుట హాసితము.

## కపోలకర్మ

కుంచితః కంపితః ఫుల్లః క్షామః పూర్ణ స్తతః సమః
ఇతి భేదాః కపోలస్య మునినా షడ్విర్మితాః
కుంచితః కృతసంకోచః శీత త్రాస జ్వరాదిషు
స్ఫురితః కంపితః కోపే ప్రమోదే చ విధీయతే
ఫుల్లో వికసితో హర్షే తతః క్షామో రుజి స్మృతః
పూర్ణః సమున్నతో గర్వే ప్రోత్సాహే చ ప్రయుజ్యతే
సమః స్వాభావికశ్శేషభావేషు వినియుజ్యతే। ౧౧

## కపోలకర్మ

కపోలకర్మలకు గండకర్మ లనియు పేరు. గండ మారువిధములు. భరతముని యిట్లు నిరూపించెను.

కుంచితము — కంపితము — ఫుల్లము
క్షామము — పూర్ణము — సమము

వీని లక్షణ వినియోగము లీ విధమున నున్నవి.

౧. కుంచితము:— సంకోచము కూడిన కపోలము కుంచితము. శీతస్పర్శలో భయములో జ్వరములో రోమాంచ సహిత మయిన కపోలము కుంచిత కపోలముగా భాసించును.

౨. కంపితము :— స్ఫురిత కపోలము కంపితము. రోష హర్షములలో నిది యుండును. రోషనిమిత్తకము లయిన భావము లందును, హర్షనిమిత్తకము లయిన భావము లందు నిది యుండును.

౩. ఫుల్లము :— వికసితకపోలము ఫుల్ల కపోలము. ప్రహర్షమున ఫుల్లకపోల ముండును. ఫుల్లకపోలములు కల వనితలు కన్పడుచునె యుందురు.

౪. క్షామము :— అవనతముగా నున్న కపోలము క్షామ కపోలము. దుఃఖసమయము లందు కపోల క్షామత యుండును. క్షామము కృశించి యుండుట. "క్షామ క్షామ కపోలమాననం" విరహబాధావ్యథిత శకుంతల క్షామకపోల.

౫. పూర్ణము:— పూర్ణకపోలము ఘూర్ణకపోలముగా భరతుడు సంకేతించెను. వినియోగము సమముగా నున్నది. సమున్నత మయిన కపోలము పూర్ణకపోలము. ఇది వితతము విస్తృతమై యుండును. గర్వము నందును ప్రోత్సాహము నందును అది ప్రయుక్త మగును. ఉత్సాహనిమిత్తక మయిన గర్వమున కపోల మువ్వెత్తుగా నుబ్బుగా విస్తృతముగా నుండుట ప్రసిద్ధము.

౬. సమము ;— స్వాభావిక కపోలము సమకపోలము. ఇందు భావకృత మగు వికార మేమియు నుండదు. పూర్వకపోలములకు నిరూపించినవి కాక మిగిలిన భావములలో నిది వినియుక్త మగును.

## చి బు క ల క్ష ణం

చిబుకం సప్తధోద్దిష్టం జిహ్వాదంతోష్ఠ కర్మభిః ౧౦౮
కుట్టనం లేహనం భిన్నం ఖండనం చుక్కితం సమం
దష్టం చ ల...ణం తేషాం వినియోగశ్చ కధ్యతే
కుట్టనం ద్విజసంఘష్టి, క్రుద్ధ్ శీత జ్వరాదిషు
జిహ్వయా లేహనం లేహో లేహ్యే లౌల్యే చ తద్విదుః
ద్విజానాం గాఢసంశ్లేషం భిన్నం వ్యాధౌ భయే మృతౌ ౧౦౯
వ్యాయామే రోదనే శీతే తన్మతం నాట్యవేదినాం
అసకృత్ఖండనం దంతసంస్ఫోటో జప భక్షయోః
సల్లాపేధ్యయనే చైతద్విజానంతి విచక్షణాః
దంతపంక్త్యోః స్థితిర్దూరం జృంభాయాం చుక్కితం మతం.
మనాక్ సంశ్లేషణం దంతపంక్త్యోః స్వాభావికే సమం ౧౧౦
సందష్టం దశనైర్దష్టం స్యాదేతత్క్రోధకర్మసు.

## చి బు క ల క్ష ణ ము

చిబుకకర్మలు సప్తవిధములు. భరతు డారింటినే పరిగణించెను. చిబుకము గడ్డము.

కుట్టనము — లేహనము — భిన్నము — ఖండనము
చుక్కితము — సమము — దష్టము

వీని లక్షణవినియోగము లీ విధమున నున్నవి. చిబుక మన్న పేరున కేవలము చిబుకము లక్షితము కాదు. రమ్యమును కాదు. దంతక్రియాదష్ట మయిన చిబుకమె యిందు లక్షితము. ఉపభోగ క్రియలో అధరచుంబన కపోల చుంబనముల వలె చిబుకచుంబనము కూడ శాస్త్రవిహితము. అధరచుంబనమున కివి సాధనములు. సాధనసిద్ధి యున్నచో నధరచుంబనాధికారము కలుగును.

"దష్టం చ దంతక్రియయా చిబుకం త్విహ లక్ష్యతే"
దంతక్రియా దష్ట చిబుక కర్మ విశేషములు వీనిలో నున్నవి. అన్నియు ఇక్లే గ్రాహ్యములు.

౧. కుట్టనము:— దంతములతో నొకింతగా చిబుకమునకు సంఘర్ష మొదవించుట కుట్టనము. క్రోధ — భయ — శీతజ్వరాదులలో నిది వినియుక్త మగును. భయాదులు కలవారలకే కుట్టనముండును. అధరముననే యీ కుట్టన ముండును. అధరమునందా క్రియావిక్రియలు గోచరింపగా నివి చిబుకకర్మ లగు చున్నవి.

౨. లేహనము:— నాలుకతో లేహన మొనరించుట ఆస్వాదించుట. నాలుక సారించి రుచిపట్టుట లేహన మగును. నాలుక జాపి అధరముపై నటు నిటు నంతట నాస్వాదించుట లేహనము. భావ లేహ్యములో నిది యుపకారి. భావగతముగా చాపల మున్నప్పుడు ఇది జరుగును. 'నా కిట్లు కావలెను. నీ కిట్లొనరును' అని యధీరులు తలచి నప్పుడు లేహిత ముండును.

3. ఛిన్నము:— ఛిన్నమునె ఛిన్న మనియు నందురు. గాఢ సంశ్లేషము ఛిన్నము గాఢముగా బిగువుగా పట్టు గల దగుట వ్యాధిలో భయములో మరణములో నిది యుపకరించును. అనగా నిట్టి సమయములలో దంతములతో నట్లొనరింపవలె నని భావము పూర్వము నిర్దేశించిన అధరకర్మలు అధరమాత్ర కర్మలు. ఇవి దంతాధర సంశ్లేషకర్మలు. ఛిన్నచిబుకమును వ్యాయామ రోదన-శీతము లందును ఉపయోగింప దగునని నాట్యవిదు లందురు.

౪. ఖండనము:— ముహుర్ముహుః దంతసంస్ఫోటము ఖండనము సంస్ఫోట పదమున పటుక్కున కొరుకుట యను నర్థము లభించును.

జపములో అధ్యయనములో సల్లాపములో భక్ష్య యోగములో నిదియుపకారి. అని విచక్షణుల భావము.

౫. చుక్కితము:– ఈ చుక్కితమె చుకితము చిక్షితము అక్షితము అను నామములతో నున్నది. దంతపంక్తులకు దూరముగా నుండు స్థితి చుక్కిత మగును. దూరవిచ్యుతి చుక్కితము. దూరముగా నధరము జార వేయుట పై దంతపంక్తిని లో నధరమూలమున జేర్చి అధరము ముడుతలు పడు నట్లు చేయుట, వెల్లకిల విరుపుడు పడు నట్లు చేయుట. జృంభితములో నావలింతలో చుక్కితం మతం” “జృంభణే చుక్కితం కార్యం” దీని సంగతిని పట్టి చూచునది.

౬. సమము:– కొంతగా కొద్దిగా దంతములలో నధరమును శ్లేషింప జేయుట సమమన్న చిబుకకర్మ యగును. స్వాభావజ భావములలో నిది యుపకారి. స్వాభావజన్యము లగు క్రోధకర్మలలో నిది సందష్ట రూపమున గూడ నుండును.

౭. సందష్టము:– దశనదష్టము సందష్టము క్రోధకర్మలలో నిది ప్రసరించును. ఇందలి క్రోధకర్మలను అస్వభావ జన్యము లగు కర్మలని యావేశజ కర్మ లని భావింప వలెను.

ఈ చిబుక క్రియలలో దంత మధరము జిహ్వా అను మూడిటి కరణవిధాన మున్నది. “దంతోష్ఠజిహ్వానాం కరణాచ్చిబుక క్రియా” అని భరతవచనము. కేవల చిబుకమున నీ క్రియాకౌశలము వ్యక్తము కాదు.

హ ను ల క్ష ణ ం

వ్యాదీర్ణా చలితా లోలా రోమంథే గ్రాసలోలనే
శ్వసితాద్భుత వీక్షాయామేకాంగులమధః శ్లథా

చలా శ్లిష్టాధరా యోషిదాహారే చల సంజ్ఞితా
నిశ్చలాస్యా యదా సైవ సంహతా మౌన తత్పరా ౧౧౫
స్ఫురితా వేపితా ప్రోక్తా శీత శీతజ్వరాదిషు
తిరశ్చీనగతా వక్రా గ్రహావేశేఽర్దితామయే

హనులక్షణము

హను భేదము లారు కలవు. వీనిని భరతుడు నిర్దేశింప లేదు. సోమేశ్వర శార్ఙ్గదేవులు నిరూపించిరి. అధికముగను జెప్పిరి. హానువు దవడ.

వ్యాదీర్ణ — శ్వసిత — చల
సంహత — స్ఫురిత — వక్ర

౧. వ్యాదీర్ణ:— ఇది చలితముగా నుండును. లోలముగా నుండును. రోమంథమున (నెమరు వేయుట నములుట) ముద్దలు మ్రింగుటలో నిది యుండును.

౨. శ్వసిత:— ఇందు హనువు ఒక అంగులము శ్లథమై జారి యుండును. అద్భుతము పడి చూచుటలో నిది యుపకరించును.

౩. చల:— అధరముతో కూడినదై హనువు కదులును. స్త్రీల యాహారమున నిది యిట్లుండును.

౪. సంహత:— హనువు నిశ్చల ముఖముతో నున్నచో మేన తత్పరముగా నున్నచో సంహత హాను వగును.

౫. స్ఫురిత :— ఈ హనువు వేపితముగా నుండును. కంపముతో నుండును. శీతము నందును శీతజ్వరాదు లందును. స్ఫురిత హాను వుండును.

౬. వక్ర :- బాధామయము పీడామయము నయిన గ్రహా వేశమున హానువు వక్రహాను నగును. ఈ హాను వద్దముగా తిరుగును. తిరశ్చీనగత మగును.

జిహ్వా కర్మ.

ఋజ్వీ సృక్కానుగా వక్రా నతా లోలాథ లేహినీ
ఇతి షోఢా భవేజ్జిహ్వా క్రమాల్లక్షణ ముచ్యతే
ఋజ్వీ ప్రసారితా ప్రోక్తా వివృతే వదనే సతి ౧౨౦
శ్వాపదానాం పిపాసాయాం శ్రమే చైషా విధీయతే
తిహానా సృక్కిణీసృక్కానుగా మృష్టా దన క్రుధో:
ఉచ్చాగ్రా వివృతాస్యస్థా వక్రా నృహరి దర్శనే
నతా గ్రాస్యాన్నతా జృంభా వదనాంతర వీక్షయో:
విదీర్ణాస్యే చలా లోలా వేతాలాది విడంబనే ౧౨౫
దంతానోష్ఠౌ చ లిహతీ లేహనీ లేహనే మతా

జిహ్వా కర్మ

జిహ్వాకర్మ లారు కలవు. భరతుడు వీనిని నిరూపింప లేదు. సోమేశ్వరు డయిదు కర్మలను జెప్పెను శార్ఙ్గదేవు డయిదు చెప్పెను. నామపరిగణనమున భేద మున్నది. ఇందలి జిహ్వాకర్మలు.

ఋజ్వి - సృక్కానుగ - వక్ర - నత - లోల - లేహిని. క్రమముగా వీని లక్షణములు నిరూపితము లగును.

౧. ఋజ్వి :- ఈ జిహ్వా వదనము వివృతము కాగా ప్రసారితమై యుండును మృగములకు ప్రసారిత జిహ్వా యుండును. ఆ మృగములు దప్పిక కలవయి నపుడు శ్రమతో కూడి యున్నపుడు ఈ జిహ్వావిధాన ముండును.

౨. సృక్కానుగ :- ఈ నాలుక సృక్క భాగములకు ప్రిస రించునదై లేహనము (నాకుట) ఒనరించు చున్నట్లుండును. సంతుష్టిగా తినునపు డిది యుండును. క్రోధమున నిది యుండును.

3. వక్ర :- తెఱచి యుంచిన ముఖమున నున్నదై చివరి భాగము అధికముగా చాచి నట్లుండును. నరసింహదర్శనమున నీ వక్రి నాలుక కలదు.

౪. నత :- నతాగ్రిముగా నుండునది నతజిహ్వా. ఆ వలించు నపుడు ముఖములోని వస్తువు చూచునపుడు నతజిహ్వా యుండును.

౫. లోల :- తెఱచిన ముఖములో కదలుచున్న నాలుక లోల జిహ్వా బేతాలాదుల రూపానుకరణములో లోలజిహ్వా యున్నది.

౬. లేహని :- నాకుటలో దంతములను పెదవులనుస్పృశించుచు నుండుటలో లేహని జిహ్వా యుండును.

దంతకర్మ

చర్వణచ్ఛేదనే స్యాతాం పీడనగ్రహణే తతః
అంత్యం నిష్కర్షణం జ్ఞేతుం తత్కర్మాణి చ పంచధా
ఏతాన్యన్వర్థ సంజ్ఞాని, చర్వణం చణకాదిషు
తాంబూలవీటికాచ్ఛేదే ఛేదనం, పీడనం పునః ౧౩౦
స్ఫోటనే క్రముకాదీనాం కోపే చ పరికీర్తితం
ధియాంగులీ తృణాదీనాం గ్రహణం గ్రహణేరణే
మతం నిష్కర్షణం క్లేశ రోదనాభినయం ప్రతి,

## ద ం త క ర్మ లు.

దంతకర్మ లయిదు కలవు. వీనిని భరతుడు చెప్ప లేదు. ఇతరులు చెప్పిరి.

చర్వణము - ఛేదనము - పీడనము
గ్రహణము — నిష్కర్షణము

చర్వణచ్ఛేదనాదులు దంతఘట్టన విశేషములు. వాని కర్మ లయిదు విధముల నున్నవి. ఈ కర్మ నామము లన్వర్థములుగా నున్నవి.

౧. చర్వణము :- శనగలు మొదలగు గట్టిపదార్థములను నములు నప్పుడు చర్వణాత్మక దంతకర్మ యుండును. చర్వణము నములుట.

౨. ఛేదనము:- తాంబూల పీటికను కొఱుకుటలో ఛేదన ముండును. ఇష్ట వనితలు తమలపాకుల చిలుకలను చుట్టి యీయగా మునిపండ్లతో కొఱుకుట ఛేదనము.

౩. పీడనము:- క్రముకము కొఱుకుట పోకచక్కలు మొద లగు వానిని (క్రముకము) స్ఫోటన మొనరించుట పీడనము కోపము నందును పండ్లు కొఱుకుట యున్నది.

౪. గ్రహణము :- భయముతో వ్రేలు నోటిలో నుంచుకొని చిన్నగా కొరుకుట, ఒకప్పుడు గట్టిగా కొఱుకుట గ్రహణ మను దంతకర్మ యగును. అస్త్రే గడ్డి కఱచుటయు ఇది గడ్డి గ్రహించుటలో యుద్ధమున నుండును.

౫. నిష్కర్షణము :- దంతముతో దందము రుద్దుట. కోతుల రోదన ధ్వనుల ననుకరించుటలో నిది ప్రసక్త మగును. రోదన సమయమున కోతులు పండ్లు ఇకిలించికొని యుండుట లోకప్రసిద్ధము అస్త్రై యిచ్చుట.

గ్రీవా లక్షణం

సమాంచితా నతా త్ర్యస్రా రేచితా కుంచితోన్నతా
వలితా చ నివృత్తా చ గ్రీవా నవవిధా స్మృతా ౧౩౫

(గ్రంధపాతః)

త్ర్యస్రా పార్శ్వగతా స్కంధభారేణ పరిపీడితా
రేచితా విధుతా భ్రాంతా భవేన్మధన నృత్తయోః
ఊర్ధ్వం సంకుచితే మూర్ధ్ని కుంచితా గల రక్షణే
ఉన్నతాభ్యుద్గతా సా స్యాత్ గ్రైవేయాలోకితాదిషు
ప్రలోకితే స్వభంగే చ వనితా పార్శ్వతో ముఖీ
స్వస్థానం పునరానీతా నివృత్తాబిముఖాదిషు
శిరః కర్మానుగామిత్వం గ్రీవాయాః కర్మణో యతః
యత్కించిదస్తితత్కర్మ తదస్యామఖిలం స్వయం.

గ్రీవా లక్షణము.

శిరములకు సంబంధించిన యుపాంగములు విలోచన భ్రూ-నాస - ఓష్ఠ - కపాల - చిబుకము - లారును నిరూపితము లయినవి. వానిలో హను- జిహ్వా - దంతకర్మలు లేవు. అయిన నపేక్షితము లని నిరూపితము లయినవి. గ్రీవాకర్మ అందు చేరలేదు. ప్రత్యంగకములలో _ గ్రీవా - దోః- కుక్షి - పృష్ఠ ఉరు - జంఘ లున్నవి. భరతుడు ప్రత్యంగకములలో గ్రీవను చేర్చ లేదు. పాదము కూర్చెను. ఈ గ్రంధకర్త పాదమును తీసి గ్రీవను చేర్చెను. అట్టి గ్రీవావిధానము ప్రస్తుతము లక్షిత మగును. శిరోభేదముల కథనములో గ్రీవాభేదము సూచించుట యుక్త మగును.

గ్రీవాకర్మలు తొమ్మిది విధముల నున్నవి.
సమ - అంచిత — నత — త్రిశ్ర - రేచిత
కుంచిత - ఉన్నత - వలిత — నివృత్తి

వీని లక్షణ వినియోగముల నిరూపణములో మొదటి మూడు గ్రీవాభేదముల లక్షణ వినియోగ వాక్యములు గ్రంథమున త్రుటితము లయినవి. వానిని నాట్యవేదము ననుసరించి నిరూపించుట యుక్తము

౧. సమము :– ఇది సమగ్రీవ. స్వాభావిక మయిన గ్రీవా కర్మ. ధ్యానస్వభావము సూచించును. జపకర్మలలో నిది వినియుక్త మగును.

౨. అంచిత:– అపసరణములో ఉద్బంధములో కేశకర్షణ ములో ఊర్ధ్వదర్శనములో నుండును.

3. నత:– ముఖము వంచి యుండుట నతగ్రీవ. అలంకారము కూర్పగా నతగ్రీవ యుండును. కంఠావలంబనము కూర్చుగా నిది యుండును.

౪. త్ర్యశ్రి:– పార్శ్వగత మయిన గ్రీవావిధాన మునకు త్ర్యశ్రిగ్రీవ యని పేరు. స్కంధమున భారము వహించుటలో దుఃఖిత విధానములో నిది యుపకారి.

౫. రేచిత:– భ్రాంత విధానమున మెడను విదల్చుట రేచితము. గ్రీవారేచనము లను కర్మలలో నీ రేచిత మున్నది. భావ సూచనములో మథనములో నృత్తములో నీ రేచిత గ్రీవాకర్మ యున్నది.

౬. కుంచితము:– మెడ పైన సంకుచితము కాగా కుంచిత గ్రీవ యగును. తలపై బరువున్నపుడు గ్రీవారక్షణమున నిది యుపకారి.

౭. ఉన్నత:– ముఖ మెత్తి యున్నపు డున్నత గ్రీవాకర్మ యుండును. పైకి చూచు నప్డు గ్రీవ మున్నత మగును. గ్రైవే యాలోకితాదులలో నుపకారి.

౮. వలితము:— పార్శ్వమున కున్ముఖముగా నుండు గ్రీవ వలిత కర్మ కల దగును. ఈ వలితగ్రీవ గ్రీవాభంగములో మెడవంపుతో చూచుటలో నుపకరించును.

౯. నివృత్త:— స్వస్థానాభిముఖము లయిన కర్మల సంకేత ములో స్వస్థానగతముగా నిరూపిత మయిన గ్రీవారీతి నివృత్తగ్రీవ యగును.

౧౦. అంచిత:— అపసరణములో ఉద్బంధములో కేశకర్షణ ములో ఊర్ధ్వదర్శనములో నుండును.

గ్రీవాకర్మ లన్నియు శిరఃకర్మానుగతములు. శిరమునకు సంబంధించిన కర్మవిశేష మంతయు గ్రీవావిషయమున గూడ సంగత మగును. గ్రీవాకర్మ లన్నియు శిరఃకర్మానుగతములై యుండును. శిరఃకర్మలు గ్రీవాకర్మలు సామాన్యముగా నేకరూప ములు. కావుననె గ్రీవాకర్మలు శిరఃకర్మల ననుసరించి యుండు ననుట సంగతము. శిరఃకర్మ ముఖ్యముగా గ్రీవాకర్మ ప్రసరించును. అయినను గ్రీవాకర్మలను వేఱుగా నిరూపించుట లోని విశేషమును సంభావించుట యుక్తము.

ముఖరాగః

సూచనే చ మనోవృత్తేః ముఖరాగస్య ముఖ్యతా
శరీరాభినయే యస్మాత్కార్యేన్ స్మాదిహాదరః
స్వాభావికః ప్రసన్నాఖ్యో రక్తశ్శ్యామ శ్చతుర్థకః ౧౪౫
మధ్యస్థాదిషు భావేషు స్వభావాభినయేషు చ
స్వాభావికః ప్రసన్నస్తు శృంగారాద్భుత హాస్యయోః
రక్తో మదేషు కరుణే వీరే రౌద్రే చ జాయతే

శ్యామో భవతి బీభత్స భయానక సమాశ్రయః
నాంగికాభినయో భాతి ముఖరాగం వినాకృతః ౧౫౦
కిము ధత్తే శ్రియం జాతు మధుః పుష్పాయుధం వినా
సూర్యోదయం వినా పద్మం విభ్రమా యౌవనం వినా
ముఖారాగం వినాభిఖ్యాం భజతేఽభినయో న హి
ఆంగికాభినయస్యాస్య ముఖరాగో హి జీవితం
వినా తేన బిభర్త్యేష సాదృశ్యం పుస్తచేష్టితైః ౧౫౫

ముఖరాగము.

మనోవృత్తి సూచనమున ముఖరాగము ముఖ్యము. భావరసాశ్రయ మయిన ముఖరాగమును భావరసోపేతముగా బ్రయోగించుట యావశ్యకము. ముఖరాగ మున్ననె యభినయము నకు శోభ యున్నది. ముఖరాగమె లేనపు డభినయ మెంతగా నున్నను శోభింపదు. ఈ ముఖరాగము నాలుగు విధములు.

స్వాభావికము- ప్రసన్నము- రక్తము- శ్యామము.

౧. స్వాభావికము:—స్వభావాభినయమునకు స్వాభావిక ముఖరాగ ముచితము. మధ్యస్థాది భావములలో స్వభావాభినయములో నిది యుక్తము. లోకధర్మికి నాట్యధర్మికి మధ్యస్థము లయిన భావములలో నిది యుక్తమనుట భావనీయము.

౨. ప్రసన్నము:— శృంగారాద్భుత హాస్యములందు యుక్తముగా నుండును.

౩. రక్తము:— వీర రౌద్ర మదములలో రక్తముఖరాగము యుక్తము. కరుణము నందు నిది యుక్తము.

౪. శ్యామము:- బీభత్స భయానక రసాశ్రయముగా శ్యామవర్ణ ముండును. ఇట్లు భావరసస్థానములలో ముఖరాగము ప్రయోగింపవలెను.

ముఖరాగము లేకున్న ఆంగికాభినయ మవభాసింప దనుట యుక్తము. మన్మథభావము లేకున్న మధువు శోభా సంపాదకము కాగలదా? సూర్యోదయము కాకున్న పద్మమునకు శోభయుండునా? యౌవనము వినా విలాసవిభ్రమములు రాణింపగలవా? కావున ముఖరాగము వినా అభినయ మభిఖ్యను పొంద నేరదు. ఆంగికాభినయమునకు ముఖరాగము జీవితము. ముఖరాగము లేకపోయినచో నభినయము హస్తచేష్టిత ప్రాయ మగును. హస్త పుస్తక పదముల యర్థము నిరూపిత మయినది.

## హస్తలక్షణం

చతుర మకర రాజి ప్రోల్లసత్పద్మకోశం
భ్రమరలలితలీలం హంసపక్షాభిరామం
ప్రవిచల దలపద్మం కర్కటాద్యైరుపేతం
జలధిజలమివేదం బ్రూమహే హస్తలక్ష్మ.

ఈ గ్రంథమున హస్తలక్షణ భాగము విస్తృతముగా నుండును. ఇది ముఖ్యము నగును. అనువిధములుగా నిర్ణీత మయిన సంకేతిత మయిన నాట్యసంగ్రహవిధానమున రెండవది యగు హస్తవిధాన మిచట విస్తృత మగును. హస్తవిధానములలో అసంయుత హస్తములు ఇరువది నాలుగు కలవు. పదమూడు సంయుత హస్తములు కలవు ఇరువది తొమ్మిది నృత్తహస్తములు కలవు. వీని కన్నిటికి లక్షణ వినియోగములు కలవు. ఈ హస్త లక్షణ విధాన మంతయు సాగరమంతగా నున్నదని గ్రంథకర్త

భావించి హస్తవిధానమును జలధిజలముతో బోల్చి నిరూపించుటకు ఈ "చతురమకర" శ్లోకము రచించెను. ఇందు రెండువిధము లగు భావార్థములను గ్రహింప వలెను.

హస్తసంబంధి భావమున నిరూపింప దలచిన హస్తవిశేషముల పారిభాషికము లయిన నామములు కలవు. మకర పద్మకోశ భ్రమర - లలిత హంసపక్ష - అలపద్మ - కర్కట - పదము లీ యా హస్తముద్రలను సూచింపగలవు. జలధిజల సంబంధి భావమున మకరాది పదములకు బరిభాషితార్థముల కన్న వేఱుగా ప్రసిద్ధార్థములను గ్రహింపవలెను.

జలధిజల పదార్థ మీ విధముగ నుండును. చతురము లగు మకరముల (నక్రములు-మత్స్యములు) చే జలధిజలము రాజిల్లు చున్నది. పద్మకోశములు ఉల్లసించు చున్నవి. కావుననే భ్రమరముల మనోహరలీలలతో నున్నది. హంసముల పక్షప్రసారములచే నభిరామముగా నున్నది. అందుననె కదలుచున్న దలములు కల పద్మములతో నున్నది. కర్కటము (ఎండ్రకాయ) మొదలగు వానితో గూడి యున్నది. ఇట్టి జలధిజలసాదృశ్యము హస్తలక్ష్మి కిచట నిరూపిత మయినది. శ్లేషాధారముగా గలుగు నభేదాధ్యవసాయలబ్ధ మయిన సమానధర్మము నిచట గ్రహింపవలెను.

హస్తలక్ష్మ్యనుగత మయిన భావార్థ మీ విధముగానుండును. హస్తలక్ష్మి మకర మను సంయుతహస్తముతో బ్రకాశించుచున్నది పద్మకోశ మను అసంయుత హస్తముతో శోభించుచున్నది. భ్రమర మను అసంయుత హస్తము లలిత మను నృత్తహస్తము అను వీని లీలావిలాసములతో నున్నది. హంసపక్ష మను అసంయుత హస్త

ముచే నభిరామముగా నున్నది. అలపద్మము అలపల్లవ మను అసంయుత హస్తముచే గదలికతో నున్నది. కర్కట మనునది సంయుత హస్తము. హస్తలక్ష్మి కర్కటాదులతో గూడి యున్నది.

ఇట్లు భావద్వయము గోచరించునట్లుగా నీ పద్యము నిచట నిరూపించుట నిరూపింపబోవు విషయగౌరవమునకు సూచకము.

### అసంయుతహస్తాః

పతాకా త్రిపతాకాఖ్యౌ భుజంగ మృగశీర్షకా
కర్తరీ కటకా సూచీ శుక హంస ముఖాభిధాః
కపిత్థ శిఖరౌ పద్మకోశ కాంగుల ముష్టయః
చతుర భ్రమరారాల హంసపక్షా ర్ధచంద్రకాః
సందంశ ముకులాభిఖ్యౌ పూర్ణనాభా లపల్లవౌ ౧౬౫
తామ్రచూడశ్చ వియుతా శ్చతుర్వింశతి రిత్యమీ

### అసంయుతహస్తములు

ఇరువది నాలుగు అసంయుత హస్తముల నామసంకేత మిచట నున్నవి. సంయుతము కూడుకొనినది. అసంయుతము కూడుకొననిది. విడిగా నుండునది. ఒక్కొక హస్తముతో జేయదగినది.

పతాకము - త్రిపతాకము - సర్పశిరము
మృగశీర్షము - కర్తరీముఖ - కటకాముఖ
సూచీముఖ - తర్జని - శుకతుండ
హంసాస్య - కపిత్థ - శిఖర
పద్మకోశ - ముష్టి - చతుర
భ్రమర-అరాళ - హంసపక్ష

అర్ధచంద్ర - సందంశ - ముకుల
ఊర్ణనాభ — అలపద్మ - తామ్రచూడ
వీని లక్షణము లుత్తరగ్రంథమున నిర్దిష్టము లగును.

సంయుతహస్తాః

ఆంజలిః కటకా వర్ధమాన స్వస్తిక కర్కటాః
కపోత నిషధోత్సంగ గజదంతావహిత్థకాః
డోలః పుష్పపుటో వర్ధమానో మకర ఇత్యమీ
త్రయోదశవిధా యుగ్మహస్తాః స్యు ర్మునిసమ్మతాః

సంయుతహస్తములు

సంయుత హస్తములకు యుగ్మహస్తము లనియు పేరు. యుగ్మహస్తములు పదమూడు విధములు. ఇట్టివి భరతముని సమ్మతములు.

అంజలి - కటకావర్ధమానము - స్వస్తికము - కర్కటము
కపోతము - నిషధము - ఉత్సంగము - గజదంతము అవ
హిత్థము - డోలము - పుష్పపుటము - వర్ధమానము - మకరము

నృత్తహస్తాః

చతురశ్రా వథోద్వృత్తౌ తాత తలముఖాభిధౌ ౧౭౦
స్వస్తికౌ విప్రకీర్ణాఖ్యౌ వరాల కటకాముఖౌ
ఆవిద్ధవక్రౌ సూచ్యాస్యౌ రేచితా వర్ధరేచితౌ
ఉత్తానవంచితాభిఖ్యౌ పల్లవౌ సనితంబకౌ
కేశబంధౌ లతాసంజ్ఞౌ కరిహస్తాభిధౌ తతః
పక్షవంచితకౌ పక్షప్రద్యోతౌ తార్క్ష్యపక్షకౌ ౧౭౫
దండపక్షాహ్వయా వూర్ధ్వమండలౌ పార్శ్వమండలౌ

ఉరోమండలనామానా వురః పార్శ్వార్ధమండతా
ముష్టికస్వస్తికా వన్యౌ నలినీ పద్మకోశకౌ
అలపల్లవనిష్పన్నా వుల్బణౌ లలితౌ తథా
వలితౌ చ కరా నృత్తే వింశతిః స్స్యుర్నవాధికాః
యద్యేవం మిలితాః సర్వే షట్షష్టిః త్రివిధా అపి ౫౯౦

## నృత్తహస్తములు

నృత్తహస్తములు ఇరువది తొమ్మిది యున్నవి. ఇవియు యుగ్మహస్తములు.

చతురశ్ర - ఉద్వృత్త - తలముఖ - స్వస్తిక
విప్రకీర్ణ - అరాల - కటకముఖ - అవిద్ధవక్ర
సూచ్యాస్య - రేచిత - అర్ధరేచిత - ఉత్తానవంచిత
పల్లవ - సనితంబ - కేశబంధ - లతాసంజ్ఞ
కరిహస్త - పక్షవంచితక - పక్షప్రద్యోత - తార్క్ష్యపక్షక
దండపక్ష - ఊర్ధ్వమండల - పార్శ్వమండల - ఉరోమండల
ఉరఃపార్శ్వార్ధమండల - ముష్టికస్వస్తిక
నలినీపద్మకోశ - అలపల్లవ - ఉల్బణ
లలిత - వలితములు —

ఈ నిరూపించిన చతురశ్రాదులు నృత్తహస్తములు మూడు విధములుగా నిరూపితము లయిన ఈ హస్త విశేషములన్నియు ౨౪ + ౧౩ +. ౨౯ = ౬౬ కలిసి అరువదియారు హస్త విశేషములుగా నెన్నదగి యున్నవి. వీని నీ విధముగనె పరిగణించినందున నివి షట్షష్టి అగుచున్నవి. ఈ పరిగణనము విషయమున కొందఱి భావములు పరిశీలనార్హములు.

"చతుష్షష్టికరాహ్యేతే నామతోఽభిహితా మయా"
ఇత్యుక్త్వం బ్రహ్మపుత్రేణ భరతేనాపి తత్కథం
అయుక్త్యేషు చ సూచ్యాస్య స్వస్తికః సంయుతేష్వపి
తావేనాత్ర సమానాఖ్యౌ నృత్తహస్తౌ ప్రకీర్తితౌ
యత్తు నామత ఇత్యాహ మునిః సత్యం న చాన్యథా
పల్లవావేవ లలితౌ లతాఖ్యౌ వలితావితి
నిశ్చిత్య నృత్తహస్తేషు హిత్వా తద్ద్వితయం పునః
సోమేశ్వరాదయః కేచిత్ సప్తవింశతి మూచిరే
స్వస్తికౌ విప్రకీర్ణౌ చ రేచితా వర్ధరేచితౌ
నామభేదాన్మిథో భిన్నౌ తద్వదత్రాపి మన్యతాం
స్నాతాం యేషాం మతే భిన్నౌ వుల్బణౌ వలపల్లకో
మండలానాం చ సామాన్యమండలత్వ మితి ధ్రువం
సంత్యజ్యతే త్రయం తేషు నృత్తవిద్యావిశారదైః
ఏవం చేన్న పృథక్ స్యాతాం రేచితా వర్ధరేచితౌ
ఉల్బణౌ వలపద్మౌ చ భిన్నౌ యది మునేర్మతే
బహుత్వం ప్రాప్నుతశ్చైతౌ వలపద్మోల్బణావితి
అంజల్యాదేః కరద్వంద్వ ప్రయోజ్యస్య కథం మునిః
ఉక్త్వైకవచనం నృత్తహస్తే ద్వివచనం వ్యధాత్
నృత్యే సంయుక్తయో స్సిద్ధిః హస్తత్వే సతతం భవేత్
నృత్తహస్తేషు హస్తాభ్యాం హస్తేనైకేన వా భవేత్
హస్తత్వసిద్ధి రిత్యస్మాత్కారణా దుభయో రపి
ప్రాధాన్యం వ్యక్తు కామోఽసౌ ముని ర్ద్వివచనాజ్జగౌ

నాట్యవేదమున భరతుడు హస్తముల నామములను ఈ విధముగనే చెప్పి యన్నిటి సంకలనాత్మక మయిన లెక్కను నిరూపించునపుడు "చతుష్షష్టికరాహ్యేతే నామతోఽభిహితా మయా"

ఈ అరువది నాలుగు కరములను నేను " నామతః " నిర్దేశించితిని. అనెను. భరతుడు బ్రహ్మపుత్రుడు అసంగతము పలుకడు కదా! కూడికలో నివి యన్నియు అఱువది యాఱు అగుచుండగా అఱువది నాలుగు అని అనినా డేమి? ఇందలి భావమేమై యుండును?

భరతుని భావ మిదియై యుండును. "నామతః" అని ముని యనెను. ఈ నిరూపిత హస్తముల నన్నిటిని నామనిర్దేశమున పరిశీలించినచో నివి అఱువది నాలుగె యగును. కాని అఱువది యాఱుకావు. అసంయుత హస్తములలో సూచ్యాస్యము సూచీముఖము నిరూపితము. సంయుత హస్తములలో స్వస్తికము నిరూపితమయినది. అవియే నృత్తహస్తములలో స్వస్తికములని సూచ్యాస్యములని నిరూపితము లయినవి. ఇట్లివి సమాననామములతో నున్నవి. అచట సంయుతా సంయుతములలో నిరూపితము లయిన స్వస్తిక సూచ్యాస్యములె యిందు నున్నందున వీని పేరులలో వేఱుపాటు లేనందున భరతు డఱువదినాలుగనుట యుక్తమె యగును. అన్నిటిని లెక్క పెట్టిన అఱువది యాఱె కాని నామతః చూచినచో అఱువది నాలుగె, అందుననె ముని "నామతః" అనెను. ఆతని సంఖ్యానము యుక్తమె. దాని నన్యథా భావింప రాదు.

సోమేశ్వరాదులు కొందఱు నృత్తహస్తము లిరువది తొమ్మిది యయినను, ఇరువది యేడు నృత్తహస్తములనిరి. వారి భావ మిట్లుండును. నృత్తహస్తములలో " పల్లవములు లలితములు లతాఖ్యములు వలితములు " నిరూపితము లయినవి. వానిలో లలితములు పల్లవరూపము లని వలితములు లతాఖ్యరూపము లని సోమేశ్వరాదులు భావించిరి. కావున వారి మతమున లలితము లను వలితము లను వేఱుగా పరిగణింప నక్కఱ లేదు. అందు

వలన నృత్తహస్తములలో లలితవలితములను విడనాడిరి. నృత్త హస్తము లిరువదియేడని యనిరి. వారి మతమున భరతుడు చతుష్షష్టి యనుట యిట్లు సమర్థిత మయినది.

శార్ఙ్గదేవుడు ముప్పది నృత్తహస్తములను పరిగణించెను. అలపల్లవ ఉల్బణములు, రెండిటిని వేఱుగా పరిగణించెను. భరతుని చతుష్షష్టిని సంగత పరచుట కుపాయాంతరము స్వీకరించెను. నృత్త హస్తములలో స్వస్తిక విప్రకీర్ణములను వేఱుగా పరిగణింప నక్కఱ లేదు. మొదటి దానిని రెండవది యనుకరించును. అట్లే ఉరోమండల పార్శ్వమండలములను అలపల్లవ ఉల్బణములను వేఱువేఱుగా లెక్కింప రాదు. ఇట్లాఱు హస్తములు మూడుహస్తము లయినవి. ముప్పది హస్తములు ఇరువది యేడయినవి. భరతుని చతుష్షష్టి సంగత మయినది అని.

ఈ భావములను భావించి భావించి జాయపతి యీ ప్రఘట్టసార ముల్లేఖించెను.

నృత్తహస్తములలో స్వస్తికములు విప్రకీర్ణములు కలవు. రేచితములు అర్ధరేచితములు కలవు. వాని లక్షణములు సమానము గా నున్నను నామభేద మున్నందున భిన్నభిన్నములుగనె గుర్తించిరి కదా? అట్లే పల్లవ లలితములకు, లతాఖ్య వలితములకు లక్షణ సామ్య మున్నను నామభేధ మున్నందున వేఱువేఱుగనె పరిగ ణించుట యుక్తము కావున సోమేశ్వరభాష మెట్లు స్వీకార్యము.

శార్ఙ్గదేవుని మతమున ఉల్బణములు అలపద్మములు ఊర్ధ్వమండల పార్శ్వమండల- ఉరోమండల-ఉరః పార్శ్వార్ధ మండ లములను-నృత్తహస్తములు లక్షణసామ్య మున్నందున వేఱువేఱుగా

పరిగణన మావశ్యకము కా దని మూడిటిని విడనాడ వచ్చు నని భావ మున్నది. అట్లే యయినచో రేచితార్ధ రేచితములు భిన్నములు కా నక్కఱ లేదు. ఆ రెండిటినొకటిగా జెప్ప వచ్చును గదా ఆ నృత్త విద్యా విశారదు లిట్లేల నిరూపింప వలెను.?

మునిమతమున ఉల్బణములు అలపద్మములు భిన్నములే యయినచో నవి వేఱువేఱుగనె యుండి బహురూపములె యగును కదా? అంజలి కపోతము కర్కటకము మొదలగునవి సంయుత హస్తములు కదా? అవి యన్నియు రెండు కరములచే ప్రయోగింప దగినవి రెండు హస్తములచే ప్రయోగింప దగిన నృత్తహస్తములను జెప్పునపుడు "చతురశ్రే తలపుటే" అని ద్వివచనమునె భరతుడు ప్రయోగించెను. అట్లే ద్వివచనమున ప్రయోగ యోగ్యము లయిన అంజలి మొదలగు వానిని ఏకవచనమునె భరతుడు ప్రయోగించి నా డేమి? నృత్తహస్తమున ద్వివచనమును గూర్చినాడు కదా?

ఇట్టి యాశంక కలుగగా నీ విషయమును భావింప వలసి యున్నది. నృత్యమును నిరూపించుటకు అంజల్యాది సంయుత హస్తము లున్నవి. అవి యన్నియు సంయుక్త హస్తములచే ప్రయోగింప దగినవియె. సంయుక్తములు రెండు హస్తములు హస్తత్వమున సిద్ధి కల దయినపుడు నృత్యమున సంగతము లగును అనగా రెండుహస్తము లేక విధమున గోచరించిన నృత్య సంగతి స్పష్ట మగును. నృత్త హస్తములలో రెండు హస్తములచే గాని, ఒకే హస్తమున గాని ప్రయోగ ముండును. నృత్తహస్తములు సంయుతాసంయుత రూపోపజీవనమున నుండునవి గాన, ఒక్కప్పు డేకాకి రూపమున నుండ వచ్చును. సంయుతరూప జీవనమున రెండు హస్తములచే ప్రయోగ ముండుటయు, అసంయుతరూప జీవనమున ఒకే హస్తమున ప్రయోగ

ముండుటయు ప్రగ్రాహ్యము. హస్తత్వాసిద్ధి యుండుట అను కారణమున నృత్తహస్తములలో రెండిటికి ప్రాధాన్యము సూచించుటకు ద్వివచన ప్రయోగము సూచించెను. ఇట్టి భావ విశేషము ననుసరించి అంజల్యాదులలో నేకవచనమును తలపుటాదులలో ద్వివచనమును సంగత పఱచుకొన వలెను.

### అసంయుతహస్తాః ౧. పతాకః

ప్రకృతిత్వాత్పతాకస్య ప్రవృత్తిస్సర్వకర్మసు
జాయతే హి స్వభావేన వినియోగోఽస్య తన్మహాన్
ప్రసూతిర్బహుహస్తానా మత ఏవాస్య ముఖ్యతా
తర్జనీమూలగోఽంగుష్ఠః కుంచితః కుంచితాంఘ్రివత్
అంగుల్యో యత్ర జాయంతే సమశ్లిష్టప్రసారితాః
స పతాక ఇతి ఖ్యాతః పతాకాకార ధారణాత్
హర్ష గర్వ ప్రహారాదౌ ఫాలదేశస్థితో భవేత్
చపేటే తాలికాయాం చ స్యాద్వరాభయదానయోః
పుష్పాదేః సంయుతో హర్షే విశ్లిష్ట చలితాంగులిః
లలాటోర్ధ్వగతోఽధస్తాద్వర్షధారా నిరూపణే
పుష్పోపహార శష్పాదౌ స్వస్తికీభూయ విచ్యుతః
మిథో ఘృష్టతలో మృష్ట పిష్ట ధౌతాదిషు స్మృతః
మిథస్సమ్ముఖవిశ్లిష్టః శిలా వ్యుత్పాటనాదిషు
పక్షోత్క్షేపే కటీక్షేత్రాత్ గచ్ఛన్న విరలాంగులిః
ఉత్సాహన బహుప్రాంశు ప్రముఖేషు సరేచకః
నిషేధే చలితః పార్శ్వే స్యాదధః పుష్కరాహతే
తిర్యగగ్రోగ్రసర్పే స్యాచ్చలాంగులిరధస్తలః
సమీరే లహరీవేగే వేలాక్షోభేఽప్యయం క్రమాత్
స ఏవోత్తానితో హస్తో భవేదోఘ ప్రదర్శనే

## అసంయుతహస్తములు. ౧ పతాక

వీనికి యథాన్యాయముగ లక్షణము వినియోగము ప్రదర్శింప వలెను. వినియోగశబ్దార్థము రెండు విధములు.

౧. వినియుజ్యతే అనేనేతి వినియోగః

౨. వినియుజ్యతే అస్మిన్ ఇతి వినియోగః

వినియోగ సాధనము, వినియోగ విషయము రెండును వినియోగ పదార్థములు నాట్యోద్దేశమున వినియుక్త మగుట ముఖ్యము. పతాకాదు లిరువది నాలుగును అసంయుత హస్తములు. ఈ హస్త నామములను ఉద్దేశించి చెప్పుట యుపదేశరూపము. ఇందు పతాకము మొదటి దగుట దాని ప్రాధాన్యసూచకము.

అసంయుత హస్తములలో పతాకము మొదటిది. పతాకము సర్వవిధ హస్తములకు ప్రకృతి. ప్రకృతి యనుట వికృతి రూపము లయిన త్రిపతాకాదుల కన్నిటికి మూలము. పతాక హస్తమునకు సర్వకర్మలందును ప్రవృత్తి యున్నది. పతాకమునకు స్వభావముననె వినియోగము కలుగును. కావున నిది ముఖ్యము. బహుహస్తముల కిది ప్రసూతి. ఉత్పత్తిస్థానము. అందుననె దీని కంతటి ముఖ్యత్వము కలదు. పతాకాకారధారణ మున్నందున పతాకము.

దీని స్వరూపలక్షణ మిట్లున్నది. హస్తమునకు సంబంధించిన అంగుళు లన్నియు సమముగా చక్కగా సుశ్లిష్టములై బాగుగా కూడుకొనినవై ప్రసారితములై యున్నచో నది పతాక మను హస్త మగును. పతాకము యొక్క ఆకారము ధరించి యున్నందున పతాక మని ప్రఖ్యాత మయినది. అంగుళు లన్నియు

ప్రసారితము లగుట, సమములై యుండి ప్రకృతిస్థము లగుట "ప్రసారి తాగ్రాః" ప్రసారితములు ప్రధానములుగా నుండుట యని భావము. అంగుళి యంగుళి సహితమై యవిరళముగా నుండవలెను. అంగుష్ఠము కుంచితముగా నుండవలెను.

పతాకహస్త వినియోగము వివిధరీతుల నున్నది. స్థాన-భేద విన్యాసమున, స్వరూపభేద విన్యాసమున వినియోగభేద మున్నది. పతాకము వినియోగము పొందు నప్పుడు కొంత కొంతగా మాఱును. ఏకదేశవికారము పొందును. అయినను పూర్వరూపపరిజ్ఞాన ముండును. అప్పుడు పూర్వప్రకృతి పరకృతియు మూలము ననుసరించియె యుండును. కాన పతాకరూప ముండనే యుండును. ఇట్లే యితర హస్తము లందును గుర్తింప వలెను.

పతాకము ఫాలదేశ స్థిత మగునేని హర్షగర్వ ప్రహారాదులలో వినియుక్త మగును. హస్తప్రయోగ మెఱిగినవారు లోక ప్రసిద్ధి ననుసరించి స్వయముగ నుత్ప్రేక్షించి హస్తప్రసార మొనరింప గలరు. నాట్యాచార్య ప్రవాహమును గూడ ఇం దనుసరింప వలెను. వారు సంప్రదాయమున ననేకరీతులను భద్రపఱచి యుందురు. ఊర్ధ్వముఖము అధోముఖము సమ్ముఖము పార్శ్వగతము పరాఙ్ముఖము ఉత్తానము త్ర్యశ్రము చంచలము అచంచలము ఇ ట్లనేకవిధముల నాట్యప్రవాహ మున్నది. దానిని గుర్తింప వలెను.

వరాభయ ప్రదానములలో చపేటిక నిచ్చుటలో (చెంప. దెబ్బ) తాలము వేయుటలో పతాక ముపకారి యగును. హర్షము సూచించుటలో పుష్పాదుల వృష్టిసమయములో విశ్లిష్టములు చలితములు నయిన వ్రేళులతో నుండును. వర్షధారా నిరూపణమున

ఫాలభాగమున నున్నదై యధోగతముగ నుండును. పుష్పముల నుపహారముగ నిచ్చునపుడు గడ్డిపరకల వేయునపుడు స్వస్తికముగా నయి విచ్యుత మగును. శిరోదేశమున నధోముఖముగా నున్న హస్తము క్రమముగా చలాంగులియై యధోగమనము కలదగుట యిచట పరిగ్రాహ్యము. చేతిలో చేయి వేసి పతాకను ప్రదర్శించుట యను పరిఘృష్టతల విధానమున రెండవ పతాకా హస్తముతో క్షాలన మర్దన పేషణములు కలద్రవ్యము నభినయింప వచ్చును. రెండు చేతులు పరస్పరము ఘృష్టతలములై విడిపడి మృష్టపిష్టాదులలో వినియోగము పొందును. పరస్పరము సమ్ముఖములై విడిపడిన పతాకముచే శైలశిలా సముత్పాటనము మొదలగు వాని నభినయింప వచ్చును. కటిప్రదేశమున హస్త ముంచి ఒక పార్శ్వమున విడిబడ జేసి నడచుచు పట్టిన పతాకమున, ఇతరుని ఉత్సాహపెట్టుట, ఉత్సాహమున సంప్రేరణము, మహాజనాభినయము మొదలగు వాని నభినయించునది. ఈ సమయ పతాకము రేచక విధానమున నుండవలెను. నిషేధమున చలిత మగుటయు నుండును. పుష్కరము మద్దెల మ్రోగించుటలో పార్శ్వమున ప్రసరించుట యుక్తము అడ్డముగా పైకి ప్రసరించునపుడు పతాకము చలాంగులియై అధస్తలమున ప్రసరించును. అపుడు వాయువు నభినయించుటలో లహరీ వేగము నిరూపించుటలో సముద్రపు టొడ్డు క్షోభము పొందుటలో వినియుక్త మగును. అట్టి పతాక హస్తమె యుత్తానితమై ప్రవాహ ప్రదర్శనమున నుపయోగించును.

లోకోచిత మయిన చలనక్రియ సంయుతాసంయుతములతో నుండును. అగ్నిజ్వాలలో ఊర్ధ్వ గమనము, జలధారలో నధోగమనము నుండును. ఇట్లు నానాముఖత్వమును నాట్యాచార్యాభి

నయమున గుర్తింపవలెను. పతాకవినియోగమున కివియె విషయము లగుట కాదు. తన బుద్ధివివేకమున కీ రీతి తోడు చేసికొని యా యా యితికర్తవ్యతను భావించి ప్రయోగింప దగును. ఈ పతాకము స్త్రీపురుషులకు ప్రయోగింప దగును.

## ౨. త్రిపతాకః

ఆనమ్రానామికస్సోఽయం త్రిపతాకః కరో భవేత్
యతోఽత్రాంగులయస్త్రిస్రః పతాకాకారసంస్థితాః ౨౨౫
ఆవాహనావతరణ ప్రణామోన్నామనేష్వయం
మాంగల్యవస్తుసంస్పర్శ ప్రవేశాదౌ చ శస్యతే
అనుకృత్యా యథార్థాఖ్యాః భవేయుః ప్రాయశః కరాః

## ౨ త్రిపతాకహస్తము.

పతాకహస్తము నందున్న అనామిక ఆనమ్రమై (వంకర) యుండగా మిగులు అంగుళులు పతాకాకారముననె యున్నచో నిది త్రిపతాకము అను సంజ్ఞకలది యగును. ఆవాహనము, అవతరణము, ప్రణామము, ఉన్నామనము లాలనమున ముఖమును పై కెత్తుట, మాంగల్య వస్తు సంస్పర్శము, ప్రవేశము మొదలగు వాని యం దిది ప్రశస్తము. కరవిశేషము లన్నియు అనుకృతిచే సార్థకనామము లగును. లోకప్రసిద్ధము లయిన క్రియల సాదృశ్యమున ఆ యా పేర్లు నిర్ణీతము లగుచున్నవి. కావున నివి యన్నియు సార్థకనామములు.

త్రిపతాకమునకు సంబంధించిన కర్మ విశిష్టముగా నున్నది. నాటకము లందనేకవిధముల కర్మనిర్దేశము లున్నవి. వాని యం దీ త్రిపతాకము వినియోగము పొందును. ఆ యా వినియోగములలో త్రిపతాకము నెటుగా నెటుగా త్రిప్పవలెనో నాట్యవిధుల సన్నిధాన

ములో గుర్తించుట యావశ్యకము. నాట్యవిదుల మని తలచువారి ప్రయోగములలో కన్పడు వ్యత్యాసములను శాస్త్రానుసారమున సవరించుకొనవలసి యుండును. పతాకహస్తమునకు త్రిపతాకహస్త మునకును వినియోగబాహుల్యము విచిత్రముగ నున్నది.

### 3. సర్పశిరాః

పతాకస్య యదా నిమ్నం తలం సర్పశిరా స్తదా
ప్రతిగ్రహే ప్రదానేఽథ తోయధారణసేకయోః ౨౩౦
గతౌ సర్పస్య మల్లోరుబాహూ స్ఫోటనయోర్భవేత్
కుంభికుంభద్వయస్కంధబంధురాస్ఫోటనాదిషు

### 3 సర్పశిరము

పతాకహస్తమునకు సంబంధించిన మధ్యతల ప్రదేశము నిమ్నముగా నుండునేని సర్పశిరసము సర్పశిరము అను హస్త మగును. దీనిని ప్రతిగ్రహమున ప్రదానమున జలధారణమున జలసేచనమున సర్పగమనమున వినియోగింప దగును. మల్లయుద్ధమొనరించువారు ఊరు వాస్ఫాలించుటలో, బాహువా స్ఫాలించుటలో దీని ప్రయో గింతురు. గజకుంభాస్ఫోటనమున స్కంధాస్ఫోటనమున నింక నిట్టి వానిలో నిది యుపకరించును.

అంగుష్ఠముతోఁగూడ సర్వాంగులులు సంహతములై తలము నిమ్నమై యుండగా సర్పశీర్ష మయినది. సర్పశిరస్తుల్య ముగా నుండుటచే నీ నామము సార్థకము.

### ४. మృగశీర్షకః

అస్యాంగుష్ఠకనిష్ఠే చే దూర్ధ్వకే మృగశీర్షకః
ద్యూతాక్షపాతనే శక్త్యా ఉల్లాసే స్వేదమార్జనే
ఇహ సాంప్రత మత్రాస్త్రీత్యాదౌ చైవ ప్రయుజ్యతే

౫. మృ గ శీ ర్ష క ము.

పూర్వము చెప్పిన సర్పశీర్షమునకు సంబంధించి మృగశీర్షమున్నది. ఇట్లే సర్వహస్తములు కొంతకొంత పరస్పరసంబంధము కలవగును. పూర్వపూర్వ ముత్తరోత్తరమునకు నిష్పాదక మన్న భావ మక్కఱ లేదు. కావుననే నామనిర్దేశములో భరతక్రమము వేఱు. ఇతరుల క్రమము వేఱు. ఇందలి క్రమము వేఱు. అయినను కొంతగా పూర్వపూర్వముతో సంబంధించి యుత్తరోత్తర ముండునట్లు గ్రంథకర్త నిరూపించెను.

సర్పశీర్షమునకు సంబంధించిన వ్రేళులలో అంగుష్ఠము కనిష్ఠ మూర్ధ్వముఖముగా నున్నచో మృగశీర్ష మగును. మిగిలిన సర్వాంగుళు లధోముఖములుగనే యుండవలయు నని భావము. మృగమునకువలె శృంగములు శిరస్థములై యుండుటచే నీ పేరు సంగతము.

ద్యూతమున పాచికలను పారించుటలో శక్తిసముల్లాసములో స్వేదమార్జనములో నిది యుపకరించును. "ఇదం సాంప్రతమత్రాస్తి" ఇది ఇచట ఇప్పుడు కలదు. అనుటలో నిది ప్రయుక్తమగును. ప్రత్యక్షముగా నధికరణము నిర్దేశించుటలో వినియుక్తమగును ఇది యిప్పు డని వర్తమానకాల నిర్దేశ మొనరించుటలో నుపకరించును "ఇది యున్నది" అను అభ్యుపగమాభినయములో "ఇది యుండును" అను సంభవాభినయములో దీని వినియోగమున్నది ఇంక నిందు విశేషములు కలవు.

౬. క ర్త రీ ము ఖః

త్రిపతాకస్య మధ్యాయాస్తర్జనీ పృష్ఠదర్శనీ
యదా భవేత్తదా విద్భిర్జ్ఞేయోఽసౌ కర్తరీముఖః

ఆల_క్తకాదినా పాదరంజనాదావధోముఖః
ఉత్తానో దష్టశృంగాదౌ తథా లేఖాదివాచనే ౨౩౫

౫. క ర్త రీ ము ఖ ము

త్రిపతాకమునకు సంబంధించిన తర్జనివ్రేలు మధ్యమాంగులి పృష్టమును వెనుకభాగమును చూచునదిగా నున్నచో నది కర్తరీముఖ మని నాట్యవిదులు గు_ర్తింపవలయును. ఈ కర్తరీముఖ మల_క్తకాదులచే పాదరంజన మొనరించుటలో నధోముఖముగా నుండి వినియు_క్త మగును. దష్ట శృంగాదులలో లేఖరచనములో నిది యుత్తానమై యుపకరించును. దష్ట మనునది దంశనము. తత్సమాన మగు క_ర్తనాదికమును గావచ్చును. నాసిక నుండి కర్ణాంతమువఱకు ఊర్ధ్వముఖముగా కర్తరీముఖమును ప్రయోగింపగా దంశనము సూచిత మగును. హ_స్తద్వయసన్నివేశమున కర్తరీముఖము చూపి శృంగము నభినయింపవలెను.

త్రిపతాకములో తర్జనీ మధ్యమాంగుళులు సంశ్లిష్టములై యుండును. ఇం దట్లు కాదు. అవి రెండును విడివిడిగా అసంశ్లిష్టములై యుండును. కర్తరి-కత్తెర యం దట్టి రూపమునె సాధింతురు. అట్లై యిం దది యభినీత మగును.

౬. క ట కా ము ఖః

తలస్థానమితా మధ్యా ముఖేఽంగుష్ఠనిపీడితా
వక్రా ప్రదేశినీ శేషే వక్రోర్ధ్వే కటకాముఖే
స్రగ్దామ ప్రగ్రహ ఛత్ర వ్యజనాదర్శ ధారణే
శరవస్త్రాంచలాకర్షే — — —

౬. క ట కా ము ఖః

ముష్టిహ_స్తము కపిత్థహ_స్తము ఈ కటకాముఖము పరస్పరసంబంధము కలిగియున్నవి. కటకాముఖమును ఖటకాముఖము

అనియు నందురు. "ఖట కాంక్షాయాం" కాంక్షార్థ మయిన ఖట ధాతువు క్షుత్ప్రతీక్షాసార్థము లందు వర్తించును. ఖటకుని యా ముఖమున నిది నిరూపిత మగును. గావున ఖటకాముఖ మగును. ఇందు మధ్యమాంగుళి కరకూర్పుకు తలస్థానమునందే మిత్తమై యుండును. తర్జని వ్రేలు వక్రముగ నుండును. మిగిలిన రెండు అనా మిక కనిష్ఠికలు వక్రము లూర్ధ్వముఖములై యుండవలెను. అప్పు డది కటకాముఖహస్తము.

ఇచటి గ్రంథములో దీని వినియోగము సూచించు శ్లోకము లన్నియు లేవు. మొదటి శ్లోకమె కొంత సూచించి కొంతలో జారి పోయినది. మరి కొన్ని శ్లోకము లుండవలెను. ఇతర గ్రంథము లింకను వినియోగము సూచించినవి. అట్లు సూచితముల యాధారమున వినియోగసూచన మావశ్యకము. నాట్యవేదమున హోత్ర హవ్య ఖండన ఆయత దండగ్రహణ పుష్పాపచయ ప్రతోద అంకుశ సార జ్యాకర్షణ స్త్రీదర్శనాదులును వినియోగ స్థానములుగా నిర్దిష్టము లయినవి.

కటకాముఖ హస్తవినియోగములు. పుష్పమాలా ధారణము. ఖడ్గము పట్టుట, ఛత్రధారణము, వ్యజన ధారణము అద్దము పట్టుట, శరాకర్షణము, వస్త్రాంచలాకర్షణములలో దీని విని యోగ మున్నది. ×× హోత్ర హవ్య చ్ఛత్రములలో నిది యుపకారి. యాగోపకరణ మయిన స్రుగాదికమునకు హోత్ర మని పేరు. వస్త్రాంచలాకర్షణము వివాహమున నున్నది. ప్రణయకోప సమయ, ప్రయాణకాలమున నున్నది. కేలివశమున కేశాకర్షణము నందును సహకరించును. ఇట్లు అనేక ప్రధానకార్యములందు కటకా ముఖము వ్యాపృతమై యున్నది.

౭. సూచీముఖః

భవేత్సూచీముఖో హస్తః (చేత) తర్జన్యాయతా యది
హస్తః సూచీముఖః స స్యాదభినేయమిహోచ్యతే ౨౯౫
ఊర్ధ్వానా నతా లోలా కంపితా జృంభితా తథా
ఉద్వాహితా చలేత్యస్మిన్ తర్జనీ సప్తధా మతా
ఊర్ధ్వానా భవేదూర్ధ్వా క్రియతేఽధోముఖే నతా
లోలా పార్శ్వాంతరం యాతా కంపితా స్పందితా స్మృతా
జృంభితాభిమతా కించిత్కుంచయిత్వా ప్రసారితా ౨౫౦
ఉద్వాహితా వ్రజంత్యూర్ధ్వం గచ్ఛంతీ కామతశ్చలా

౭. సూచీముఖము.

ఈ సూచీముఖలక్షణములో కొంత లేదు. లేని కొంత యిచట నున్నది. అది గ్రంథాంతరము లోనిది. తర్జని ఆయతముగా నున్నచో సూచీముఖ మను హస్తమగును. కటకాముఖ మను హస్తము నందలి తర్జని సంప్రసారిత మగుట యని భావము. సూచీముఖాభినేయము సూచిత మగును. ఇందలి తర్జనివ్రేలునకు సంబంధించిన ప్రయోగము లనేకములు కలవు. వాని నన్నిటిని సంఖ్యానించుట శక్యము కాదు. సంక్షేపముగా గొన్నిటిని నిరూపించవచ్చును. ఈ నిరూపితానుసారమున అనిరూపితముల గుర్తింపవచ్చును.

ఇందలి యీ తర్జనీ విన్యాస మేడు విధములు.
౧. ఊర్ధ్వానన. ౨. నత. ౩. లోల. ౪. కంపిత
౫. జృంభిత. ౬. ఉద్వాహిత. ౭. చల.

వీని స్వరూప మిట్లుండును. ఊర్ధ్వముగా నుండు తర్జని ఊర్ధ్వానన, అధోముఖముగ నూర్చినచో నత, పార్శ్వాంతరమునకు

ప్రసృత మయినచో లోల, స్పందము కల దయిన కంపిత, కొంచె ముగా వంచి ప్రసారిత మొనరించినచో జృంభిత, ఊర్ధ్వమునకు ప్రసరిం చునది యగునేని ఉద్వాహిత, ఇచ్ఛానుసారమున నుండు నేని చల యగును.

సూ చీ ప్ర యో గః

పృథఙ్మిధః ప్రభేదాయ వినియోగేషు యుజ్యతే
ఊర్ధ్వాస్యా తర్జనైకత్వయష్టి మోజ గృహాదిషు
ఊర్ధ్వావలోలా చ భవేత్ వామమండలవర్తినీ
చక్రే తథాభిధే శస్త్రే కులాలరథ దేహినాం
గ్రహణే సర్వలోకస్య వృత్తమండలయోరపి
గండేఽనుకుండలే సౌదామన్యాం స్ఫురిత కంపితా
ఉత్కృష్టా తు పతాకాయాం మంజర్యాం కంపితా మతా
మీనాదివక్రసంచారే పార్శ్వాత్పార్శ్వాంతరం గతా
అంగుష్ఠోపహితా ధూపదీపయోః కాకపక్షకే
అలాబ్వాదిషు వల్లీషు ద్రాక్షాదిషు లతాస్వపి
పల్లవే పతనే వక్రభావే బాలభుజంగమే
వినతా సృక్వసంపన్నా వరాహాదిషు దంష్ట్రిషు
వామతో దక్షిణం యావత్ ప్రోన్నతా వినతా క్రమాత్
ఉదయాస్తమయే దీర్ఘగమనాత్ సూచయత్యసౌ
వాక్యం నిరూపయత్యాస్యాభ్యగ్రే కుంచితజృంభితా
కుండలాంగదయోః స్పర్శే కుంతలానాం ప్రసాధనే
స్వేదస్య మార్జనే పత్రభంగాదౌ చ ప్రసారితః
ఉత్కంపసహితా సైవ భ్రామితా రోషదర్శనే
స్యాత్త్వదేతి స ఇత్యాదౌ సైవోత్తానీకృతా పునః
క్రోధేన రిపునిర్దేశే కోఽసావితి నిరూపణే

అగ్రగా కథితా తత్ర వస్తునశ్చ దవీయసః
తిరశ్చ కర్ణకండూతౌ సంగమే సంగతాన్వయా
విశ్లేషితా వియోగే స్యాత్ కలహే స్వస్తికీకృతా
మిథః శృంఖలితా బంధే తాలమాత్రాంతరాలయోః ౨౬౯
స్వసంముఖపరాఙ్ముఖ్యో దక్షిణం గతయో ర్ద్వయోః
సూర్యస్యాస్తమయ స్స్యాద్యో భాగస్తస్య హి దక్షిణః
ఏవం వామో శశాంకస్య భాగస్తస్యహి సమ్మతః
భ్రాంతాగ్రాధోముఖీ యత్ర కూపావర్త శిలాదిషు
సంగతాధోముఖీ ఫాలేత్ర్యంబకస్య నిరూపణే ౨౭౦
తత్త్రైవ తిర్యగుత్తానా సహస్రాక్షస్య సూచనే

## సూచీముఖము

ఇచటి యీ శ్లోకపంక్తు లన్నియు సూచీముఖ హస్తమునకు సంబంధించిన వినియోగప్రదర్శన పరిమితులు. సూచీముఖమునకు సప్తభేదములు కలవు కదా! అవి వేఱువేఱుగా వినియోగము లందు యుక్తములు కాగలవు. అప్పుడు వాని మిథఃప్రభేదము స్పష్ట మగును. ఊర్ధ్వాననాత్మక మయిన సూచి, భయపెట్టుటలో, సూచించుటలో, యష్టిగ్రహణములో ఘోణాగ్రహణమున నింక నిట్టి వానితో వినియుక్త మగును. ఊర్ధ్వముఖము లోలము నయిన సూచి వామమండలమున సంచరించుచు కుమ్మరివాని చక్రము సారె యందును, రథచక్రము నందును, వీరునిశస్త్రమునందును వినియుక్త మగును. స్ఫురిత స్వభావము కల కంపితహస్తము లోకగ్రహణమున, వృత్తమున మండలమున, గండస్థలమున, తదనుసారమున నుండు కుండలరూపమున, మెఱుపు రూపము నిరూపించుటలో నుపయుక్త మగును. కంపితహస్తమె పతాకనిరూపణములో, మంజరినిర్దేశములో, మీనాదుల వక్రసంచారములలో నుపయుక్త మగును.

అప్పుడు పార్శ్వము నుండి పార్శ్వాంతరమునకు సంచరించునది కావలెను. ఆ వ్రేలు అంగుష్ఠముతో కూడుకొనినది యయినపుడు ధూపదీపముల నిరూపించుటలో కాకపక్షము-జులపాలు-ముంగురులు సూచించుటలో నుపయుక్త మగును. అదియె అలాబూ లత-సొర తీగలను సూచించుటను ద్రాక్షాది లతలను సూచించుటను సమర్థ మగును. వినత యగు సూచీముఖ ప్రదేశిని పల్లవము, పతనము, వక్రీభావము, బాలభుజంగమము చిన్న పాములను సూచించుటలో నుపయుక్త మగును. ఆ వినతాంగుళియె సృక్వభాగమున గూడు కొనినదై కోరలతో గూడుకొనిన వరాహాదుల సూచనమున నుపక రించును. వామభాగమునుండి దక్షిణభాగమునకు ప్రోన్నతముగా సంచరించుచు క్రమముగా ఉదయాస్తమయ ములకు సూచక మగును. అట్టి సూచనమున దీర్ఘ గమన ముండును.

జృంభితసంజ్ఞ కల సూచీముఖ తర్జని కుంచిత రూపమున నున్నదై ముఖాగ్రభాగమున సంచరించుచు వాక్యము నిరూపించునది కాగలదు కుండలాంగదముల స్పర్శలో వినియుక్త మగును. కుంతల ముల ప్రసాధన విధానమున నుపయుక్తము కాగలదు. అదియె యుత్కంప సహితమై స్వేద మార్జనమున నుపకరించును. పరిసా రితమై పత్రిభంగాదుల నుపయుక్త మగును. భ్రామిత మైనదై రోమదర్శనమున వినియుక్త మగును.

"ఆత డప్పు డట్లయ్యో" అను వంటివానియభినయమున నది యుత్తానీకృతమై యుపకరించును. క్రోధమున శత్రువును నిర్దే శించుటలో "ఈత డెవడు?" అని నిరూపించుటలో నిది యుపకారి. అగ్రభాగముగ తర్జని ప్రసరించి దగ్గఱ నున్న వస్తువును నిరూపించు టలో నుపయుక్త మగుట యున్నది. ఆ తర్జని తిరఃప్రసారము

పొంది కర్ణకండూతి యభినయనమున సహకరించును. మరియొక వ్రేలితో కూడుకొనినదై సంగమ...ర్థమున సంగత మగును. విశ్లేషితమై వియోగార్థమున ప్రసరించును. స్వస్తికీకృతమై కలహమున నుపయుక్త మగును.

సంయుతహస్తమున పరస్పరము శృంఖలిత (గొలుసు) స్వభావమున నుండి తాల మాత్రల యొక్క యంతరాలముల బంధ సంబంధమున వినియుక్త మగును. తాలాంతరము మాత్రాంతరము ననుసరించి యుండు విధానము నృత్యహస్త వినియోగమగునా? నృత్త హస్త వినియోగ మగునా? గతిలయ విధాన ములలోని యంతరాల విశేషముల సూచనము ముఖ్యముగా నృత్త హస్తములందె యుండును. నృత్యహస్త విశేషముగా నున్న సూచీముఖము శృంఖలితాబంధమున నున్నప్పుడు తాల మాత్రలయ విధానముల ననుసరించి నృత్త హస్తముగా గూడ నుండుట నిది సూచింపవచ్చును.

స్వస్తికీకృతము లయిన సూచీముఖాంగుళులు స్వసమ్ముఖ పరాఙ్ముఖత కలవై దక్షిణభాగమునకు ప్రసరించినవి కాగా సూర్యాస్తమయ సూచకములగును. అట్టి యప్పటి సూచీముఖము నకు సూర్యుడు దక్షిణభాగముగ నభినయింప వలెను. వామభాగము చంద్రరూపముగా నభినయింపవలెను. చంద్రుడు అట్టి సూచీముఖ మున వామభాగ మనుట సమ్మతము. అగ్రభాగము భ్రాంతమై యధోముఖముగ నున్నచో బావిని సూచించుటలో జల ప్రవాహాము నందలి యావర్తము (సుడి) సూచించుటలో శిలాఫలకము సూచించు టలో వినియుక్త మగును. అధోముఖముగ ఫాలమున సంగతము కాగా శివుని మూడుకన్నుల వేల్పు నిరూపణమున వినియుక్త మగును. అచటనే యడ్డముగా నుత్తానముగా నున్నచో సహస్రాక్షుని సూచన

ములో నుపకరించును. ఇట్లు సూచీముఖ వినియోగ విశేషము లశేషముగ నున్నవి. సంపూర్ణ చంద్రమండలమును పరిమండల భ్రమణ నిర్దేశమున సూచించుట యుక్తము. హరనయన ప్రయోగ మున లలాటవిన్యాసమున జూపవలెను. హరదేవుని ఫాలనేత్ర ప్రదర్శనాభినయనమున వ్రేలును లలాటమున గూర్పవలెను. శక్రాభి నయన ప్రసంగమునను లలాటమునందె యుత్తానముగా తిరశ్చీన ముగా వ్రేలి నుంచవలెను. కొందఱు శివశక్రాభినయమును కటకాముఖ మధ్యమాంగుళీ ప్రయోగమున సాధింపదలచుట యుక్తము కాదని గుర్తింప వలెను. సూచీముఖమునకు గల యిట్టి ప్రాధాన్య మితరముల విశిష్టత నపహరింపదు.

౮ శుకతుండః

అంచితాంగుష్ఠ సంలగ్నా చంద్రలేఖేవ తర్జనీ
నిమితానామికా మధ్యా కనిష్ఠే వలితోర్ధ్వగే
యత్రాసౌ శుకతుండః స్యాద్యథార్థాఖ్యో విసర్జనే
ఆవాహనే ధిక్ ఇత్యుక్తౌ నాహమిత్యాది దర్శనే, ౨౮॥

౭. శుకతుండము

చంద్రలేఖ వలె వక్రముగా అంగుష్ఠ సంలగ్నముగా తర్జని యంచితమై యుండునేని, అనామిక నిమితము నియతమై యుండునేని, నడిమి వ్రేలు కనిష్ఠక వలితములై యూర్ధ్వముగ నుండునేని శుక తుండ మను హస్తమగును. శుకతుండ మనుట సార్థకము. ఇది విసర్జనమున ఆవాహమున వినియుక్త మగును. 'ధిక్' అని నిందాయుత ముగ ననుటలో నుపయోగించును. "నాహం, న త్వం, న కృత్యం" "నేను కాదు. నీవు కాదు. చేయ వలయు నది లేదు" అని యనుట లలో వినియుక్తమగును. నిషేధార్థమున నిది యున్నను నిత్యము

నిషేధమె దీని పని కాదు. యాచనమున నిది యున్నది. ఒకడొకటి యాచించు నపుడు కలుగు ఈర్ష్యలో కలహములో వినియోగ మున్నది.

శుకతుండమున కరాళహస్తముతో సంబంధ మున్నది కొన్నిటిలో సంబంధ ముండును. కొన్నిటిలో నుండక పోవచ్చును.

## ౯. హంసాస్యః

అంగుష్ఠ తర్జనీ మధ్యాః సంగతాగ్రాః పరస్పరం
విరలోర్ధ్వే పరే యత్ర మతో హంసాస్య ఇత్యసౌ
శ్లక్ష్ణత్వం మృదుతాల్పత్వం మర్దనక్షేపణాదిషు
కించిత్ప్రస్పందమానాదౌ యథాయోగం విధీయతే ౨౮౬

## ౯. హంసాస్యము

అంగుష్ఠము తర్జని మధ్యమాంగుళులు మూడును పరస్పరము సంగతాగ్రములై యుండగా, మిగిలిన రెండు అనామికా కనిష్ఠికలు విరలములై యూర్ధ్వముగ నుండు నేని హంసాస్య మను హస్త మగును. హంసాస్యమునె హంసవక్త్ర మందురు. తత్తదాకార విశేషమున వామాచిత్యము పరిగ్రాహ్యము కించిత్ప్రస్పందితాగ్రముగ నుండు నీ హస్తమున శ్లక్ష్ణము, అల్పము, శిథిలము, లాఘవము, నిస్సార మభినయించుట యుక్తము. మర్దనము క్షేపణము మొదలగు వానిలో నిది వినియుక్త మగును. మథన విధూననము లందు నుండును.

## ౧౦. కపిత్థః

కటకాముఖ మధ్యాది కనిష్ఠాంతా అధో యదా
తలమధ్యస్థితాగ్రాః స్యుః కపిత్థోఽసౌ నిగద్యతే ౨౯౦
తోమరాసి గదా చక్ర కుంత సాయక శక్తిషు
ఛురికాస్ఫోటనే సత్యే పథ్యే శ్రేయసి వేష్యతే

కటకాముఖ హస్తమున నిరూపించిన మధ్యమానామికా కనిష్ఠికాంగులములు క్రిందుగా నుండి తలమధ్యమున నగ్రభాగములు కూడి యుండు నట్లుగా నున్నచో కపిత్థ మను హస్త మగును. తోమరము, ఖడ్గము, గద, చక్రము, కుంతము, బాణము, శక్తి యను నాయుధము లందును వినియుక్త మగును. సత్యము పథ్యము శ్రేయస్సు లందును వినియుక్త మగును. కపిత్థము వెలగకాయ, తదాకారమున నిందు వ్రేళ్లు లుండును గాన కపిత్థ నామము సార్థకము సత్య పథ్య శ్రేయ స్సూచకముగా ఛోటికా స్ఫోటనము చిటిక వేయుటయు నిందు సంగత మగును.

### ౧౧. శిఖరః

తర్జన్యపి తలస్థాగ్రా కపిత్థస్య సముచ్ఛ్రితః ౨౬౫
అంగుష్ఠస్తు యదా హస్తః శిఖరః కీర్తితస్తదా
గ్రహణే కాశపాశాదౌ శక్తితోమర మోచనే
కాంతానాం కుంతాలోత్క్షేపే చరణాధర రంజనే

### ౧౧. శిఖరము

కపిత్థహస్తమునకు సంబంధించిన తర్జని వ్రేలును అగ్రభాగమును తలప్రదేశమున నుంచగా అంగుష్ఠము సముచ్ఛ్రితమై యున్నచో శిఖరము అను హస్త మగును. ముష్టి హస్తముతో కొంత సంబంధ ముండుట కొన్నిట నున్నది. ఇందు కపిత్థ సంబంధము కలదు. వీని కన్నిటికి పరస్పరసంబధ ముండుట పరిగ్రాహ్యము. లక్షణము వేఱుగా నున్నదని భావించ రాదు. ఆకార మేకవిధము

కాశపాశాదుల గ్రహణము నందును శక్తితోమరముల మోక్షణము నందును, కాంతల కుంతలముల నెత్తుట యందును, చరణరంజన అధరరంజనము లందును శిఖరహస్తము వినియుక్త

మగును. ప్రయోగానుసారమున గండతలము నుండి పై భాగము నకు అలకల నెత్తుటలో నీ హస్త మున్నది. అలకల కుటిలీకరణము నకు నిది కావలెను.

౧౨. పద్మకోశః

అంగుల్యో యత్ర సాంగుష్ఠా విరలా కుంచితోర్ధ్వకాః
ఆసన్నాగ్రప్రదేశాః స్యుః దరహాస సరోజవత్ ౩౦౦
పద్మకోశః స విజ్ఞేయో బాలికా కుచ దర్శనే
కపిత్థ శ్రీ ఫలాదీనాం గ్రహణే చాయమిష్యతే

౧౨. పద్మకోశము.

పద్మకోశము నందు వ్రేళులు విరలముగా నుండ వలెను. అంగుష్ఠముతో కూడి కుంచితములై యుండ వలెను. అసంగతాగ్ర భాగముగా ఊర్ధ్వముగా నుండ వలెను. ఇందు "ఆసన్నాగ్ర ప్రదేశాః స్యు" అగ్రప్రదేశము లాసన్నములై యుండుట కలదు. నాట్యవేద మున "అసంగతాగ్రాః" అనియే యున్నది. "పద్మస్యేవ కోశః అభ్యంతరం వినతం యస్య" అని పదార్థము. పద్మమునకువలె కోశము అనగా అభ్యంతరము వినతముగా నుండుట యని దాని భావము. కోశపదమునకు అభ్యంతరార్థమును గ్రహించినవారు అసంగతాగ్రత్వము భావింతురు. పద్మకోశము ముకులము మొగ్గ అని భావించువారు ఆసన్నాగ్రత్వ మభిమానింతురు. ఈ గ్రంథమునవె ముకుల హస్తమునకు లక్షణము నిరూపించు నపుడు అయిదు వ్రేళులు సంగతాగ్రములుగా నుండుట యున్నది. కావున ముకుల పద్మ కోశ భేదమునకు ఇచట "అసంగాగ్రప్రదేశాః" అని పాఠ ముండుట యుక్తముగా నుండును. ఇట్టి పద్మకోశహస్తము కొంతగా వికసించిన పద్మమువలె నుండును. పద్మకోశహస్తము బాలికా కుచ దర్శన

మున ఇంత యున్న దనుటలో, వెలగ మారేడు ఫలముల నభిన యించుటలో వినియుక్త మగును. "కుచౌ దృశ్యేతే అనేనేతి కుచ దర్శనం పద్మకోశః" ఈ హస్తమున నారీకుచము లోచనగోచర మగును. ఇంకను సుశ్లిష్టము లగు వినియోగ విశేషములు కలవు.

౧౩. కాంగూలః

హంసాగ్రస్య నతానామా విశ్లిష్టాగ్రా స్త్రికాగ్నివత్
యత్రాంగుష్ఠాదయస్త్రిస్రః స కాంగూలోఽభిధీయతే
శిశూనాం చిబుకస్పర్శే స్వల్పకే తరుణే ఫలే
స్యాద్వధూ రోషవాక్యేషు సోఽంగులీ క్షేపణైః పునః ౩౦౪

౧౩. కాంగూలము.

ఈ కాంగూలము ఖాంగూలము కాంగులము ఖాంగులము పేరులతో నున్నది. హంసాస్యమునకు సంబంధించిన విధముగా అంగుష్ఠము తర్జని మధ్యమాంగుళులు త్రేతాగ్నుల వలె విశ్లిష్టములై యుండును. ఆహవనీయము, గార్హ్యపత్యము, దక్షిణాగ్ని యనునవి త్రేతాగ్నులు. అనామిక నతమై యుండును. అట్లుండ నిది కాంగుల హస్త మగును. మధ్యాతర్జనులు విరలము లగుట అంగుష్ఠము శ్లిష్ట ముగ నుండుట, అనామిక వక్రముగా నుండుట, కనీయసి యూర్ధ్వ ముగ నుండుట యపేక్షితము.

కంగు వన ప్రియంగువు. దాని నాకర్షించు నది కాంగులము. కాంగులము వృశ్చిక మని కొందరనిరి. శిశువుల చిబుక స్పర్శన మున నిది యుండును. అల్పముగా నుండు తరుణ ఫల నిర్దేశమున నిది వినియుక్త మగును. వధూ రోషవాక్యములలో వ్రేళుల విద లింపులతో కాంగులము సహకరించును. దీనిచే మరకత వైడూర్యాది

ప్రదర్శనములలో పుష్పాది ప్రదర్శనములలో గూడ దీని వినియోగము గుర్తించునది.

౧౪. ముష్టిహస్తః

శిఖరస్య యదాంగుష్ఠో మధ్యమాం పీడయన్ స్థితః
తదా ముష్టిరితి ఖ్యాతః ఖడ్గకుంతాదిధారణే
ప్రవాహే గాత్రసంవాహే రసనిష్పీడనాదిషు
నిష్పీడే దోహనేంగుష్ఠః తాసాం గర్భస్థితోఽపి చ ౩౧౦

౧౪. ముష్టిహస్తము.

శిఖరహస్తమునకు సంబంధించిన అంగుష్ఠము మధ్యమాంగులిపీడన మొనరించుచు నుండు నేని యది ముష్టిహస్తమగును. ఖడ్గకుంతాదిధారణమున నిది యుపకరించును. ప్రహారమున, గాత్రసంవాహనమున, రసమును పీల్చుటయందును, మన్ను పిసికి ఉండలు చేయుట యందును, పాలు పితుకుట యందును ముష్టి హస్తముపయోగించును. అట్టి సమయమున నంగుష్ఠ మంగుళుల మధ్యనున్నదై యుపకారి యగును. కరతల మధ్యభాగమున హస్తాంగుళులు నాలుగును బాగుగా కూడుకొని యున్నప్పుడు వానిపై అంగుష్ఠమున్నప్పుడు ముష్టి యయినది. వ్రేళులపై నున్న అంగుష్ఠము మధ్యమాంగుళముపై గట్టిగా నొక్కిపట్టి యుండ వలయును. ప్రతిమల్లుని ప్రకోష్ఠము పట్టుటలో ముష్టి యుండును. దోహనాదులలో అంగుష్ఠము వ్రేళులమధ్య నుండుట నీ గ్రంథ ముపదేశించుచున్నది.

౧౫. చతురః

శ్లిష్ట ప్రసారితా స్త్రిస్రః కనీయస్యున్నతా తథా
మధ్యమామూలగోఽంగుష్ఠో యద్యేవం చతురస్తదా

స్యాదేకహస్తాల్పమధ్యాతి ద్యాభ్యాం పద్మదలాక్షిణీ
కించిన్మండలగాభ్యాం చ తాభ్యాం తత్త్వ ప్రపాదికం
ఊర్ధ్వగేన సితం రక్తం మండలేన కరేణ తు ౩౧౫
పీతం నీలం తథా వర్ణం మృదితేన ప్రదర్శయేత్

౧౫. చ తు ర ము.

మూడు వ్రేళులు శ్లిష్టములు ప్రసారితములు కావలెను. కనిష్ఠిక యున్నతముగా నుండ వలెను. అంగుష్ఠము మధ్యమాంగులి మూలమును పొంది యుండ వలెను. అప్పు డది చతురమను హస్త మగును. నాలుగు వ్రేళు లంగుష్ఠ శ్లిష్టములై యున్నందున నిది చతురము. చతురశబ్దము అచ్ ప్రత్యయాంత మయిన అకారాంత శబ్దము. ఒక విన్యాసమున అల్పమధ్యాదులను అభినయించునది. రెండు హస్తముల విన్యాసములచే పద్మదలాక్షి యభినయము సంగతము. నయనము లభినేయము లయినప్పుడుపమానోపమేయ భావము ఉండగా పద్మదలాదికము ప్రదర్శిత మగు నప్పు డొక హస్త ముచితము కాదు. కించిన్మండల కృత మయిన హస్తమున తత్త్వము లజ్జ మొదలగు వాని నభినయించునది. తత్త్వ మనుట సత్త్వము సత్యము నగును. ఈ విధానమున వికృతవిచారిత చరితాభినయ మిష్టము. వితర్కితాభినయము నిష్టము. వికృత ప్రకార మొకహస్తమున జేయుట యున్నది. ఆవేశానావేశము లందు రెండు హస్తములచే నొనరింప వలయును. నానావర్ణములను చతురహస్తమున ప్రయోగింప దగును. ఊర్ధ్వగ హస్తమున సితవర్ణము, రక్తవర్ణము, మండలాత్మక హస్తమున పీతవర్ణము, మృదిత విధానమున (నలుపుట) నీలవర్ణమును ప్రదర్శింప దగును. ఆ యా హస్తవిన్యాసమునకు ఆ యా వినియోగ విశేషమునకు అంతర మయిన సంబంధము కలదు. ఇది భరతవిద్యానిపుణుల విజ్ఞానము.

౧౬. భ్రమరః

లగ్నాగ్రే మధ్యమాంగుష్ఠౌ తర్జనీ కుంచితా మనాక్
విరలోర్ధ్వే పరే యత్ర భ్రమరస్యోఽభిదీయతే
దీర్ఘనాలాబ్జ కహ్లార కుముదోత్పల ధారణే
ప్రసాధనే మృగాక్షీణాం కర్ణపత్ర ప్రధారణే ౩౨౦

౧౬. భ్రమరము.

ఈ హస్తమున మధ్యమాంగుష్ఠములు రెండును అగ్రభాగము లందు లగ్నములుగా నుండును. ఇట్టి అగ్రిసంయోగము నకు సందంశ మని పేరు. "సందంశోఽగ్రభాగః" తర్జని కొంచెముగా కుంచితము కావలెను. మిగిలిన రెండు వ్రేళులు విరలోర్ధ్వములై యుండ వలెను. అప్పు డది భ్రమరము. భ్రమరాకృతి యుండుటచే భ్రమరము. ఈ హస్తమును దీర్ఘనాళము కల పద్మములను కలువలను (అబ్జ - కహ్లార - కుముద - ఉత్పల) ధారణమున వినియోగము పొందును. వనితల యలంకార విధానము లందు నుపకరించును. కర్ణపత్రి ధారణమున వినియుక్త మగును. బెదరించుటలు కోపించుటలు ఉన్నపుడు భ్రమరహస్తము విచ్యుతము సశబ్దము నగును,

౧౭. అరాలః

విరలే వలితోర్ధ్వాశ్చేన్మధ్యాద్యాః ఫణిమస్తకే
అరాలః సత్త్వ శౌండీర్య ధైర్య గాంభీర్య కాంతిషు ౩౨౦
వారణే సౌరభాఘ్రాణే స్వేదాపనయనాదిషు
కేశ సంగ్రహణోత్కర్ష లీలయోశ్చ నతభ్రువాం

౧౭. అరాలము.

సర్పశీర్షమను పూర్వము నిరూపించిన హస్తము నందలి మధ్యాంగుళి మొదలగునవి వలితము లూర్ధ్వములుగా నుండునవి

యయినచో అరాలహస్త మగును. తర్జనివ్రేలు ధనుర్నతముగా నుండుట, మధ్యమానామికాకనిష్ఠికలు తర్జనీపృష్ఠమున సమీపములో నుండుటయు నిందు స్వీకారము. అంగుష్ఠము కుంచితముగనె యుండును. మధ్యమాదిత్రయము కొంత వలితమై యుండుటయు నిచటి స్వరూపము. అరాలపక్ష్మ, అరాలకుంతల యనుటలో అరాలపదము కుటిలార్థమున నున్నది. దీనిచే సత్త్వము శౌండీర్యము ధైర్యము గాంభీర్యము కాంతి యనునవి యభినేయము లగును. నివారణమునందును పరిమల మాఘ్రాణించుటయందును, స్వేదమును నివారించుకొనుటయందును వినియుక్త మగును. వనితల కేశసంగ్రహమున సమధిక లీలలందును అరాళము వర్తించును. “ఘాణ్యావాం” మొదలగు ఆశీర్వాదములు హితపర్యాయములయిన సుఖభావములు దీనిచే నభినీతములు కాగలవు. త్రిపతాకహస్త కర్మలుగా నిరూపించిన వానిని వనిత లరాల హస్తయోగమున నభినయింపవచ్చును.

### ౧౮. హంసపక్షకః

పతాకాంగుల యస్తిస్రో మూలేష్వ వనతా మనాక్ ౩-౨౫
కనీయస్యూర్ధ్వగా యత్ర స కరో హంసపక్షకః
స్పర్శేఽనులేపనే గండసంశ్రయే స్యాత్ప్రతిగ్రహే
ఆవాపే గాత్రసంవాహే రోమాంచ ప్రముఖేష్వపి

### ౧౮. హంసపక్షము.

పతాకహస్తమునకు సంబంధించిన మూడుప్రేళులు మూలమున కొంతగా వంగినవగుట కనిష్ఠిక ఊర్ధ్వముగా నుండుటవలన హంసపక్షము అను హస్త మగును. ఇందు అంగుష్ఠము కుంచితముగా నుండుటయు నిచట వివక్షితము. మూడువ్రేళు లవనతములగుటయె కాక ప్రసారితములై పరిశ్లిష్టములునై యుండదగును. ఇది స్పర్శ-

అనులేపనములందు వినియుక్తమగును. ఈ స్పర్శానులేపనములు కపోలాశ్రయము లయినప్పుడే యీ హంసపక్ష మున్నది. ప్రతి గ్రహమున ప్రసరించును. ఆవాప గాత్రసంవాహన రోమాంచాదు లందు వినియోగము పొందును. హనుధారణ రూపమయిన గండ సంశ్రియకర్మలో నిది సహకరించును. బ్రాహ్మణుల ప్రతిగ్రహాచమ నాదులలో నిదియున్నది. స్త్రీల స్తనాంతరస్థితితో నుండు విభ్రమ విశేషములు నేతత్కార్యములు, శృంగారాదిరసముల వ్యభిచారి విశేషయోగమున హంసపక్షము సుందరము.

౧౯. అర్ధచంద్రః

భుజంగశిరసోఽంగుష్ఠో యదా స్యాద్దూర విచ్యుతః
ఖ్యాతోఽర్ధ చంద్రనామ్నాసౌ బలనిర్ఘాటనే తదా ౩౩౦
కలశేందు కలాకాంచీ మధ్య కుండల కంబుషు
యథాయోగం కృశాంగీనాం లీలాదౌచ విధీయతే

౧౯. అర్ధచంద్రము.

సర్పశీర్షమను హస్తమునకు సంబంధించిన అంగుష్ఠము దూరవిచ్యుత మగునేని అర్ధచంద్రమను హస్తమగును. అర్ధచంద్రమను పేరు నామసంకేతమునని విశదార్థము సార్థకము. లోకప్రసిద్ధము. అంగుష్ఠము ధనువువలె వినతము కుంచిత మగుట, మిగిలిన నాలుగును ధనురాకారమున వంగుట దీని రూపము. ఈ అర్ధచంద్రహస్తకర్మలు భావానుసారమున సవిశేషముగా నున్నవి. బలనిర్ఘాటనమున అనగా బలాత్కారముగ నిష్కాసన మొనరించుట వెడలగొట్టుట ఉపయుక్త మగును. కలశము చంద్రకల కాంచీమధ్యము కుండలము కంబువులను ప్రదర్శించుటలో నిది వినియుక్తమగును. స్త్రీలకు సంబంధించిన లీలాది విశేషములందును అర్ధచంద్రము యథాయోగ

ముగ నుపకరించును. అర్ధచంద్రి హస్తమునకు సంబంధించిన వినియోగ విశేషములు సంప్రదాయపరంపరావిచ్ఛేదమున విశిష్ట విధులలో స్పష్టముగనె యున్నవి.

## ౨౦. స ం ద ం శ ః

అరాలస్య యదాంగుష్ఠ తర్జన్యో స్సంగతి స్తదా
సందంశ స్త్రివిధస్సోఽపి స్యాదగ్ర ముఖపార్శ్వజః
అన్యోన్య నఖసంశ్లేషా దగ్ర సందంశకో భవేత్ ౩౩౫
గ్రథనేఽ పచయే సూక్ష్మ పుష్పాణాం గ్రహణే పునః
సూత్రకేశ తృణాదీనాం శల్యాద్యుత్పాటనాదిషు
ముఖసందంశక స్తద్వ త్సంశ్లేషా దగ్రపర్వణోః
వితర్కేఽ సౌ ధిగిత్యుక్తౌ వృంతా త్ప్రసవమోచనే
ప్రవాల రచనావర్తి శలాకా లేఖ్య కర్మసు ౩౪౦
లాక్షా నిష్పీడనే నేత్రరంజనాదే ప్రజాయతే
ముక్తాదివేధనే బాణే బ్రహ్మసూత్రస్య మార్జనే
లక్ష్యే ధ్యానే గుణాదౌచ సద్వితీయో భవేదసౌ
తదైవ పార్శ్వసంశ్లేషా త్సందంశః పార్శ్వజోమతః
సదోషవచనం కుత్సా మసూయా పేలవా దిచ ౩౪౫
హస్తప్రయోగనిపుణో వామేనానేన యోజయేత్

## ౨౦. స ం ద ం శ ము.

అరాలహస్తమునకు సంబంధించిన అంగుష్ఠము తర్జని అను రెండు వ్రేళులకు సంగతి యుండునేని యది సందంశము అను హస్తమగును. ఇందు మధ్యతల మాభుగ్నమై యుండును. ఈ సందంశము మూడు విధములు.

౧. అగ్రిసందంశము ౨ ముఖజసందంశము
3. పార్శ్వగత సందంశము.

౧. అగ్రసందంశము :— అన్యోన్యము నఖసంశ్లేష మున్నచో నగ్రసందంశము. పుష్పముల గ్రథనమున పుష్పాపచయమున సూక్ష్మ పుష్పముల గ్రహణమున వినియుక్త మగును. తృణ పర్ణ కేశ సూత్రగ్రహణమున నుపకారి. శల్యములయిన కంటకాదుల సముత్పాటనమున సహకారి.

౨. ముఖజసందంశము:— వ్రేళుల చివరికణుపుల సంబంధ మున్నచో ముఖజసందంశ మగును. ఇది వితర్కమున నుపయుక్త మగును. ధిక్ అని నిందార్థము నిరూపించుటలో సహకారి యగును. వృంతమునుండి పుష్పమును విడదీయుటలో నుపకరించును. పగడముల కూర్పులో, లేతచిగురుల రచనలో, వర్తికర్మ శలాకాకర్మ లేఖ్యకర్మ ములలో లాక్షానిష్పీడనమున నేత్రరంజనమునందును వినియుక్తమగును. ముత్యములను సూత్రమున గూర్చునపుడు, బాణము కూర్చునపుడు, బ్రహ్మసూత్రము మార్జన మొనరించునపుడు, ధ్యాన మొనరించు నపుడు, సూక్ష్మబాణలక్ష్యమునందు నిది సద్వితీయమై వినియుక్త మగును. హస్తద్వయమున కాధారముగ నుండుటగు ర్తింపవలెను.

3. పార్శ్వసందంశము:— పార్శ్వభాగమున గలుగు సందంశము వలన పార్శ్వసందంశ మగును. హస్త ప్రయోగనిపుణుడు బాగుగా గుర్తించి, దోషయుక్తమగు వచనమును కుత్సితమగు విధానమును అసూయను పేలవమగు విధానమును అగౌరవమగు రీతిని ఈ హస్త మున ప్రయోగింపవలెను.

ఈ సందంశ ప్రయోగమును స్త్రీలోనర్పవలయుట యిందలి విశేషము. కావున నా యా వినియోగ విధులందున్న సౌకుమార్యము వ్యక్త మగును.

### ౨౧. ముకులహస్తః

పంచాప్యంగులయో యత్ర సంగతాగ్రాః సముచ్ఛ్రితాః
ముకులోऽసౌ సరోజాది ముకులానాం నిరూపణే
అర్చనే దేవతాదీనాం బలే కాముకచుంబనే
వలయామోచనే పంచ సంఖ్యాయాం చాయ మిష్యతే ౩౫౦

### ౨౧. ముకులహస్తము

అయిదు వ్రేళులు అగ్రభాగమున సంగతములై సముచ్ఛ్రితములై యున్నచో నది ముకులమను హస్తమగును. పద్మములు మొదలగు వాని మొగ్గలను నిరూపించుటలో నిది వినియుక్తమగును. దేవతాదుల యర్చనమున నిది యుపకారి. బలి పూజావిధానమున నుపకరించును. కాముకచుంబనమున ముకులము ముద్దుగా నుండును. వలయములు - కంకణములు - గాజులు పట్టుటలో నిది ప్రసరించును. పంచసంఖ్యానిరూపణములో ముకుల ముపకరించును. విటచుంబనమున ముకులము ముచ్చటగా నుండును. విటచుంబన మిట్లుండును. స్వాభిప్రాయ మావిష్కరించుటకై వనితల సన్నిధానమున విటులు తమహస్తములనె ముకులిత మొనరించి చుంబన మొనరింతురు. ఇదియొక విధము. మరియొకవిధ మిట్లుండును. వనితల కుచ చిబుకాది స్థానములను అంగులిపంచకముతో సుకుమారముగా స్పృశించి "చ్చుమ్, చ్చుమ్" గా సశబ్దముగా చుంబించుట విటచుంబనము. ఆయా స్థానములందు నఖస్పర్శనము చుంబనము కామతంత్ర ప్రసిద్ధము.

### ౨౨. ఊర్ణనాభః

అంగుల్యః పద్మకోశస్య నితాంతావనతా యది
ఊర్ణనాభో భవేదేషాం శిరఃకండూయనే కరః
కర్షాశ్మ చౌర్య కేశాది గ్రహే కుష్ఠస్య దర్శనే
చిబుకే స్వస్తికీ భూతే శ్వాపదానాం నిరూపణే

## ౨౨. ఊర్ణనాభము.

పద్మకోశమునకు సంబంధించిన అంగులులు మిక్కిలి యవనతములై యుండునేని యది ఊర్ణనాభమను హస్తమగును. తలను గోకికొనుటలో నీ హస్త ముపయోగించును. కర్మాశ్మ ఒరిపిడి రాయి గ్రహించుటలో, చౌర్యములో, కేశగ్రహణములో, కుష్ఠవ్యాధి నభినయించుటలో నీహస్త ముపయుక్తమగును. కరాశ్మము నికషోపలము, చిబుకమున నీహస్తము స్వస్తికరూపము కలదై మృగముల నిరూపణమున నుపయుక్తమగును. ఊర్ణనాభి యనునది అల్లిక వేయు సాలెపురుగు. ఊర్ణనాభి శబ్దమునకు మత్వర్థీయమున అచ్ ప్రత్యయము రాగా ఊర్ణనాభ మయినది.

## ౨౩. అలపల్లవః

ఆవర్తిన్యః కనిష్ఠాద్యాః విరలాః పృష్ఠగాః క్రమాత్ ౩౭౫
యస్మిన్నంగుల యస్సోయం సముద్దిష్టోఽలపల్లవః
కస్యత్వ మితి నాస్తీతి ప్రతిషేధా యభాషణే
సూన్యేచ వచనే స్త్రీణా మాత్మసంభావనేఽపిచ
అలపద్మ మముంప్రాహు శ్చలపద్మా నుకారతః

## ౨౩ అలపల్లవము.

ఈ హస్తమునకు సంబంధించిన అంగుళులన్నియు కనిష్ఠికాదిక్రమమున వర్తనా పరివర్తనమున నావర్తితములగునేని, పార్శ్వగతములై వికీర్ణములు నగునేని అలపల్లవమను హస్తమగును. దీనికే అలపద్మకమనియు పేరు కలదు. "ఇయర్తీత్యరః, చలచలత్పల్లవాకారత్వాత్ అలపల్లవః" గతికలది అరము అలము చలమని భావము. చలత్పల్లవాకారమున నుండును గావున అలపల్లవము. ప్రతిషేధాభినయ మొనరించుటకై యిది యుపయోగించును. "నీ

వెవరి వాడవు? లేదులే" అను మిథ్యాధిక్షేపార్థమం దలపల్లవ ముప యోగించును. ఆడువారి శూన్యవచనాభినయమున నిది యుపకారి. వారి ఆత్మ సంభావనమందు సహకారి. "తచ్ఛాస్త్ర మసత్ప్రయుక్తం" ఆ శాస్త్ర మసచ్ఛాస్త్ర మనుటలో నిది యుండును. చల పద్మానుకార మున్నందున అలపద్మ మనుట సార్థకమందురు.

౨౪. తామ్రచూడః

భ్రమరస్య యదానామ కనీయస్యౌ తలే స్థితే ౩౬౦
తామ్రచూడ స్తదా జ్ఞేయః కుక్కుటేఽల్ప నిరాకృతౌ
సశబ్ద విచ్యుతః తాలే శైఘ్ర్యే విశ్వాసనేక్షణే
ఆహ్వానే బాలకాదీనాం భర్త్సనే నృప జృంభణే

౨౪. తామ్రచూడము.

భ్రమరహస్తమునకు సంబంధించిన మధ్యమాంగుష్ఠములు సంలగ్నములై యుండగా, ప్రదేశిని వక్రమై యుండగా, చివరి వ్రేళులు రెండును తల భాగమున నుండగా, తామ్రచూడ హస్తమగు నను భావమును లక్షణవాక్యమున గ్రహింపవలెను. చూడా ముక్త కుక్కుటాకారమున నుండును. గావున తామ్రచూడము తామ్రచూ లము నగును. చివరి వ్రేళులు అల్పముగా నిరాకృతములై యుండుటయు నిందు వివక్షితము. కాలమానము ననుసరించు తాలవిధానమున, శీఘ్రత్వమున, విశ్వాసనమున, కలా కాష్ఠాని మేషాత్మక క్షణములందును, బాలకాదుల యాహ్వానమున భర్త్సన మున రాజవిజృంభణమున తామ్రచూడము ప్రసరించును. బాలాలాప నిమంత్రిణమున నిది వినియుక్త మగును.

ఈ నిరుపించిన యిరువది నాలుగు హస్తములు అసం యుత హస్తములు. అసంయుతహస్తము లిన్నియే యని కాదు.

కోహలాదు లన్యహస్తముల గూడ నిర్దేశించిరి. ఈ అసంయుత హస్తములె వక్ష్యమాణ సంయుతహస్తములకు నిదానములు. ఇతరు లంగీకరించిన హస్తములు.

అర్ధపతాక - మయూర - చంద్రకల -
త్రిశూల - సింహాముఖ

ఇట్టి హస్తములు పూర్వనిరూపితహస్తముల పరస్పర మిశ్రణమున గలుగవచ్చును. ఈ హస్తముల వినియోగవిశేషములును పూర్వోదితములకన్న నంతగా వేఱుగాలేవు. కొన్నిటికి వినియోగములను నిరూపించునప్పుడు 'ఆది' పదములు కలవు. ఆది పదాభ్యాహ్యములు ఇతరహస్త వినియోగస్థానములుగా నిర్దిష్టము లయినవి. వీనిలో పూర్వహస్తములె వినియుక్తములు కాగలవు.

## సంయుతహస్తాః

### ౧. అంజలిః

పతాక తలయోః శ్లేషా దంజలిః ప్రణతౌ క్రమాత్
భూదేవ గురుదేవానాం వక్షోవక్త్ర శిరః స్థితః ౩౬౫
క్రోదే చ పరిహాసే చ నాస్త్యయం నియమః పునః

## సంయుతహస్తములు.

సంయుతహస్తము లసంయుతహస్తములనుండియె యుత్పన్నము లగును. అసంయుతహస్తములు అన్యసంశ్లేషమువలన సంయుతహస్తము లగును. ఇట్లు సముత్పన్నములగు సంయుతహస్తములను స్వాయముగా నభ్యూహించి గుర్తింపవచ్చును. అయినను ఈ సంయుతహస్తముల గుర్తించుట యుక్తము. సంయుతహస్తములు పదమూడు కల వని నిరూపితము. వానిలో నిచట అంజలి అను

హస్తము నిరూపితమగును. దేవతా గుర్వాదుల యభివాదనమున నిది వినియోగము పొందును గావున ప్రథమముగా నిర్దిష్టమగుట యుక్తముగా నున్నది.

## ౧. అంజలి.

రెండు పతాకహస్తముల సంశ్లేషమున్నచో అంజలి యను సంయుతహస్త మగును. ఇతరహస్తముల సంబంధము కూడ నిందుండవచ్చును గాని నామాంతరము కలుగదు. సంశ్లేషముండుట యావశ్యకము. రెండుహస్తములు దగ్గఱదగ్గఱగా సర్వాంగుళులకు సంబంధ ముండునట్లుగా కూర్పు పొందవలయును.

ఈ అంజలిహస్తము ప్రణతిలో వినియుక్తమగును. భూదేవుల వందనములో అంజలి వక్షఃస్థితమగుటయు, గురువందనములో అంజలి ముఖగతమగుటయు, దేవతల వందనములలో అంజలి శిరఃస్థితమగుటయు వివక్షితము. నాట్యవేదములో శిరస్థాంజలి దేవవిషయమున, ముఖస్థితాంజలి గురువందనమున, వక్షస్థాంజలి మిత్రవందనమున నుండుట నిరూపిత మయినది. ఈ గ్రంథమున విశేషపదము లేదు. నమస్కారవిధానమున నీ నియమము పురుషులకు సంబంధించి యున్నది. స్త్రీల కభివాదనవిధి నియతముగ లేదు. వారౌచిత్యాను సారమున నటు నిటు నాచరింపవచ్చును. క్రోధ పరిహాసముల సమయమున నిట్టి నమస్కార నియమములేదు. ఆ సమయమున పతాకా హస్తములు రెండు నుపయుక్తము లగుటయు వివక్షితము కాదు.

## ౨. కటకా వర్ధ మాన కః

స్వస్తికాకారతాశ్లిష్టే భవేతాం కటకాముఖౌ
మణిబంధప్రదేశే చేత్ కటకావర్ధమానకః

అన్యోన్యాభిముఖం చైనం కేచిదాహుర్మనీషిణః
అసౌ శృంగారకార్యేషు తాంబూలగ్రహణాదిషు ౩౨౦
రుష్టప్రాణేశ్వరీ పాద ప్రణామేష్వపి చేష్యతే

## ౨. కటకావర్ధమానము.

కటకము కటకమునందున్న ఆ చేతితో నీ చేతితో పట్టిన కటకాముఖములు రెండును స్వస్తికాకారమున సంశ్లిష్టములై యున్న కటకావర్ధమానక మను సంయుతహస్త మగును. కటకద్వయ మన్యోన్యాభిముఖగా నుండుటయు కటకావర్ధమానమె యగు నని కొందఱి భావము. ఖటకావర్ధమాన మనియు దీని పేరు. కటకము కటకమునం దుండుట అనగా; మణిబంధప్రదేశమున కూడి యుండుట యను భావము. ఇది తాంబూలగ్రహణము మొదలగు శృంగారకార్యములందు వినియుక్త మగును. కటకావర్ధమానము ననుసరించి విటగతి ననుసరింపవలె నని విధి యున్నది. అవస్థాభేదమున గతినిరూపణ మావశ్యకము కావున విటావస్థలో నీ సంయుత హస్తానుసారమున గతి ననుసరింపవలెను. అట్టి విధానముననే కోపించిన కామిని పాదప్రణామములందు నిది యుక్తమగును. విరహిణిపై వెన్నెల పడకుండుటకు వానచినుకులు పడకుండుటకు విలాసమునకు హిందాళనమునకు ఛత్రము పట్టుటలో నీ కటకావర్ధమానక మావశ్యకము.

## ౩. స్వస్తికః

స్యాదరాలీకృత స్సోయం వామపార్శ్వగతో యదా
ఉత్తానశ్చ తదా జ్ఞేయః స్వస్తికో మునిసమ్మతః
దీర్ఘవస్తు వనోత్తుంగ భూ విస్తీర్ణాంబుదా వ్యయాః
విచ్యుతేన నృణాం యోజ్యాః పతాకే నతు యోషితాం ౩౨౧

### ౩. స్వస్తికము

అరాలహస్తములు మణిబంధస్థానమున విన్యస్తములై యుత్తానములై, వామపార్శ్వగతములై యున్నచో స్వస్తిక మను సంయుతహస్త మగును ఇట్లుండుట మునిసమ్మతము. పతాకాహస్త యోగమునగూడ స్వస్తిక మున్నది. అయినను మణిబంధన విన్యసన మంతట ననుయాయి ధర్మము. పురుషు లీ స్వస్తికముచే దీర్ఘములుగా నున్న వస్తువులను వనములను సమున్నత భూములను విశాలసాగర మును విశాలాకాశమును సూచింపదగును. పురుషులు విచ్యుతవిధాన మున సూచింతురు. స్త్రీలు పతాకస్వస్తికమున సూచింపదగును.

### ౪. కర్కటః

కరయోః కరశాఖాస్స్యు రన్యోన్యాంతర నిర్గతాః
యత్రాసౌ కర్కటో జ్ఞేయో జృంభణే హనుధారణే
స్థూలాంగే గ్రహణే కంబోః ఆలస్యాద్వాంగ మోటనే

### ౪. కర్కటము.

రెండుకరములకు సంబంధించిన కరశాఖ లనదగు వ్రేళులు అన్యోన్యాంతర నిర్గతములై యున్నచో అన్యోన్యమంతరములనుండి వెలువడియున్నచో నది కర్కటహస్త మగును. రెండెండ్రికాయలు అన్యోన్య మెదురుగానుండి కోరలు చాచి యున్నవిధమున వ్రేళు లున్నచో కర్కటహస్త మగును. ఇది జృంభణమున హనుధారణమున స్థూలాంగమున కంబుగ్రహణమున ఆలస్యముగా నొనరించు నంగ మోటనమున వినియుక్త మగును. మదనకృతమయిన అంగ మోటన మొనరింపవలసి యున్నపుడు కర్కటప్రయోగ మావశ్య కము. నిద్రనుండి లేచువాని ఆవులింత నభినయించునపుడు కర్కట మావశ్యకము.

### ౫. కపోతః

అన్యోన్య పార్శ్వసంశ్లేషా త్కపోతస్సర్ప శీర్షయోః
వక్షస్థశ్చావగంతవ్యో గురుసంభాషణేతు సః ౩౮౦
వినయే ప్రాఙ్ముఖః స్త్రీభిః కంపితో భయ శీతయోః
కూర్మకం కథయంత్యేన మపరే కూర్మకాకృతిం

### ౫. కపోతము.

సర్పశీర్ష హస్తము అసంయుతములలో నున్నది. రెండుసర్ప శీర్షము లన్యోన్యము పార్శ్వసంశ్లేషము కలవయినచో కపోతహస్త మగును. "కంపతే ఇతి కపోతః భీరుః పక్షీ తత్ప్రకృతి రన్యోపి కపోతః" కంపించునది కపోతము. భీరు వగు పక్షి కపోతము పావురము, అట్టి ప్రకృతి కలవాడును కపోతపదవాచ్యుడు, ఈ కపోతహస్తము నామానుచిత్యమునవె భీతవిషయముగా నుండుట స్పష్టము. గురువులతో సంభాషించునపుడీహస్తము వక్షస్థముగా నుండుటను గుర్తింపవలెను. వినయసూచనములో ప్రాఙ్ముఖముగా నుండవలెను. భయము కలిగి నపుడు శీతబాధ కలిగినపుడు, స్త్రీలు కంపితముగా కపోతమును ధరింతురు. కంపితహస్తమును వక్షోగతముగ స్త్రీలు కూర్పవలెను. ఇచటి స్త్రీ లధమస్త్రీ లని భావము. మధ్యమోత్తమ లింతగా కంపితలు కారు. ఈ కపోతహస్తమె కూర్మాకారముగా నుండునని దీనిని కూర్మక మందురు

### ౬. నిషధః

కూర్పరాభ్యంతరే ధృత్వా భుజం వామేన దక్షిణం
అన్యం ముష్టికృతం వామే కూర్పరాభ్యంతరే న్యసేత్
యద్యేతన్నిషధః సోయం స్తంభాశ్లేషే భయే భవేత్ ౩౮౫
ఔత్సుక్య సౌష్ఠవాటోప స్థైర్య గర్వ మదాదిషు

భట్టాభినవగుప్తోఽస్య లక్ష్మ దూరాంతరం జగౌ
వేష్టితః స్యాత్కపిత్థేన ముకులో నిషధ స్త్వితి
నిరుక్తి వినియోగాభ్యాం వ్యాఖ్యాయాం వ్యక్త మబ్రవీత్
అనేన వర్త్మనా యాతా స్త్వన్యతంత్రవిధాయినః ౩౯౦
పూర్వలక్షణమేవాస్య మేనే కీర్తిధరః పునః

## ౬. నిషధము.

దక్షిణభుజమును వామహస్తముచే కూర్పరాభ్యంతరమున ధరించి పట్టవలెను. దక్షిణహస్తము గట్టిగా ముష్టిముద్రతో నుండవలెను. దానిని వామకూర్పరాభ్యంతరమున నుంచవలెను. ఇట్టిది నిషధహస్త మగును. ఇది స్తంభాక్షేపమున భయమున నుండును. ఔత్సుక్యము, స్థాపనము, ఆటోపము, స్థైర్యము, గర్వము, మదము మొదలగు వానియందు వినియుక్త మగును.

భట్టాభినవగుపుడు వీని లక్షణము వేఱుగా భావించెను. కపిత్థహస్తమున ముకులహస్తము వేష్టిత మగుట నిషధహస్త మని భావించెను. అట్లే నిరుక్తి వినియోగములను నిర్దేశించెను. కాగా అన్యతంత్రవిధాత లీ మార్గమునె యనుసరించిరి. కాని మే మిందు నిరూపించిన లక్షణమె యుక్తము. కీర్తిధరు డిట్లె నిషధహస్త లక్షణము చెప్పెను. కీర్తిధరభావమె మాకును సమ్మతము.

ఇచట నీ విషయవిజ్ఞాన మావశ్యకము. నాట్యవేదమున నిషధలక్షణ మిట్లున్నది.

“ముకులం తు యదా హస్తం కపిత్థః పరివేష్టయేత్
స మంతవ్య స్తదా హస్తో నిషధో నామ నామతః

ఈ యంశమున అభినవభారతి యిట్లున్నది.

" నిషధమాహ, ముకులం త్వితి, కపిత్థహస్తేన,
పరివేష్ట్యమాన ముకులం తదభ్యంతరే నిషణ్ణమాస్తే
ఇత్యతోఽయం నిషధః

మా శర్మ నాట్యవేదమున ౩౮౨ పుటలో నిషధహస్త నిరూపణమున అభినవభాష్య మిట్లున్నది.

"కపిత్థహస్తము నుముకులహస్తము పరివేష్టించునేని నది నిషధమను హస్తమగునని గుర్తింప వలెను. కపిత్థహస్తమున పరివేష్ట్యమానమగు ముకులహస్తము అభ్యంతరమున నిషణ్ణమై యుండుట నిషధహస్త రూప మని భావము " అని

నిషధహస్త స్వరూపము నిరూపించు లక్షణములు పాఠాంతరముగా నున్నవి. కీర్తిధరాచార్య పాఠము ననుసరించువారు ఈ గ్రంథమున నిరూపించిన లక్షణార్థము లక లక్షణము నిట్లు భావించిరి.

"గృహీత్వా వామహస్తేన కూర్పరాభ్యంతరే భుజం
దక్షిణం చాపి వామస్య కూర్పరాభ్యంతరే న్యసేత్.

నిషధహస్త నిరూపణమున భావభేదములు పాఠభేదములు కలవు. జాయపతి కీర్తిధరు భావు డయ్యెను.

౭. ఉత్సంగః

అరాలౌ సర్పశీర్షౌ వా వ్యత్యాసాద్భుజయోః స్థితా
ప్రకోష్ఠస్వస్తికౌ తావ దుత్సంగః స్యాత్స్వసమ్ముఖౌ
నిష్పీడామర్షరోషేషు పరోక్షస్పర్శశీతయోః
కంఠాశ్లేషే వరోరూణాం ఈర్ష్యాయాం కుచగోపనే

౭. ఉత్సంగము.

అరాలహస్తములు కాని సర్పశీర్షహస్తములు కాని వ్యత్యాసమున భుజములం దుండుట, ప్రకోష్ఠము లు స్వస్తికములుగా

నుండుట ఉత్తానములై సమ్ముఖములై యుండుట ఉత్సంగ లక్షణము. ఉత్సంగ గ్రహణ యోగ్యత్వ మున్నందున ఉత్సంగ మయినది. నిష్పేషకృతము లయిన రోషానుర్షములలో నిది వినియుక్తమగును. నిష్పేషమనుట పీడనము. పీడనమున నొనరించునది యతిప్రయత్న సాధ్యము. “ దృఢ నిపీడన బాహుయంత్ర ముఖప్రయోగములు రూపకము లందు గలవు. పరోక్ష మయిన స్పర్శమును గ్రహించు నభినయములో నట్టి శీతాభినయములో నిది వినియుక్త మగును. వక్షోరూ కంఠా శ్లేషమున పురుషుల కుపయోగించును. ఆశ్లేషసమయమున స్త్రీలు కుచగోపన మొనరించుటలో నుపకారి యగును. విదూషకాదులవలన గలిగిన విప్రియము హేతువుగా ప్రియుని ప్రసాదన మంగీకరింపక పోవుటలో వనితలకు సహకారము చేయును.

లా. గ జ ద ం త ః

అంసకూర్పరయోర్మధ్యే ధారయేతే పరస్పరం ౬౯౫
భుజంగశిరసీ యత్ర గజదంత స్స కీర్తితః
భారస్తంభగ్రహే చైవ శైలాద్యుత్పాటనే మతః

లా. గ జ ద ం త ము.

అంసకూర్పరముల మధ్య రెండు సర్పశీర్షములను ధరించి యున్నచో నది గజదంతహస్త మగును.

భారగ్రహణము స్తంభగ్రహణము, శైలాదుల సముత్పాటనము మొదలగు వానిలో నిది యుపయుక్త మగును. అంసకూర్పర శబ్దమున తదుభయసామీప్యము తదంతరాళము సంగృహీత మగును. వామబాహువు నందు దక్షిణమును, దక్షిణబాహువు నందు వామహస్తమును, స్తంభాకారమున చుట్టుకొనియున్న దంతాకృతితో చుట్టుకొని యున్నందున గజదంత మగును.

### ౯. అవహిత్థః

అధివక్షోఽంచితే స్యాతాం శుకతుండౌ పరాఙ్ముఖౌ
శనైర్వర్తనయాధస్తాన్నితో యస్మిన్నధోముఖౌ
సోఽవహిత్థో భవేత్ కార్శ్యశ్వాసోత్కంఠాదితానవే ౪౦౦

### ౯. అవహిత్థము.

శుకతుండహస్తములను వక్షము నందభిముఖముగా నుంచి యొప్పు నట్లొనర్చునది. నెమ్మదిగా వర్తనానుసారమున దిగువున కధోముఖములుగా నొనర్చునది. అప్పాటది అవహిత్థ హస్తమగును. అవహిత్థాసూచక మయినందున నిది యవహిత్థము. అవహిత్థము లజ్జ. ఇట్లొనర్చిన స్త్రీయాశయము గోపిత మగును. దీనిచే కృశత్వము శ్వాసప్రసారము ఉత్కంఠ వీనివలన గలుగు తనుత్వము నభినయింప వచ్చును. దౌర్బల్య నిశ్వాసితములలో నిది యుండును.

### ౧౦. దోలః

ఆస్కంధాభ్యామధః స్యాతాం పతాకే పార్శ్వలంబితౌ
యస్మిన్నేష భవేద్దోలో విషాదే సంభ్రమే మదే
అభిఘాతామయావేగ మూర్ఛా శస్త్రక్షతాదిషు

### ౧౦. దోలము

స్కంధభాగముల నుండియు జారినవై పతాకహస్తములు పార్శ్వము లందు వ్రేలాడునవై యున్నచో దోల అను సంయుత హస్త మగును. ఇది విషాద-మద-సంభ్రమము లందు వినియుక్త మగును. దెబ్బ తగులుట, వ్యాధికలుగుట, ఆవేగము, మూర్ఛ, శస్త్ర క్షతములందు ప్రసరించును. హస్తములు బాగుగా లంబమానములై యున్నందునను స్కంధములకు శైథిల్యము కలుగును. అవి యదృ

ఫము లగును. పతాకాంగులముల కవష్టంభ ముండదు. దోలాకార మున నుండుటచే (ఊయెల) దోల, ఆ యా యంశ మభినేయ మయి నపుడు పార్శ్వమునుండి పార్శ్వాంత గమనము సూచిత మగును.

౧౧. పు ష్ప పు టః

మిథఃకరభయోః శ్లిష్టౌ భుజంగశిరసౌ యదా ౪౦౯
తదా పుష్పపుటః ప్రోక్తో యాచ్ఞాయాం దేవతర్పణే
పుష్ప పానీయ ధాన్యానాం భక్ష్యాణామపి ధారణే

౧౧. పు ష్ప పు ట ము.

సర్పశీర్షము లను హస్తములు రెండు పరస్పరము రెండు కరభములందు శ్లిష్టములై యున్నచో నది పుష్పపుట మను హస్త మగును. కరభమనగా; మణికట్టునుండి కనిష్టిక వఱకు నున్న చేతి చివరి ప్రదేశము, సర్పశీర్షములుగా నుండు రెండు హస్తములు సమ్ముఖముగ నుండరాదు. పార్శ్వమునందే యుండవలెను. ఈ హస్తము యాచనము చేయుటలో, దేవతర్పణమున, పుష్పధారణ మున, పానీయధారణమున, ధాన్యధారణమున, భక్ష్యధారణమున వినియుక్త మగును

౧౨. వ ర్ధ మా నః

పరాఙ్ముఖౌ హంసపక్షౌ వర్ధమానస్య ఉచ్యతే
ద్వార వాతాయనోద్ఘాటే స్వస్తికీభూయ విచ్యుతః
రిపూరఃపాటనాద్యేషు నైకట్యాద్విచ్యుతస్స్వమః ౪౧౦
భుజంగశిరసా చైనం కీర్తయంత్యపరే బుధాః

౧౨. వ ర్ధ మా న ము.

హంసపక్షములు పరాఙ్ముఖముగా నున్నచో వర్ధమాన మగును. ద్వారము తెఱచుటలో గవాక్షముద్ఘాటించుటలో వర్ధ

మానము స్వస్తికముగా నయి విచ్యుత మగును. శత్రువక్షః పాట నాదులలో నికటమునగనుండియే విచ్యుత మగును. దీనిలో హస్త ములు అన్యోన్యము స్వస్తికములవలె నున్నను లక్ష్యమున అనగా వినియోగవిషయమున అన్యోన్యము సమీపవర్తులుగనె యుండును. స్వస్తికత లేనివై కేవలము పరాఙ్ముఖములై పరస్పరచలనమున విస్తారయోగమును పొందునవి యగును గావున వర్ధమానత్వ మున్నది.

౧౩. మకరః

పతాకావున్నతాంగుష్ఠౌ వ్యాదీర్ణాగ్రావధఃస్థలౌ
మణిబంధాగ్రవిన్యాసౌ స్యాతాం చేన్మకరః స్వతః
తరక్షు వ్యాల సింహానాం నక్రాద్యంబునివాసినాం
క్రవ్యాదీనాం నదీపూరప్రభృతీనాం చ దర్శనే ౮౧౫

౧౩. మకరము.

పతాకహస్తములు ఉన్నతాంగుష్ఠములతో నుండగా అగ్ర భాగములు వ్యాదీర్ణములు-విడివిడిగా నున్నవి కాగా, అధఃస్థల సంచారము కలవికాగా, మణిబంధమునం దగ్రవిన్యాసము కలది కాగా మకరహస్త మగును. చిఱుతపులి-సివంగి, పెద్దపులి, సింహము జలనివాస మొనరించు మొసలి మొదలగునవి, నదీపూరము మొదలగు వానిని ప్రదర్శించి యభినయించు నపుడు మకరహస్తమును ప్రయో గింప వలెను. క్రవ్యాదములు-క్రూరమృగము లెదుట పార్శ్వమున నుండి కదలుచున్నపు డర్థవశమున మకరహస్తముచే వానిని అభిన యింప వచ్చును. తత్తదర్థయోగమున నా యా విశేషాంశములు ప్రయోజ్యములు కాదగును.

ఇట్లీ విధముగా అసంయుత సంయుత హస్తములు నిరూపి తము లయినవి. ఇవి యన్నియు తమ నియత మయిన అభినేయ

విషయమున నిరూపితములు. ఇతరాభినేయము లందును ఇవి వినియుక్తములు కాగలవు. అభినేయము లనంతములు. అభినయములు ననంతములు. హస్తాంతరము లెన్నియేని యుండవచ్చును. వానిని లోకము నుండి గ్రహింప దగును. వాని ప్రయోగనియమమును గుర్తింప దగును.

అభినేయం జగత్సర్వం అనంతోఽభినయోఽప్యయం
య ఏవ యుజ్యతే హస్తో .... ....
.... .... తత్తేషామప్యనంతతా
మత్వేతి ప్రాయికం యద్యత్ రూపం తత్తత్ జగౌ మునిః
అభినేయ పదార్థానామాభిముఖ్యస్య సిద్ధయే ౪–౨౦
అభీష్టానాం తు దృష్టార్థం యస్మాదేతే కరాస్తతః
అన్యేపి బహవో లోకవిదితా స్సంతి తాన్సుధీః
దేశ కాల ప్రయోగార్థవేదీ నేత్రాదిచేష్టితైః
అనుకూలైః ప్రయుంజీత స్థాయి సంచారి సూచకైః
క్వాపి నామ్నః క్వచిల్లోకాత్క్రచి ద్ద్విత్ర యోగతః ౪–౨౫
లక్ష్యం క్వచన నిశ్చేయం సంప్రదాయవశాదిహ

ఈ జగమంతయు నభినేయమె. జగము నందున్న పదార్థము లనంతములు. తద్విషయము లయిన అభినయము లనంతములు. ఏ హస్త మెచట వినియుక్త మగునో అదియే యనేకము లందు వినియుక్తము కావచ్చును, ఆ వినియోగవిషయములందు వేఱొక హస్తమును వినియుక్తము కావచ్చును. అందువనె అభినయము లనంతములు, విషయము లనంతములు. ఇట్లే భరతముని భావించి ప్రాయికముగా నా యా రూపమును గుర్తించి యా యా విశేషముల నిరూపించెను.

"నాస్తి కశ్చిదహస్తస్తు నాట్యేఽర్థోఽభినయం ప్రతి
యస్య యద్దృశ్యతే రూపం బహుశస్తన్నిరూపితం

అనునది భరతముని వచనము. నాట్యము నందభినయో ద్దేశమున అహస్త మయిన యర్థ మేదియునుండదు. హస్తప్రయోగ రహితముగా నే నాట్యార్థము నుండదు. సర్వనాట్యార్థములు హస్త ప్రయోగానుసారమున నుండును. ఏ హస్తప్రయోగమున కే రూపము నియతముగ నున్నదో యా రూపము బహుపర్యాయ ములు నిరూపితమయినది అని భరతభావము.

ఈ నిరూపితము లగు సంయుతాసంయుత కరము లన్నియు అభినేయపదార్థములు యాభిముఖ్య సంపాదనమునకు సమర్థములు. కావుననే నాట్యవేదకర్త ప్రాయికముగా జెప్పదగినది యంతయు జెప్పెను. ప్రతిపాదితములయిన హస్తములు అభీష్టము లగు వానిని దర్శించుట కుద్దిష్టము లయినవి. ఈ హస్తము లిన్నిమాత్రమె యని భావింప వలదు. లోకప్రసిద్ధము లయిన హస్తవిశేషము లెన్నియో కలవు. నాట్యవిదుడు వానిని సావధానముగ గుర్తించి దేశ కాల ప్రయోగ ప్రయోజనముల నన్నిటిని గుర్తించి గ్రహింప వలెను. లోకధర్మమును ప్రదర్శించుచు ఈ నిరూపితముల ప్రదర్శ నము ప్రసిద్ధోదాహరణము మాత్రమె యని ప్రఖ్యాపనము చేయ వలయును. నాట్యవిదు డిట్లు భావించి సేకరించుటలో నొక విధాన మావశ్యకము. తన నిశ్చయమున తాను స్వీకరించి నిర్ణయించుట యుక్తము కాదు. నాట్యాచార్యేచ్ఛా ప్రవాహానుసారముగ నట్టి నిశ్చయము యుక్తము.

దేశకాలాదుల గుర్తించుటలోగూడ నొకవిశేష మున్నది. క్షేత్రవిశేషమయిన దేశమును గుర్తింపవలెను. సుకుమారోద్ధత

స్వభావక మయిన రూపక విశేషమును భావింప వలెను. శరద్వసంతాది కాల విశేషమును భావింప వలెను. ముఖ్యార్థ గౌణార్థ లాక్షణికార్థ వ్యంగ్యార్థ భేదమున నున్న అర్థముల యుప పత్తిని విచారింప వలెను. వీని నన్నింటిని స్థాయి సూచకములు సంచారిసూచకములు నగు అనుకూలములయిన నేత్రాదిచేష్టితము లచే గుర్తించి ప్రయోగింప వలెను. ఒక్కొకచో నామవిశేషమునను మరియొకచో లోకానుసరణమునను వేఱొకచో నాట్యాచార్య సంప్రదాయమునను లక్ష్యము నుపలక్షించి నిశ్చయింప వలసి యుండును. నామ లోక సంప్రదాయములను మూడింటిలో నామ లోకములును లోకసంప్రదాయములను నామసంప్రదాయములను నామలోకసంప్రదాయములను మూటిని అనుసరించిన లక్ష్యనిశ్చయ మావశ్యకముగ నుండునని భావించునది. ఈ ద్విత్రయోగవిశేష మీ విధమున నుండును.

పతాకాత్రిపతాకాద్యా విజ్ఞేయా నామతో బుధైః
ముష్టి ప్రభృతయో లోకాత్ కాంగూలచతురాదయః
ద్విత్రియోగాత్ నిషధారాలప్రముఖాః సంప్రదాయతః
శ్రేష్ఠక మధ్యక నీచానాం విదధీత ప్రయోగవిత్ ౪౩౦
క్రమేణ ఫాల వక్షోరః క్షేత్ర సంచారిణః కరాన్
యథావల్లక్షణోపేతాః ప్రయోజ్యాః శ్రేష్ఠమధ్యమైః
ఉత్తమైరపి దర్పాదిదర్శనే నీచపాత్రవత్
ప్రాప్య కాలం ప్రయోగం చ నీచైరుత్తమమధ్యవత్
హస్తాః కార్యా న వా కార్యా మునేరాశయవేదిభిః ౪౩౫

పతాక త్రిపతాక మొదలగునవి వాని నామవిశేషముల వలననే స్పష్టరూపము లని బుధులు గుర్తింతురు. ముష్టిహస్తము

మొదలగు కొన్ని లోకముననుసరించి తెలియదగినవిగా నున్నవి. కాంగూలము చతురము మొదలగునవి ద్వి—త్రియోగమున విజ్ఞేయములు. నివధారాల ప్రభృతులు సంప్రదాయమున విజ్ఞేయములు. నాట్యప్రయోక్త లందఱు సామాన్యముగ నేకవిధ స్వభావులయి నను వా రనుకరించు పాత్రి వ్యక్తులలో శ్రేష్ఠ — మధ్యమ — అధమ స్వభావము లుండును. అనుకరణ మొనరించు ప్రయోక్తలు కూడ శ్రేష్ఠ మధ్యమ కనిష్ఠభావమున నుండదగును. అందువలన నీ హస్తముల ప్రయోగించుటలో నొక విధిని పాటించ వలెను.

౧. శ్రేష్ఠులు ఫాలసంచారమున

౨. మధ్యములు ముఖసంచారమున

3. అధములు వక్షస్సంచారమున

హస్తముల ప్రయోగింప వలెను. ఆ యా స్థానము లందలి హస్త ప్రయోగములవలన అనుకార్య స్వభావములు విశదము లగును.

శ్రేష్ఠమధ్యములు శాస్త్రానుసారముగా నిర్ణీతము లయిన లక్షణములు కల హస్తములను ప్రయోగించుట సముచితము. అధము లవస్థావిశేషానుసారమున లౌకికహస్తములను ప్రయోగించుట యుక్తము. వారి వారి హస్తప్రయోగ విధానముననె అనుకార్యుల స్వభావవిశేషములను సహృదయ ప్రేక్షకులు గుర్తింతురు. గర్వాదులను ప్రదర్శించుసమయమున నుత్తములును నీచపాత్రల వలె ప్రదర్శింప జనును. నీచవ్యక్తులును కాలానుసారమున ప్రయోగానుసారమున ఉత్తమ మధ్యమ పాత్రలవలె ప్రయోగింప దగును. భరతముని యాశయమును బాగుగా గుర్తించి ఏ హస్తముల నెవరు ప్రయోగింప దగునో, ఏ హస్తముల నెవరు ప్రయోగింప దగదో, గుర్తించుట యావశ్యకము. అందఱు అన్నిహస్తముల ప్రయోగింప

నక్కఱ లేదు. "హస్తాః కార్యా న వా కార్యాః" ప్రయోగింప దగునా? తగదా? అని సమాలోచనమున గుర్తింప వలసి యున్నది.

సర్వోపపత్తులను గుర్తించి విచారించి పురుషులకు స్త్రీలకునీ యభినయహస్తములను ప్రయోగింపవలెను. పురుషుల విషయమున కన్న స్త్రీల విషయమున విశేషసమీక్ష యపేక్షితము. ఉత్తములకు హస్తాభినయ మతిస్వల్పప్రచారముగా నుండుట యుక్తము. వారు సత్త్వావష్టంభముననె సర్వము ప్రయోగింప గలరు. యథోక్త గ్రహణ సామర్థ్యము కల స్త్రీల విషయమున సావధానత యుక్తము.

నిరూపించిన హస్తకర్మల కన్నిటికి రసభావకృతములయిన కర్మలు కలవు. వాని నిరూపింపవలసి యున్నది. స్థాయి సంచారి భేదమున హస్తకర్మలను జెప్పవలెను. అవి యిరువది కలవు.

హ స్త క ర్మా ణి

వికర్షాకర్షణోత్కర్షా నిగ్రహోఽథ పరిగ్రహః
మోక్ష రక్షణ నిక్షేపా విసర్గశ్ఛేద భేదనే
సంశ్లేషాహ్వానవిశ్లేషాః తోదస్తాడన తర్జనే
ధూననా మోటనస్ఫోటా ఇత్యాఖ్యాతాని వింశతిః
కోవిదైః కరకర్మాణి దధత్యన్వర్థ సంజ్ఞతాం ౪౪౦

హ స్త క ర్మ లు.

వికర్షము - ఆకర్షణము - ఉత్కర్షము
నిగ్రహము - పరిగ్రహము - మోక్షణము
రక్షణము - విక్షేపము - విసర్గము
ఛేదనము - భేదనము - సంశ్లేషము
ఆహ్వానము - విశ్లేషము - తోదనము

తాడనము - తర్జనము - ధూననము
మోటనము - స్ఫోటనము.

ఈ యిరువది కరకర్మలు. నాట్యకోవిదులు వీని నిర్ణయించిరి. ఇవి సార్థక నామములు ఈ యిరువదియె కాక ప్రకార భేదము లింకను నుండును. ఇట్టి వన్నియు రస భావ కృతములు.

నృత్తహస్తములను కరణము లందు విశేషముగా ప్రయోగింపవలెను. కరము లన్నియు కరణసంశ్రయములు. "క్రియతే సంపాద్యతే ఇతి కరణం" క్రియమాణము సంపాద్యమానము "కరణము" అనదగి యున్నది. కరణ మభినయవిశేషము సంపాదించును.

హస్తకరణాని

యేన క్రియావిశేషేణ విశేషోభినయాశ్రయః
స్వసిద్ధావనపేక్షాయామంగులీచాలనాత్మనా
క్రియతే కరణం తస్మాత్ తచ్చతుర్విధముచ్యతే
అపవేష్టనముద్వేష్టో వ్యావర్త పరివర్తనే
హస్తానాం కరణాన్యేవం జన్యాని జనకానిచ ౪౪౫

హస్తకరణములు.

సర్వవిధ నాట్యహస్తములకు కరణము నాలుగు విధముల నుండును.

అపవేష్టనము—ఉద్వేష్టనము_వ్యావర్తనము
పరివర్తనము—అను నాలుగు కరణములు.

కరము లన్నియు కరణాసక్తములు. కరములకు కరణాసక్తత యిందు నిరూపణీయము. స్వసిద్ధిలో నపేక్ష లేనపుడు అంగులీ చాలనా

త్మక మయిన క్రియావిశేషమున అభినయాశ్రయమగు విశేషము సంపాదిత మగునేని యది "కరణము" అనదగును. అంగులి చాల నాత్మక మయిన క్రియావిశేషమున నభినయవిశేషము నిరూపిత మగును. ఈ హస్తకరణములు నాలుగు జన్యములు జనకములు నగును. ఈ యంశము మున్ముందు విశదము కా గలదు. వీని లక్షణము లీ విధమున గ్రహింపదగును.

### హస్తకరణలక్షణాని

తర్జన్యాద్యంగులీనాం తు పూర్వ మావేష్టన క్రమాత్
అంతఃపాణి ర్నిజా త్పార్శ్వాద్వక్షో గచ్ఛత్యధస్తలః
యత్ర తత్కరణం ప్రోక్తం నృత్తజ్ఞైరపవేష్టితం
తచ్చైవోద్వేష్టనం తాసాం కుర్వన్నుత్తానితో బహిః
వక్షసః పార్శ్వమాయాతి యస్మిన్నుద్వేష్టితం తు తత్ ౪౫౦
కనిష్ఠాద్యంగులీనాం చేదంతరావర్తనం క్రమాత్
ఉత్తానితస్య హస్తస్య వక్షః ప్రాప్తస్య పార్శ్వకః
వ్యావర్తితం తదాఖ్యాతం నృత్తవిద్యా విశారదైః
తథైవ బాహ్యతస్తాసాం యత్ర స్యా త్పరివర్తనం
అధస్తస్య తు హస్తస్య వక్షసా పార్శ్వగామినః ౪౫౩
నృత్తవిద్యా రహస్యజ్ఞైః తదుక్తం పరివర్తితం
ఏతచ్చతుష్టయం హస్తం ప్రయోజ్యం నాట్యనృత్తయోః
యుక్తం భ్రూముఖరాగాద్యైః కరణం కుర్వతః క్వచిత్
హస్తస్యానుచరీ భూత్వా దృష్టిర్ధావతి ధావతః

### హస్తకరణలక్షణములు.

౧ ఆవేష్టితము:- ఇదియే అపవేష్టిత కరణము. తర్జని మొదలుగా గల వ్రేళ్లు లన్నియు మొదట క్రమనియమానుసారమున

నావేష్టితములు కావలెను. అభ్యంతర విధానమున నావేష్టిత మగుట యభీష్టము. ఆభ్యంతర విధాన మనగా తలసంముఖ రూపమున నున్న హస్తము బాహ్య పార్శ్వమునుండి దేహమున వక్షః ప్రదేశ పర్యంతము వ్యాప్తి కలది కావలెను. విపరీతముగా నుండుట బహిర్ముఖము. తల సమ్ముఖముగా నుండుట యభ్యంతరవిధి. వక్షః క్షేత్రము నుండి బహిర్గమనము బాహ్యరీతి. తర్జన్యాదు లావేష్టితములగుచు పార్శ్వము నుండి యురమునకు ప్రసరించుట అపవేష్టన కరణ మగునని భావార్థము. ఇట్టి దీనిని నృత్తజ్ఞులు అపవేష్టిత కరణ మని వ్యవహరింతురు.

౨. ఉద్వేష్టితము:— తర్జన్యాదికము లయిన అంగుళులు బహిర్ముఖములుగా నుద్వేష్టితము లగుట, అంగుళు లుద్వేష్టనము పొందుచుండగా హస్త ముత్తానితమై బహిర్వర్తనమున నున్నదై వక్షః పార్శ్వమును పొందునది యగుట యీ యుద్వేష్టిత కరణరూపము.

౩. వ్యావర్తితము:— నృత్తవిద్యా విశారదులు వ్యావర్తిత కరణమునకు రూపము నీ విధముగా నిరూపింతురు "కనిష్ఠికాద్యంగుళులు క్రమముగా నంతరావర్తనము పొందుటయు, ఉత్తానిత మగు హస్తము వక్షఃప్రదేశము పొందినదై పార్శ్వగతముగా నుండుటయు వ్యావర్తిత కరణ మగును." అని

౪. పరివర్తితము:— కనిష్ఠాదులు బాహ్యావర్తనమున నుండగా హస్తము వక్షఃప్రదేశము నుండి పార్శ్వము పొందినది కాగా పరివర్తిత కరణ మగును. ఇట్లీ వర్తనవిశేషముల ననుసరించి నృత్తవిద్యా రహస్యజ్ఞు లీ కరణములను నిర్దేశించిరి.

నాట్యముననను నృత్తముననను ఈ చతుర్విధ హస్తకరణములను ప్రయోగింపవలెను. వర్తనముల ననుసరించిన పాణి విధానము

లనేకాక భ్రూ ముఖరాగాదులతో కూడి యుండునట్లుగా కరణముల ననుసరింపవలెను. అప్పుడు దృష్టి హస్తమునకు అనుగతి సంపాదించినది యగును. హస్తధావనమునకు దృష్టిధావనము తగియుండును. "యతో హస్తస్తతో దృష్టిః"

ఈ నిరూపితములయిన హస్తకరణములచే నెట్టి ప్రయోజనము కలుగునన్న యాశంక కలుగునేని యీ యర్థమును భావింపవలెను. ఇవి యన్నియు సాధకతమము లయిన కరణములు. నృత్తనాట్య హస్తరూపము లయిన పాణివిధానము లన్నియు పూర్వాపరశాస్త్రద్వారాలుగా జన్యజనకవిధానమున నుండు వర్తనములను గలుగజేయును. అట్టి కరకర్మలు పరిధానము లయినను ముఖ భ్రూ నేత్రయుక్తములు కావలెను. హస్తవర్తన మే దిశగా నుండునో ముఖాదులా దిశగా ననుధావనముకలవి కావలెను. నేత్ర భ్రూ ముఖరాగము లన్నియు నీ హస్తకర్మలచే వ్యంజితము లగును. కావున నీ కరణముల ప్రక్రియ యభినయములందు పూరణార్థముగా నుండును.

## హస్తప్రచారాః

ఉత్తానోఽధస్తలస్తిర్యక్తథోర్ధ్వాధోముఖా ఇతి ౪౬౦
ప్రచారాః పంచ హస్తస్య యథార్థా మునిసమ్మతాః
ఊర్ధ్వాభస్తిర్యగగ్ర స్వసమ్ముఖోపపదాస్తలాః
స్యుః పంచోపపదైరేభిరేవం పంచ ముఖా అపి
ఏవం దశవిధం చారం కరస్యాభిదధుః పరే
ఊర్ధ్వాధోముఖయోర్లీనౌ సమ్ముఖాగ్రతలావుభౌ ౪౬౫
తలభేదేషు సంసృష్టమవశిష్టం ముఖత్రయం
ఇత్యాశయపరో భేదాన్ పంచైవ మునిరబ్రవీత్
ఊర్ధ్వగోఽధోగతస్తిర్యగ్గతోఽవ్యస్త్వగ్రతో గతః

సమ్ముఖాగత ఇత్యన్యే పంచ హస్తగతీర్జగుః
ఇత్యేవం గతిభేదాత్తత్పంచధా హస్తపంచకం ౪౨౦
ఉత్తమైస్సత్త్వభూయస్త్వాదస్తాః స్వల్పప్రచారిణః
మధ్యప్రచారిణః కార్యా మధ్యమైర్మధ్యమత్వతః
నీచైరత్యంతవిక్షిప్తాః సత్త్వహీనోఽధమో యతః

## హస్తప్రచారములు.

భరతముని సమ్మతము లయిన హస్తప్రచారము లయిదు గలవు. ఈ అయిదును సార్థకనామములు.

ఉత్తానము - అధస్తలము - తిర్యక్
ఊర్ధ్వముఖము - అధోముఖము.

కొందరు హస్తప్రచారములు పది కలవని యనిరి. ఊర్ధ్వతలము - అధస్తలము - తిర్యక్తలము - అగ్రతలము - సమ్ముఖతలము అను నయిదు. తలపదమునకు ఊర్ధ్వాదిపదముల నుపపదములనుగా గూర్పగా సిద్ధము లగును. అట్లె ఊర్ధ్వాదు లుపపదములుగా గూర్పగా నయిదు ముఖపదములు అనగా; ఊర్ధ్వముఖము - అధోముఖము - తిర్యఙ్ముఖము - అగ్రముఖము - సంముఖముఖము అనునవి సిద్ధము లగును. పంచతలములు పంచముఖములు మొత్తము హస్తప్రచారము పదివిధముల నుండు ననిరి.

హస్తప్రచారము లయిదనియె మునిమతము ముని పంచకమునె చెప్పెను ఇతరములను జెప్ప లేదు. అట్లు చెప్పక పోవుట "చెప్పిన వాని యందె చెప్పనివి యంతర్భవించును" అని ముని తలచి నట్లగును. సమ్ముఖము అగ్రతలము అనునవి ఊర్ధ్వముఖాధోముఖము లందంతర్భవించును. మిగిలిన మూడు ముఖములు తలభే

దము లం దంతర్భవించును. ఇట్టి ఆశయమున భరతముని అయిదు ప్రచారములె చెప్పెను.

మఱి కొందరు హస్తగతుల నీ విధముగ పరిగణించిరి. ఊర్ధ్వగతము - అధోగతము - తిర్యగ్గతము - అగ్రగతము - సమ్ముఖాగతము. అని ఇట్టి గతిభేదమున హస్తపంచకము నిర్ణీత మగుచున్నది. ఇట్టి యుపపత్తుల ననుసరించి హస్తప్రచారము లయిదనుటయె యుక్తము.

హస్తప్రచారముల నిర్దేశించుటలో నాట్యవేద మిట్లు నిరూపించు చున్నది.

"ఉత్తలోధ స్తల స్తిర్యగూర్ధ్వాధోముఖ ఏవ చ
హస్తప్రచారా విజ్ఞేయా నాట్యే నృత్తే చ పంచధా"

ఉత్తలము - అధస్తలము - తిర్యక్ - ఊర్ధ్వముఖము-అధోముఖము అని హస్తప్రచారముల గుర్తించునది. ఇవి నాట్యమున నృత్తమున నయిదు విధములుగ నున్నవి." అని ఈ పాఠానుసారముననె జాయపతి మునిమతముగా హస్తప్రచార మంగీకరించెను.

నాట్యవేదమున నీ ప్రఘట్టమున పాఠాంతర మిట్లున్నది.

ఉత్తానః పార్శ్వగశ్చేతి తథాధోముఖ ఏవ చ
హస్తప్రచారస్త్రివిధో నాట్యతత్త్వ సమాశ్రయః

ఉత్తానము - పార్శ్వగతము - అధోముఖము - అని హస్తప్రచారము నాట్య తత్త్వ సమాశ్రయముగా మూడు విధములనున్నది." అని ఈ పాఠమునె అభినవభారతీ కర్త యాదరించెను. అందుననె తరువాత గూడ నాట్య నృత్త సమాశ్రయ మయిన అంగప్రచారమును మూడు విధములుగ నుండుటనే నిర్దేశించెను. అయిదు

విధముల నితరు లంగీకరించుట సూచించి, త్రైవిధ్యమె యుక్తమనెను. ఉత్తానము - అధస్తలము - త్ర్యశ్రము - అగ్రగము - అధోముఖము అను పంచ హస్తప్రచారములను భట్టోద్భటుడు పఠించుట నుల్లేఖించి;

అధస్తలమున నధోముఖ మంతర్భూత మగునని, ఉత్తానమున నగ్రగము గతార్థ మగునని, త్రశ్రము త్రిపార్శ్వగమె యని, త్రివిధ మనుటనె యుక్త మని సంగత పరచెను. జాయపతి యన్నిటిని భావించి తన భావము నిరూపించెను, అదియె మునిసమ్మత మనెను.

హస్తప్రచార మనుసరించుటలో గొన్ని విశేషములు కలవు. ఉత్తములు సత్త్వసంపదాతిశయమున నుందురు. కావున వారిలో హస్తప్రచారములు స్వల్పసంచారమున నుండును. మధ్యములు మధ్యమత్వమున నుందురు. గావున మధ్యమప్రచార ముచితము. నీచు లత్యంతము విక్షిప్తవిధానమున హస్తప్రచారము గావింతురు. అధముడు సత్త్వహీనుడు. ఈ భేదములను గుర్తించి హస్తప్రచారములను గూర్చుట యుక్తము.

## బాహుప్రకారాః

ఊర్ధ్వగః పృష్ఠగః తిర్యగ్గతః స్వస్తికమండలౌ
అపవిద్ధాంచితావిద్ధ కుంచితాధోముఖా ఇతి
ఆహుర్దశవిధం బాహుం నాట్యే నృత్తే చ తద్విదః ౪౩॥
ఊర్ధ్వగః శిరసోఽప్యూర్ధ్వం గచ్ఛన్ స్వస్యైవ పృష్ఠతః
పృష్ఠగః పార్శ్వగస్తిర్యగ్గతో బాహుః పరేణ చేత్
స్వస్తికః స్వస్తికీభూతో మండలః పరితో భ్రమన్
తతో మండలవన్నిర్యన్ అపవిద్ధస్తు వక్షసః

ప్రాప్యోరస్తః శిరఃక్షేత్రమురః ప్రత్యాహృతోఽంచితః ౪౮౦
స్యాదావిద్ధోఽంతరాక్షేపాత్ కుంచితస్తీక్ష్ణకూర్పరం
భవేద్ద్విగుణతాం నీతోఽధోముఖః క్షితి సంముఖః

బాహు ప్రకారములు.

అంగులిక్రియ బాహులగ్నము కావున బాహు ప్రకారముల నిర్దేశింప వలెను నాట్యమున గాని నృత్తమున గాని తద్విధులు బాహుప్రకారము దశవిధముగా నుండు ననిరి. వాని పేరులిట్లున్నవి.

ఊర్ధ్వగము — పృష్ఠగము — తిర్యగ్గతము — స్వస్తికము — మండలము — అపవిద్ధము — అంచితము — ఆవిద్ధము — కుంచితము — అధోముఖము అని.

వీని లక్షణ మీ విధమున నున్నది.

౧. ఊర్ధ్వగము:— శిరమునకు పైగా సంచార ముండుట.

౨. పృష్ఠగము:— తన శరీరపృష్ఠభాగమున సంచారము.

౩. తిర్యగ్గతము:— వేరొక హస్తమున పార్శ్వగత మగుట.

౪. స్వస్తికము:— బాహువులు స్వస్తికాకృతి నుండుట.

౫. మండలము:— అంతట భ్రమించునది యగుట.

౬. అపవిదము:— మండలాకార బాహువువలె పరితో భ్రమణమున కుపక్రమించి వక్షఃప్రతిఘాతము పొంది మరలుట.

౭. అంచితము:— ఉరఃప్రదేశము నుండి శిరఃప్రదేశము చేరి ఉరఃప్రదేశమునకు ప్రత్యాహృత మయిన బాహు వంచితము.

౮. ఆవిద్ధము:— మధ్యలో క్షేపము వలన మరలిన దగుట ఆవిద్ధము.

౯. కుంచితము:– తీక్ష్ణకూర్పరముగా నుండి ద్విగుణముగా ప్రచారము పొందుట.

౧౦. అధోముఖము:– భూమి సమ్ముఖముగా ఆలింగనము చేసికొనిన రీతి యధోముఖము.

ఈ పది బాహుప్రకారములు కరణగతములుగా నుండును. ఇవి నాలుగు కరణము లందును దశవిధ బాహు ప్రకారములు నియుక్తములు కాగా ననేకభేదము లావిర్భవించును. కొందరింకను బహుప్రకారముల నంగీకరించిరి. వాని వివేక మీ విధమున నుండును.

సరలాందోలితౌ నమ్రోద్వేష్టితోత్సారితా స్తథా
ప్రసారిత ఇతి ప్రాహుర్బాహుమన్యే చ షడ్విధం
ప్రసృతః పార్శ్వయోరూర్ధ్వం అధో వా సరలః స్మృతః ౪౮౩
భవేదాందోలితోఽన్వర్థో నమ్రః స్యాద్వక్రితో మనాక్
భవేదుద్వేష్టిత స్తిర్యక్ మణిబంధ వివర్తితః
స్వ పార్శ్వాంతరాత్పార్శ్వం గచ్ఛన్నుత్సారితో మతః
అనుధావన్పురోదేశం సమాఖ్యాతః ప్రసారితః
స్వోక్తావాంతరభేదత్వాదిమాన్మునిరముంచత ౪౯౦

కొందరు బాహుప్రకారము లారు కల వనిరి.
సరలము – ఆందోలితము – నమ్రము–
ఉద్వేష్టితము – ఉత్సారితము – ప్రసారితము –
అని వీని లక్షణవిధానము లీ విధమున నున్నవి.

౧. సరలము:–పార్శ్వభాగముల కూర్ధ్వమున కధోభాగమునకు ప్రసరించిన బాహువు సరలము.

౨. ఆందోలితము:– ఆందోలనము (వేలాడుచు నుండు బాహు వాందోలిత మనుట సార్థకము.

౩. నమ్రము:– బాహువు కొంచెము వక్రముగా నుండునేని నమ్రబాహు వగును.

౪. ఉద్వేష్టితము:– అడ్డముగా నుండి మణిబంధనము వివర్తిత మగు బాహు వుద్వేష్టితము.

౫. ఉత్సారితము:– ఒక పార్శ్వము నుండి పార్శ్వాంతరమునకు ప్రసరించు బాహు వుత్సారిత మగును.

౬. ప్రసారితము:– ఎదురుగా నున్నప్రదేశమున కనుధావన మొనరించు బాహువు (ప్రసారిత మని సమాఖ్యాతము.

ఇట్లితరులు పరిగణించిన బాహు(ప్రకారములను తాను నిరూపించిన వానిలో నాంతరభేదములె యగును. గాని వేరుభేద ములు కా నోపవన్న భావమున ముని పీ.ిని విడనాడెను. బాహు వర్తనము లనేకవిధములు. అనంతములు. ఆ వర్తనములకు సంఖ్యా నియమము యుక్తము కాదు. ఈ విషయ మిచట మీామాంస్యము.

ద్రుతమధ్యాదివైచిత్ర్యాత్ సమస్త వ్యస్త యోజనాత్
పర్యాయశో హి బాహూనాం కరణేషు చతుర్ష్వపి
వర్తనాః (క్రియమాణాస్తు సంభవంతు పరశ్శతం
యచ్చత్వారింశతం కేచిత్ శతం కేచిదిమాన్ జగుః
సంఖ్యయా నియమస్తస్మాదితి కర్తుమసాం(ప్రతం ౪౫౪

బాహు(ప్రచారములకు బాహువర్తనములని పేరు. ఈ పది బాహువర్తనములు పూర్వము నిరూపించిన నాలుగు కరణము లందును (ప్రయుక్తము లగును. ఇట్లు (ప్రయుక్తము లగు బాహు

వర్తనములకు ద్రుతగతి వైచిత్ర్యమున మధ్యగతి వైచిత్ర్యమున విలంబితగతి వైచిత్ర్యమునను భేదవిశేషములు సంభవించును. ఈ వర్తనము లన్నియు సమస్తములుగా యోజితము లగుట వ్యస్తములుగా నాయోజితము లగుట పర్యాయక్రమమున ప్రయుక్తము లగుట యను విశేషముల వలన ననేక వర్తనములు కలుగును. ఇవి వందల కొలది కావచ్చును. వాని సంఖ్యానించుట శక్యము కాదు. ఇట్టి యాయోజనవిశేషముల వలన శతసహస్రభేదములు కలుగును.

ఇట్టి భేదము లెన్ని యుదయించిన నివి యన్నియు మా పరిగణనమున నంతర్భావించునని కొందరు భావించిరి. కావుననె కొందరు నలుబది బాహువర్తనములను సంఖ్యానించిరి. నాలుగు కరణములకు పదివర్తనముల సంబంధమున నలుబది విధములు కలుగునని వేరు వేరు యోజనమున గలుగు నానాభేదము లన్నియు నీ నలుబది భేదము లందే యంతర్భవించునని వారు భావించి యుందురు. అట్లే కొందరు శతవర్తనము లుండుట నామోదించి నానాభేదము లీ శతమున నంతర్భవింప గలవని భావించి యుందురు.

ఇట్లు సంఖ్యానియమ మొనరించుట యుక్తము కాదు. అది యసాంప్రతము. అవి వీనిలో నంతర్భవించు ననుట మిథ్య. అవి యంతర్భవింపవు. అవి అనంతప్రకారములు. వాని సంఖ్యాన మసంగతము.

ఈ హస్తము లంతట ప్రయోగింప దగవు. కొన్ని భావములలో వీనిని ప్రయోగింపరాదు. అట్టి యనుచితభావావస్థల నిట్లు గుర్తించుట యావశ్యకము.

చింతా శోక జరా రోగ శీత ప్రాలేయవృష్టిభిః
తంద్రా మూర్ఛా జుగుప్సాభిః పీడితేషు విషాదిని

ప్లవోదన్వత్తపః స్థేషు హ్రీతే గ్లానే నభశ్చ్యుతే
సంగ్రామ త్రస్త నిశ్చేష్ట హస్త హీనేషు హర్షితే
స్వప్నే స్వప్నాయితే మత్తే ప్రమత్తోన్మత్తయోర్జడే ౫౦౦
నాభినేయాః కరాః బాహ్యాన్ ద్రవ్యాదీన్ గమయంతి యే

చింత శోకము ముసలితనము రోగము శీతబాధ మంచు వర్షించుట మాంద్యము మూర్ఛ జుగుప్స అనువానిచే పీడితులగువారి విషయమున హస్తప్రచారపరికారములను పరియోగింపరాదు. విషాదము పొందినను పడవలో నున్నను సముద్రమునం దీదుచున్నను తప మొనరించు చున్నను ప్రయోగింప రాదు. హ్రీ పడి యుండు వానిలో గ్లానితో నున్నపుడు ఆకసమునుండి పడినపుడు ప్రయోగింప జనదు. యుద్ధము నందున్నను భయపడి యున్నను నిశ్చేష్టుడై యున్నను హస్తహీనముగా నున్నను వీని ప్రయోగింపరాదు. సంతోషమున నున్నచో నివి తగవు. స్వప్నముతో నున్నను స్వప్నాయితుడై కలవరింతలతో నున్నను మత్తుడై యున్నన ప్రమత్తులై యున్మత్తులై యున్నను జడునందును ఈ హస్తము లభినేయములు కారాదు. బాహ్యద్రవ్యములను ఇట్టివానిని అవగమింపజేయు స్వభావము కల కరములను ప్రయోగింప వలసిన యవసరము లేదు. బాహ్యద్రవ్యముల గోచరింపజేయలేని వాని నభినయించి ప్రదర్శింపవలయునే కాని యన్నిటి నభినయింప నక్కరలేదు.

యధా సర్పశిరాః సర్పం యధా చ మకలో ఝషం
సూచయత్యంతరీం చిత్తవృత్తిం సాత్త్వికభావవత్
యో యో భావః స్వభావత్వాత్తేషామభినయో మతః
శుకాస్యస్య యధేర్ష్యాయాం పతాకస్య యధా ముది ౫౦౫
యధా త్రాసే కపోతస్య శోకే డోలస్య వా యధా
ఏవం భావవిశేషేపి కార్యం హస్తానుకూల్యతః

సర్పశిరము అనెడు హస్తము సర్పమును సూచించును. మకర మను హస్తము ఝుషము-మత్స్యమును సూచించును. మకర ధ్వజపద మునకు మన్మథు డని యర్థము. మన్మథుడు మత్స్యధ్వజుడు మకరధ్వజపదము మత్స్యధ్వజ పదపర్యాయముగా కొన్ని ప్రాచీన గ్రంథము లందు కలదని, మకరపదమునకు మత్స్యమను నర్థము ప్రచారమున నున్నదని, అందుననె మన్మథార్థము సంగతమని కొంద రభిజ్ఞులు సూచించిరి. మకరపదము నక్రము-మొసలి అను నర్థమున ప్రసిద్ధముగా నున్నది. మకరధ్వజు డను పదమునకు సముద్రార్థమున ప్రయోగ ముండుటను కొందురు సందేహింతురు. ప్రస్తుతము మకరము మత్స్యమును సూచించు ననుట వివక్షితము. సాత్త్విక భావముల వలె నివి యాంతర చిత్తవృత్తిని సూచింప గలవు. అనుభావాత్మక ముగా నుండు అభినయము స్వభావాత్మకమె. సాత్త్విక భావముల వలె ననుభావములు భావములె కావున హస్తవిన్యాసము లన్నియు సత్త్వావష్టంభనమున నున్నవై సూచ్యములను సూచింప గలవు. హస్తము లాంతరచిత్తవృత్తి విశేషములను సూచించు ననుట నిశ్చితము. కపోతకహస్తము భయమును సూచించుట, కర్కటకము మదనవిజృంభణ సూచించుట, దోలహస్తము శోకమునుసూచించుట, శుకతుండము ఈర్ష్యను సూచించుట కలదు. పతాకము సంతోషము సూచించును. ఇట్లు హస్తానుకూల్యమున భావవిశేషసూచనము గ్రహింపవలెను.

## నృత్తహస్తములు.

హస్తప్రసంగమున నృత్తహస్తములను జెప్పవలసి యున్నది. అభినయ మొనరించు నర్తకుడును వానిని దెలియ వలయును. చతురశ్రాది నృత్తహస్తములకు ప్రయోగవశమున విశేషము పరిశీలింప వలసి యున్నది. ఇటుపై నృత్తసమాశ్రయము లయిన కరములను

నిరూపించుట యుచితము. కరణాత్మకమయిన నృత్తముల కివి యాశ్రయములు కావున కరణహేతువులు. అభినయహస్తములను నిరూపించిన పిమ్మట వీనిని నిరూపించుట వలన నివి యభినయహస్తములుగా గూడ పరిగణనయోగ్యత కలవని విశదమగును.

### వృత్తహస్తాః - ౧. చతురశ్రః

చతురశ్రత్వమంగస్య నృత్తే జీవిత ముచ్యతే
తదాకారతయా పూర్వం చతురశ్రా వుదాహృతౌ
ప్రాయేణ నృత్తహస్తానాం ప్రభవత్వాచ్చ సూరిభిః ॥౧౦
బింబసూత్ర సమస్కంధ కూర్పరౌ కటకాముఖే
పరాఙ్ముఖే యదా స్యాతా మురసోఽష్టాంగులాంతరే
చతురశ్రౌ తదా జ్ఞేయే సౌష్ఠవేనాపి సంయుతౌ
ఆకర్షణే స్రగాదీనాం విష్ణోరభినయే పునః

### ౧. చతురశ్రము

నృత్తహస్తములలో చతురశ్రము మొదటిది. నృత్తమునందు అంగము చతురశ్రముగా నుండుట సమానవిభక్తావయవముగా నుండుట నలువైపుల శోభాసుందరముగా నుండుట జీవిత మని నాట్యవిదులు భావింతురు. చతురశ్రాకారముగా నున్నందున మొదట చతురశ్రము నిరూపించుట సముచితము. ఈ చతురశ్రము సామాన్యముగా నృత్తహస్తముల కన్నిటికి నుత్పత్తిస్థానము. ప్రభవభూమి. అని నాట్యవిదుల భావనము. చతురశ్రాది హస్తములన్నియు సంయుత హస్తము లనుట స్పష్టము.

స్కంధము-అంసము కూర్పరములు బింబసూత్ర సమాన విన్యాసముతో నున్నప్పుడు కటకాముఖ హస్తములు వక్షఃస్థలము

నకు ఎనిమిది అంగుళముల దూరమున నున్నవై పరాఙ్ముఖములుగా నుండునేని చతురశ్రహస్తము లగును. పరస్పర మష్టాంగులాంతర ముగా నున్నందున చతురశ్ర్యము కలుగుట అభ్యూహ్యము కాగలదు.

మూలము నందలి లక్షణవచనములో "బింబసూత్రి" పదము "పరాఙ్ముఖా" పదము కలదు. బింబసూత్రపదము స్పష్టార్థ మిచ్చుట లేదు. శిల్పము నిర్మించుటకు పూర్వము బింబము. ఆకృతి నిర్మించు స్థపతులు శిల్పులు పై నుండి దిగువ స్థానము వఱకు సమాంతరాకృతి నిర్మాణమునకై సూత్రిపట్టు విధానము కావల యును. ఇట్టి విధానమునె చిత్రికారులు పూర్వరూప (నమూనా) విధాతలనుసరింతురు. ఇట్టి భావమునె సూచించుటకు అభినవ గుప్తుడు "కూర్పరాంసయోశ్చ తులాధారణవత్ సమత్వమవై షమ్యం" అనెను. కూర్పరము లంసములు తులాధారణము-త్రాసు పట్టు విధానమున అవైషమ్యముతో నుండుటయె యిచటి సమానత" అని యీ వాక్యభావము. బింబిసూత్రము స్థపతు లుపయోగించు వడంబము కా దగునా? బింబసూత్రి పదమున బ్రహ్మసూత్ర పద మును కూర్చుకొనుట యుక్తముగ నుండునా! అని తోచును.

"పరాఙ్ముఖా" కటకాముఖములు వక్షోదేశమున పరా ఙ్ముఖములుగా నుండుట జాయపతి సూచించెను. భరతాది గ్రంథము లందు "ప్రాఙ్ముఖా" అని యున్నది. ప్రయోక్త యగు నటు డెవరి కభిముఖుడై యుండునో హస్తములు తత్సమ్ముఖములై యుండ వలె నని భావము. కాని యీ హస్తములు ప్రయోక్తృ సమ్ముఖ ములుగా నుండ రాదు. కావున నా హస్తములు ప్రయోక్తకు పరా ఙ్ముఖములు గనె యుండును. అందుననె జాయపతి యట్లు చెప్పెనని భావించునది.

ఇట్టి హ స్తములు చతురశ్రములు. ఇట్టి సౌష్ఠవముతో నివి సంయుతములై యుండును. ఇవి స్రగాదుల యాకర్షణమున విని యుక్తము లగును. విష్ణు వభినయమున నివి వినియోగము పొందును.

## ౨. ఉద్వృత్తే

చతురశ్రౌ కరౌ పూర్వం కృత్వోద్వేష్టితకర్మణా ॥౧౫
హంసపక్షీకృతౌ వక్షః క్షేత్రే వైచిత్ర్యత స్తయోః
ఏకో వ్యావర్తనేఽన్యశ్చ యుగపత్పరివర్తనే
యదోద్వృత్తౌ తదా స్యాతామూర్ధ్వవర్తనయా త్విమౌ
తాలవృంతస్య తుల్యత్వాత్తాలవృంతాపరాభిధౌ
అత ఏవ మతావేతౌ తాలవృంత నిరూపణే ॥౨౦

## ౨. ఉద్వృత్తములు

ఉద్వృత్తహస్తముల రూప మిట్లుండును. మొదట హస్తములను చతురశ్రములనుగా నుంచునది. పిమ్మట ఉద్వేష్టనవర్తన విధానమున హంసపక్షములనుగా జేయునది. ఒక హస్తము నుత్తానముగా వివర్తింప జేయునది. మరియొక హస్తము వక్షఃప్రదేశమున విచిత్రవర్తనమున నొక్కసారిగా పరివర్తనము పొందునట్లు చేయునది. ఊర్ధ్వవర్తనమున నీ హస్తములు ఉద్వృత్తములుగా నుండునేని తాలవృంతముతో సమానముగా నుండును గావున వీనికి "తాలవృంతములు" అను నామము ప్రసిద్ధముగా నున్నది. ఊర్ధ్వమునకు వర్తనము కలవగుటచే ఉద్వృత్తము లయినవి. తాలవృంత నిరూపణమున నివి వినియుక్తము లగును.

## ౩. తలముఖే

చతురశ్రౌ కరౌ హంసపక్షీ కృత్వేవ పూర్వవత్
అన్యోన్యాభిముఖౌ త్ర్యశ్రౌ సమాప్తౌ స్వస్వపార్శ్వగౌ
కార్యౌ తలముఖా వేవం హృద్య మద్దల వాదనే

### ౩. తలముఖములు.

చతురశ్రములుగా నున్న హస్తములను పూర్వము వలె హంసపక్షములనుగా నొనరించి వ్యావృత్తములనుగా ఉద్వృత్తములనుగా జేసి అన్యోన్యాభిముఖములుగా నొనరించునది. అప్పుడు త్ర్యశ్రములుగా నుండియు సమాప్తిలో స్వస్వ పార్శ్వగతము లగును. ఇట్లు తలముఖ హస్తములను గూర్చునది. అన్యోన్య సమ్ముఖతలములుగా నున్నందున తలముఖ వ్యావహారము కలిగినది. హృద్య మద్దల వాదనమున నివి వినియుక్తమగును. "హృద్యం మర్దలంవాదయతి" ఇత్యాది విషయమున నీ యభినయము నుండు నని భావము.

### ౪. స్వస్తికౌ. ౫. విప్రకీర్ణకౌ.

స్వస్తికౌ మణిబంధాంతే భూత్వైతౌ స్వలక్షణౌ
స్వస్తికోధస్తథావాహు విచ్యుతౌ విప్రకీర్ణకౌ

### ౪. స్వస్తికములు. ౫. విప్రకీర్ణకములు

ఈ రెండింటికి పరస్పరసంబంధ మున్నందున నొకచో నిరూపితము లయినవి. తలముఖహస్తములె మణిబంధాంతమున స్వస్తికాకారమున నున్నచో స్వస్తికహస్తము లగును. మణిబంధాంతమనగా మణికట్టు సమీపమున నని భావము. అవియే విశేషముగా చ్యుతము లయినచో విప్రకీర్ణహస్తము లను వ్యవహారము కలుగును. ఈ స్వస్తిక విప్రకీర్ణములు పూర్వము నిరూపించిన నాలుగు వృత్తాకరముల స్వరూపోపజీవనమున నుండుట స్పష్టము.

### ౬. అరాలకటకాముఖౌ

పూర్వపూర్వోపజీవిత్వమేతేషాం విద్యతే క్రమాత్
పతాకస్వస్తికౌ పూర్వమలపద్మవిధానతః

వ్యావృత్తపరివృత్తౌ చ కృత్వోర్ధ్వౌ పద్మకోశకౌ
వ్యావృత్తపరివృత్తౌ చ తతః కృత్వా తయోః పునః
అరాలమేకమన్యం తు విదధ్యాత్కటకాముఖం
చతురశ్రేణ చేత్స్యాత్తామరాలం కటకాముఖం
ఆచార్యాః స్వస్తికేనేతి కేచిత్ప్రాహురిమే పునః ౪౩౦
ప్రాగరాలౌ పరే ప్రాహుః కటకాస్యావతః పరం

## ౬. అ రా ల క ట కా ము ఖ ము లు.

ఈ నిరూపితము లగు నృత్తహస్తములకుక్రమముగా పూర్వపూర్వోపజీవిత్వము కలదు. మొదట స్వస్తికముగా పతాకహస్తమును కూర్పవలెను. అలపల్లవ రీతిలో నున్న పద్మకోశహస్తమును వ్యావృత్తముగా పరివృత్తముగా నూర్ధ్వముఖముగ పద్మకోశములనుగా నొనరింపవలెను. అట్లు పద్మకోశములుగా నొనరించిన హస్తములలో నొక హస్తమున అరాలము పట్టవలెను. వేరొక హస్తమున కటకాముఖము పట్టవలెను. ఈ యరాలకటకములు చతురశ్రములుగా నొనర్పవలెను. అప్పు డరాల కటకాముఖహస్త మగును. కొందరు స్వస్తికమునను వీని స్థితి నభిమానించిరి. మొదట అరాలములు పిమ్మట కటకాముఖము లని కొందరందురు. మణిబంధాంతమున అరాలములు కూర్చి విడువగా అరాలకటకాముఖ మని కొందరు సంభావించిన స్వరూపము.

## ౭. ఆ వి ద్ధ వ క్రా

అంసాభ్యాం కూర్పరాభ్యాం చ భుజాభ్యాం చ క్రమాద్యథా
కుటిలాభ్యాం విలాసేన పతాకౌ వర్తితౌ తదా
అవాఙ్ముఖతలౌ క్షేప్యే బుధైరావిద్ధవక్రకౌ॥

## ౬. ఆవిద్ధవక్రములు.

పతాకహస్తము లంసభాగములతో కూడినవై కూర్పరములతో గూడినవై భుజములతో గూడినవై కుటిలముగా విలాసమున నావర్తితము లగు నేని ఆవిద్ధవక్రము లగును. అవాఙ్ముఖతలములుగా; అధోముఖతలములుగా నుండుట యని భావము.

## ౭. సూచ్యాస్యౌ

వ్యావృత్తపరివృత్తాభ్యాం ప్రథమం చతురశ్రగౌ ౪౩౫
పతాకే భవతః పశ్చాత్తథా స్తః ఫణిమస్తకౌ
తత స్తథైవ సూచ్యాస్యౌ పార్శ్వే తిర్యక్ప్రసారితౌ
పర్యాయేణ చ సూచ్యాస్యౌ జ్ఞేయే నృత్తప్రయోక్తృభిః

## ౭. సూచ్యాస్యములు.

పతాకహస్తములు మొదట వ్యావర్తన పరివర్తనములతో నుండి చతురశ్రరూప గతములు కావలెను. అనంతరము సర్పశిరసములు కావలెను. పార్శ్వమున తిర్యక్ప్రసారితములై సూచ్యాస్యము లగును. సర్పశీర్షములు చతురశ్రగతములై స్వస్తికస్థానమున నున్నవై సూచ్యాస్యము లగు ననియు కొందరు భావింతురు. సూచ్యాస్యము లందు పర్యాయమున ప్రవృత్తియు నుండును.

## ౮. రేచితే.

భ్రమతో రేచితే సంతౌ హంసపక్షౌ ద్రుతం యది
ప్రసృతోచ్చతలత్వేన విఖ్యాతావితి రేచితౌ ౪౪౦
ఉక్తౌ నరహరేరేతౌ దైత్యోర స్తటపాటనే

## ౮. రేచితములు.

హంసపక్షములు వేగముగా భ్రమణము పొందినవై ప్రసరించిన ఉచ్చతలములుగా రేచితము లయినచో రేచితహస్తము

లని విఖ్యాతము లయినవి. ఇవి నరసింహస్వామి దైత్యోరస్తటపాటన ము న వినియుక్తము లగును. రేచితహస్తములను నిరూపించుటలో నాట్యవేదలక్షణము.

"రేచితే చాపి విజ్ఞేయే హంసపక్షౌ ద్రుతభ్రమౌ
ప్రసారితోత్తానతలౌ రేచితావితి సంజ్ఞితౌ."

ఇం దభినవభారతీభావ మీ విధమున నున్నది. ఈ రేచితములె అర్ధరేచితములు నగును. లక్షణ శ్లోకములో "రేచిత" అను పదము రెండు పర్యాయములు ప్రయుక్త మయినందున పునరుక్తి కలుగు నని, పునరుక్తిని పరిహరించుటకై కొంద రివి రెండు లక్షణము లని యనిరి. కావున, భ్రాంతము లవికృతములయిన హంసపక్షములు రేచితము లగునని యొక లక్షణము గ్రాహ్యము. హంసపక్షములు ప్రసారితోత్తానతలములుగా నుండి వికృతములుగా నున్నను రేచితములగును. అని మరికొంద రిది ఏకవాక్య మనియె భావించిరి

"రేచితే సంతౌ యే ద్రుతభ్రమౌ తౌ
రేచితసంజ్ఞావితి న పౌనరుక్త్యం"

హంసపక్షములు వేగభ్రాంతములై రేచితములుగా నుండు నేని రేచితసంజ్ఞకల హస్తములగును. ఇట్టి యర్థమున పౌనరుక్త్యము లేదు. జాయపతి నిరూపించిన లక్షణమున రేచితపదము రెండు పర్యాయములు ప్రయుక్తము యినది. అయినను పునరుక్తి లేని విధమున నర్థము నిర్ణయించుటకు అభినవభారతి యనుసారమున జాయపతి నిరూపించెను.

## ౧౦. అర్ధరేచితౌ

యత్త్వేకో రేచిత స్తద్వదపరశ్చతురశ్రగః
పర్యాయేణ కరావేవ మర్ధరేచిత సంజ్ఞికౌ

## ౧౦. అర్ధరేచితములు.

అర్ధరేచిత సంజ్ఞ వలననె అర్ధరేచిత రూపము స్పష్టము. అయినను మరల లక్షణకథనమున నొక విశేషము గోచరించును. అంతట నవిశేషముగ చాతురశ్రస్థితి యుండునని నృత్తహస్తాంతరము లందును ఆ యా అంగపర్యాయమున ప్రయోగ ముండుట యుక్త మని సూచితమగును.

ఒకహస్తము రేచిత మగుట మరియొకటి చతురశ్రముగా నుండుట ఇట్లు పర్యాయమున ప్రవృత్తము లగుట అర్ధరేచిత మగును. వామహస్తము రేచితమగుట సవ్యహస్తము చతురశ్రమగుట కొందర రంగీకరింతురు. ఈ జాయపతి పర్యాయప్రవృత్తియు అర్ధరేచిత మని యంగీకరించెను.

## ౧౧. ఉత్తానవంచితే

అంసగండకపాలానాం సమక్షేత్రే క్వచిత్ స్థితౌ
త్రిపతాకౌ మనాక్తిర్యగుత్తానౌ సమ్ముఖౌ తథా ౪౪౫
కూర్పరాంసం చలత్కించిత్ స్యాతా ముత్తానవంచితౌ

## ౧౧. ఉత్తానవంచితములు.

త్రిపతాకహస్తములు అంసమునందు కపోలమునందు లలాటము నందును ఉన్నవై, అన్యోన్యము సమ్ముఖములై కొంతగా తిర్యగుత్తానములుగా నున్నచో ఉత్తానవంచితము లను హస్తము లగును. అప్పు డంసములకు కూర్పరములకు కించిచ్చలన ముండును. అంచన ముద్గమనము రెండు నుండును గావున ఉత్తానవంచిత మగును.

## ౧౨. పల్లవౌ

వ్యావర్తిత భుజాదూర్ధ్వం ప్రసార్య పరివర్తనాత్
పతాకౌ మణిబంధస్థౌ శిథిలౌ స్వస్తికీకృతౌ

సంపద్యేతే యదా విద్భిః కధితే పల్లవే తదా
కేచిత్పతాకయోః స్థానే త్రిపతాకావిహాబ్రువన్ ౪౨౦

౧౨. పల్లవములు.

మణిబంధమునందున్న పతాకహస్తములు శిధిలములై స్వస్తికీకృతము లయినచో పల్లవహస్తము లగునందురు. ఊర్ధ్వా వ్యావర్తనమున బాహువులను సాచి పరివర్తన మొనరింపగా శిధిలములగు పతాకహస్తములు స్వస్తికాకృతి కలవగును. కొందరు పతాక స్థానమున త్రిపతాకహస్తము లుంచుటను నిరూపించిరి. అవియు పతాకముల వలె కావలెను.

౧౩. కేశబంధౌ

ఉత్తానితౌ ముఖార్ధేన విచిత్రౌ స్కంధదేశతః
నిష్క్రాంతౌ పూర్వవచ్చేతౌ కేశబంధా వుదాహృతౌ

౧౩. కేశబంధములు.

పతాకహస్తములు స్కంధదేశమునుండి కొంతగా ఉత్తానితములు విచిత్రములునై వినిర్గతము లయినచో కేశబంధము లను నృత్తహస్తము లగును. మొదట ఒక పార్శ్వము నుండి పార్శ్వ పరివర్తనమున వెలువడి శిరః ప్రదేశమువరకు ప్రసరించి అటు నుండి నితంబ హస్తముల వలె విచిత్ర హస్త విధానమున వెలువడి పర్యాయ ప్రవృత్తము లయినచో కేశహస్తము లగుననుట నిచట భావింప వలెను.

౧౪. లతాఖ్యే

ప్రలంబితభుజౌ తిర్యత్పతాకౌ చేత్ప్రసారితౌ
లతాఖ్యావితి విజ్ఞేయౌ నృత్తాభినయగోచరౌ
నితంబప్రభృతిష్వేషు త్రిపతాకౌ జగుః పరే ౪౨౩

## ౧౪. లతాఖ్యములు.

పతాకహస్తములు తిర్యక్ప్రసారితము లై యుండగా భుజములు వ్రేలాడు నట్లుండు నేని లతాఖ్యములగును. ఇది నృత్తాభినయ గోచరములై సుందరములుగ నుండునని నాట్యవిదులు భావింతురు. నితంబ కేశబంధ లతాఖ్యములలో పతాకహస్తముల ప్రయోగమె యిచట నిర్దిష్ట మయినది. వీనిలో త్రిపతాక ప్రయోగ మభీష్ట మని కొందరనిరి.

### ౧౫. కరిహస్తౌ. ౧౬. పక్షవంచితౌ

లతాహస్తో భవేత్పార్శ్వాత్ పార్శ్వం దోలావదున్నతః
కర్ణేఽన్యస్త్రిపతాకశ్చే త్కరిహస్తం విదుర్బుధాః
కటకాముఖమత్రాన్యే కేచిత్పూర్వం లలాటకం
త్రిపతాకే కటీ మూర్ధ్ని దత్తాగ్రే పక్షవంచితౌ

### ౧౫. కరిహస్తములు ౧౬. పక్షవంచితములు.

సమున్నతము యిన లతాహస్తము దోలాహస్తము వలె ఒక పార్శ్వమునుండి మరియొక పార్శ్వమునకు ప్రసరించు నేని విలోలితముగా నుండు నేని, త్రిపతాకము కర్ణ దేశమున నున్నచో కరిహస్తమగును చతురశ్రములో వలె సజాతీయముల కిం దారంభ ముండదు. నృత్తాభ్యాస వ్యపదేశము ననుసరించి విజాతీయారంభ మును యుక్తమగును. కరిహస్తాకారమున నుండుటచే కరి హస్త మను నామము చితము. కర్ణ దేశమున నుండునది త్రిపతాకమని కొంద రనగా కొందరు కటకాముఖ ముండునని లలాటక ముండు నని యనిరి.

త్రిపతాకహస్తములు కటి అగ్రభాగ నివిష్టములయి నచో పక్షవంచితము లగును. పక్షము లంచితము లగుట గుర్తింపవలెను.

౧౭. ప క్ష ప్ర ద్యో త కౌ

కటీ పరాఙ్ముఖాగ్రేణ పక్షప్రద్యోతకావిమౌ ౪౬౦
ఏతే శోభావహౌ నిత్యం పక్షప్రద్యోతపూర్వకౌ

౧౭. ప క్ష ప్ర ద్యో త క ము లు.

త్రిపతాకహస్తములు కటిభాగ పరాఙ్ముఖము లయినచో పక్ష ప్రద్యోతకము లగును. ఆ హస్తములు పక్ష భాగమున ప్రద్యోతమానములుగనుండును. కావున నివి నిత్యము శోభావహములుగ నుండును. పక్షవంచిత పక్షప్రద్యోతకముల వ్యామిశ్రణమున ప్రయోగశోభ కలుగుటను నాట్యవిదు లంగీకరింతురు.

౧౮. తా ర్క్ష్య ప క్షౌ

తౌ పతాకీకృతౌ సంతావధస్తలమధోగతౌ
ఉత్పతంతౌ చ తరసా తార్క్ష్యపక్షా వుదాహృతౌ

౧౮. తా ర్క్ష్య ప క్ష ము లు.

వీనికే గరుడపక్షము లనియు పేరు కలదు. పతాక హస్తములు అధస్తలము పొందినవై పైకి క్రిందికి ప్రసరించు చున్నవై వేగ వేగముగా నుత్పతనము కలవయినచో తార్క్ష్య పక్షములగుచున్నవి. పతాకము లధోముఖ తలావిద్ధము లగుట వీని రూపము పతాకము లధోముఖములై నితంబమున ప్రసరించి వేగముగా నూర్ధ్వగమన మొనరించునవి యగుట వివక్షితము. తార్క్ష్య భుజాకారత గోచరించుటచే పేరు యుక్తము.

౧౯. దం డ ప క్షౌ

వక్షఃక్షేత్రం త్రయత్యేకో యేన కాలేన పార్శ్వతః
వ్యావృత్త్యా హంసపక్షాఖ్యః తేనైవ పరికీర్తితః ౪౬౫

ప్రసారితభుజోన్యస్తు తిర్యక్పర్యాయశః పునః
ఏవమంగాంతరేణాపి క్రియాస్యా ద్దండపక్షయోః
ఉభయోర్వేగపద్యేన ప్రాహుః బాహ్వోః ప్రసారణం
వ్యావృత్తపరివృత్తం చ క్రమేణాత్ర క్రియావిదః

## ౧౯. దండపక్షములు.

హంస పక్ష మను హస్త మొకటి వక్షస్థలము నాశ్రయించి యుండి వ్యావర్తన విలాసమున పార్శ్వము నుండి ప్రసరింపవలెను. రెండవ హంసపక్షము భుజప్రసారముతో నున్నదై పర్యాయవర్తనమున తిర్యక్ప్రసారితము కావలెను. ఒక హంస పక్షమునకు వ్యావర్తనమున్నప్పుడు పార్శ్వము నుండి యురమునకు ప్రసరించుటయు, ఆ సమయముననే రెండవ హంసపక్షము దేహ పరివర్తనమున భుజ ప్రసారపర్యంతము వర్తనముండుటయు, ఇట్లే వేరొక యంగమున నాచరించుటయు, రెండు హంసపక్షములును భుజ ప్రసారముతో నున్నవై వ్యావర్తన పరివర్తనములతో నుండుటయు దండ పక్ష హస్త క్రియలు దండము వలె పక్షమున భుజ ముండుటచే దండపక్షమయినది. కొందరు ఒకే సమయమున రెండు హస్తములకు ప్రసరణ ముండునని వ్యావర్తన పరివర్తనములు క్రమమున నుండునని యనిరి. ఇట్టి యితర భావముల నభినవభారతి సూచించినది.

## ౨౦. ఊర్ధ్వమండలౌ

వ్యావృత్తవక్షసౌ పాలవర్త్మనా పార్శ్వమాగతౌ ౪౭౦
తతో మండలవద్భ్రాంతే ప్రసారితకరౌ భుజౌ
పతాకౌ చేన్మతావూర్ధ్వమండలౌ నృత్తకోవిదైః
చక్రవర్తనికేత్యన్యత్ప్రోదితం నామ లోకతః
ప్రాహ కీర్తిధరాచార్యః కరయో రనయో రితి

## ౨౦. ఊర్ధ్వమండలములు.

పతాకహస్తములు వక్షోభాగము నుండి వ్యావృత్తములై ఫాలతల వర్తన విధానమున పార్శ్వ భాగమునకు వచ్చినవై మండలాకారముగ పరిభ్రాంతములై యుండగా భుజములు ప్రసారితములు కాగా ఊర్ధ్వ మండల హస్తములగునని నాట్యకోవిదులు భావించిరి. లోకానుసారమున నీహస్తములు "చక్రవర్తనిక" అను పేరు కలవయినవి. కీర్తిధరాచార్యుడీ నామవ్యవహారము నంగీకరించెను. అభినవగుప్తుడు చక్రవర్తనిక నామము నూర్ధ్వ మండలమునకు చెప్పెను. కాని కీర్తిధరుడు చెప్పినట్లనలేదు.

## ౨౧. పార్శ్వమండలౌ

తే మిథస్సమ్ముఖౌ పార్శ్వవిన్యస్తౌ పార్శ్వమండలౌ ౪౩౫
స్కంధక్షేత్రాదధః స్వస్వపార్శ్వయోర్భ్రమణం పరే
ఆవిద్ధభుజయోరాహుః తయోరన్వర్థవాదినః
కక్షవర్తనికేత్యన్యదనయోర్నామ కల్పితం

## ౨౧. పార్శ్వమండలములు,

ఊర్ధ్వమండల హస్తములె పార్శ్వ విన్యస్తము లయినచో పార్శ్వమండలహస్తము లగును. ఊర్ధ్వ మండలముగా నున్న హస్తములె పార్శ్వ గతములై పతాకాకారమున పరస్పర సమ్ముఖములు గానుండునేని పార్శ్వమండల సంజ్ఞ కలవగుట వివక్షితము. కొందరు స్కంధ భాగమునుండి స్వస్వపార్శ్వము లందు భ్రమణము పొందుటను పార్శ్వమండలహస్తముగా పరిగణించిరి. పార్శ్వ మండల మన్వర్థనామ మని తలచువారు భుజము లావిద్ధముగా నుండుటను నిరూపించిరి. ఈ పార్శ్వ మండల హస్తములకు "కక్ష వర్తనిక" అను నామమును కొందరు భావించిరి. ఇది వారి కల్పనము. ఇట్లు ప్రసిద్ధి కానరాదు.

## ౨౨. ఉరోమండలౌ

ఉద్వేష్టశ్చాపవేష్టశ్చ స్యాతాం చేదేకకాలతః
హస్తయోరురసః స్థానాత్పార్శ్వయోః భ్రాంతయః క్రమాత్ ౪౭౦
ఉరోమండలినౌ అన్యే ప్రాహుర్వక్షస్థయో రితి
ఏతద్భేదద్వయం కేచిదురోవర్తనికాం జగుః
ఊర్ధ్వదిఙ్మండలేష్వేష హంసపక్షే విదుః పరే

## ౨౨. ఉరోమండలములు.

ఒక హస్తము ద్వేష్టితమై మరియొకటి యపవేష్టితమై ఒకేకాలము ననుసరించి ఉరః స్థానము నుండి భ్రమితము లయినచో నురోమండల మగును. ఉరము నుండి భ్రమితము లగుటలో ఒక హస్తమున కాగమనము వేరొక హస్తమునకు గమనము వర్తనమున నుండును. ఉరః స్థలము నుండి పార్శ్వములకు క్రమాను సారమున భ్రమణము లుండును. వక్షః స్థములగు హంస పక్ష హస్తముల వర్తనమె ఉరోమండలి హస్తములకు స్వరూపమిచ్చు నని కొందరనిరి. పార్శ్వ మండల ఉరో మండలముల రెండిటిని కొందరు "ఉరోవర్తనిక" యని వ్యవహరించిరి. హంస పక్ష హస్తములు ఊర్ధ్వ దిఙ్మండలములలో సంచరించుటను కొందరు నిర్దేశించిరి.

## ౨౩. ఉరఃపార్శ్వార్ధ మండలౌ

వ్యావర్తితేన హస్తశ్చేదలపల్లవశంసినా
పార్శ్వం చ వక్షసః ప్రాప్య ప్రసారితభుజో భ్రమన్ ౪౭౧
అరాలం దధదావేష్టకరణేన క్రియత్యురః
తదానీమేవ పార్శ్వం స్వమతో గచ్ఛతి పూర్వవత్
మండలేన తతోప్యేవమురఃపార్శ్వార్ధమండలౌ

## ౨౩. ఉరఃపార్శ్వార్ధమండలములు.

ఈ హస్తములందు అలపల్లవము అరాలము అను హస్తముల వర్తనము లుండును. అలపల్లవ హస్తము వ్యావర్తితమై వక్షః పార్శ్వమును పొంది భుజ ప్రసారముతో నున్నదై భ్రమించును. అరాలహస్తము ఆవేష్టిత రూపమున నుండి వక్షః ప్రదేశము ననుసరించుచు ఆ సమయముననె స్వపార్శ్వము చేరును. ఇట్లివి మండలాకారమున నుండును. గావున ఉరఃపార్శ్వార్ధమండలము లగుచున్నవి.

అలపల్లవము అరాలము వక్షమున సగము వర్తన మొనరించి పార్శ్వ వర్తనము కలది కావలెను. వక్షము నుండి యుత్తానమయిన హస్తము అలపల్లవము నకు స్థానమిచ్చుటకై వ్యావర్తితమగును. ఆ సమయముననె పార్శ్వ ప్రసారిత భుజమయిన రెండవ హస్తము వక్షమున వ్యాపించును. వక్షమున నొక హస్తము పార్శ్వమున నొక హస్తము మండలముగా గతాగత మొనరించు గావున ఆ పేరు సముచితము.

## ౨౪. ముష్టికస్వస్తికౌ

కరణేనాపవేష్టేన స్యాదేకః కుంచితో యదా
తదాన్యోప్యంచితో భూత్వోద్వేష్టితేన మృదుః క్రమాత్ ౪౯౦
స్వస్తికౌ కటకాస్యౌ చేన్ముష్టికాస్వస్తికౌ మతౌ
యత్పరంపరయా ముష్టేర్జాతౌ తౌ మునినా తతః
తయోక్తౌ ముష్టిశిఖరకసిత్థకటకేష్వపి
స్యాతామన్యతమావేతా లిత్యాశయవతా మునా
ఏకః స్యాత్కుంచితో ముష్టిః కాటకాస్యోఽంచితః పరః ౪౯౩
ఇతి కీర్తిధరః ప్రాహ ముష్టికస్వస్తికౌ కరౌ
ఖడ్గవర్తనికేత్యన్యన్నామధేయం చ కల్పితం

## ౨౪. ముష్టిస్వస్తికములు.

అపవేష్టన కరణమున నొక హస్తము కుంచితము కావలెను. అన్యహస్తము ఉద్వేష్టితమున అంచితము కావలెను. అట్లు క్రమమున మృదువుగా హస్తములు ప్రసరించి స్వస్తికములు కటకాస్యములు నయినచో, ముష్టికస్వస్తికములను హస్తములగును. ముష్టికహస్తముల పరంపరా విశేషమున నివి యుత్పన్నము లని ముని భావించెను. కావున ముష్టి - శిఖర - కపిత్థ న కటక హస్తములలో నేవేని ప్రయుక్తములు కావచ్చును, ఒక హస్త మరాల హస్తమున కుంచితమగుటయు మరియొక హస్తముల పల్లవ వర్తనమున నంచితమగుటయు నిందు గ్రహింపవలెను.

ఈ ముష్టిక స్వస్తికముల నిరూపించుటలో కీర్తిధరు డిట్లభిమానించెను. ఒక ముష్టికుంచితము. మరియొకటి కటకాస్యమున నంచితమగును. ఇట్లుండుట ముష్టిక స్వస్తికరూపము. అని ఈ హస్తమునకు ఖడ్గవర్తనిక అను నామధేయము నంగీకరించెను.

## ౨౫. నలినీపద్మకోశకా

పద్మకోశాభిధౌ హస్తౌ వ్యావర్తాదిక్రియాకృతౌ
ఆశ్లిష్టే స్వస్తికక్షేత్రే వ్యావృత్తపరివర్తితౌ
మిధః పరాఙ్ముఖే స్యాతాం నలినీపద్మకోశకా ౨౦౦
మణిబంధసమాశ్లిష్టే కనిష్ఠాంగుష్ఠ సంముఖౌ
శ్లిష్టలక్షణసంయుక్తౌ వేతా వన్యై రుదీరితౌ
ఏతావన్యతమక్షేత్రే స్కంధ వక్షోజ జానుషు
ప్రోక్తౌ వివర్తితౌ కైశ్చిన్నలినీపద్మకోశకా
ఏతౌ కీర్తిధరాధ్యాస్తు పద్మవర్తనికాం జగుః ౨౦౨

### ౨౫. నలినీపద్మకోశములు.

పద్మకోశము పేరుగల హస్తములు వ్యావర్తనక్రియలతో నున్నవై స్వస్తిక స్థానమున ఆశ్లిష్ట రూపములై వ్యావృత్తములు పరివర్తితములు కావలెను. పరస్పరము పరాఙ్ముఖములు కావలెను. అప్పుడవి నలినీ పద్మకోశ హస్తము లగును. పద్మకోశములు సమ్ముఖములై మణిబంధమున శ్లిష్టములగుట వీనిరూపము. ఇవి కనిష్ఠాంగుష్ఠములకు సమ్ముఖములై పరస్పరము సంశ్లిష్టములగుట నలినీ పద్మకోశముల లక్షణమని కొందరనిరి. కొందరు భుజస్కంధము వక్షోజము, జానువు అను వానిలో నొక స్థలమున నున్నవై వివర్తితము లగుచో నలినీపద్మకోశహస్తములగు నని యనిరి. కీర్తిధరాదులీ హస్తములను పద్మవర్తనిక యని వ్యవహరించిరి. నలినీ లతపై యనేక పద్మము లుండుట సంభవమె కావున వీని కీ నలినీపద్మకోశ నామ ముచితమె.

### ౨౬. అలపద్మోల్బణౌ

ఉద్వేష్టితేన నిష్పన్నౌ స్యాతాం చేదలపల్లవౌ
వక్షసః స్కంధయోరూర్ధ్వం ప్రసారితభుజానిమే
స్కంధాభిముఖమావిద్ధే చలితాంగులీదలైః
అలపద్మోల్బణౌ వాహుర్వ్యావర్తనికాం పరే

### ౨౬. అలపద్మోల్బణములు

అలపల్లవ హస్తముల అగ్రభాగములను ఉద్వేష్టన మొనరించి, వక్షఃస్థలమునకు స్కంధములకు నూర్ధ్వముగా భుజప్రసారమున్నచో అలపద్మోల్బణ హస్తము లగును. వక్షోదేశము నుండే యుద్వేష్టనప్రధానము లయిన హస్తములు ఊర్ధ్వస్కంధమున ప్రసారితము లగుటయు స్కంధాభిముఖముగా నావిద్ధములై చలదంగులీకములై

అలపల్లవము లుండుటయు నీ హస్తముల రూపమని నాట్యవిదు లందురు. హర్షపరవశమయిన చిత్తవృత్తిని సూచించునవి యగుట ఉల్బణరూపము. ఈహస్తములను వాతవర్తనిక అను నామమున కొందరు వ్యవహరించిరి.

౨౭. లలితౌ. ౨౮. వలితౌ.

ఏతావేవ కరావూర్ధ్వక్షేత్రగౌ లలితే మతే ౫౧౦
కటకాస్యౌ శిరోదేశలగ్నాగ్రౌ తే పరే జగుః
లతాఖ్యే వలితే ప్రోక్తౌ కూర్పరస్వస్తికీకృతౌ

౨౭. లలితములు.

ఈ చెప్పిన అలపల్లవ హస్తములె ఊర్ధ్వక్షేత్రగతము లయినచో లలితములు అను నృత్తహస్తము లగును కటకాముఖ హస్తములు శిరోదేశలగ్నాగ్రము లయినచో లలితహస్తము లగునని కొంద రనిరి. చాతురశ్ర్యమున లాలిత్యసంపాదకము లగుటచే లలితనామము యుక్తము.

లతాహస్తములు కూర్పరస్థానమున స్వస్తికములుగా నున్నచో వలితహస్తము లగును. బాహువుల వలన మున్నందున వలితము అను నామము యుక్తముగా నున్నది.

ఈ విధముగా వర్తనాంతరములు పరిగ్రాహ్యములు కాగలవు. సంయుతాసంయుతముల సంకలనమున నిట్టి వర్తనాంతరము లనేకములు సంభవించును. వానిని అర్థక్రియానుసారమున గుర్తింపవలెను. నృత్తహస్తములను కరణములం దధికముగా ప్రయోగింపవలెను. "కరణేతు ప్రయోక్తవ్యా నృత్తహస్తా విశేషతః" అర్థవశమున వీని ప్రయోగములో సాంకర్యమును సంభవించును.

నాట్యమునందు గాని నృత్తమునందు గాని ప్రాధాన్యము ననుసరించి సంజ్ఞయుండును. ఈ నృత్తహస్తము లన్నియు నిట్లు నామౌచిత్యమున నిరూపితము లయినవి.

## హస్తలక్షణం

ప్రోక్తం హస్తద్వయం కైశ్చిదసంయుక్తో నికుంచకః
యుక్తో ద్విశిఖరో నృత్యహస్తకౌ వరదాభయౌ
అనామా పార్శ్వసంలగ్నా చతురస్య కనీయసీ ॥౧౯॥
యస్మిన్నికుంచకో వేదభాషణే స్వల్పదర్శనే
సమం శిఖరయోర్యోగాద్భవేత్ ద్విశిఖరాభిధః
శాపార్థమంగులీస్ఫోటే భామినీ కోప కర్మణి
అస్య విశ్లేషణాదిష్టే నాస్తీత్యభినయే బుధైః
పరాఙ్ముఖతలౌ భిన్నౌ పతాకౌ కటిపార్శ్వగౌ ॥౨౦॥
అథ ఉర్ధ్వముఖే స్యాతాం క్రమేణ వరదాభయౌ

## హస్తలక్షణము.

కొందరు హస్తద్వయము అధికముగా లక్షించిరి. నికుంచకహస్తము - ద్విశిఖరహస్తము అని వాని నామములు. ఈ రెండును అసంయుతహస్తములు వరదాభయ హస్తసంజ్ఞితో నృత్తహస్తములును మతాంతరమున గలవు.

*నికుంచకము:—* చతురహస్తమునకు సంబంధించిన కనీయసి చిటికెన వ్రేలు అనామిక యొక్క పార్శ్వమున సంలగ్నమయినచో నికుంచక హస్త మగును. ఇది వేదభాషణమున వినియుక్త మగును. స్వల్పముగా నభినయము ప్రదర్శించుటలో నుపకరించును. పతాక హస్తము మధ్యమానామాలు సంలగ్నాంగుష్ఠ మయినచో నికుంచక హస్త మగునని కొందరు భావించిరి. వినియోగము సమానము.

ద్విశిఖరము:— రెండు శిఖరహస్తములు సమాయోగమున ద్విశిఖర మను హస్తము సిద్ధ మగును. ఇది శాపార్థ మంగులిస్ఫోట మొనరించునపుడు భామనీ కోపకర్మ యందు నుపకరించి వినియుక్త మగును. స్త్రీలకు కోపము కలిగినపుడు వారిని బ్రతిమలాడుకొను నప్పుడు అనునయమున నిది యుపకరించును. "నాస్తి" లేదు. అను నప్పుడు సంయుక్తమగు శిఖరద్వయము వినియుక్త మగును.

వ ర దా భ య హ స్త ము లు.

పతాకహస్తములు పరాఙ్ముఖతలములుగా నుండి కటి పార్శ్వగతము లయినచో వరదహస్తరూపమును, పిమ్మట ఊర్ధ్వ ముఖములు కాగా అభయహస్తరూపమును సిద్ధమగును. దక్షిణ హస్తము వామహస్తము వరదాభయరూపము కలవి యగును. అరాలహస్తములు కటిపార్శ్వగతములగుట వరదాభయహస్త స్వరూపము. దక్షిణహస్త మూర్ధ్వప్రసారమున వరదము వామ హస్తము దిగువకుండుట అభయము.

ఈ హస్తముల మొదట నెవరు నిరూపించిరో గోచరము కాకున్నను నర్వాచీనులు వీనిని సంకేతించి నిరూపించిరి. "శాపార్థ మంగులి స్ఫోటే" యనుటకు "శయనార్థం" కొందరు భావించిరి. అది యుక్తనూ? ఇది యుక్తమా? హృదయము ప్రమాణము-అర్వా చీను లింకను పరిగణింతురు. సూచీవిద్ధ హస్తము - జ్ఞానహస్తము - ముద్రహస్తము - ప్రకీర్ణహస్తము. వీని కంతము లేదు.

నాట్యాంగషట్కములో శిరోభేదములు హస్తభేదములు నిరూపితము లయినవి. ఇక మూడవది యయిన వక్షము నిరూపింప వలెను. పార్శ్వములను నిరూపింపవలెను. ఆ సందర్భమున కుక్షి - పృష్ఠ - ఊరు - జంఘా విశేషములను నిరూపింపవలసి యున్నది.

ఆ పాద పాదాంగుళీ నిరూపణము ప్రసక్తము. అంగనిరూపణాధ్యాయమున నివి యపేక్షితములు. ఇందు ముందు వక్షోభేద నిరూపణము ప్రసక్తము.

## వ క్షో ల క్ష ణం

సమముద్వాహితాభుగ్ననిర్భుగ్నాని ప్రకంపితం
ఇత్యుక్తం పంచధా వక్షోలక్షణాని ప్రచక్ష్మహే
చతురశ్రకృతం సర్వైరంగైః సౌష్ఠవశాలిభిః
సమం సమ్మతమేతస్య స్వభావాభినయే భవేత్ ॥౨౨॥
ఉత్తుంగత్వే తు బిభ్రాణ ముద్వాహిత ముదీరితం
జృంభాయా మాయతాఘ్రాణే దీర్ఘోచ్ఛ్వాసాదిమేషు చ
అధః పతదివ స్కంధద్వితయం దధదానతం
మధ్యే మధ్యే శ్లథీభావం భజత్పృష్ఠే సమున్నతం
ఆభుగ్నం సంభ్రమే భీతే విషాదగదయోశ్శుచి ॥౨౩॥
మూర్ఛాహృచ్ఛల్య మందాక్ష శీతస్పర్శన వృష్టిషు
నిర్భుగ్నంనం నామత్పృష్ఠం స్తంభశోభి ధృతోన్నతి
నిర్భుగ్నం కథ్యతే మానగ్రహణే సత్యభాషణే
విస్మయాలోకిత్ స్తంభే దర్పోక్త్యావహమిత్యదః
ప్రకంపితం కృతం జ్ఞేయమూర్ధ్వాత్తైపైః నిరంతరైః ॥౨౪॥
హసితక్రందిత శ్రాన శ్రమశ్వాసాభయాదిషు

## వ క్షో ల క్ష ణ ము.

వక్షోభినయ మయిదు విధములు నున్నది. సమము-ఉద్వాహితము-ఆభుగ్నము-నిర్భుగ్నము-ప్రకంపితము. ఈ అయిదు విధముల వక్షోలక్షణములను ఇట్లుపై నిరూపింతుము.

౧. సమము:— సౌష్ఠవముతో శోభించు సర్వావయవములచే చతురశ్రీకృత మగునది సమమగును. స్వభావాభినయమున నిది యుపయుక్త మగును. సర్వాంగముల చతురశ్ర విధానమని భావము.

౨. ఉద్వాహితము:— ఉత్తుంగముగా నుబ్బెత్తుగా హృదయ ముండుట ఉద్వాహిత మనిరి. ఆవలించు నపుడు బాగుగా నాఘ్రా ణించు నపుడు దీర్ఘముగా నిట్టూర్చు నప్పుడు ఉన్నతాలోకమునం దుద్వాహితము వినియుక్తమగును.

3. ఆభుగ్నము:— ఈ విధానమున రెండు స్కంధములు దిగువ భాగమునకు పడిపోవున ట్లుండును. జారిపోవునట్లుండును. హృదయము వంగి యుండును. మధ్యమధ్యలో శ్లథముగా శిథిలముగా నిరవష్టంభ ముగా నుండును. పృష్ఠమున సమున్నతముగా నుండును. నిమ్నమై ససంకోచమై ఆభుగ్నమను వక్షముండును. ఈ యాభుగ్న వక్షః కర్మ లీ విధముగ నుండును. పై కెగురుట ప్రకంపనము ఆయాసము మొదలగునవి. సంభ్రమములో భీతావస్థలో విషాద సమయమున జ్వరపడినప్పుడు శుచిగా నుండు సమయమున, మూర్ఛ, హృచ్ఛల్యము, లజ్జ, శీతస్పర్శ వృష్టి సమయములలో నీ ఆభుగ్న హృదయాభినయము యుక్తము.

౪. నిర్భుగ్నము:— భుజములు కుంచితములై యుండుట నడుము వంగి యుండుట స్తబ్ధభావమున నుండుట రొమ్ము పూరించి యెత్తుగా నుండుట అనునవి నిర్భుగ్న వక్షః స్వరూపములు. అభిమానము పడు నప్పుడు, సత్యము పలుకు నపుడు విస్మయాలోకనమున స్తంభస్వభా వమున నేను నేనన్న దర్పోక్తిలో గర్వాతిశయ సూచనములో నిర్భుగ్న వక్షోఽభినయము యుక్తము. స్త్రీల జృంభణ మోటన బిబ్బోకము లందిట్టి వక్షఃప్రయోగ మావశ్యకము.

౫. ప్రకంపితము :— నిరంతర మూర్ధ్వోత్క్షేపములతో నుండు హృదయము ప్రకంపిత మను హృదయ మగును. ఇది హాసిత ములో క్రందన మొనరించుటలో భయములో శ్రమములో శ్వాస ములో ప్రకంపితవక్ష ముపకరించును. దుఃఖమునందును హిక్కా (ఎక్కిళ్లు) ప్రయోగము నందు నర్థయోగమున నాట్యవిదు లీ విధాన ముపయోగింతురు.

పా ర్శ్వ ల క్ష ణ మ్

ఉరోలక్ష్మ్యభిధాయేతి బ్రూమహే పార్శ్వలక్షణం
వివర్తితావసృతే తద్వత్ ప్రసారిత సమున్నతే
నతం చేతి మతం పార్శ్వకర్మ పంచవిధం బుధైః
త్రికస్య పరివర్తేన పరావర్తౌ వివర్తనం ౨౪౦
వివర్తితపరిత్యాగాన్నివృత్తేఽపసృతం స్మృతం
ఆయామాత్పార్శ్వయోః ప్రోక్తం ప్రకర్షాదౌ ప్రసారితం
కటీ పార్శ్వభుజస్కంధే దధత్యున్నతిమున్నతం
అభ్యధాయి బుధై రస్య వినియోగోఽపసర్పణే
ఉన్నతాదపరం పార్శ్వం ఉపసర్పే నతం మతం ౨౪౧
ఇత్యుక్తం పార్శ్వయోర్లక్ష్మ వినియోగైస్సమన్వితం

పా ర్శ్వ ల క్ష ణ ము.

ఉరోలక్ష్మ నిరూపించిన యనంతరము పార్శ్వకర్మలను నిరూపింపవలసి యున్నది, తల్లక్షణము చెప్పవలెను. పార్శ్వకర్మ లయిదు గలవు. వివర్తితము — అపసృతము — ప్రసారితము — సము న్నతము — నతము అని పార్శ్వకర్మ పంచవిధముగా నున్నదని నాట్య బుధు లందురు.

౧. వివర్తితము :— త్రికము నడుము, త్రిక పరివర్తనమున పార్శ్వమునకు పరావర్తనము కలుగగా వివర్తనము, వివర్తితము అను

పార్శ్వకర్మ యగును. దీనిని పరావృత్తాభినయము నందు నిరూపింతురు. అపిసర్పణము తొలగిపోవుట నభినయించుటలో వివర్తన ముండును.

౨. అపసృతము:— వివర్తన పరిత్యాగమున అపసృతమను పార్శ్వకర్మ యగును. ఆవశ్యకతానుసారముగా వినివృత్తరీతిలో అపసృతమును ప్రయోగింపవలెను. అపసరణము తొలగుటలో నొక విశేషము.

౩. ప్రసారితము:— పార్శ్వభాగముల ఆయామరీతిచే పొడవుగా దీర్ఘముగా నుండుటచే ప్రసారితకర్మ యగును. దీనిని ప్రకర్ష నిరూపణములో నుపయోగింతురు.

౪. సమున్నతము:— కటి పార్శ్వ భుజస్కంధము లున్నతముగా నున్నచో సమున్నతమను పార్శ్వకర్మ యగును. ఇది యుపసర్పణమున వినియోగ పడును. ఈ సమున్నతపార్శ్వము తరువాతి నతపార్శ్వముతో కొంత సంబంధించి యుండును.

౫. నతము:— ఉన్నతపార్శ్వమునకన్న వేరొక విధముగా నుండు పార్శ్వము నతపార్శ్వ మగును. ఇది యుపసర్పణమున నుపకరించును. ఇట్లిచట వినియోగసహితముగా పార్శ్వకర్మ నిరూపిత మయినది. కటిభాగము వ్యాభుగ్నమగుట, పార్శ్వభాగ మాభుగ్న మగుట, కొంతగా భుజము లపసృతము లగుట నతపార్శ్వ మగునని కొందరి భావము.

వక్షసః పార్శ్వయోః పృష్ఠలక్ష్మణోఽంతర్గతేః మునిః
నోవాచేతినమయాప్యుక్తం న పృథక్పృష్ఠలక్షణం

## జఠరకర్మాణి

క్షామం స్వల్పం తతః పూర్ణమిత్యుక్తం జఠరం త్రిధా
తనుక్షామం స్మృతం హాస్యజృంభాని శ్వాసరోదనే ౨౨౦
నతం స్వల్పం మతం శ్రాంతే క్షుధి రోగే తపస్యపి
పూర్ణమాధ్మాత ముచ్ఛ్వాసాత్యశన స్థూలభోగిషు

నాట్యవేదములో భరతముని పృష్ఠలక్షణము వేరుగా జెప్పలేదు. పృష్ఠలక్షణము సర్వము వక్షోలక్షణమున పార్శ్వలక్షణమున నంతర్భవించునని ముని భావించెను. అందుననె నేనును పృష్ఠలక్షణమును వేరుగా జెప్పుటలేదు. భరతభావమునే నేను నా యీ గ్రంథమున నిరూపించుట కుపక్రమించితిని. భరతానుక్తము నా కుపాదేయము కాదు. భరతసూచితము నేను స్వీకరింతును. భరతుడు చెప్పని పృష్ఠకర్మల నిర్దేశించుట యనావశ్యకము. జఠరమునకు నిరూపించిన వర్తనావిశేషముల వలననే పృష్ఠవర్తనములు నిరూపితప్రాయములె యగునని యితరులును భావించుటచే జాయపతి యిందు పృష్ఠలక్షణము నిరూపింపలేదు. పృష్ఠవర్తనము లేవేని యున్నచో నవి పూర్వోక్తము లందే యంతర్భవించును. ఇంక నున్న నితర వర్తనములచే నభ్యూహింప వచ్చును.

## జఠరకర్మలు.

వక్షః పార్శ్వకర్మ నిరూపణానంతరము ఊరు కటి కర్మల నిరూపణమునకు పూర్వము జఠరకర్మలు ప్రసంగప్రాప్తము లగుటచే వాని నిరూపించుట యావశ్యకము. జఠరకర్మలు మూడు కలవు. క్షామము–స్వల్పము–పూర్ణము అని వీని లక్షణవినియోగము లీ విధమున నున్నవి.

౧. క్షామము:- కృశించి యున్న జఠరమునకు క్షామము అని పేరు. ఈ క్షామోదరము హాస్యమునను ఆవలించుట యందును నిశ్వాసము నందును రోదనము నందును వినియుక్త మగును. అట్టి సమయములం దీ క్షామాభినయము యుక్తము.

౨. స్వల్పము:- నతముగా జఠర ముండునేని యది స్వల్ప మనుట మతము. సమ్నత మనుట యుక్తము. ఈ స్వల్పమును శ్రాంతు నందు శ్రమపడినవాని విషయమున ఆకలి కలిగి యున్నపుడు రోగాభినయమున తపసు నందున ప్రయోగింపవలెను.

౩. పూర్ణము:- ఆధ్మాతమై నిండుగా నున్నపుడు పూర్ణజఠర మగును. పూర్ణజఠరము చూచి పొట్ట నిండుగా నుండుట చూచి బాగుగా గాలి పీల్చి ఉచ్ఛ్వాసమున నున్నాడని బాగుగా భోజనము చేసినాడని స్థూలభోగి యని భావింతుము. కావున ఉచ్ఛ్వాసమున అత్యశనమున స్థూలభోగి యభినయమున పూర్ణజఠరము వినియోగము పొందునని భావింపవలెను.

### కటిలక్షణం

రేచితా కంపితా భిన్నా నివృత్తోద్వాహితా తతః
పంచదేతి కటిర్నాట్యే నృత్తే చ పరికీర్తితా
రేచితా పరితో భ్రాంతా భ్రమణేషు విధీయతే ౫౫౫
యాతాయాతైస్తిరశ్చీనైర్వేగితా కంపితా మతా
నీచ వామన కుబ్జానాం గతానుకరణేష్వయం
మధ్యస్య వలనాచ్ఛిన్నా శ్రమే పృష్ఠవిలోకితే
పృష్ఠతో వలనాత్పూర్వకాయే సతి పరాఙ్ముఖే
నరస్యాభిముఖీ యా సా నివృత్తా వర్తనే మతా ౫౬౦
సమకాలం శనైః పార్శ్వకట్యోరుద్వాహనాద్భవేత్
ఉద్వాహితా పృథుశ్రోణ్యాగమనేఽపి పరస్య వా

కటిలక్షణము.

కటికర్మ అయిదు విధముల నున్నవి. రేచిత — కంపిత — భిన్న — నివృత్త — ఉద్వాహితము అనునవి కటికర్మలు. నాట్యమున గాని నృత్తమున గాని యీ పంచవిధ కటికర్మలు పరికీర్తితము లయినవి. వీని లక్షణ వినియోగము లిట్లున్నవి.

౧. రేచితము:— సర్వతో భ్రమణమున్నచో రేచితకటి యగును. ఇది భ్రమణములందు విహితము. సర్వతో భ్రమణము పరితో భ్రమణము. వలయాకారమున భ్రమణము లొనరించుట గుండ్రగా తిరుగుటలో నిది వినియుక్త మగును.

౨. కంపిత:— వేగముకలదై తిరశ్చీనము లగు యాతాయాతములు గతాగతములు కలదయినచో కంపితకటి యగును. కుబ్జ వామన నీచ జనుల గమనానుకరణములో నీ కంపితకటి యుపయుక్త మగును.

౩. భిన్న:— కటి మధ్యభాగముయొక్క వలనముతో నున్నచో భిన్నకటి యగును. శ్రమమున పృష్ఠవిలోకితమున భిన్నకటి వినియుక్త మగును. పృష్ఠవిలోకన మనునది వ్యావృత్తప్రేక్షణము. వెనుదిరిగి చూచుట. వ్యాయామవిధానములో సంభ్రాంతరీతిలో నిది యుపకరించును.

౪. నివృత్త:— పృష్ఠభాగమునను వలనమున్నందున పూర్వకాయము పరాఙ్ముఖముగా నుండగా వెనుదిరిగి యుండగా పరాఙ్ముఖున కభిముఖముగా నుండు రీతి నివృత్తికటి యగును. ఇది యావర్తనమున వినియుక్త మగును.

౫. ఉద్వాహిత:— పార్శ్వభాగమును కటిభాగమును సమకాలమున నెమ్మదిగా నుద్వహన మొనరించుటవలన ఉద్వాహితకటి

యగును. ఈ కటికర్మను పృథుశ్రోణీగమనమున నితంబగుర్వీగమనమున నుపయుక్తమగును. స్థూలకాయము కలవాని గమనమున నిది వినియోగము పొందును. స్త్రీల లీలాగతము లందును ఉద్వాహిత కటికర్మ సుందరముగ నుండును.

## ఉరుకర్మాణి

కంపనం వలనం స్తంభ ఉద్వర్తననివర్తనే
ఇత్యూర్వోః పంచధా కర్మ విజ్ఞేయం నటనర్తకైః
పతనోత్పతనైః పార్ష్ణేః కంపనం వేపనం ముహుః
స్యాద్గతే కాందిశీకానాం నీచపాత్ర పరిక్రమే
జానునోఽభ్యంతరగతే వలనం సముదీరితం
స్వేచ్ఛాసంక్రమణే స్త్రీణాం కరణే వలితోరుకే
పరిత్యక్తక్రియం ప్రోక్తం స్తంభనం భీ విషాదయోః
యదూర్వోః వలితాలిద్ధో భవేదుద్వర్తనం తదా
వ్యాయామే తాండవే పార్ష్ణావభ్యంతరగతే పునః
నివర్తనం సముద్దిష్టం సంభ్రమాది పరిక్రమే

## ఊరుకర్మలు.

ఊరువుల కర్మ లయిదు విధములుగా నున్నవని నటనర్తకులు గుర్తింపవలసి యున్నది. కంపనము - వలనము - స్తంభము ఉద్వర్తనము నివర్తనము నని యూరుకర్మలు వీని నామసంకేతముననే వీని లక్షణస్వరూపము స్పష్టము, కాని కథనము సముచితము, వీని లక్షణ వినియోగము లిట్లున్నవి.

౧ కంపనము: పార్ష్ణి భాగమునకు సంబంధించిన పతనోత్పతనములచే ముహుర్వేపన ముండుట కంపనమను నూరుకర్మ యగును.

పతనోత్పతనములు నమనోన్నమనములు. కాందిశీకుల గమనములో కంపన ముండును. నిచవ్యక్తుల పరిక్రమణములో కంపన ముండును. అధముల గతులలో భయావిధానమున కంపన ముండును.

౨. వలనము: జానువులు-మోకాళ్లు అభ్యంతరము పొంది యుండుట - లోనికి జొరబడుట వలన కర్మ యగును. ఇది స్త్రీల స్వేచ్ఛాసంక్రమణములో ఊరువుల వలనము కల కరణము నందు నిది యుపయుక్తమగును.

౩ స్తంభనము: ఊరువుల కెట్టి క్రియయు లేకుండుట స్తంభనము ఇట్టిరీతికి అపవిద్ధక్రియావిధానము పరిత్యక్తక్రియారీతి యందురు. భయమున విషాదమున స్తంభన ముండును.

౪. ఉద్వర్తనము: వలితావిద్ధకరణమున ఉద్వర్తన మగును. ఊరువు వలితావిద్ధమగుట ఊరువుపై నూరువు చేరుట ఊరువున కూరువు ఒత్తిడి కలిగించుట యగును. ఇట్టి యుద్వర్తనము వ్యాయామములో తాండవములో నుపకరింపగలదు.

౫ నివర్తనము: పార్ష్ణిభాగ మభ్యంతరము పొందినది యగు నేని నివర్తనకర్మ యగును. దీనికే వివర్తనమనియు పేరు. సంభ్రమాదులవలన పరిక్రమణ మొనరించునపుడీ నివర్తన ముపకారి. ఇట్టి యూరుకర్మ విశేషములను యథాదర్శనముగా ప్రయోక్తలు ప్రయోగమున గమనింపవలెను. ఇంకను నాట్యసుందర లోకము నుండియు నూరుకర్మలను గుర్తింపవచ్చును.

## జానుకర్మాణి.

ఉన్నతం వివృతం నమ్రం అర్ధకుంచిత కుంచితే
సంహతం సమమిత్యేవం సప్తధా జాను కథ్యతే

శైలాద్యారోహణే నృత్తే చోన్నతం స్తనసమ్మితం ౫౭౩
జానునోఽశ్లిష్టతో హస్త్యారోహణే వివృతం మతం
భూమౌ చేచ్చుంబనం నమ్రం నమస్కృతి నిపాతయోః
భవేన్నృత్తే నితంబస్య నమనాదర్ధకుంచితం
ఊరుజంఘస్య సంశ్లేషాత్కుంచితం మనుజాసనే
సంహతం జానునోః శ్లేషాత్ స్త్రీణామీర్ష్యా త్రపాదిషు ౫౮౦
స్వభావస్థం సమం స్థానే సమపాదే ప్రయుజ్యతే

జానుకర్మలు.

సప్తవిధముల జానుకర్మలు కలవని యందురు. ఉన్నతము వివృతము - నమ్రము - అర్ధకుంచితము - కుంచితము - సంహతము సమము అని. వీని లక్షణవినియోగము లిట్లున్నవి.

౧. ఉన్నతము: శైలాదుల యారోహణ రూపమయిన నృత్తమున ఉన్నత జాను వుండును. ఈ యున్నత జానువు ముడిచిన మోకాలు గుండ్రముగా నుండును.

౨. వివృతము: జానువులు కలిసకొనక దూరముగా నుండగా అశ్లిష్టములై యుండగా వివృత మగును. హస్త్యారోహణ సమయమున జానువులు వివృతములుగా నుండవలెను.

౩. నమ్రము: నమస్కార మొనరించు నప్పుడు నిపాతన మున్నప్పుడు మోకాలు భూమి స్పృశించి యుండును అప్పుడు నమ్రము అను జానుకర్మ యగును.

౪. అర్ధకుంచితము: సమము కుంచితగా నుండుట అర్ధకుంచితము. నృత్తము నందు నితంబము నమనము పొందునేని అర్ధకుంచిత జాను వేర్పడును.

౫. కుంచితము: ఊరుజంఘా భాగములకు సంశ్లేష ముండునేని కుంచితజాను వగును. మానవులు కూర్చొనునప్పు డిట్లు సంశ్లేషము కలుగును. మయుజాసనమున దీని వినియోగ మున్నది.

౬. సంహితము: జానువులు మోకాళ్లు రెండును సంశ్లేషమున నుండునేని సంహితజాను వగును. ఈ జానువు స్త్రీల యీర్ష్యాత్రపాది సమయములందు వినియుక్తమగును.

౭. సమము: స్వభావగతముగా నుండు జానువు సమజానువు. ఇది సమపాద విన్యాసమున సముచితావస్థానమున ప్రయుక్త మగును.

ఇట్టి జానుకర్మలను భరతుడు నాట్యవేదమున నిరూపింప లేదు. అయినను జాయపతి నిరూపించెను. పూర్వోక్తము లందు గతార్థములు కావని జాయపతి భావము. అనుక్తముల నన్యవిధమున గ్రహింపవచ్చునని భరతు డనెను గావున జాయపతి వీని నన్య గ్రంథముల నుండి గ్రహించెను. సోమేశ్వరుని గ్రంథమున నివి యున్నవి. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమున నివి యున్నవి. అందున్నవి కావున నిందు నున్నవి. జాయపతి కొన్నిటి నట్లే నిరూపించెను. ఇట్లు నిరూపించుటయు భరతసమ్మత మగునని జాయపతి భావించెను. అధికమయిన నవిరుద్ధ మగ్రాహ్యము కాదు.

జంఘాకర్మాణి

పరివృత్తం నతం క్షిప్తావర్తితోద్వాహితాన్యథ
ఇతి పంచవిధం కర్మ జంఘాయాః కథ్యతే స్ఫుటం
పరివృత్తం గతం ప్రోక్తం పృష్ఠతస్తాండవాదిషు
స్థానావనగతాద్యేషు కుంచనా జ్జానునోర్నతం ౩౮౫
పాదవిక్షేపణాత్క్షిప్తం వ్యాయామోద్ధతనృత్తయోః

పర్యాయా దన్య పార్శ్వాభ్యాం గచ్ఛతశ్చరణే యది
ఆవర్తితం తదా ప్రోక్తం విదూషక గతాగతే
ఆవిద్ధగమనాదేస్యా దుద్వాహితముదంచితం

జంఘా కర్మలు.

జంఘాకర్మ లయిదు విధములు. పరివృత్తము - నతము క్షిప్తము ఆవర్తితము - ఉద్వాహితము అని జంఘాకర్మ పంచవిధ మనిరి. వీని లక్షణ వినియోగము లీ విధమున నున్నవి.

౧. పరివృత్తము: వెనుక వెనుకకు గమన మున్నచో జంఘా భాగమునకు ప్రతీప గమన మున్నచో పరివృత్తాజంఘ యగును. దీనిని తాండవాదులలో ప్రయోగింపవలెనని ప్రయోగవిదు లందురు.

౨. నతము: స్థానాసన గతాదులలో జానుకుంచనము వలన నతమను జంఘాకర్మ యగును. ఇది స్థానాసనాదులలో వినియోగము పొందును.

౩. క్షిప్తము: పాదవిక్షేపణము వలన క్షిప్తమను జంఘాకర్మ యగును. పాదవిక్షేపమున జంఘావిక్షేప ముండునని భావము. దీనిని వ్యాయామ మందును ఉద్ధత నృత్తము లందును వినియోగింతురు.

౪. ఆవర్తితము: పార్శ్వములనుండి చరణములు పర్యాయ క్రమమున గమనము కలవయినచో నావర్తిత మగును. వామ పాదము దక్షిణపార్శ్వమున సంచరించుటయు దక్షిణమునుండి వామపార్శ్వమునకు సంచరించుటయు నున్నచో నది యావర్తిత జంఘాకర్మ యగును. జంఘాస్వస్తిక యోగమున ఆవర్తిత మగునని కొందరనిరి. ఇది విదూషకుని గతాగతములలో నుపయోగించును.

౫. ఉద్వాహితము: జంఘాభాగము నూర్ధ్వప్రదేశమున నుదంచిత మొనరించినచో నుద్వాహితకర్మ యగును. ఆవిద్ధములగు గమనాదులలో నిది వినియుక్తమగును.

భ్రామితం నిసృతం కంపః తిరశ్చీనం బహిర్గతం ౫౮౦
ఇత్యేతదపి జంఘాయాః కర్మోక్తం పంచధా పరైః
భ్రామితం మండలభ్రాంత్యా వాద్యే డమరుకాభిధే
ఛత్రభ్రమరికాద్యేషు నిసృతం నిర్గతం పురః
కంపః స్యాద్ధూననం త్రాసే ఘర్ఘరీణాం చ వాదనే
పార్శ్వగామి తిరశ్చీనముక్తం పద్మాసనాదిషు ౫౮౫
బహిర్గతం క్షితేః పార్శ్వనిర్గతం ఖండసూచకే

ఈ చెప్పిన జంఘాకర్మల పరిగణనమున మరికొందరి మత మీ విధమున నున్నది. సోమేశ్వరాదులు పంచవిధ జంఘాకర్మలను నిరూపించిరి. నాట్యవేదానుసారమున జాయపతి నిరూపించిన జంఘా కర్మ సోమేశ్వరు డంగీకరించిన జంఘాకర్మలలో నామాంతరమున నున్నది. వీని వినియోగ నిరూపణములందు సోమేశ్వర జాయపతు లలో నభిప్రాయభేద మున్నది.

మతాంతరమున జంఘాకర్మ లయిదు. (భ్రమితము - నిసృతము - కంపము - తిరశ్చీనము - బహిర్గతము నని ఈ యయిదుకూడ చెప్పిరి.

౧. భ్రామితము:- మండలాకారమున భ్రమణము కలదగుట భ్రమిత జంఘాకర్మ. ఇది డమరుకమను వాద్య మనుకరించుటలో నుండును. ఛత్రభ్రమరికాదులలో నుండును.

౨. నిసృతము:- నిర్గతమగునది ఎదుటగా వెలువడి యుండు నది యగు జంఘ నిసృతము.

౩. కంపము:— ధూననముశో నుండునది. విదలించుట కలది కంపాత్మకమయిన జంఘాకర్మ. దీనిని త్రాసము - భయమున నుప యోగింతురు. ఝర్ఝరి మొదలగు వాద్యముల వాదనమున నిది యుండును.

౪. తిరశ్చీనము:— అడ్డముగా నుండునది. పార్శ్వగామి యగు జంఘాకర్మ తిరశ్చీనము పద్మాసనాదుల విధానమున నిది వినియుక్త మగును.

౫. బహిర్గతము:— భూమినుండి యొక పార్శ్వమునకు ప్రసారితమై యుండు జంఘాకర్మ బహిర్గత మన్న పేరుకలది యగును. దీనిని ఖండసూచకమున వినియోగింతురు. ఇట్టివి యన్యు లంగీకరించిన జంఘాకర్మలు. వీని యంగీకారమున నంతగా జాయపతి కాస్థ యున్నట్లు లేదు.

పాదలక్షణం

సమాగ్రతల సంచార కుంచితోద్ఘట్టితాంచితాః
ఇతి పాదభిదాః పంచ భవేయుర్మునిసమ్మతాః
సమస్థానే స్వభావే చ భూమిసంస్థ సమో మతః
యత్రోత్క్షిప్తో భవేత్పార్ష్ణిః అంగుష్ఠాంగులయోంచితాః ౬౦౦
స్యాదగ్రతలసంచారీ సవిక్షేపే నికుట్టనే
అతిక్రాంతక్రమోదార గత్యుద్వర్తిత వర్తితే
స్థిత్వా యత్ర తలాగ్రేణ పార్ష్ణితో ఘట్యతే క్షితిః
ఉద్ఘట్టిత స్తదాఖ్యేషు కరణేషు స కీర్తితః
ప్రయోగానుకృతే చారీ ప్రసారే చాసకృత్సకృత్ ౬౦౫
ఊర్ధ్వమగ్రతలం భూమౌ పార్ష్ణిరంగులయోంచితాః
యస్మిన్పాదేఽంచితః స స్యాత్పదాగ్రక్షత చంక్రమే

## పాదలక్షణము.

ప్రసంగప్రాప్తమయిన పాదలక్షణ మిందున్నది. సమము అగ్రతల సంచారము - కుంచితము - ఉద్ఘట్టితము - అంచితము అను నయిదును మునిసమ్మతములయిన పాదభేదములు. ఇవియే మునిసమ్మతము లనుటచే నితర సమ్మతములగు పాదభేదములు కలవని భావము. వానినిగూడ జాయపతి యిందు చెప్పదలచెను.

౧. సమము:— ఇది స్వభావరచితము. భూమియందు సమస్థానమున నుండుట నిది సమపాదకర్మ యయినది. ఇది స్వభావాభినయము నాశ్రయించి యుండును. పాదపార్ష్ణిభాగ మిందుత్క్షిప్తమై యుండును. అంగుష్ఠము లంచితములై యుండును. నానా కరణ సంశ్రయమయిన స్వభావాభినయము నాశ్రయించినదయినను స్వభావాభినయమున స్థిరముగా నుండునది యయినను పాదరేచితము నందు దీనిని చలితముగా ప్రయోగింపవలెనని నాట్యవిధివిదుల భావము. పాదాభ్యంతరమునందు పార్ష్ణిభాగము కూడుకొనగా త్ర్యశ్రభాగ ముదయించునని యది స్థానకాదులలో ప్రయోగింప దగినదని కొందరు భావించిరి.

౨. అగ్రతలసంచారము:— దీని లక్షణము కొంత త్రుటితమయినది. మూడవది యయిన కుంచితపాద లక్షణవాక్యమును త్రుటిత మయినది. నికుట్టనము విక్షేపముతో నుండగా పార్ష్ణిభాగ ముత్క్షిప్తముకాగా అంగుష్ఠము ప్రసారితమై యుండగా మిగులు ప్రేళ్లు లంచితములై యుండగా అగ్రతల మను పాదకర్మ యగును. దీనిని తోదన నికుట్టన నిశుంభన భూమితాడన భ్రమణము లందు వినియోగింపవలెను. ఆ సమయమున పాదవిక్షేపము వివిధ రేచకములతో నుండును.

౩. కుంచితము:— పార్ష్ణి భాగము పైకెత్తుగా నుండుట ప్రేళులు కుంచితము లగుట, పాదమధ్య మాకుంచిత మగుట యున్నచో కుంచితకర్మ యగును. దీని నుదాత్తగమనమున నుపయోగింతురు. వర్తితోద్వర్తితములం దనుసరింతురు. అతిక్రాంతక్రమణమున దీని నుపయోగింతురు.

౪. ఉద్ఘట్టితము:— తలాగ్రమునుండి పార్ష్ణి భాగమున భూమి ఘట్టన మొనరించినచో ఉద్ఘట్టిత మగును. పాదతలాగ్రమున నుండి పార్ష్ణి భాగమును భూమియం దుంచుట దీని రూపము. ఉద్ఘట్టిత కరణములలో నిది యుపకరించును. ప్రయోగానుకరణమున దుగ్ధమధ్య మప్రచారము కలదై సకృత్తుగా నుపయోగించుటయు ప్రసారమున నసకృత్తుగా నుపయోగించుటయు నావశ్యకము.

౫. అంచితము:— భూమియందు పాదాగ్రతలము ఊర్ధ్వముగా నుండవలెను. పార్ష్ణి భాగము ప్రేళులు అంచితములై యుండవలెను. పాదముయొక్క ఇతర భాగము లీ చెప్పిన విధముగ నున్నచో నది యంచిత మను పదమగును. ఈ యంచితపదము పదాగ్రము క్షత మయిన ప్పుడు చంక్రమణ మొనరించుటలో పాదమునకు దెబ్బతగిలినప్పుడు కలుగు వర్తితోద్వర్తనము లందును భ్రమణవిధానము నందును విని యుక్త మగును.

తాడితో ఘట్టితోత్సేధో ఘట్టితో మర్దితోఽగ్రగః
పార్ష్ణిగః పార్శ్వగః సూచీ సంజ్ఞకోఽఙులిపృష్ఠగః
తలాహతిరితి ప్రాహురస్య భేదాన్ పరే దశ ౬౧౦
పార్ష్ణిగేనా భువమాలమ్బ్య తలస్యాగ్రేణ తాడయన్
తాడితః కోపగర్వాదౌ ఘర్ఘరాణాం చ వాదనే

పార్ష్ణినా తాడయన్నగ్రతలేనాపి ముహుర్ముహుః
ఘట్టితోత్సేధసంజ్ఞః స్యాద్ ఘర్ఘరవాదనాదిషు
ఘట్టితః పార్ష్ణినా విఘ్నన్ కరభాశ్వాదినోదనే ౬౧౫
ఘృష్యత్తిర్యక్ తలేనోర్వ్యాం మర్దితః కిఙ్కిణీవిధౌ
పురతః స్ఖలితః శీఘ్రమగ్రగః పథి పిచ్ఛితే
పృష్ఠతః పార్ష్ణినా గచ్ఛన్ పార్ష్ణిగః కింకిణీవిధౌ
తిష్ఠన్ పార్శ్వేన గచ్ఛన్ వా పార్శ్వగః కణ్టకోద్ధృతౌ
ఆసనే చ భవేన్నృత్తే నస్ఫురో బహుభంగిభిః ౬౨౦
పార్ష్ణిముత్క్షిప్య యో భూమౌ అఙ్గుష్ఠాగ్రేణ తిష్ఠతి
స సూచీతి మతో నృత్యే విలాసావస్థితావపి
తిష్ఠన్ సర్వాఙ్గులీపృష్ఠైః అఙ్గులీపృష్ఠగో భవేత్
స్ఫురితాయాం తథా స్థానే బుధైర్నృత్యే విధీయతే
సశబ్దం తాడనం భూమేః తలేన స్యాత్తలాహతిః ౬౨౫
తాణ్డవే ధావనే కోపే ఘర్ఘరీణాం చ వాదనే

కొందరింకను పది పాదకర్మల నంగీకరించిరి. వాని నామలక్షణ వినియోగము లీ విధమున నున్నవి. తాడితము – ఘట్టితోత్సేధము – ఘట్టితము – మర్దితము – అగ్రగము – పార్ష్ణిగము పార్శ్వగము – సూచీసంజ్ఞకము అంగులి పృష్ఠగము – తలాహతి, అనునవి వాని నామములు.

౧. తాడితము: పాణిపార్శ్వభాగముచే భూమి నవలంబించి పాదతలము యొక్క అగ్రభాగమున తాడనము చేయుచున్నచో తాడితమను పాదకర్మ యగును. దీనిని కోపమున గర్వాదులలో ఘర్ఘరవాద్యముల వాదనము నందును వినియుక్త మగును.

౨. ఘట్టితోత్సేధము: పాదపార్ష్ణి భాగముననుపాదాగ్రతల మునను మహార్ణవాళః తాడన మొనరించుచున్నచో ఘట్టితోత్సేధ మగును. దీనిన ఘర్ఘరీ వాదనాదులం దుపయోగింతురు.

౩. ఘట్టితము:– పాదపార్ష్ణి భాగముచే పొడుచుట యున్నచో ఘట్టిత మగును. కరభమును-ఒంటెను అశ్వాదులను నోదన మొన రించుటలో వానిని తోలుటలో నిది యుపయుక్త మగును. అశ్వా దుల ప్రేరణమున నిది వినియోగము పొందు నని కొందరి భావము.

౪. మర్దితము:– తలభాగమున భూమి నడ్డముగా ఘర్షణ మగును ఇది కింకిణీవిధానమున నుపయుక్త మగును. పాదమున కేర్పఱచిన చిరుగజ్జెలు కింకిణీపదమున జెప్పదగి యున్నవి. పాదముల గజ్జెల గలగల మనిపించుటలో వానిని తాలలయానుసారమున మ్రోగునట్లు చేయుటలో మర్దిత ముపయోగించును.

౫. అగ్రగము:– ఎదుట శీఘ్రముగా స్ఖలిత మగున ట్లొనరించి నచో నది యగ్రగ మను పాదకర్మ మగును. ఇది పిచ్ఛిలముగా నున్న మార్గసంచారమున నుపయుక్త మగును. గట్టిగానుండుటను పిచ్ఛిల మందురు. "పిచ్ఛిలా నిచ దధీని"

౬. పార్ష్ణిగము:– వెనుకభాగమునకు పార్ష్ణి భాగమున గమన మున్నచో పార్ష్ణిగ మను పాదకర్మ యగును. ఇదియు కింకిణీవిధానమున నుపకరించును.

౭. పార్శ్వగము:– నిలబడుచు పార్శ్వభాగమున గమన మొన రించుచు నున్నచో పార్శ్వగ మగును. ఇది కంటకోద్ధరణ విధాన మున నుపకరించును. కంటకోద్ధరణము కాలిలోని ముల్లు నూడ

దీయుట. నృత్తాసనమున నిది యుపకరించును. నానాభంగీవిశేష ములచే నిది స్ఫురించునదిగా నుండుననియు పరిగ్రాహ్యము.

౮. సూచిసంజ్ఞకము:- పార్ష్ణి భాగమును పైకెత్తి అంగుష్ఠాగ్ర మున భూమిపై నున్నచో సూచీసంజ్ఞక మగును. ఇది నృత్యమున నుపయోగించును. సవిలాసముగా నుండుటలో నిది వినియుక్తమగును.

౯. అంగులిపృష్ఠగము:- సర్వాంగులీపృష్ఠ భాగములతో నిల బడినచో నంగులీపృష్ఠగ మను పాదకర్మ యగును. దీనిని నృత్య విధానమున స్ఫురితరీతిలో బుధు లుపయోగింతురు.

౧౦. తలాహతి:- పాదతలమున సశబ్దముగా భూమితాడన మొనరించినచో తలాహతి యగును. తాండవములో భావనములో కోపములో ఘుర్ఘురీ వాదనములో పాదతలాహతి యుండును.

ఇట్లీ పది విధములగు పాదకర్మ లన్యమతానుసారమున నిరూపితము లయినవి. వీనిలో గొన్నిటిని గొంద రంగీకరించిరి. మరికొన్నిటిని మరికొంద రంగీకరించిరి. కొందరు తొమ్మిదనిరి. కొంద రారనిరి. జాయపతి యన్నిటిని పరిశీలించి పదికర్మలను నిరూపించెను.

అంగులీనాం లక్షణం

బ్రూమః పాదాంగులీలక్ష్మ పాదలక్ష్మ ప్రసంగతః
ఉత్క్షిప్తాః కుంచితా స్తబ్ధాః అవక్షిప్తాః స్వభావజాః
అనంగుష్ఠయుతాంగుష్ఠ సంయుక్తాశ్చేతి సప్తధా
ఉత్క్షిప్తా ముహురున్నీతా ప్రపాయాం ముగ్ధయోషితః ౬౩౦
యదా సంకోచరూపేణ నామితాః కుంచితా స్తదా
మూర్ఛిత స్వస్తికాద్యర్థ గ్రహావిష్టేషు కీర్తితాః

కాష్ఠవన్నిశ్చలాః స్తబ్ధాః మృతౌ స్తబ్ధేఽంగ మోటనే
అవక్షిప్తాః సమాఖ్యాతాః అధోనీతాః పునః పునః
వృష్ఠతస్సరణే స్త్రీణాం బిబ్బోకే కిలకించితే ౬౩౫
ప్రకృత్యైవ స్థితా భూమే ప్రకృతౌ స్యుః స్వభావజాః
అనంగుష్ఠయుతాః ప్రోక్తాః త్యక్తాంగుష్ఠా మిధః శ్రితాః
పాదత్రారోహణే పూగదండాది గ్రహణే క్షితేః
అంగుష్ఠసంయుతాః ప్రోక్తాః సహాంగుష్ఠా మిధః శ్రితాః
అంఘ్రేః స్తంబేరమస్యేవ రజ్జు గర్భ ప్రవేశనే ౬౪౦
ఆముక్తౌ నూపురాదీనాం దూరస్థాకర్షణేపి చ
అంగుష్ఠః సర్వసంయోగాదంగులీత్వం క్వచిద్భజేత్
ఉత్క్షిప్తోఽవనతోఽంగుష్ఠస్సహజశ్చేతి స త్రిధా
ఉన్ముఖీకృతముత్క్షిప్తః ప్రాహుర్నఖముఖాదిషు
నామితోఽవనతోఽధస్తాత్ హ్రియా భూమ్యాదిలేఖనే ౬౪౫
సహజస్తు స్వభావస్థః ప్రస్థితే పరికీర్తితః

పాదాంగులీ లక్షణము.

పాదలక్షణప్రసంగమున పాదాంగులీ లక్షణకథన మావశ్యకము. వీనిని నాట్యవేదము సూచింపలేదు. సోమేశ్వరాదు లంగీకరించిరి. ఇందు కొంత భావభేదము నామభేదము కలదు. అది యంతగా లెక్కింపదగినది కాదు. పాదకర్మలు నిరూపించినప్పుడు పాదాంగులీ కర్మలక్షణ వినియోగములును నిరూపణీయములు, పాదాంగులీ విధానములు సప్తవిధముల నున్నవి. వాని పేరు లిట్లున్నవి.

ఉత్క్షిప్తములు – కుంచితములు – స్తబ్ధములు – అవక్షిప్తములు– స్వభావజములు – అనంగుష్ఠయుతములు – అంగుష్ఠ సంయుక్తములు,

వీనిలో నంగుష్ఠ సంయుక్తములు ఉత్క్షిప్తావనత సహజ భావమున నుంచుటయు నిందు నిరూపిత మగును. వీని లక్షణ విని యోగము లిట్లున్నవి.

౧. ఉత్క్షిప్తములు:- పాదాంగుళులు ముహుర్ముహుః ఉన్నీతము లగుట వేళులు మాటిమాటికి వ్రేళులెత్తి కొనుట యున్నచో నుత్క్షిప్తములను సంజ్ఞ కలుగును. ముగ్ధ వనితలు అంగుళుల నిట్లొనరించు చుందురు.

౨. కుంచితములు:- సంకోచరూపమున వ్రేళులు నామితము లాగికొనుట కుంచితము లగుట యున్న కుంచితము లను పేరుకలు గును. ఇవి మూర్ఛితులలో నుండును. జారుపాటులో నుండును. శీతార్తులలో నుండును. గ్రహావిష్టులలో నుండును. ఇట్లు వీని విని యోగము కీర్తితమయినది.

౩. స్తబ్ధములు:- కొయ్యవలె నిశ్చలముగా నున్నచో కొయ్యా కాతినవిధమున నున్నచో స్తబ్ధము లందురు. సోమేశ్వర శార్ఙ్గదేవులు వీనిని ప్రసారితము లనిరి. వీనిని మరణాభినయమున స్తంభ విధానమున అంగమోటనమున నుపయోగింతురు.

౪. అవక్షిప్తములు:- మాటి మాటికి అధోనతములగు వ్రేళు లను అవక్షిప్తము లందురు. పాదములతో వెనుకకు వెనుకకు జరు గుటలో నిది యుపయోగించును. స్త్రీల బిబ్బోకమునందును కిల కించిత మందు నిది యుపయోగించును. బిబ్బోకము కిలకించిత మను నవి స్త్రీల శృంగార చేష్టావిశేషములు. స్త్రీలకు స్వాభావికములయిన విశేషములు పదియున్నవి. వానిలో నివి యున్నవి. వీని లక్షణము లిట్లున్నవి.

బిబ్బోకము స్త్రీల కిష్టభావ ప్రాప్తిలో నభిమాన గర్వ సంభూత మయిన అనాదరకృతభావము స్త్రీలకు వస్త్రాలంకారము లభీష్టములు. అభీష్టములు లభించినను వాని ననాదరభావమున గ్రహించుట బిబ్బోకము. సౌభాగ్యగర్వమున అభీష్టలాభ సంతోష గర్వమున బహుళముగ ననాదర మున్నచో బిబ్బోక మగును. ఇట్టి బిబ్బోకమున అవక్షిప్తాంగులీ విధాన మభ్యూహ్యము.

కిలకించితములో స్మిత రుదిత హసిత భయ హర్ష గర్వ దుఃఖ శ్రమాభిలాష రీతులు మరల మరల సాంకర్యము పొంది యుండును. ఈ సంకరకరణములో గూడ సౌభాగ్యగర్వము హేతువుగా నుండును. ఇట్టి కిలకించితము నందును అవక్షిప్తాంగులి యుండుట సంభావ్యము.

౫. స్వభావజములు:- భూమియందు ప్రకృతిసహజముగా వ్రేళులున్నచో స్వభావజము లగును. దీనిని ప్రకృతివిధానమున వినియోగింతురు.

౬. అనంగుష్ఠ యుతములు:- అంగుష్ఠముతో కూడి యుండని మిగులు నాలుగు వ్రేళుల విధానమని యీ పాదముననె గోచరించును. అంగుష్ఠమును విడచి నాలుగు వ్రేలు లుండుట అవి మిథఃసంశ్రితములై యుండుటవలన అనంగుష్ఠయుతములను పేరు కలుగును. పాదత్రములు - చెప్పులు పాదత్రములను ధరించునపుడు ఆ పాదత్రమునకు "ఉంగరము" "ఉంగటము" పేరుతో నొక వల యాకృతి యుండునేని అందు కాలి బొటనవ్రేలిని కూర్పవలసి యున్నపు డనంగుష్ఠరీతి కలుగును. అట్లు బొటనవ్రేలు దూరము కాగా నాలుగు వ్రేళు లటు కూడుకొనును. భూమినుండి కాడను కర్రను దీయునప్పుడును ఈ యంగులీరీతి వినియుక్త మగును.

౭. అంగుష్ఠ సంయుతములు:- అంగుష్ఠముతో నన్ని వ్రేళులు కూడుకొని మిథస్సంశ్రితము లయినచో నంగుష్ఠయుతములను నామము సిద్ధమగును. గజమునకు వలె పాదమును త్రాటియుచ్చులో రజ్జు గర్భములో ప్రవేశపెట్టవలసి యున్నపుడు నూపురాదులను పాదము నుండి విడదీయునపుడు దూరస్థము నాకర్షింప వలసి యున్నపు డీ అంగుష్ఠయుక్త రీతి వినియుక్త మగును.

సర్వాంగులులతో నంగుష్ఠము సంయోగము పొందుట వలన అంగులీత్వము పొందును. ఒకప్పుడిట్టి అంగులీత్వము కలుగగా నప్పు డంగుష్ఠము త్రివిధముగా పరిగణిత మగును. ఉత్క్షిప్తము — అవనతము — సహజము అని వీనిలక్షణ వినియోగము లిట్లుండును.

ఉత్క్షిప్తము:- నఖ ముఖాదులలో అంగుష్ఠము ఉన్ముఖీకృతముగా నున్నచో నుత్క్షిప్త మగును. అంగుష్ఠముతో కూడిన వ్రేళులు కావున అంగుష్ఠయుతము లనుట యుక్తము. నామిత మనునది వంగి యుండునట్టి యంగుష్ఠము. లజ్జాతిశయమున భూమ్యాది విలేఖన మున్నపుడు నమితాంగుష్ఠము వినియుక్త మగును. "లిఖన్నాస్తే భూమిం" సహజ మనునది స్వభావగతము. సర్వసామాన్యముగా నడచు నప్పు డిది యుండును. ఈ నిరూపించిన త్రివిధాంగుష్ఠ రీతులను జాయపతియె స్వయముగ సూచించెను. దీని నితరులు చెప్ప లేదు. నాట్యవేదమున నిది లేదు. లేని వాని నభ్యూహించి చెప్పుటయు జాయపతి విశిష్టత.

అంగనాం లక్షణం సర్వం వినియోగసమన్వితం
ప్రోక్తం జాయచమూపేన మునేరాశయవేదినా

వినియోగసమన్వితముగా నిట్లు అంగాభినయముల లక్షణ మంతయు నిరూపిత మయినది. నాట్యవేదనిర్మాత యగు భరతముని యాశయమును గుర్తించిన జాయచమూపాలకు డీ విధముగా సర్వము నిరూపించెను.

శ్రీ మన్మహారాజాధిరాజ గణపతిదేవ
గజసాధనిక శ్రీ జాయ సేనాపతి
విరచితాయాం నృత్తరత్నావల్యాం
అంగనిరూపణం నామ
ద్వితీయాధ్యాయః

ఆంధ్రభోజ సాహితీవల్లభ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ
భావసాధక శ్రీ మాధవరామశర్మ
విరచిత సాహితీవల్లభాఖ్య వ్యాఖ్య
అంగ నిరూపణము
ద్వితీయాధ్యాయము.



శ్రీ జాయసేనాపతి విరచితా

# నృత్తరత్నావలీ

## తృతీయాధ్యాయః

లీలోల్లసచ్చాపగతిప్రబంధ
మృగీప్లుతోద్యద్భ్రమరీ మనోజ్ఞాం
సస్యందితాబ్జాం జనితోరుశోభాం
వక్ష్యామి చారీం వనరాజి తుల్యాం

ఈ తృతీయాధ్యాయమున జాయసేనాపతి చారీవిశేషములను నిరూపింప దలచెను. వనరాజి సమానముగా నెన్నదగిన చారీవిశేషము నిరూపింతు నని యిం దనుటలో వనరాజితుల్యత భావనీయము. చారిని వనరాజి సదృశముగా నిశ్చయించుటచే నీ శ్లోకమున వనరాజి పక్ష భావమును, చారీపక్షభావమును గ్రహింపవలసి యున్నది. అందు ముందుగా నుపమానముగా నెన్నదగిన వనరాజికి సంబంధించిన భావము నిట్లు గ్రహించునది.

వనరాజిలో చాపము లను పక్షులు విలాసమున నుల్లసించునవై ప్రడీనోడ్డీనాది గతిప్రబంధములు కల వగును. మృగీప్లుతములతో వనరాజి శోభించును సాతిశయముగా సంచరించు భ్రమరములచే మనోహారముగా నుండును. స్యందిత-స్యందము కల వయిన, కదలికలతో గూడిన పద్మములు వనరాజిలో నుండును. సముత్పన్న

మయిన సమధికశోభతో వనరాజి ప్రకాశించును. ఇట్టి వనరాజితో చారి తుల్య మగుటకు శబ్దసామ్యము నిరూపిత మయినది. సమాన ధర్మవాచకము లయిన శబ్దములు శ్లిష్టము లయినందున చారీపక్ష మున వేరొక భావమున సంగతము లగును. చారి ఉపమేయము. ఉపమేయభావము నిట్లు గ్రహించునది.

చారీవిశేషములలో చాషగతి మృగప్లుతము భ్రమరి స్యందితము జనితము అనునవి కలవు. ఆ పదముల కలయికతో వివక్షితార్థమును గ్రహింప వచ్చును. విలాస సముల్లాసము కల చాషగతి ప్రబంధము చారిలో నున్నది. మృగీప్లుతముచే నుద్యద్భ్రమ రీవిధానమున చారి మనోహరము. స్యందితచారిచే పద్మశోభయు నున్నది. జనితచారీ విధానమున నధికశోభయు నున్నది. ఇట్టిచారి అట్టి వనరాజితుల్యము. ఇది ఆర్థి ఉపమాలంకారము. శబ్దసామ్యమున నిచట ఉపమానిర్వాహ ముండుట స్పష్టము - ఇట్టి శ్లోకములను జాయన సాభిమానముగా నా యా స్థలము లందు నిబంధించెను. తరువాతి భాగములలో నున్న యిట్టివాని నుభయార్థసంబంధ యోగ్యత కలవానిగా భావించుట సముచితము.

ఈ తృతీయాధ్యాయము నందు నృత్త నాట్యము లకు సంబంధించిన కొన్ని సాంకేతిక విధానములు నిరూపితములు కాను న్నవి. చారీవిధానములు, స్థాన విశేషములు, చతుర్విధములగు న్యాయములు, ప్రవిచార విశేషములు, వ్యాయామవిధి, ఆసనభేద ములు, సుప్తస్థానములు, ఆయతరీతి, మండల రీతులు, భేద ప్రభేద సహితములుగా నిందు ప్రతిపాదితము లగును. వాని వినియోగము లును నిదర్శితములగును. కటికర్మలు, ఊరుకర్మలు, జంఘాకర్మలు, పాదకర్మలు పరస్పరము వ్యామిశ్రణము పొందగా నందలి విశేష

మున విచిత్రిత యుదయించును. అట్టి వైచిత్ర్యముతో కూడి యుండునట్లుగా ప్రయోగించినచో నాయా కట్యాది కర్మలకు "చారి" అను వ్యవహారము కలుగును. కట్యాది పాదాంత కర్మ విశేషము ననె చారీ కథనము యుక్తము. ఇట్టి వీనివైచిత్ర్యోదాహరణ ప్రదర్శనమునకై తృతీయాధ్యాయము ప్రకాశింతమగుచున్నది. చారీ మండల విధానములు వీని వైచిత్ర్య నిరూపకములు.

చారీ లక్షణము చారీ శబ్దనిష్పత్తి చారీ స్వరూప వివేకము వాని ద్వితిత్రియోగము వలన గలుగు భేదములు ముందుగా నిరూపితములు కావలెను. చారీ శబ్దవ్యుత్పత్తిని అభినవు లీవిధముగా నిర్ణయించిరి. "చరేర్హి ఇఞ్ కరణే భావే వా ఔణాదిక ఇతి, "కృదికారాదక్తినజీష్" ఇతి చ చారీశబ్దః ప్రసిద్ధార్థః" చరధాతువునకు కరణార్థమున గాని భావార్థమున గాని ఔణాదిక మగు ఇఞ్ ప్రత్యయ మొనర్పగా 'చారీ' శబ్దము నిష్పన్నమగును. వేరొక విధమున గూడ నిష్పన్న మగును. "కృదికారాదక్తినః" అను గణసూత్రము కలదు. ఇకారాంతమయిన కృదంత ప్రాతిపదిక కంటె జీష్ ప్రత్యయము వికల్పముగా వచ్చునని సూత్రార్థము. చారి పదమునకు జీష్ చేర్పగా 'చారి' శబ్దము నిష్పన్నమయినది. ఇట్లీ యర్థమును ప్రతిపాదింప వలసి యున్నది.

### చారీలక్షణం - నిష్పత్తిః

భవేతౌణాదికత్వాత్ ఇఞ్ చరేః కరణభావయోః
కృదికారాత్కృతే జీషి సిద్ధం చారీత్యతః పదం

కరణార్థమున భావార్థమున చర పదమునకు ఇఞ్ ప్రత్యయ మొనర్పగా చారీ పదము నిష్పన్న మగును. ఇకారాంతకృదంత మగు చారి పదమునకు జీష్ కూర్పగా చారీ పదము నిష్పన్న

మగును. కట్యాదికర్మలు సముదితములుగా ప్రయుక్తము లయినచో చారి నిష్పన్న మగును. కావుననే చారీ విధానములకు వేరుగా విని యోగము లేదని యభినవభారతి వాక్యము. ఆ వాక్యార్థమును జాయపతి యిట్లు నిబంధించుట యుక్తము.

చార్యః కట్యాదిపాదాంతచేష్టయైవ భవంతి యత్
వినియోగః పృథక్తాసాం న ప్రత్యేకం భవేత్తతః

కట్యాది పాదాంత చేష్టచే చారీ రీతులు కలుగుచున్నవి. కావున చారీ విధానము లకు వేరుగా వినియోగ ప్రదర్శనము లేదు. నిరూపించుట లేదు. కట్యాది కర్మలకు నిరూపితము లయిన వినియోగ విశేషములె చారీవిధానము లకును సంబంధించును. అట్టి యపుడు వేరు ప్రదర్శనమేల ?

### చారీస్వరూపవివేకః

ధ్రువం పాదస్య యత్కర్మ తజ్జంఘోరుకృతం యతః ౯
పాదజంఘోరుకరణం తతః కుర్యుః ధ్రువం సమం
[యతః పాదే ప్రవర్తేతే] ఊరుజంఘే యతస్తతః
తుల్యత్వకరణాదేషాం పాదచారీ ప్రశస్యతే
పాదస్యైకస్య యశ్చారః స చారీతి నిగద్యతే
కరణం పాదయోశ్చారః ఖండస్తు కరణైస్త్రిభిః ౧౦
ఖండైస్త్రిభిశ్చతుర్భిర్వా మండలం మిలితైర్మతం
గతౌ యుద్ధే నియుద్ధే చ చక్రశక్త్యాదిమోచనే
నృత్తే నాట్యే చ చారీభిః వినా కించిన్న వర్తతే

### స్వరూపభేదనామములు.

ప్రదర్శింప దలచిన చారీవ్యాయామ న్యాయస్థాన మండలము లన్నియు పాద జంఘోరు కరణముల నాశ్రయించి యుండు

టను నాట్యవేదము కీర్తించినది. ప్రయోక్తలు పాద జంఘోరు కర్మలను సమముగా నొకటొకటి కూడి యుండునట్లు చరింప వలెనని నియమమున్నది. పాద కర్మ నాచరించినచో జంఘోరు కర్మ లాచరించినట్లె యగును. ఈ భావమె మొదటి శ్లోకమున నున్నది. పాదమునకు సంబంధించిన యే కర్మ కలదో యది జంఘోరు కర్మయె యగును. కావున పాద జంఘోరు కరణము సమముగా నుండుట యావశ్యకము. పాదము లేవిధమున ప్రవర్తితము లగునో ఊరు జంఘ లావిధముగనే ప్రవర్తించును. వీని కిట్లు సమాన సంచారమున్నందున పాదచారి యనుట యుక్తముగా నున్నది. ఏక పాద ప్రచారమున చారి యను వ్యవహారము కలుగును. రెండు పాదముల చారమునకు కరణమని పేరు. మూడు కరణముల సంచారమున్న ఖండమని వ్యవహారము. మూడు ఖండములు గాని నాలుగు ఖండములు గాని మిలితములై యున్నచో మండల మను పేరు యుక్తమగును. ఇట్లు చారీ రీతులున్నవి. ఇట్టి చారీ విధానములు గతి ప్రచారము నందావశ్యకములు. యుద్ధము నందావశ్యకములు. నియుద్ధ మునందపేక్షితములు. చక్రము శక్తి మొదలగు నాయుధముల ప్రయోగించుటలో చారీగతు లుండవలెను. నృత్తమున గాని నాట్యమున గాని చారీవిశేషములు వినా యేదియు ప్రవర్తింపదు. ఇట్లు చారీవిశేషముల గుర్తింపవలసి యున్నది.

చారీ పదమును వ్యవహరించు నపుడు వ్యాయామ పదమును గూడ వ్యవహరింతురు. చారీ శబ్దార్థము నిరూపిత మయినది. చారీ రీతు లన్యోన్య ప్రయోజనమున సంగతము లయినచో వ్యాయామ మన్న వ్యపదేశము కలుగును. చారీ వ్యాయామ మని వ్యవహరించి నప్పుడు "చార్య ఏవ వ్యాయామః" యని కర్మధారయ

సమాస మంగీకరింపవలెను. "వ్యాయచ్ఛంతే పరస్పరం" అని వ్యాయామపద వ్యుత్పత్తి. పరస్పరము చారులు సంగతములగుట దాని యర్థము. చారులు పరస్పరము సంగతము లగునపుడు పూర్వచారి తరువాతిచారి లో నియతమగును. కాని పూర్వచారిలో తరువాతిచారి నియతమగు ననరాదు. సంగతములగు చారీరీతులలో నొకటి ప్రధానము కాగా నితరము త దుపగతమై యుండును. అంగికాభినయమునందలి యొక యంగము ప్రధానముకాగా చారి తదుపయోగమున నుండును. ప్రధానమగును. అట్టిచారీ సంపత్తికి తగినట్లుగా నవంతర చారి పూర్వముతో సంగత మగును. ఇట్లు పరస్పర నియమము కల చారులు వ్యాయామ మగు ననుట యుక్తము.

ఇట్టి వ్యాయామములో సంక్షిప్తము మధ్యమము విస్తీర్ణము నని భేదములు కలవు. అవియే చార కరణము ఖండము మండలము నను నామములతో నున్నవి. ఏకాకి పాదప్రచారము చారి యనుటచే శ్రోణ్యాది ప్రచారము వ్యాక్షిప్త మయినది. మూడు నాలుగు ఖండములున్న మండలమనుట చతురశ్రతాలాభిప్రాయమున నని గుర్తించునది. ఈ చారీ విధానములకు లౌకికత్వము కలదు. అదియె నృత్యాద్యుప యోగము. అంగహారాత్మక నృత్తమున చారీసంచార మున్నది నాట్యమంతయు "చారీష్వేవసంస్థితం". ఇట్టి భావములన్నియు నాట్యవేదాభినవభారతి నుండి సంగృహీతములు. తద్భావ భావిత జాయపతిలో నభిన వాదరము గోచరించుట చే నివి నిరూపితములు. ఇట్లంతట నిరూప్య మాణ సుందరముల నిరూపణ ముందును "ప్రకృతాధికారి ఖేదావహాత్వాచ్ఛ న పద వాక్యవిత్పరిచితతా ప్రకటన మాత్ర లాలసాత్మక మతిరితి విరమ్యతే" అనిన అభినవ గుప్తుడు నాకును సమామ్నాయ్యడుపజీవ్యుడును.

భూచార్యః షోడశ

సమపాదా స్థితావర్తా జనితా స్యందితా మతా
తథావస్యందితా బద్ధా శకటాస్యాథ విచ్యవా ౧౫
పలకాక్రీడితా చాషగతిః ఉత్స్యంగితాడ్డితా
సమోసారితమత్తల్లీ మత్తల్యర్ధరికా తతః
ఊరూద్వృత్తేతి భూచార్యః షోడశైతాః ప్రకీర్తితాః

భూచారులు.

చారీ రీతులు రెండు విధముల నున్నవి. భూచారులు ఆకాశ చారులు నని పదునారు భూచారులున్నవి. పదునారు ఆకాశ చారులున్నవి. వాని నామము లిచట నిర్దిష్టము లగును. భూమ్యాకాశ సంచార ముఖములచే సామాన్యముగా నిట్టి పేరులు కలుగుట నట్లూహింపవచ్చును. "భూమే భవా భౌమ్యః" భూమి యందు కలుగునవి కావున భౌమ్యములు భౌమములు. ఇట్లే ఆకాశ భవము లాకాశిక చారులగు నని గుర్తింపవచ్చును. ప్రాక్తను లయిన భరతాదిమునులు వీని నిట్లు స్మరించి చెప్పిరి. వేదో దాహరణమున నెంతగా స్మృత మయినదో వాని నంతగా నిరూ పించిరి. లోకవ్యుత్పత్తి సంపాదనమునకై వారట్లు చెప్పిరి. భూచా రుల నామము లీవిధమున నున్నవి.

సమపాద — స్థితావర్త — జనిత — స్యందిత — అవస్యందిత
బద్ధ — శకటాస్య — విచ్యవ — ఏలకాక్రీడిత — చాషగతి
ఉత్స్యందిత — అడ్డిత — సమోసారిత మత్తల్లి — మత్తల్లి
అధ్యర్ధిక — ఊరూద్వృత్తా

అను నామములకు యివి భూచారులు పదునారు ప్రసి ద్ధములై యున్నవి.

ఆ కా శి క్యః

అతిపార్శ్వాపపూర్వాః స్యుః క్రాంతాః సూచీమృగప్లుతాః
భుజంగత్రాసితాలాతా విద్ధా నూపురపాదికా ౨౦
ఆక్షిప్తా భ్రమరీ దండా విద్యుద్భ్రాంతాభిధా తతః
ఊర్ధ్వజానురథోద్వృత్తా దోలాపాదేతి షోడశ
ఆకాశిక్యః స్మృతాశ్చార్యాః ప్రోక్తనైర్భరతాదిభిః
భూమ్యాకాశచరత్వేన ప్రాయశస్తాస్తదాహ్వయాః

ఆ కా శ చా రు లు.

ప్రాక్తను లయిన భరతాదు లాకాశ చారులు పదునారు కలవని నిరూపించిరి. ఆకాశ సంచారమున అకాశచారులను నామము కలిగినది. వాని పేరులు.

అతిక్రాంత — పార్శ్వక్రాంత — అపక్రాంత — సూచి
మృగప్లుత — భుజంగత్రాసిత — అలాత — ఆవిద్ధ
నూపురపాదిక — ఆక్షిప్త — భ్రమరి — దండ
విద్యుద్భ్రాంత — ఊర్ధ్వజాను — ఉద్వృత్త — డోలాపాద

వీని నామకథనములో "అతి — పార్శ్వ — అపపూర్వాః క్రాంతాః" అని యున్నది. అతిపూర్వమగు క్రాంత — అతి క్రాంత యని యర్థము. ఇట్లె పార్శ్వ పూర్వ—అపపూర్వ క్రాంత పదములు గ్రాహ్యములు. "ఏవ మాకాశిక్యః ఉపరిచరితాం" అని అభినవభారతి, ఉపరిచరుల పాదజంఘోరుకరణము లాకాశచారు లని భావము ఇట్లు ముప్పది రెండు చారీగతు లుల్లిఖితములయినవి. వీనిలక్షణ స్వరూపముల జెప్పవలసి యున్నది.

౧. స మ పా దా

స్థిత్వైవ సమపాదేన భౌమీమాకాశికీమపి ౨౪
యతః కుర్యాత్తతశ్చారీ సమపాదా నిగద్యతే

శ్లిష్టాః పార్ష్ణినఖం పాదాః తిష్ఠంత్యేకైకశో వ్రజేత్
సమం పాదద్వయం తస్మాత్సమపాదేతి సంస్మృతా
మునేరాశయమజ్ఞాత్వా కైశ్చిత్ శాస్త్రవిధాయిభిః
సమపాదయుగ స్థాన మాత్రేణైషా ప్రకీర్తితా ౩౦
యద్యేవం కరణం న స్యాద్భిన్నం సమనఖాభిధం
అస్యాశ్చలనశీలత్వాత్పాదై రిత్యబ్రవీన్మునిః

### భౌమచారులు. ౧. సమపాద.

సమానముగా పాదము లుండగా సమపాదమగు. ననుట సమపాద పదలభ్యార్థము. సమాన పదమున నిలబడి యుండియే భౌమ విధానమును ఆకాశ విధానమును ఆచరించినచో సమపాద చారి యనదగును. సమపాద స్థితియు చారి యగునా యని చరణ చారణమందు లేదుకదా యని సందేహింపదగదు. సమపాదమున నుండియే యొకస్థానము నుండి స్థానాంతరమునకు గమన మొనరించినచో చరణము చారి కాగలదు. ఇట్టి యోగ్యత యుండుటచే సమపాదవ్యపదేశము కలిగినది. పదములు వ్యవధానము లేకుండు నట్లుగా నొనర్పగా పదపార్ష్ణి భాగములు నఖములు కలసి యున్న ట్లొనర్పగా పాదము లొక్కటిగా ప్లుతగతితో గమన మొనర్పగా సమపాద మగును. ఇట్టి భావసూచనమునకు నాట్యవేదము "స్థాన సంశ్రియా సమపదా" యనినది. సమపాదముగనె యుండి స్థానాంతరము నాశ్రియించుట సమపాద స్వరూపము. ఇట్టి భరతముని భావము గుర్తింపక శాస్త్రవిధాతలు కొందరు సమపాద యుగ స్థాన మాత్రముననె సమపాదచారి యగునని యనిరి. ఇది ముని యాశయము కాదు. భరతుడు. "పాదైర్నిరంతర కృతైః తథా సమనఖైరపి" అని సమపాద లక్షణము పలికెను. సమపాదము వేరు కర

ణము కాక పోయినచో "సమనఖ" మనుట సంగతము కాదు. సమ పాద చారి చలన శీలము కావుననె "పాదైః" అని బహువచనమున పలికెను. స్థానమునుండి స్థానాంతరము పొ౦దుట నుద్దేశించియె "స్థాన సంశ్రయా" యని లక్షణమున ననెను. సమనఖ మను కరణ మను నిర్దేశించు నప్పుడును చతుర్థాధ్యాయ మున "శ్లిష్టౌ సమనఖౌ పాదౌ" యనెను. ఇట్లు సమనఖ కథనమున భరతుడు సమపాదము చారియగునని భావించినట్లు గుర్తింప వలెను.

## ౨. స్థితావర్తా

పాదస్యాగ్రతలేనోర్వీం ఘర్షన్ పార్శ్వేఽన్యతః క్షిపేత్
జానుభ్యాం స్వస్తికం యావత్కుర్యాదంతరమండలం
తదన్యముత్క్షిపన్ స్వస్య పార్శ్వ ఏవ నివేశయేత్ ౩౫
స్థితావర్తా భవేచ్చారీ స్థిత్వా స్థిత్వా ప్రవర్తనాత్
అనుక్తాస్తు బుద్ధైరేవ జ్ఞేయాశ్చారీనిరుక్తయః

## ౨. స్థితావర్త.

పాదము యొక్క అగ్రతలము చే భూమిని ఘర్షణ మొన రించుచు పార్శ్వమున వేరుగా సారింపవలెను. జానువులచే స్వస్తిక రూపము కలుగు వర కంతరమండలము నిర్మింపవలెను. వేరొక పాదమును పైకెత్తి స్వ పార్శ్వముననె యుంచవలెను. అపుడది స్థితావర్త యగును. స్థితి పొంది పొంది ప్రవర్తించుట చే స్థితావర్త నామ ముచితము. భూమి ఘృష్టమగు పాదముచే నగ్రతల సంచా రమున నభ్యంతర మండలము నిర్మించుట జాను స్వస్తికాంతముగా నుండును. ఇట్లొనరించిన పిమ్మట వేరొక పాదమును నాతర్షించుట యుండును. మొదటిపాదము స్వపార్శ్వము స్వస్తికముగా శ్లిష్టము కాగా రెండవ పాదమున విశేష సన్నివేశముండును. రెండవ

పాదమునకు స్వపార్శ్వాకర్షణమున స్థితియె యిందలి విశేషము. స్థితమై యావర్తిత మగుట ఒక దాని స్థానమును మరియొకస్థితిలో నుంచుటచే నిది స్థితావర్తము. ఇట్లు కొన్ని చారీ విశేషములు స్వరూప నిర్వచన మచ్చట నచ్చట నుండును. అనుక్తము లయిన చారీ నిరుక్తులను బుధులు స్వయముగా నభ్యూహించి గుర్తించునది. అట్లవి సులభగ్రాహ్యము లగును.

### ౩. జనితా

వక్షోజప్రవణయా ముష్టిః అన్యోప్యావర్తితః కరః
యస్యాం సా జనితా జ్ఞేయా పాదస్తు తలసంచరః
ఏతాం దేశీవిదః కేచి దూచుర్ముసలఘాటికాం ౪౦

### ౩. జనిత.

ముష్టి హస్తము వక్షస్థము కావలెను. వనితలయినచో వక్షోజ ప్రవణయి కావలెను. రెండవ హస్త మావర్తితము కావలెను. పాదము తల సంచారముతో నుండవలెను అప్పుడది జనిత యను చారి యగును. సమస్త గతి విశేషములకు నిదిజననము సంపాదించునది కావున, ప్రారంభరూపముకావున జనిత యయినది. ముష్టి వక్షోగామి యగుట దీని రూపము. హస్తాంతర పరివర్తన మింద తికర్త వ్యతా రూపము. దేశీనృత్తవిదులు కీర్తిధరాదులు కొందరు దీనిని ముసలఘాటిక యని వ్యవహరించిరి. నృత్య రత్న కోశములో నిది యిట్లేయున్నది. దీనిని ముసల పాదిక యనుట ప్రామాదికము. ముసల పాదిక ముసల ఘాటిక యనుట కన్న దీనిని ముసల ఘాతిక యనుట యుక్తముగా తోచును. తెలుగు దేశములోని రోకలి పోటు కావచ్చును. వడ్లు దంపునపుడు పాడుచు పదుచు వాండ్రు ముష్టివక్షోజముల బట్టి పాదతలముతో ఘాత మొన

రించుట స్పష్టము ప్రసిద్ధము. దేశీపద్ధతులను పేర్కొనుటలో జాయపతియు నీ ముసల ఘాతికను పరిగణింపలేదు. దేశీరీతులను నిరూపించుటలో జాయపతి మార్గ రీతులకు సంబంధించిన కరణములకు చారీ విధానములకు దేశీ నామములను కూర్ప లేదు. ఈముసల ఘాతిక రాజస్థాన దేశియగునా ? అచటి దేశీపదమున కిది సంస్కృతీ కరణమా ?

౪. స్యం ది తా

నిషణ్ణోరుః సమో వామః తిర్యగన్యః ప్రసారితః
పంచతాలాంతరం యస్యాం స్యందితేయం నిగద్యతే
తాల స్తత్కరాంగుష్ఠమధ్యయో స్తయోర్మితిః

౪. స్యం ది త.

వామ పాద మూరు దేశమున కూడియుండగా రెండవదియగు దక్షిణపాదము అడ్డముగా పంచతాలాంతరము గా ప్రసారితము కావలెను. పంచతాలాంతరముగా పాదమును ప్రసారిత మొనరించుట యనునది చెప్పబోవు అవస్యందితచారిలో కూడకలదు. ఇందు దక్షిణపాదము ప్రసారిత మగుటయు అందు వామము ప్రసారిత మగుటయు నూహింపవలెను. పంచతాలాంతర మనుటలో అంగుష్ఠ మధ్యమాంగులుల ఘాతము చిటిక వేయుట పరిమితి గా గుర్తింప వలెను. "తాలః స్మృతో మధ్యమయా" ఇట్టి విధానమునకు స్యందితమని పేరు. "సాస్యందితా ప్రసారణ ధర్మత్వాత్" ప్రసారణములో నున్నందున స్యందితచారియ యినది.

౫. అ వ స్యం ది తా

స్యాదవస్యందితా తద్వదస్యా ఏవ విపర్యయాత్
యద్యపి స్ఫుటమాలీఢప్రత్యాలీఢసమే ఇమే ౪౫
తయోరచలయోర్భిన్నే తథాప్యేతే యతశ్చలే

## ౫. అవస్యందితము.

స్యందిత చారీ విపర్యయమున అవస్యందిత చారి కలుగును. దక్షిణ పాద ప్రసారమున్నచో స్యందిత చారి కాగా, వామ పాద ప్రసారమున్నచో అవస్యందిత చారి యగును. ఈ నిరూపించిన స్యందితావస్యందితములు రెండును ఆలీఢ ప్రత్యాలీఢ స్థానకములతో సమానములు. ఈ యధ్యాయము నందే స్థానకములను నిరూపించుచు, వామ పాదము నిషణ్ణ మగుటను పంచతాల మితముగా దక్షిణపాదము ప్రసారిత మగుట నాలీఢ స్థానమునకును దీని పరివర్తనమున ప్రత్యాలీఢ మగుటను గ్రంథకర్త నిరూపించును. అందువలన స్యందితావస్యందితము లాలీఢ ప్రత్యాలీఢ సమానములనుట సంగతము. కాని ఆస్థానకములకు నీ చారీవిశేషములకు భేదము కలదు. స్థానకము లచలములు. చారులు చలములు. ఆలీఢ ప్రత్యాలీఢములలో రెండు పాదములును త్ర్యశ్ర విధానమున నుండుట కలదు. స్యందిత చారి కట్లు కాదు. "స్థానస్య స్థితి ప్రధానతా చార్యాస్తు గతి ప్రధానతా" స్థానమునకు స్థితి ప్రధానము. చారికి గతి ప్రధానము. ఇట్టి విశేషమె అచలచల పదములచే నిరూపిత మయినది.

## ౬. బద్ధా

భవేత్స్వస్తికరూపేణ సంవేధో జంఘయోర్మిథః
తతో వలనమూరుభ్యాం యస్యాం బద్ధేతి సా స్మృతా
అస్యాం స్వస్తికవిశ్లేషం యావత్పాదతలాగ్రయోః
మండలభ్రమణాత్స్వస్వపార్శ్వయోర్గమనం [తథా] ౨౦
ఇత్యూర్వోర్వలనం యుక్తం కేచిదూచుర్విపశ్చితః

౬. బద్ధ.

బద్ధ యను చారీవిశేషములో జంఘాభాగములకు స్వస్తిక రూపముగా సంవేధ ముండును. పిమ్మట ఊరు భాగములకు వలన ముండును. ఇట్లున్నచో నది బద్ధచారి యగును. జంఘాస్వస్తిక మట్లై యుండగా కేవల మూరువుల వలన ముండుట బద్ధచారి యని కొందరి భావము. మరి కొందరు స్వస్తికాపసరణమున పాద తలాగ్రభాగములు మండలభ్రమణ పూర్వకముగా స్వస్వపార్శ్వ గమన రూపమున నూరు బంధన ముండుట బద్ధచారి యని యనిరి. ఈ రెండవ భావమును జాయపతి కొందరి విద్వాంసుల భావముగా నిందు నిరూపించెను. స్వస్తిక విశ్లేష పూర్వకముగా పాద తలాగ్రములకు మండల భ్రమణమున తమ తమ పార్శ్వములకు సంచార ముండుటను ఊరువుల వలన ముండుటను కొందరు బద్ధచారి యని నిరూపించిరి. జంఘల స్వస్తికాకృతి ఊరు వలనమురూపమయిన బద్ధచారి ముని సమ్మతము.

౭ శకటాస్యా.

ఉద్వాహితమురః పూర్వనిషణ్ణాంగః స్వపార్శ్వతః
తిర్యక్ప్రసారయేదేకం చరణం తలసంచరం
స్థితేఽన్యస్మిన్సమే పాదే శకటాస్యాభిధీయతే
ఏతయా శకటం క్షేప్యమితి ప్రాప్తా యథార్థతా ౨౫
[జానునా] కల్ప్యతే కైశ్చిదయం పాదస్య రేచనాత్

౭. శకటాస్య.

శకటాస్య పదమునకు సార్థకత యున్నది. "శకటం అస నీయం క్షేప్యం" అని పద వ్యుత్పత్తి. శకటము దీనిచే క్షేప్య మగును. బండిని తోసి వేయుట యుండును. ఈ శకటాస్యచారిలో ఉరము

ఉద్వాహితమై యుండవలెను. పూర్వకాయమును ప్రయత్నమున బిగపట్టి యుంచవలెను. నిషణ్ణాంగః — ఉపవిష్టుడై యుండి తన పార్శ్వమునుండి తల సంచారమున నొకపాదము నడ్డముగా ప్రసరింపజేయవలెను. ఇతర పాదము సమపాదముగా నుండవలెను. అప్పుడది శకటాస్యచారి యగును. కొందరిట్లందురు. ఒక పాదమును సమముగానుంచి యంగుల్యంచితముగా నుంచి జానువును కుంచిత మొనరించి జంఘా ప్రసారణ మొనరింపవలెను. అపుడు తన పార్శ్వమున తల ప్రదేశమును త్ర్యశ్రిత మొనరింపవలెను. అపుడది నిరోధనముగా నుండును. ఉపవిష్టుడై ఒక మోకాలు మడత వేసికొని వేరొక కాలు సికృచాచి నిరోధన మొనరించు రీతిలో శకటాస్యచారి యుండునవి భావింప వచ్చును. అని కాని యిట్టి లక్షణము లక్ష్యార్థ సంగతము కాదని యభినవభారతి యనును.

౮. విచ్యవా

క్రమత్పాదతలాగ్రాభ్యాం మహీతలనికుట్టనైః
విచ్యుతేః సమపాదాయాః విచ్యవేత్యభిధీయతే

౮. విచ్యవ.

క్రమముగా పాద తలముల అగ్రభాగములచే భూతల నికుట్టన మొనరించుటయు, మొదట చెప్పిన సమపాద చారీరీతిని విడనాడుటయు విచ్యవ యను చారీరీతిలో నుండును. పాదముల తల భాగములచే ధరణీతలమును నికుట్టన మొనరించుటచే సమపాదచారి విడనాడి నట్లగును. సమపాదచారీ విశేషమును భావించి దీనిని భావించుట యుక్తము.

౯. ఏలకాక్రీడితా

తలసంచరయోర్యస్యాం పాదయోః క్రమశో భవేత్
ఉత్ప్లుత్య పతనం సేయమేలకాక్రీడితా [మతా] ౬౦

## ౯. ఏలకాక్రీడిత.

తల సంచారముకల పాదములు రెండును క్రమక్రమముగా నెగిరి పడుట లున్నచో నిది యేలకా క్రీడిత చారి యగును. ఒకపాదము ముందుగా నొక ఉత్ప్లుతిచే సక్థి గుల్ఫసంబంధమున నుండి పతితము కావలెను. మరల వేరొక పాదమున నట్లె యొనర్పవలెను. ఇట్లు పర్యాయశః ఉండుట యుక్తము. ఇట్టి చారిగతి అజికా (మేక) గతి తుల్యమగుటచే ఏలకా క్రీడిత మయినది. ఇదియే ఏడకాక్రీడిత మనియు వ్యవహృతము.

## ౧౦. చాషగతిః

పురః ప్రసారితః సవ్యః తాలమాత్రం తతః పునః
ద్వితాలం కించిదుత్ప్లుత్య వామేన సహ పృష్ఠతః
శ్లిష్టః స్యాదేవమభ్యాసీ పాదశ్చాషగతిర్భవేత్

## ౧౦. చాషగతి.

సవ్యపాదము తాలమాత్రమున నెదుట ప్రసారితము కావలెను. అప్పుడు పాదమునకు పృష్ఠశస్సన్నివేశ ముండును. సవ్యపాదము పసర్పణము పొందుచునె యుండును. తాలమాత్రముగా నది యగ్రభాగమున సంచరించి యదియే యపసర్పణమున ద్వితాలమాత్రముగా పశ్చాన్నీతమై యుండును. వామ పాదము సవ్యపాదముతో నపసర్పణము పొందును. కొంతగా నెగిరి సవ్య వామ పాదములు అపసర్పణము పొందుటయు కలిసికొనుటయు నుండును. భయమున నపసర్పణ మొనరించుటలో "చాషస్యేవ గతి చాషగతిః" మొదట ప్రసారితమై వామపాదముతో శ్లిష్టమై యుండు నభ్యాసమున్నచో చాషగతియనుచారి యగును.

## ౧౧. ఉత్స్యందితా

కనిష్ఠాంగుష్ఠభాగాభ్యాం బాహ్యాభ్యంతరతః క్రమాత్
పాదస్స్పర్శన్ శనైః రృత్యా కురుతీ చ గతాగతమ్ ౬౫
రేచకస్యానుసారేణ సేయముత్స్యన్దితా మతా
రేచితః కైశ్చిదత్రోక్తో నృత్తహస్తో విచక్షణైః

## ౧౧. ఉత్స్యందిత.

ఉత్స్యందిత చారీ విశేషమునే కొందరు ఉత్సందిత అందురు. కనిష్ఠాంగుష్ఠ భాగములచే బాహ్యాభ్యంతరములలో క్రమముగా పాదము మెల్లగా ప్రసరించుచు గతాగతమొనరించునేని ఉత్స్యందితచారి యందురు. కనిష్ఠాంగులి భాగము బాహ్యమున నుండి అంగుష్ఠ భాగము అభ్యంతరము నుండి నివర్తనము పొందుటను రెండుపాదములకు గమాగమము లుండుటను అభ్యూహించునది. ఈ గమాగమ విధానము లను సావధికముగా భావింపవలెను. పాద రేచకానుసారమున ఈ గమాగమము లుండును. ఇట్టి దీనిని ఉత్స్యందిత చారి యందురు. శోభానుసారమున పాద రేచితము వరకు ప్రసరించి అపసరణమును పొందుట యిందలి విధి. ఉత్స్పందిత చారి అనుపేరు వ్యవహరించువారు నదికి ప్రత్యావర్తనరూపమైన స్పందనమును యిది సంపాదించును కావున, తత్సామ్యమున్నది కావున యిది ఉత్స్పందిత చారి యందురు. ఈ విషయమున కొందరు రేచకము నృత్తహస్తమును నిరూపింతురు.

## ౧౨. అడ్డితా

సమస్థితస్య పాదస్య ద్వితీయస్తలసంచరః
అగ్రే పృష్ఠే చ సుశ్లిష్టః క్రమాత్ సా చార్డితా మతా
అగ్రధేతి ప్రసిద్ధేతి గురుః కీర్తిధరోఽబ్రవీత్ ౭౦

౧౨. అడ్డిత.

ఒకపాదము సమ స్థితితో నుండవలెను. రెండవపాదము అగ్రభాగమునను పృష్ఠభాగమునను సంచరించునది కావలెను. అగ్రపార్శ్వము లందు సుశ్లిష్టమై యుండగా అది అడ్డితచారి యగును. ఒక పాదము సమస్థిత మగుట మరియొకటి అటు నిటు నిఘృష్టమై శ్లిష్టముగా నుండుట యిందూహింపవలెను. పాదమునకు స్వస్థానాతి క్రమణముండును గావున యిది అడ్డితమైనది. అడ్డు అతిక్రమ హింసయోః అని ధాతువును పఠింతురు. ఈ అడ్డితచారిని గురువుగా నభిమానింపదగిన కీర్తిధరుడు అగ్రధాచారి అని అనెను. ఇది ప్రసిద్ధ మనియు ననెను.

౧౩. సమోసరితమత్తల్లీ

తలసఞ్చరమేకేన ఘూర్ణ మానేనకుర్వతా
అన్యేనస్వస్తికం యస్యాం పర్యాయేణోపసర్ప్యతే
సమోసరితమత్తల్లీ మతేయం మధ్యమేమదే
అన్యేతు స్వస్తికం హిత్వా యుగపద్ఘూర్ణమానయోః
పదయోర్వలనా దస్యాం కథయన్త్యుపసర్పణమ్ ౨౫
మత్తపాదేతి లోకేఽస్యాః ప్రసిద్ధమభిధాన్తరమ్

౧౩. సమోసరితమత్తల్లి.

ఈ పేరుకల యీ చారి సమోత్సరితమత్తల్లి యను పేరుతో గూడ నున్నది. ఘూర్ణ మానమగు నొక పాదమున తల సంచరణ ముండును. వేరొకపాదమున స్వస్తిక ముండును. ఇట్టిరీతి పర్యాయమున నుండును. ఇట్టి దీనిని సమోసరితమత్తల్లి యందురు. ఇది మధ్యమ మదమున ప్రయుక్త మగును. కొందరు దీని స్వరూ పమును వేరుగా నిర్ణయించిరి. స్వస్తికము లేకుండగనే ఘూర్ణమా

నములగు రెండు పాదములు యుగ పత్కాలమునసె వలనము పొందగా ఉపసర్పణ ముండుటను సమోత్సరితమత్తల్లి యనిరి. ఈ చారి మత్తపాదచారి యని నామాంతర ముండుట లోకమున ప్రసిద్ధముగా నున్నది.

నాట్యవేదములో దీని లక్షణ మిట్లున్నది. తల సంచార మొనరించు పాదములతో ఘూర్ణమానోపసర్పణము లుండగా సమోత్సరితమత్తల్లి యగును. దీనిని వ్యాయామంతో నుదాహరింప దగును. ఈ లక్షణములో స్వస్తిక సంబంధము లేదు. అని దీనిని అన్యమతముగా జాయపతి సూచించెను. అభినవభారతి యీ విషయమున భావనీయము. భరత నిరూపిత లక్షణము స్పష్టార్థ మని అన్యమతము నిట్లుపపాదించెను. తల సంచార జంఘాస్వస్తికమున నొక పాదమభ్యంతరమున సంచరించుట అది ఘూర్ణమాన మగుట మరియొక పాదము తల సంచరముతో నుండుట సరోత్సరితమత్తల్లి యగునని కొందరనిరి. ఈ భావమునె జాయపతి ముఖ్యముగా నిరూపించెను.

ఈ చారి నామార్థము నిరూపించుచు అభినవభారతి యిట్లనుచున్నది.

> ౧. "సమః అవికలః అవనం రక్షణం ఉత్ తదర్థం
> సరితః గతిమాన్ మదనం మత్ ముదం తనోతీతి
> మత్తత్ తస్య లయో గమనం యస్యా మితి స
> మోత్సరితమత్తల్లీ"

ఈ నిర్వచనార్థ మిట్లు గ్రాహ్యము. అవికలమయిన రక్షణమునకై గతికల మదనమదమున గమనముకల చారీవిధానము కావున సమోత్సరితమత్తల్లి యయినది. మదమున వికలుడు

కానివానిని రక్షించుటకై మరియొకడు పలాయన మొనరించు నేని యాతని గతి రెండువిధముల నుండును. అట్టి గతియె యిందు నిరూపిత మయినది.

ఈ విషయమున మానవల్లి కవి యిట్లు భావించెను. ఓసరి అ అను అపసరణార్థమున ప్రాకృత పదమున్నది. ఆ పదమున కిది సంస్కృతీ కరణమని కొందరనిరి. ఇం దపశబ్ద దోషమును పరిహరింప దలచి యభినవులు భంగభేదమున ఇట్టి నిరుక్తి ననుగ్రహించిరని భావింతుము. అని ఈ చారీవిధానమున నీ భావములను భావించుట యుక్తము.

౧౪. మత్తల్లీ

జంఘాస్వస్తికయోగేన లగ్నాఖిలతలౌ భువి
ఘూర్ణమానౌ ముహుః కించి త్త్ర్యశ్రితావుపసర్పతః
పాదౌ హస్తౌ తథోద్వేష్టైరపవేష్టైశ్చ సంయుతౌ
భవేతాం యత్ర మత్తల్లీ నామ్నాహు స్తరుణే మదే ౨౦
అపసర్పణమిత్యేకే స్ఖలత్పాదాభిధాం పరే

౧౪. మత్తల్లి.

పాదములు రెండును జంఘా స్వస్తిక యోగమున నున్నవై భూమియందు తల భాగములను లగ్నమొనరించినవి కావలెను. ముహుః ఘూర్ణమానములగుచు కొంతగా త్ర్యశ్రితములై పరిసరింపవలెను. హస్తములును ఉద్వేష్టనములు అపవేష్టనములు కలవై యుండవలెను. హస్త పాదము లిట్లుండగా మత్తల్లి యను చారి యగును. దీనిని తరుణ మదమున నుపయోగింతురు. పాదముల యుపసర్పణమును హస్తముల యుద్వేష్టితా పవేష్టితములును మత్తల్లీ చారిలో నుండును. ఈ మత్తల్లి విషయమున అప

సర్పణమును కొందరు చెప్పిరి. స్థలత్పద వ్యవహారమును కొందరు సూచించిరి.

౧౩. అధ్యర్ధికా

సవ్యస్య పృష్ఠదేశే స్యాద్ వామ [స్తు చరణో యదా
[వామా]పసర్పణాచ్చైవ విజ్ఞేయాధ్యర్ధికా బుధైః]

౧౩. అధ్యర్ధిక.

పూర్వము నిర్దేశించిన చారీ రీతులలో ౧౩ వది ఐన అధ్యర్ధికా చారి లక్షణము గ్రంథములో పతితమైనది. అధ్యర్ధికకు సంబంధించిన లక్షణ వచనములో మొదటి పాదము మాత్రమే యున్నది. విషయసూచకములైన తరువాతి పాదములు లేవు. ఈ స్థలమునందు అధ్యర్ధికా చారీ స్వరూపము నిరూపింప వలసి యున్నది. జాయపతికిని మూలమైన నాట్యవేదమునందలి ఈ చారి లక్షణమును ఇచట గుర్తించుట సముచితము

"సవ్యస్య పృష్ఠతః వామశ్చరణస్తు యదా భవేత్
తస్యాపసర్పణం చైవ జ్ఞేయా స్యాధ్యర్ధికా బుధైః" ౮౩

దక్షిణపాదమునకు పృష్ఠభాగమున వామపాదముండ వలెను. ఆ దక్షిణ పాదమునకు అపసర్పణ ముండుటయు ఆవశ్యకము. అపుడది అధ్యర్ధికా అను చారి యగును. ఇట్లు ఈచారివిధానము నున్నృత్తజ్ఞులగు వారు నిరూపించినారు. ఈ చారీవిశేష స్వరూప నిర్వచన మొనరించుటలో అభినవభారతి ఈ విధముగా ననుచున్నది.

దక్షిణపాదము యొక్క పార్ష్ణి దేశమునందు వామచర ణము ఉండగా నా దక్షిణపాదమున కుపసర్పణమున స్వపార్శ్వార్ధ త్రిశ్రితముగా స్థితి యుండగా నది యధ్యర్ధిక యగును. అనుగత మగునట్లుగా అధ్యర్థతాలాంతరత్వాదుల నూహింపదగును. ఒక

పాదమునకు పూర్ణగతియు మరియొక పాదమునకు పూర్ణార్ధక గతియు నుండుట నన్యులంగీకరించిరి. కరణప్రాధాన్యము ననుసరించి యిట్లు లక్షణము నిరూపితమయినది. వామపాదమునకును పృష్ఠసంగతమై సత్యముండుటయు గలదు.

౧౬. ఊ రూ ద్వృ త్తా

.... .... .... .... ....

.... .... నృత్తజ్ఞైరూరూద్వృత్తపదేరితా

౧౬. ఊ రూ ద్వృ త్త.

అధ్యర్ధికాలక్షణమువలె ఈ ఊరూద్వృత్తలక్షణము కూడ లుప్తమయినది. కేవలము చివరి పాదము మాత్రముకలదు. లక్ష్యనామముకల పాదము మాత్రమె యున్నది. సర్వలక్షణమునకై నాట్యవేదము నందలి లక్షణము గ్రాహ్యము. అది యిట్లున్నది.

తలసంచారపాదస్య పార్ష్ణిః బాహ్యోన్ముఖీ యదా
జంఘాంచితా తథోద్వృత్తా ఊరూద్వృత్తేతి సా స్మృతా

తలసంచారముతోనున్న పాదమునకు సంబంధించిన పార్ష్ణి భాగము బాహ్యోన్ముఖముగా నుండగా అదియే జంఘాసమన్వితమై యుద్వర్తనము పొందుచుండునేని ఊరూద్వృత్తము అను పేరుకల చారీవిశేష మగును. అగ్రతలసంచారముకల పాదమునకు సంబంధించిన పార్ష్ణిభాగము ద్వితీయభాగ పృష్ఠభాగాన్ముఖ్యము పొందునేని జంఘాభాగమును జానునమనము వలన ఆకుంచితమై యుండునేని సమ్ముఖవలనము వలన ద్వితీయజంఘయుద్వృత్త మగునేని యూరూద్వృత్తయగునని యభినవభారతి భావము. ఊరువున కూర్ధ్వవివర్తనమువలన ఈచారి లజ్జేర్ష్యాది విషయముగ నుండును. కొందరు

పార్ష్ణిసహితపాగమునకు తలసంచారమున బాహ్యోన్ముఖముగా నీ
చారి యుండుననిరి.

ఇట్లు నిరూపితములయిన ఈ పదునారును భౌమములయిన చారీవిశేషములు. ఇవి నియుద్ధమున ననాదిసిద్ధముగా నున్నవి. నాట్యమున నివి కరణములందును అంగహారములందును సంగతములై యుండును. ఈ చారీవిధానములను భరతుడు నిరూపించి "స్మృతాశ్చార్యః" అనెను. స్మృతాః అనుటచే ఉపవేదసంబద్ధములయినవని యిందు వేదమె ప్రమాణమని ప్రదర్శిత మయినది. ఇవి నియుద్ధకరణాశ్రయములని యనుట కించిత్ వినియోగ ప్రదర్శనమని భావింపవచ్చును. ఇంతవఱకు భౌమచారీవిశేషములు లక్షణసహితముగా నిరూపితములైనవి ఇకపై ఆకాశచారీ విశేషములను నిర్వచింపవలసి యున్నది. పూర్వము నిరూపించినట్లుగా అతిక్రాంతా పార్శ్వక్రాంతా అపక్రాంతా మొదలుగాగలిగిన దోలాపాదాంత చారీవిశేషములు నిరూపణార్హములు. వానిలో యథాక్రమముగా అతిక్రాంతా చారీరూపము ఈ రూపముగా నున్నది.

ప్రసార్య పురతః కిఞ్చిత్ పాత్రప్రకృతిభేదతః
యత్రోత్క్షిప్తం [చతుస్తాలాద్యన్తరం .... ....
అగ్రేణ పాతయేద్ భూమా]వతిక్రాన్తేతి తాం విదుః
అనుక్తత్వాద్విశేషస్య మునినా తస్య చిత్తవిత్
పాదస్య పార్శ్వ ఏవేతి న్యాయాత్ కీర్తిధరోऽబ్రవీత్ ౬౩

౧. అతిక్రాంత.

ఆయా పాత్రిలప్రికృతి భేదానుసారముగా కొంతగా పాదము ప్రిసారమొనరింప వలెను. పురఃప్రిసారమే ఇచట వివక్షితము. చతుస్తాలాంతరముగా ఆపాదము పైకెత్తవలెను. ఆపాదా

గ్రముచే భూమియందు పాతము ఆచరింప వలెను. ఇట్లొనరించినచో దీనిని ఆకాశచారీవిధానములలో అతిక్రాంతచారి యందురు. అను కరణ మొనరించునప్పుడు ఆ యా పాత్రలప్రకృతిభేదము ననుసరించి తదనుగుణముగనే వ్యవహరింప వలెను. ప్రకృతి భేదానుసారమున గతిసంచారముండును. అట్లు ప్రకృతిస్వభావోచితముగా పాదము చాచుట ఊర్ధ్వమునకు ప్రసరింపజేయుట మరల భూమియందు పడు నట్లు చేయుట ఆవశ్యకము. పాదప్రసారసముత్క్షేపవినిపాతములు తాలప్రక్రియానుసారముగా నుండవలెను. అట్టి ప్రక్రియా నిరూపణమునకే చతుస్తాలాంతర మని నిర్దిష్టమైనది. ప్రసరణాదు లన్నియు భూమియందు కాక ఆకాశమందే సంగతములగుటచే ఆకాశచారి యైనది.

భరతుడు నాట్యవేదములో నయాతిక్రాంత చారీవిషయమున నెట్టివిశేషములను సూచింపలేదు. కావుననే మునిభావవేది యైన కీర్తిధరాచార్యులును పాదపార్శ్వమునే ఇచట నిర్దేశించెను. ఈ భావమే అభినవభారతిలో కూడ సంగతమై యున్నది.

### ౨. పార్శ్వక్రాంతా

కుంచితం చరణం తిర్యగ్గత్వా పార్ష్ణే సముత్థితం
యదా చోద్ఘాటితం న్యస్యేత్ పార్శ్వాద్వేయమితి స్మృతా
ఉరుక్షేత్రే ద్వితీయస్య యావదుత్క్షిప్య పాతయేత్
పాదముద్ఘాటితేనాస్య లక్ష్మ కీర్తిధరోఽభ్యధాత్
తత్రాబ్రవీత్పార్ష్ణిచండఘాతేతి కిల లోకతః ౨౦

### ౨. పార్శ్వక్రాంతా.

చరణము కుంచిత మగునట్లుగా తిర్యగ్గమన మొనరించి పార్శ్వభాగమునందు చరణమును పార్ష్ణిభాగమున నుంచవలెను.

ఇట్టి కుంచనమున వలనమున ఉద్ఘాటితత్వము కలుగును. పాద తలాగ్రమున నుండి పార్ష్ణిభాగమును భూమిపై నుండునట్లుచేయుట ఉద్ఘాటితమందురు. ఇట్టి ఉద్ఘాటితవిన్యాసమున దీనిని పార్శ్వక్రాంత యందురు శ్రీధరుడీ చారీవిషయమున నిట్లు లక్షణము చెప్పెను. రెండవపాదము నూరుక్షేత్రమునందుంచి ఉద్ఘాటితముగా ప్రసరింప జేసినచో పార్శ్వక్రాంత యగును. అని ఈ చారి "పాదచండఘాత" యని లోకవ్యవహారము కలిగినది. అభినవగుప్తుడిట్టి పేరుండుటను సూచించెను. అన్యమతముగా నభినవగుప్తుడు సూచించిన పార్శ్వ క్రాంతలక్షణమును కీర్తిధరుడవిరూపించి నిరూపించెను. కీర్తిధర నిరూపితములు అభినవభారతీ నిరూపితములయిన అన్యమతరూప ములుగా నున్నవి. అయినను కొన్ని సూక్ష్మాంశము లందు కీర్తి ధరుడు భరతభావవేది యని జాయపతి భావము.

౩. అపక్రాంత

బద్ధాం చారీం విధాయాదౌ పాదముద్ధృత్య కుంచితం
స్వపార్శ్వే నిక్షిపేద్యస్యామపక్రాంతేతి సా స్మృతా
ఉత్క్షిప్య పాదం తత్ .. ....పార్శ్వతో న్యసేత్
ఇతి కీర్తిధరస్త్వాహ విక్షేపవలనాభిధాం

౩. అపక్రాంత.

మొదట "బద్ధ" చారిని నిర్మించి కుంచితముగా నున్న పాదమెత్తి స్వపార్శ్వమున నుంచవలెను. అపుడది అపక్రాంతచారి యగును. మొదట స్తనోపలక్షితముగా నూరువులతో బద్ధచారి నిర్మించుటను పాదమెత్తి తనపార్శ్వమున నుంచుటను అపక్రమణ మును సూచించును. పాదమెత్తుట పార్శ్వమున నుంచుటలను గమ నించి కీర్తిధరుడు దీనిని 'విక్షేపవలనము' అని భావించి పేరుపెట్టెను.

౪. సూచీ

పాదం కుంచితముత్క్షిప్య పురో జంఘాం ప్రసారితాం ౭౫
జాన్వంతామథవోర్వంతామగ్రయోగేన పాతయేత్

౪. సూచి.

కుంచితముగా నున్న పాదము నెత్తి ప్రసారితమయిన జంఘను జాన్వంతముగా గాని ఊర్వంతముగా గాని అగ్రయోగమున ప్రసరింపజేయవలెను. జానుపర్యంతము జంఘను ప్రసరించునట్లు చేయవలెను కాదేని జానువులకూర్ధ్వముగా ఊరుపర్యంతము జంఘాభాగము నంతను ప్రసరింపజేసి అగ్రయోగమున పడునట్లు చేయవలెను. అపుడది సూచ్యాకారమున నుండుటచే సూచి యను ఆకాశచారి యగును.

౫. మృగప్లుతా

అతిక్రాంతోదితం పాదముత్క్షిప్యోత్ప్లుత్య పాతయన్
పృష్ఠదేశే పరాం జంఘామంచితాంఘ్రిసముత్క్షిపేత్
యస్యామేవం భవేత్సేయం వృద్ధైర్జ్ఞేయా మృగప్లుతా

౫. మృగప్లుత.

దీనికి హారిణప్లుత అనియు పేరు. అతిక్రాంతచారీవిశేషములలో చెప్పిన పాదమును పైకినెత్తి ఎగిరిపడునట్లుగా ప్రసరింపజేసినచో పృష్ఠదేశమునందు వేఱొకజంఘాభాగమును సుందరముగా నుండు అంఘ్రిభాగముతో సముత్క్షేపము చేయవలెను. అపుడది మృగప్లుత అను చారీవిశేష మగును. అతిక్రాంతచారిలో కుంచితపాదము నిరూపిత మైనది. దానిని ఉత్క్షేప ఉత్ప్లుతి క్రియలతో నుండునట్లు చేసి ప్రసరింపచేయుట, అనంతరము నందు రెండవజంఘ అఞ్చితపాదముతో నున్నదియై పశ్చాద్భాగమున కూర్చవలెను. ఇదిమృగప్లుతి తుల్యముగా నుండును. స్వస్తిభవతి అని పరిహాసముగా పలికి విదూషకుడు గమన మొనరించునపుడు ఈ హారిణప్లుత ముండును.

## ౬. భుజఙ్గత్రాసితా

ఉత్క్షిప్య కుఞ్చితం పాదం స్వపార్శ్వగతజానుకమ్ ౮౦
త్ర్యశ్రమేవోరుమూలస్య సమక్షేత్రే వివర్తయేత్
యస్యామేషా సమాఖ్యాతా భుజఙ్గత్రాసితా మతా
పాదోపాన్త భుజఙ్గార్థ త్రాసనిష్పాదితా యతః

## ౬. భుజఙ్గత్రాసిత.

కుఞ్చితపాదమును ఉత్క్షేపించి జానుపార్శ్వగతమగు నట్లొనరించి త్ర్యశ్రముగా ఊరుమూలక్షేత్రమునందు వర్తితమొనరింపవలెను. ద్వితీయఊరు మూలక్షేత్రపర్యంతము కుఞ్చితపాదమునెత్తి నితంబసమ్ముఖముగా పార్ష్ణిభాగమును ఊరుభాగమును వివర్తింపజేయవలెను. స్వపార్శ్వమున జానువున్నట్లు ఉత్తానపాదతలముండునట్లు పివర్తిత మొనరింపవలెను. అపుడది భుజఙ్గత్రాసితచారియగును. పాదోపాంతమునందు భుజంగమున్నదని భయభావమున గమనమొనరించునపుడు సాదృశ్యము ననుసరించి భుజఙ్గత్రాసితము అనునామ ముండుట సార్థకము. భుజఙ్గత్రాసిత పదార్థమును నిరూపించుటలో జాయపతి "పాదోపాంత భుజఙ్గార్థత్రాసనిష్పాదితా" అనెను. అభినవభారతిలో "పాదోపాంత భుజఙ్గభయభావిత గతి సాదృశ్యాత్ భుజఙ్గత్రాసితా" అని యున్నది. జాయపతి అనేక స్థలములందు సావధానముగా అభినవభారతిని యిట్లు ఉపయోగించుట, తదర్థమునే నిరూపించుట ప్రసిద్ధముగా నున్నది.

## ౭. అలాతా.

పృష్ఠప్రసారితం పాదం వలనాభ్యన్తరీకృతమ్
తలస్య సంముఖాన్యోరుం స్వపార్శ్వే పార్ష్ణినా క్షిపేత్ ౮౫
యస్యాం సేయమలాతేతి కీర్తితా నృత్తకోవిదైః

౭. అ లా త.

పృష్ఠప్రసారిత మగు పాదమును వలనముచే అభ్యంతరీకృత మొనరించి తలసమూహముగా నున్న ఊరుభాగమును పార్ష్ణి భాగముచే స్వపార్శ్వమున నుంచవలెను. మొదటగా పశ్చాద్భాగమున ప్రసారితమై అనంతరము వలనమున అభ్యంతర కృతమై రెండవ ఊరుభాగము నుండి అభిముఖముగా సమాగతమైనచో అలాతమగును. స్వపార్శ్వమునుండి పార్ష్ణిభాగముచే పరిసారము పొందుటను బట్టి అలాత చక్రఆకారమున్నందున అలాతమను పేరు కీర్తితమైనది. నృత్తకోవిదులు దీనిని అలాతమని వ్యవహరించుచున్నారు.

౮. ఆ వి ద్ధా

పాదో విశ్లిష్టజంఘస్య స్వస్తికస్యైవ కుంచితః
అగ్రే ప్రసారితో యత్ర విద్ధః పార్శ్వే నిజే పునః
అన్యపార్ష్ణి నిజేక్షేత్రే పార్ష్ణినా పతితో భవేత్
ఆవిద్ధా సా భవేత్కేచిదాక్షిప్తాపూర్వికాం విదుః

౮. ఆ వి ద్ధ.

జంఘావిశ్లేషముతో నున్న స్వస్తికముయొక్క పాదము కుంచితమై అగ్రిభాగమున ప్రసారితమై నిజపార్శ్వమున విద్ధమై యుండగా అన్యపార్ష్ణి తనస్థానమున పార్ష్ణిభాగమున పతితము కావలెను. అప్పుడది యావిద్ధచారి పాదము కుంచితము ప్రసారితము ఆవిద్ధము పాతితము నగుట యిందు గుర్తింపవలెను. కొందరు దీనిని ఆక్షిప్తావిద్ధ యని వ్యవహరించిరి.

౯. నూపురపాదికా

స్ఫిక్పార్ష్ణిశ్లేషపర్యంతమంచితం పృష్ఠతో నయన్
పాదమన్వితజంఘం చ పార్శ్వ ఏవ భువి క్షిపేత్
తరసా యత్ర విజ్ఞేయా సేయం నూపురపాదికాం
యథాశోభం స్ఫిజ_స్త్వర్వాక్ స్వయం మన్యామహే పునః

౯. నూపురపాదిక.

పాదము నంచితముగా నొనరించి పృష్ఠదేశమున స్ఫిక్, పార్ష్ణిశ్లేషపర్యంతము పిరుదు పాదము కలియుపర్యంతము జంఘా భాగము సంగతమగునంతగా కలియజేసి పార్శ్వముననె భూమియం దుంచ వలెను. అపుడది నూపురపాదిక యగును. శోభాను సారముగా శ్రోణిభాగము యొక్క పరిదేశము గోచరించువిధానము కూడ సముచితమని మేము స్వయముగ సంభావింతుము. నూపురముల ఝణంఝణాశబ్దము కలుగును. గావున నూపురయోజనమున నిది పరియుక్తమగుటను నూపురపాదిక యను నామము సముచితముగ నున్నదనియు భావింపవలెను.

౧౦. ఆక్షిప్త

త్రితాలాంతరముత్క్షిప్య కుంచితం చరణం పునః ౫౨
సజంఘాస్వస్తికం భూమే వామతః పార్ష్ణినా క్షిపేత్
యస్యామేతా మతాక్షిప్తా ఖండే చింతాపరాభిధా

౧౦. ఆక్షిప్తా:

కుంచితమగు పాదమును త్రితాలాంతరముగా నెత్తి జంఘా స్వస్తికముతో నుండునట్లుగా భూమియందు ఎడమ ప్రక్కగా పార్ష్ణి భాగమున క్షేప మొనరింప వలెను. అప్పుడది ఆక్షిప్తచారి యగును. ఎదట త్రితాలోత్క్షేపణమున అర్ధమండలముగా పార్శ్వాంతరమున

కాకర్షించి స్వస్తికముతో పార్ష్ణిభాగమున పాతమాచరింపవలెను. దానికాక్షిప్త మని పేరు. "ఖండేచింతా పరాభిధా" చింతాపర నామము నితరులంగీకరించిరి. కీర్తిధరుడీ నామము నంగీకరించెను. ఈ నామసంకేతము స్ఫుటమగుట లేదు.

౧౧. భ్ర మ రీ

భుజంగత్రాసితాం కుర్వన్ ద్వితీయేన తలేన చేత్
శరీరం భ్రామ్యతే వేగాత్ భ్రమరీ సా ప్రకీర్తితా

౧౧. భ్ర మ రి.

భుజంగత్రాసితచారిలో సూచించిన విధాన మాచరించుచు రెండవ తలభాగమున వేగముగా శరీరమును భ్రమింపజేసినచో నది భ్రమరీచారి యగును. నాట్యవేదమున నీచారి లక్షణ మిట్లున్నది. అతిక్రాంత చారిలో సూచించిన కుంచితపాదమునెత్తి భుజంగత్రాసితమున వలె త్ర్యశ్రమగు నూరువును వివర్తింపజేసి రెండవ పాదతలభ్రమణమున త్రికభాగమును పరివర్తింపజేయ వలయును. అని, కాని రెండుభావములు భిన్నభిన్నములుకావు. పాద క్రమములో వర్ణనవిశేషమె యున్నది. సర్వశరీర పరివర్తన ద్వారమున నేమి భ్రమణముగా నుండును గావున భ్రమరియయినది.

౧౨. ద ం డ పా దా

కుర్వన్నూపురపాదోక్తం కుంచితం చరణం పునః ౧౦౦
దేహసమ్ముఖజాన్వగ్రక్రియా వేగాత్ప్రసారయేత్
యత్ర సా దండపాదేతి పండితైః పరికీర్తితా

౧౨. ద ం డ పా ద.

నూపురపాదికా చారీవిశేషములో నిరూపించిన కుంచిత చరణమును దేహమునకు సమ్ముఖమయిన జాన్వగ్రక్రియగా వేగ

మున ప్రసారిత మొనర్పవలెను. ఆ కుంచితపాదమును రెండవ పార్ష్ణిగతమగునట్లు చేసి అగ్రభాగమున ప్రసారితము చేయవలెను. వేగముగా ప్రసారయేత్. అప్పుడావిద్ధకరణముగా నది యుండును. ఆవిద్ధమయిన తన దేహమునకు సమ్ముఖముగా జానువుయొక్క యగ్రభాగక్రియ యుందుండును. ఊరు జాను జంఘా భాగములు స్తబ్ధము లగుటచే దండాకారమున నుండుట నిది దండపాదమను చారి యయినది. నూపురపాదమున నుండి పాదము నూర్ధ్వముగా ప్రసారము చేయవలెనని భావము. దీనినిట్లు పండితులు కీర్తించిరనుట దీని ప్రశస్తి.

## ౧౩. విద్యుద్భ్రాంతా

పృష్ఠతో వలితాశ్లిష్టపృష్ఠః పాదః ప్రసార్యతే
ఊర్ధ్వాధఃపార్శ్వదేశేషు భ్రాంతో మండలవద్యదా
కీర్తితేయం తదా విద్యుద్భ్రాంతా లక్ష్యేఽతిదుష్కరా ౧౦॥

## ౧౩. విద్యుద్భ్రాంత.

పృష్ఠభాగమున పాదము వలితమై పృష్ఠము ననుసరించి ప్రసారితమగునేని ఊర్ధ్వాధఃపార్శ్వములందు మండలవిధానమున భ్రమణము పొందునేని విద్యుద్భ్రాంత యను ఆకాశచారి యగును. ఇట్లు కీర్తిత మయిన యీ చారీవిశేషము లక్ష్యము లం దతిదుష్కరము. దీని ప్రదర్శనము సుకరము కాదు. పాదము పృష్ఠభాగమున వలితమగుటను ఊరుమూలము నుండియు వలితము కావలెనని కొందరనిరి. అభినవగుప్తుని ఉపాధ్యాయుడయిన భట్టతోతుడు ఇట్లు భావించెను. పృష్ఠతః — పార్శ్వభాగమునుండి పశ్చాద్భాగమున వలిత మొనరించి శిరఃసంశ్లేషద్వారమున ఊర్ధ్వాధఃపార్శ్వములందంతటను మండలాకారమున భ్రమిత మొనరించి ప్రసరింపజేసిన

విద్యుద్భ్రాంత యగును. అని ఇంతటిక్లేశముతో గూడుకొనిన యిది లక్ష్యమర్గభమని జాయపతి యంతటివ్యక్తియు భావింపవలసివచ్చినది.

### ౧౪. ఊ ర్ధ్వ జా ను ః

జాను స్తనసమం యావత్కుంచితం పాదముద్ధరేత్
యత్ర స్తబ్ధీకృతో౽న్యోంఘ్రిః ఊర్ధ్వజానురియం మతా

### ౧౪. ఊ ర్ధ్వ జా ను వు.

కుంచితమగు పాదమును జాను స్తనసమముగా పైకెత్త వలెను. రెండవపాదము స్తబ్ధీకృతము కావలెను. ద్వితీయపాదము క్రమస్తబ్ధమగుట యున్నది. ఆ పాదముత్క్షిప్తము కాగా దానికల్లు స్తబ్ధత కలుగునని భావము.

### ౧౫. ఉ ద్వృ త్తా

ఆవిద్ధం పదమన్యోరుక్షేత్రే పార్ష్ణి యథా భవేత్
భ్రాంత్వోత్పత్య యదా బాహ్యభ్రమర్యుత్పాతయేద్భువి
తదోద్వృత్తా మనోవర్తా లోకే భూచారపూర్వికా ౧౧౦

### ౧౫. ఉ ద్వృ త్త.

ఆవిద్ధమగు పాదమును ఇతరమగు ఊరుప్రదేశమున పార్ష్ణి భాగముండునట్లుగా భ్రమణము పొందునట్లుచేసి భ్రమకర మొనరించి దింపవలెను. అప్పుడది ఉద్వృత్తచారియగును. ఆవిద్ధచారీ సంబద్ధమయిన కుంచితపాదమును నిరూపించుటచే నీయుద్వృత్తచారి ఆవిద్ధచారీ శేషరూపమగుట సూచితమగును. "ఊర్ధ్వం వర్తమానత్వాదుద్వృత్తా" ఊర్ధ్వముగా నున్నందున నిది యుద్వృత్త యయినది. "మనోవర్త లోకే భూచారపూర్వికా" అను లక్షణము చివరి వాక్య

ములో నీ యుద్వృత్తచారికి నామాంతరము నిరూపితమగుచున్నది కాని యది స్పష్టమగుట లేదు.

౧౬. డోలాపాదా

ఉత్క్షిప్య కుంచితం పాదం పార్శ్వయోర్డోలయన్ క్షిపేత్
స్వపార్శ్వే పార్ష్ణినా యస్యాం డోలాపాదేతి సా స్మృతా

౧౬. డోలాపాదము.

కుంచితపాదమును ఉత్క్షేపించి పార్శ్వములందు కదలింపజేయుచు నుంచవలెను. పార్ష్ణిభాగముచే తన పార్శ్వమునందుంచవలెను. అపుడది డోలాపాదచారి యగును. కుంచితపాదమును దక్షిణభాగపర్యంతము స్వపార్శ్వమునకు దెచ్చి యచట దోలితమొనరింపవలెను. స్వపార్శ్వమున నూపవలెను. పిమ్మట స్వపార్శ్వమున నంచితముగా నుంచవలెను. ఇట్టిది డోలాపాదము.

ఇట్లీవిధముగా చారీవిశేషములు నిరూపితములయినవి. ఇవి యన్నియు లలితాంగక్రియారూపములు. కటీ జంఘోరుకర్మలకు నిరూపించిన వినియోగములె చారీవిశేషములకును వినియోగములు. అయినను కొన్ని వినియోగవిశేషములు కలవు. అవియన్నియు నితికర్తవ్యతా విశేషములు. ధనుః ప్రయోగమున వ్యజవిమోక్షణమున శస్త్రపాతమున వీని ప్రయోగింప వచ్చును. ఈ చారీవిధానములు కాయశోభాసంపాదకములు. వీనికింకను వ్యాపక వినియోగమున్నది. నాట్యప్రయోక్తలగువా రీవిశేషమును గుర్తింప వలెను. చారీవిధానములలో నంతట పాదప్రసారమె యున్నది. హస్తప్రసారము నిరూపితము కాలేదు. హస్తములు అగ్రగములయినను పృష్ఠగతములయినను ఆ యా సందర్భానుసారముగా నెట్లున్నను పాదములకు అనుగతములుగా నుండవలెను. అట్లుగా వానిని కూర్పవలెను.

“ఇదం తాత్పర్యం.” ఈ ప్రక్రియలలో నొకప్పుడు గతికి ప్రాధాన్యముండును. ఒకప్పుడు హస్త వ్యాపారమునకు ప్రాధాన్య ముండును. ఒకప్పుడు రెండిటికి ప్రాధాన్యముండును. గతిప్రాధాన్య మున్నప్పుడు హస్తములు పాదవిక్షేపమున కనుగతములుగా నుండును. తదనుసారులై యుండును. తత్పశ్చాద్భావులుగా పృష్ఠగతములుగా నుండును. హస్తవ్యాపారమునకు ప్రాధాన్య మున్నపుడు హస్త వ్యాపారానుసారముగా పాదములు పశ్చాద్భావమున ప్రసరింప వలెను. ఉభయ ప్రాధాన్యమున్నప్పుడు తుల్యకాలత వినియోగ పరతంత్రముగా వాని ప్రవృత్తియుండవలెను. ఇట్టి యీ రీతు లన్నియు ఔచిత్యా నుసారమున నుండవలయుట యుక్తము. అసలు కాయశోభా యోజనమునకై యీ యధ్యాయమున చారీవిశేషములు ప్రస్తుతములయినవి. అట్లు శరీరశోభా ప్రాధాన్య ముండునట్లుగా ప్రయోజనము కూర్పవలసియున్నది. అట్టి సంపత్తికై యిది యపేక్షితము. అభినవభారతీ గతమయిన యిట్టి విశిష్ట భావమును సావధానముగా సాభిమానముగా గుర్తించిన జాయపతి ఇట్లు తత్త్వమావిష్కరించుచున్నాడు.

పాదస్య ముఖ్యతా క్వాపి హస్తస్యాపి క్వచిద్భవేత్
ఉభయోః కుత్రచిదేయా యథాశోభం ప్రయోగతః
హస్తావవనతే స్యాతాం యదా పాదస్య ముఖ్యతా ౧౧౯
అగ్రగే స్తః స్వముఖ్యత్వే ద్వయోశ్చేత్సమగౌ పునః
యతశ్చారీప్రయోగేఽంఘ్రీ తతో హస్తౌ యతః కరః
తతస్త్రికం యతః తత్స్యాత్ నేత్రాద్యం యోజయేత్తతః
పాదచార్యాం కృతార్థో వా పాదో యాతి భువం యథా
హస్తః స్వకార్యనిష్పత్తౌ కటిమాశ్రయతే తథా ౧౨౦
హస్తః స్యాదర్ధచంద్రోఽత్ర నాట్యే నృత్తవిధౌ పునః

పక్షనంచితకౌ పక్షప్రద్యోతౌ వామతో సతాం
ఏతత్త్రయమపి బ్రూమో నృత్యే లక్ష్యనిరీక్షణాత్
అనంతేషు విభేదేషు గతీనాం లలితాత్మకాః
చార్యో ద్వాత్రింశదేవోక్తా మునినాన్వర్థసంజ్ఞికాః ౧౨౯

ఈ నిరూపితములయిన చారీవిధానములలో కొన్నిటియందు పాదప్రయోగమునకు ప్రాధాన్యమున్నది. కొన్నిటియందు హస్తమునకును ప్రాధాన్యము కలదు. కొన్నిస్థలములందు పాదహస్తములకు రెండింటికిని ప్రాధాన్యమున్నది. ఇట్లు ప్రాధాన్యముండుటను ప్రయోగానుసారమున యథా సుందరముగా గ్రహింపవలెను. ఇట్టి గ్రహణము సర్వము తత్సమయేచిత్యానుసారమున నుండును. హస్తము లవనతములుగా నుండునేని యప్పుడు పాదమునకు ముఖ్యత యుండును. అనగా పాదమునకు ముఖ్యతయున్నప్పుడు హస్తములవనతములుగా నుండవలెను. హస్తములకు ముఖ్యత్వముండునేని యప్పుడు హస్తములు అగ్రభాగగతము లగును. హస్తపాదములకు రెండింటికి ప్రాధాన్యముండునేని హస్తములు సమగతికలవి, అనుగతి కలవి కావలెను.

చారీప్రయోగమునందు పాద మెటుగా ప్రసరించునో అటుగా హస్తసంచారము ముండవలెను. హస్తమెటుగా ప్రసారము పొందునో అటుగా త్రికము ప్రవర్తింపవలెను. త్రికమెట్లు వర్తనము పొందునో అటుగా నేత్రాదు లుండవలెను. అట్లె యుపాంగాభినయము ను ఉండవలెను. "యతః పాదస్తతో హస్తః యతో హస్తస్తతస్త్రికం" పాదక్రియలలో హస్తగతి క్రియ యిట్లుండుట శరీరశోభ సంపాదించును. ఇట్లయినచో పాదక్రియ సమాప్తముకాగా హస్తక్రియయెట్లుండును? అప్పటి హస్తవార్త యేమి? ఇదిగో.

పాదచారీవిధానమున కృతార్థమయిన పాదము అనగా పాదచారి సమాప్తముకాగా పాదము భూగతముకాగా హస్తమును తనకార్యము నిష్పన్నము కాగా కటి నాశ్రియించియుండును. పాద సంచారసమయమున హస్తసంచారము పూర్తికాగా కటిదేశసమాశ్రయణమె సముచితము. నాట్యమునందుగాని నృత్తవిధిలో గాని హస్త మర్ధచంద్రముగా నుండవలెను. కేవల నృత్తమునందు హస్తములు వక్షువంచితకములు వక్షుప్రిద్యోతములు నై యుండుట యుక్తము. నాట్య సద్భావులంద రిట్లే గుర్తించిరి. లక్ష్య నిరీక్షణమున నృత్యమునందీ త్రితయము నుండునని మేమంఉదుము. చారీగతు లనంతవిధానముల నున్నవి. వాని నన్నిటి నిరూపించుట శక్యముకాదు. వానిలో లలితాభినయాత్మకములయిన చారీగతులు ముప్పదిరెండు మాత్రము నిరూపితములయినవి. ఇవి యన్నియు సార్థకనామములు. ఇవియన్నియు భరతముని సమ్మతములు. భరతుడు వీనినె నిరూపించినందున మేమును వీనినె నిరూపించితిమి.

చరితమివ సురాజ్ఞాం యుక్తదండాభిరామం
గిరిశమివ భుజంగత్రాసితాలోకనీయం
జలదమివ సవిద్యుద్భ్రాంతమశ్రాంతలక్ష్మ
వ్యరచయదిహ చారీలక్షణం జాయనార్యః

జాయనార్యుడిచట చారీలక్షణమును నిర్మించినాడు. ఈ చారీలక్షణము రాజులచరితమువలె శివునివలె జలదమువలె నున్నది. చరిత గిరిశ జలదములవలె చారీలక్షణ మున్నదనుటలో గుణక్రియారూపమయిన సమానధర్మములేదు. అభిన్న శబ్దాత్మకమయిన సాధర్మ్య మున్నది. దానినిట్లు గ్రహించవలెను.

యుక్తదండాభిరామ భుజంగత్రాసితాలోకనీయ సవిద్యుద్భ్రాంత శబ్దము లుపమానోపమేయముల కభిన్న శబ్దసాధర్మ్యము నివేదించునవిగా నున్నవి. ఆ పదముల వలన రెండర్థముల గ్రహించి ఉపమానోపమేయములందు సంగతపరచుకొన వలెను. రాజచరితము నందు యుక్తమగు దండవిధానముచే నభిరామతయున్నది. యుక్తదండత యనగా దండ్యదండనము, అదండ్యాదండనము. యుక్తదండముచే రాజచరిత మభిరామముగా నున్నదని భావము. చారీలక్షణము యుక్త—కూడుకొనిన. దండ—దండపాదమను చారిచే నభిరామముగా నున్నది. ఇట్లు ఒకే శబ్ద మటునిటు సంగతమై సమానధర్మమయినది. ఈ విధముగనె యితరములందును గ్రహింపవలెను. రెండవ పాదములో గిరిశచారీ లక్షణములకు సమానధర్మ సమర్పకముగా "భుజంగత్రాసితా లోకనీయం" అని యున్నది. శివుడు తాను ధరించిన భుజంగములచే త్రాసముపొందిన వారిచే నాలోకింపదగినవాడు. భుజంగత్రాసిత మను చారిచే లక్షణ మాలోకనీయము. మూడవపాదములో జలదము విద్యుద్భ్రమణములతో గూడినది. లక్షణము విద్యుద్భ్రాంతమను చారితోనున్నది. అశ్రాంతలక్ష్మి—శ్రాంతము కాని నిత్యముగానున్న లక్ష్మి కలది యనుట ఉపమానోపమేయముల కనుగామి యయినధర్మము. చారీ లక్షణారంభములో చారీనామముల కలయికతో శ్లోక మున్నది. ఇచట నట్టిశ్లోకమె యున్నది. ఇట్లు నిరూపించుటలోని వక్రిత రమ్యముగా నున్నది.

పాదచారీ ప్రసంగములో హస్తము లే విధముగ నుండవలెనో నిరూపిత మయినది. పాదచారి సమాప్తము కాగా పాదము భూగతము కాగా హస్తవిన్యాసరీతియు సూచితమయినది. పాదము ధరణీగతమై యుండగా కాయసన్నివేశ మెట్లుండవలెనో నిరూపింప

వలసి యున్నది. అప్పటి కాయసన్నివేశరీతి సూచనమునకై స్థానకములను జెప్పవలెను. చారీవిధానము లన్నియు లలితాంగ క్రియాత్మకము లనుట స్పష్టము. అంగములకు లలితత్వ మీ నియతచారీ విశేషములవలననె కలుగును. ఇవి యుత్థానము లైనను గతిప్రకార మట్లై లలితక్రియాత్మకముగా నుండును. ఇట్టి యీ విశేషమును నిరూపింపవలసి యున్నది.

## స్థా నా ని

ఆసా మాద్యంతభావార్థ మధునా స్థానముచ్యతే ౧౩౦
కరణాధారభావేషు స్థానశబ్దో నిరుచ్యతే
భావిగత్యనుకూలేన స్థానకేన హి కేనచిత్
స్థిత్వా గచ్ఛేత్తదంతేపి తిష్ఠేదిత్యత్ర కల్పన
ప్రయోగో న వినా యేన తస్మాదేతన్నిరూపయేత్
శరీరస్యాంగవిన్యాసవిశేషో భావయో [గతః] ౧౩౧
నేత్రయోః సహగః కోపి నిశ్చలః స్థాన ముచ్యతే

## స్థా న ము లు.

ఈ నిరూపితములయిన చారీవిశేషముల కాద్యంతభావ నిరూపణమునకై స్థానము నిరూపితమగును. చారులకు గతిరూపత్వముకలదు. గతికిని పూర్వగత్యనుకూలత, భావిగత్యనుకూలత యున్నది. ఆదిభావాత్మకమయిన పూర్వగతి, అంతభావాత్మకమయిన భావిగతి యీ యుభయసిద్ధికై స్థాననిరూపణ మావశ్యకము. స్థానపదము భావార్థమునందును కరణార్థము నందును అధికరణార్థము నందును ,ప్రయుక్తమగును. ఇట్లు నిరుక్తమయిన స్థానపదవ్యుత్పత్తి ననుసరించి కాయసన్నివేశములు నిరూపితములగును. భావిగత్యను

కూలమయిన యేదేనిస్థానకమున నుండి గమన మొనరింపవలెను. అట్టి గమనానంతరమున "త్రిష్ఠేత్" స్థితి ననుసరింపవలెను. ఇట్టి యీ విధానము ననుసరించియె స్థానకప్రయోగ మొనరింప వలసియున్నది. స్థానకము లేకున్న నిది యుపపన్నముకాదు. కావున స్థానకము నిరూపింపవలసియున్నది.

భావయోగానుసారమున శరీరమునకు సంబంధించిన అంగ విన్యాసవిశేషము స్థానపద వాచ్యమగును. నేత్రములకు సహాగమై యుండు సుందరమయిన అంగవిన్యాసము స్థానము. నిశ్చితమగు భావసంబంధమున నిశ్చలమగు నేత్రవిధానమున నంగవిన్యాస ముండుట యని భావము. ఇట్టి స్థానములారు కలవు.

వైష్ణవం సమపాదాఖ్యం వైశాఖం మండలాభిధం
ఆలీఢసంజ్ఞితం ప్రత్యాలీఢాఖ్యం చేతి షణ్ణృణాం

మానవులకు సంబంధించిన స్థానకము లారు కలవు. వైష్ణవము—సమపాదము — వైశాఖము — మండలము—ఆలీఢము—ప్రత్యాలీఢము. అని ఆ యా నామసంకేతముల వలననె వీని స్వరూపము కొంతగా విశదమయినను విస్పష్టముగా నిర్దేశించుట యావశ్యకము. ఇవి యన్నియు సర్వశస్త్రవిమోక్షణము లందుపయుక్తము లగును. ఇట్లనుట సర్వస్థానకములకును సాధారణమయిన వినియోగ మని గ్రాహ్యము.

## ౧. వైష్ణవస్థానకం

ఏకః పాదః సమో యత్ర త్ర్యశ్రః పార్శ్వముఖోఽపరః
అనయోరంతరం సార్ధతాలద్వితయసంజ్ఞకం ౧౪౦
జంఘాయామంచితం కించిత్సౌష్ఠవేనోపశోభితం
వైష్ణవం స్థానకం యస్మాద్విష్ణురత్రాధిదైవతం

అనేనాభినయో విష్ణోః నరయోః శ్రేష్ఠమధ్యయోః
కర్తవ్యః సూత్రధారాదౌ సంలాపోపి స్వభావజః

## ౧. వైష్ణవస్థానకము.

ఈ స్థానకమునకు విష్ణువధిదైవతము. కావున వైష్ణవము. విష్ణుప్రయోగమున నీ స్థానకముండును. అట్టివాని ప్రయోగమున నుండు స్త్రీప్రధానత యుండని సూత్రధారాదుల ప్రయోగమున నిది యుండును. ఇట్లే యీ స్థానకముల వినియోగ విధానము నితరము లందును గుర్తింపవలెను.

ఈ వైష్ణవస్థానకమునందు ఒక పాదము సమముగానుండును. రెండవపాదము త్ర్యశ్రమై పార్శ్వముఖముగా నుండును. ఈ రెండు పాదముల విన్యాసమున సార్ధతాళద్వయము వ్యవధానముండవలెను. జంఘావిన్యాసమున నిది సౌష్ఠవముతో కూడినదై కించిదంచితమై యుండవలెను. ఇందు విష్ణువధిదైవతమయిన నిది వైష్ణవస్థానకమగును. ఇట్టి వైష్ణవస్థానకముచే విష్ణువుయొక్క యభినయము కూర్పవలెను. శ్రేష్ఠమానవుని యభినయము మధ్యమమానవుని యభినయమును దీనిచేనగును. సూత్రధారాదుల ప్రయోగమునందును ఇది యుక్తము. ఇందు స్వభావజమయిన సంలాపముండును.

దీనిలో జంఘాభాగ మంచితమగుట యనగా జానునమనము వలన కొంతకుటిలమగుట యని భావము. "సౌష్ఠవాంగపురస్కృతం" అని నాట్యవేదము. సౌష్ఠవమున నంగ మెట్లుండ వలయునో అట్టి విధానమున నిది పురస్కృతము ప్రశస్తము కావలెను. సౌష్ఠవమప్రధానమయినచో నంగపురస్కృత మగుట ప్రధానము. నానా కార్యాంతరోపేతులయిన ఉత్తమ మధ్యమ మానవులు ఇందు స్వభావసహజ సల్లాపమొనర్చుట యుక్తము.

ఈ వైష్ణవస్థానకమునకు సంబంధించిన స్వరూపవిశేషములు వినియోగవిశేషములు వివిధముగానున్నవి. ఉరము సమున్నతముగా నుండుట, పాదశీర్షములు సమముగా నుండుట, ఉరఃస్థానముకన్న చిబుకము చతురంగుల వ్యవధానమున నుండుట, కటకముకాని త్రిపతాకముకాని నాభీగతముగా నుండుట మొదలగు విశేషము లిందుగలవు. చక్రమోక్షణము, ధనుర్ధారణము, దైర్ఘ్యదత్తాంగలీలావిశేషములు మొదలగు వానిలో నిది ప్రయోజ్యము. ఇదియె కొంత విపర్యస్తమయినచో ప్రణయక్రోధమున ప్రణయోద్వేగమున శంకానూయాదులలో వినియుక్తమగుటను నాట్యవిదులు భావించిరి.

## ౨. సమపాదం

తాలమాత్రాంతరౌ స్యాతాం స్వభావాచ్చరణే సమే ౧౪౫
సౌష్ఠవం సహజం యత్ర సమపాదం తదుచ్యతే
విమాన స్యందనాకాశ వ్రతలింగ స్థితేషు తత్
వివాహ పక్షి నిర్దేశే విప్ర మంగల వాచనే
అధిదైవతమేతస్య కీర్తితః కమలాసనః

## ౨. సమపాదము.

ఈ స్థానకమునందు స్వభావానుసారమున నుండు చరణములు సమముగానుండును. స్వభావమనుట అన్యావేశితవిధానమున నుండుట యని భావము. చరణముల విన్యాసము తాలమాత్రాంతరముగా నుండును. సహజమగు సౌష్ఠవ ముండును. ఇట్లున్నచో నది సమపాదస్థానకమగును. విమానమున నున్నవారలకు స్యందనారూఢులకు ఆకాశగతులకు వ్రతస్థులకు లింగస్థులు—శైవాదులకు నీ సమపాదస్థాన ముచితము వారి విషయమున నీ స్థానక ముపయోజ్య

మగును. వివాహకౌతుకనిర్దేశమున పత్నుల రూపణమున విప్రమం గళ వాచనమున దీని వినియోగింపదగును. విప్రులాచరించు మంగ ళాశీర్వచనాదుల స్వీకారమాశించునప్పుడిది వినియుక్తమగును. బ్రహ్మ యీ స్థానకమునకు అధిదైవతమని తద్విదులు గుర్తించిరి.

౩. వై శా ఖ స్థా న కం

సార్ధతాలత్రితయవత్ త్ర్యశ్రపక్షస్థపాదయోః ౧౩౦
అంతరం స్యాద్వ్యవస్థేయం ఊర్వోరపి నిషణ్ణయోః
యస్మిన్వైశాఖమాఖ్యాతం తద్విశాఖాధిదైవతం
వ్యాయామే నిర్గమే స్థూలభంగే వాహనవాహనే

౩. వై శా ఖ స్థా న క ము.

ఇందు పాదములు రెండును త్ర్యశ్రములు పక్షస్థితములు కావలెను. ఊరువులు నిశ్చలములుగా నుండవలెను. సూచీవిధానమున కన్న నివి యచలములై విశ్రాంతములుగా నుండవలెను. సార్ధతాల త్రయ మూరువులకు పాదములకు అంతరము వ్యవస్థితము కావలెను. మూడున్నర తాలముల కాలస్థితి యావశ్యకము. ఇట్టిస్థితి వైశాఖ స్థానముగా ప్రఖ్యాత మయినది. ఇందు విశాఖ దేవుడు స్కందస్వామి కుమారస్వామి అధిదైవతముగా నుండు నందురు. వ్యాయామమున నిర్గమమున స్థూలభంగమున వాహనముల వహనమున నిది వినియుక్త మగును. అశ్వముల వాహనము దీనిచే నగునని పెద్దలందురు. యుద్ధా దులలో వ్యాప్యాంగములకు వేగాదానపార్ష్ణి చోదనాక్రమమున నిర్గ మన ముండును. ప్రయోక్తలు వైశాఖస్థానమును రేచకములలో ననుసరించుట యుక్తము.

## ౪. మండలస్థానం.

త్ర్యశ్రౌ పార్శ్వముఖే పాదౌ చతుస్తాలాంతరాన్వితౌ
నిషణ్ణోరూ కటీ యత్ర జాయేతే జానునోస్సమౌ ౧౫౫
బుధైర్మండలమాఖ్యాతం తదాఖండలదైవతం
ప్రయోగే చాపవజ్రాదేః స్కంధే సింధురవాహనే
గరుడాదిమహాపక్షిణాం చ నిరూపణే

## ౪. మండలస్థానము.

ఈ మండల మైంద్రిమండల మనియు స్థానవిదుల వ్యవహారము. వైశాఖస్థానమునందువలె నిందును పాదములు త్ర్యశ్రములు పార్శ్వములు— పక్షస్థితములు నగును. నిషణ్ణోరుత్వమందువలె నిందున్నది. పాదములు చతుస్తాలాంతరమున నుండుట యిందు విశేషము. కటిజానువులు సమానముగా నుండుట విశేషము. ఇట్టిదిది మండలము అని సమాఖ్యాత మయినది. ఇది యాఖండలదైవతము. మండలేశ్వరవిషయముగా నుండును. కావున మండలమనుట సంగతముగా నున్నది. చాపవజ్రాదుల ప్రయోగమున నిది వినియుక్తమగును. స్కంధమున సింధురముల వహించుటలో నిది యావశ్యకము. అశ్వముల వహించుటలో వైశాఖముపయుక్తము కాగా, అశ్వములకన్న స్థూలములయిన సింధురములను గజములను వహించుటలో నిది యుపయుక్తమగును. సింధురముల కన్నను స్థూలతమములయిన గరుడాది మహాపక్షుల నిరూపణమున మండలముపకారియని పరిగ్రాహ్యము.

## ౫. ఆలీఢస్థానం

వామః పాదో నిషణ్ణోఽత్ర కుంచితో జానునా పునః
తేన తుల్యే కటీపృష్ఠే త్ర్యశ్రః సవ్యః ప్రసారితః ౧౬౦

పంచతాలమిత స్తిష్ఠన్నయోః పార్శ్వగుల్ఫయోః
ఆలీఢమిదమాఖ్యాతం రుద్రస్తస్యాధిదైవతం
ఉత్తరోత్తరతో జల్పే రోషామర్షసముద్భవే
వీరరౌద్రకృతే మల్లాస్ఫోటే రిపునిరూపణే
తదభిద్రవణే శత్రుమోచనే చేదముచ్యతే ౧౬౫

## ౫. ఆ లీ ఢ స్థా న ము.

ఈ స్థానమునందు వామపాదము నిషణ్ణమై జానువుతో కుంచితమై యుండును కటీపృష్ఠము లావిధమునను సమముగా నుండును. దక్షిణపాదము త్ర్యశ్రమై ప్రసారితమగును. పాదగుల్ఫము లందు పంచతాలమితముగా నుండును. ఇట్లున్న నిది ఆలీఢస్థానము మండలస్థానము నందువలె నిందును ఊరువులు నిషణ్ణములగుట పాదము త్ర్యశ్రయముగానుండుట సమానము. దక్షిణపాదము పంచ తాలమితముగా ప్రసారితమగుట యిందు విశేషము. "ఆసమంతాత్ స్పృష్టాభూమిర్యేన ఇతి ఆలీఢం" అని దీని వ్యుత్పత్తి. ఇందలి పాదముచే భూమి యంతట స్పృష్టమగును. గావున నిది యాలీఢమనుట యుక్తము.

ఈ ఆలీఢపాదమునకు రుద్రదేవుడధిదైవతము ఉత్తరోత్త రాధికముగా జల్ప మొనరించుటలో నిది వినియుక్తమగును. ఆ జల్పము రోషామర్షసముత్పన్నమయినదిగా నుండుట గ్రాహ్యము. వీరరౌద్రీకృతమయిన మల్లాస్ఫోటములో రిపునిరూపణములో రిపువు నెదుర్కొనుటలో శత్రుమోచనములో నిది ప్రయోగార్హము.

## ౬. ప్ర త్యా లీ ఢః

ఆస్యైవాంగః పరీవర్తే ప్రత్యాలీఢం ప్రకీర్తితం
విముంచేదమునా శస్త్రం సర్వమాలీఢసంహితం
ఆలీఢస్యైవ భేదత్వాద్రుద్రోఽప్యస్యాప్యధిదైవతం

## ౬. ప్రత్యాలీఢము.

ఆలీఢస్థానాంగమె ప్రత్యాలీఢము. ఆలీఢమునకు పరివర్త మున్నచో ప్రత్యాలీఢమందురు. ఆలీఢస్థానమున సంహితమగుశస్త్ర మును ఈ ప్రత్యాలీఢస్థానమున విడువవలెను. ప్రత్యాలీఢమాలీఢ భేదమె యయినందున ప్రత్యాలీఢమునకును అధిదైవతము రుద్ర దేవుడె. దక్షిణపాదమును కుంచిత మొనరించుట వామపాదమును ప్రసారిత మొనరించుట యను నంశము నిరూపితప్రాయమయినను ఇతికర్తవ్యతను స్పష్టమొనరించుట కది యుక్తమగును. కుంచితత్వము ప్రసారణవిపరీతమగునట్లుగా మరల ఉత్తానాకుంచితముగా నొనర్పగా సిద్ధమగును.

ఉపక్రాంతార్థమున కవిరుద్ధముగా స్థానషట్కము నిరూపిత మయినది. ఆ యా స్థానస్థితులై ప్రయోక్తలు శస్త్రవిమోక్ష మొనరింప వలెనని నిరూపితముకదా! అట్టి విమోక్షణమునకు వ్యాయామాది విధానాదు లావశ్యకములు. కావున పరిశేషరూపము లని నిరూపింపవలసి యున్నది. శస్త్రమోచనగోచరములగువానిలో న్యాయములు ప్రవిచారములు ప్రస్తుతము ప్రతిపాదింపదగి యున్నవి.

న్యాయాః

శస్త్రాణాం మోచనే న్యాయాః చత్వారః కథితా బుధైః
రణే స్వపరశస్త్రాణాం కర్తుం పాతనసారణే ౨౩౦
ఉచితా వర్తనాంగానాం న్యాయోఽత్ర పరికీర్తితః
భారతః సాత్వతో వార్షగణ్యః కైశిక ఇత్యమీ
క్రమాన్న్యాయాః కటీ పాద వక్షో మూర్ధ్నాం విభేదనే

న్యాయములు.

ప్రయోక్తలు నానాశస్త్ర విమోక్షమొనరింప వలెనని నిరూపితము. శస్త్రమోక్షణమున నాలుగురీతులు కలవనినారు.

వానికి న్యాయములనిపేరు. యుద్ధమున స్వపరశస్త్రములకు పాతన సారణము లొనరించుటకునై సముచితమైన యంగముల వర్తనమును న్యాయము అందురు. ఔచిత్యముతో కూడుకొనిన అంగవర్తన మున్నందున, న్యాయము ననుసరించియె సంగ్రామకర్మ లుండుటను న్యాయములు ప్రవర్తితములయినవి. ఇట్టి న్యాయములివి నాలుగు కలవు. భారతము — సాత్వతము — వార్షగణ్యము — కైశికము. అని ఈ నాలుగు న్యాయములు క్రమముగా కటీ పాద వక్షో మూర్ధ ముల విభేదనమున నుపయోగింపవలెను. ఇటుపై భారతాదిన్యాయ ముల స్వరూపము నిట్లు గ్రహింపదగును.

### ౧. భారతం

ఖేటం వామేన హస్తేన పరశస్త్రనివారణం
ధృత్వా శస్త్రం తదాన్యేన ప్రసార్యేతే పునః పునః ౧౭౯
ఆక్షిప్య భ్రామయేత్పశ్చాత్పార్శ్వాత్పార్శ్వం తతః పరం
ధృతశస్త్రేణ హస్తేన మస్తకం పరివేష్టయేత్
మణిబంధవివర్తేన కపోలప్రాంతయోః పునః
కుర్యాదుద్వేష్టనం భూయో మస్తకం పరివేష్టయేత్
లలితే వేష్టనే ద్వాభ్యాం యత్రాసౌ భారతః స్మృతః ౧౮౦

### ౧. భారతము.

భారతన్యాయమున నీ విధానముండును. వామహస్తమున ఖేటమును ధరించి పరప్రయుక్తములయిన శస్త్రముల నివారింప వలెను. దక్షిణహస్తమున శస్త్రము ధరింపవలెను. జళిపించి ప్రసా రితము చేయవలెను. ఖేటశస్త్రములు రెండును పునః పునః ప్రసారిత ములు కావలెను. జళిపించుట ప్రసారితము చేయుటల యనంతరము పార్శ్వమునుండి పార్శ్వమునకు అటు నిటు వేగముగా త్రిప్పవలెను.

శస్త్రముధరించిన హస్తమున తలచుట్టును పరివేష్టిత మొనరింప వలెను. కరముల ప్రసారించుట మరల నాకర్షించుట ఖేటకము భ్రమింపజేయుట పార్శ్వమునుండి పార్శ్వమునకు త్రిప్పుట కపోలాంతరమున శస్త్రోత్క్షిప్తనము శస్త్రమున శిరఃపరిగమము లలితోద్వేష్టనము కల శస్త్రహస్తమున శిరఃపరిగమము ఖేటమున శిరఃపరిగమము అనునివి భారతన్యాయమున ప్రచారములు. శిరఃపరిగమము — శిరము చుట్టు పరివేష్టనమున నమన మొనరించుట యని భావము.

౨. సాత్వతం ౩. వార్షగణ్యం ౪. కైశికం

సాత్త్వతే సర్వమేతత్స్యాత్ కరశస్త్రం తు పృష్ఠతః
వార్షగణ్యే తథా కుర్యాత్ప్రక్రియాం సాత్త్వతే యథా
ఉద్వేష్టనం తు శస్త్రేణ వక్షస్యంగేషు చ స్మృతం
కైశికే ప్రవిచారస్తు సర్వో భారతవన్మతః
భ్రామయిత్వా ద్విషన్మూర్ధ్ని శస్త్రం తావన్నిపాతయేత్ ॥౧౩॥

౨. సాత్వత. ౩. వార్షగణ్య ౪. కైశికములు.

సాత్వతన్యాయమునందు భారతన్యాయమున నిరూపించిన వన్నియు నుండును. కాని శస్త్రఖేటములకు సంబంధించిన ప్రవిచార పద్ధతిమాత్రము భారతమునందువలె నిందు పురోభాగమున నుండదు. పృష్ఠభాగమునందుండును. అనగా కరశస్త్రము పృష్ఠసంచారమున నుండును. వార్షగణ్యమునందు సాత్వతమునందువలె ప్రక్రియను గూర్పవలెను. ఈ విశేషము మాత్రమిందుండును. వార్షగణ్యమున వక్షోభాగమునందును అంగములందును శస్త్రముచే నుద్వేష్టన మొనరింపవలెను. శస్త్రఖేటములకు భ్రమణము నిందు నిహితము. శస్త్రముచే శిరఃపరిగమ మొనరింపవలెను. ఉరమునందును అంసభాగమునందును శస్త్రమునకుద్వేష్టన మావశ్యకము. కైశికన్యాయమునందు

భారతమునందలి ప్రవిచారమంతయు నుండదగును. శస్త్రమును భ్రమణ ముండునట్లు చేసి గిరగిర త్రిప్పి మూర్ధమున వేయవలెను. "శిరచ్ఛేద్యంతు కైశికే" భ్రమింపజేసి శత్రుమూర్ధమున శస్త్రము వేటువేయవలయును. భారతమున కటిచ్ఛేద్యము సాత్వతమున పాదచ్ఛేద్యము వార్షగణ్యమున వక్షశ్ఛేద్యము కైశికమున శిరశ్ఛేద్యము మొదట నిరూపితము కావున ఆ యా చ్ఛేద్యానుకూలముగా శస్త్రప్రవిచారమావశ్యకము.

ప్ర వి చా రాః

నానాచారీభవైః న్యాయైరమీభిరుపలక్షితాః
ప్రవిచారా భవంత్యత్ర శస్త్రమోచనగోచరాః
హస్తేనైకేన హస్తాభ్యాం ప్రయోజ్యమితి తద్ద్విధా
తత్రాద్యం ఖడ్గశక్త్యాది ధనుఃకుంతాదికం పరం
ప్రకృష్టత్వాద్విశిష్టత్వాదన్వర్థా తద్గతాభిదా ౧౮౦
రంగే ప్రహరణైః భేదచ్ఛేదశోణితవిస్మృతిః
వ్యక్తఘాతశ్చ నో కార్యః చిత్తోద్వేగకరం చ యత్
కార్యం వాభినయైరేవ భేదనాద్యం విధానతః
దర్శనాదేవ జానాతి యేన సామాజికో జనః

ప్ర వి చా ర ము లు.

నానావిధములగు చారీవిశేషములచే సముత్పన్నములయిన న్యాయములతో ప్రవిచారములు కూడియుండును. ఈ న్యాయోపలక్షితములయిన ప్రవిచారములు శస్త్రమోచనములందు గోచరించును. "ప్రవిచారాః ప్రయోక్తవ్యా నానాశస్త్రవిమోక్షణే" అని నాట్యవేద వచనము. నానాశస్త్రవిమోక్షణమున ప్రవిచారములను ప్రయోగింపవలెను. శస్త్రమోక్షణవిషయములయిన ప్రవిచారములు ప్రకృ

ష్టములు విచిత్రములు నయిన గతివిశేషములు. ఇవి యన్నియు చారీరూపముగా వ్యాయామాత్మకముగా ఖండమండలాత్మకముగా నొనరింపదగియున్నవి. ఒకహస్తముతో ప్రయోగించుటయు రెండు హస్తములతో ప్రయోగించుటయు నిందుండును. ఖడ్గము శక్తి మొదలగువానిని ఒక హస్తమున ప్రయోగించుట ప్రసిద్ధము. ధనుఃకుంతాదికములను రెండుహస్తములచే ప్రయోగింతురు. వామ హస్తమున ఖేటమునుబట్టి దక్షిణహస్తమున శస్త్రమునుబట్టి రెండు హస్తములనుచాచి లాగి ప్రయోగించుటలో ప్రవిచారముండుట యిదివరలో నిరూపితమయినది. పరిక్లృప్తము విశిష్టము నయినందున ప్రవిచారనామ మన్వర్థముగానున్నది. భారతసాత్త్వత వార్షగణ్య కైశిక న్యాయములలో శస్త్రమోక్షణవిధానమున ప్రవిచార ముండ వలయుట సూచితము. భారతన్యాయము నందలి పరివిచారము సాత్వతాదులలో నుండుట పరిసిద్ధము. వార్షగణ్యము ఆరుభటీ విధానమున నుండుటయు ప్రసిద్ధము.

ఇట్లు పరివిచారసమాలోచనమున విచారణీయము లింకను గలవు. యుద్ధప్రసంగము కావున ఛేద్యభేద్యము లన్నియు ప్రయోజ్యము లనిపించవచ్చును. ఇవి రంగపరియోజ్యము లగుటలో నియమ మున్నది. ఆ నియమపాలన మావశ్యకము. రంగమునందు పరిహారణ మొనరించినచో శిరము భిన్నమగును. దేహము గాయమగును. క్షత మగును. రక్తము స్రవించును. ఇది రంగనిషిద్ధము. నాట్యవిరుద్ధము. కావున వ్యక్తఘాత మొనరింపరాదు. చిత్తోద్వేగకర మగు రీతి ననుసరింపరాదు. ఛేదనచ్ఛేదనాదికముల నన్నిటిని అభినయముల విధానానుసారమున నొనర్పవలెను. అప్పుడు దర్శనమున నె సామాజికులు సర్వము గుర్తించువారు కాగలరు. "వీరు యుద్ధ మొనరించుచున్నారు" అని యితరులు తలచునట్లుగా "వీరిట్లున్నారు"

అని భావించునట్లుగా రంగవిధానములను అనుసరింపవలెను. ఇట్టి విషయమును నటులు భావించి నాటకాదులలో సంజ్ఞామాత్రమున సర్వము సాధింపవచ్చును. అపుడనౌచిత్యము కలుగదు. అభినయ విధానానుసారమున ఛేద్యాదుల నభినయసముపేతము లగునట్లు పరిశీలించుటయె యుక్తము.

వ్యాయామనిర్వర్తనం. ౧౮౯

వ్యాయామం సౌష్ఠవోపేతై రంగహారై ర్మనోహరం
లయతాలసమాయుక్తం కారయేత యథాబలం
సుతరాం సౌష్ఠవే యత్నః కార్యో వ్యాయామకారిభిః
సాధకస్తేన హీనాంగో నాట్యే నృత్తే న శోభతే
యత్ర నాంగమతీవోచ్చం నాతిఖర్వమచంచలం
విశ్రాంతావయవం లోలపాదం వక్షః సమున్నతం ౧౯౦
సమకంఠ కటీ శీర్ష కూర్పరాంసం ప్రయుజ్యతే
సౌష్ఠవం తత్సమాఖ్యాతం బుధై ర్వ్యాయామగోచరం

వ్యాయామనిర్వర్తనము.

చారీన్యాయస్థానవిశేషము లన్నిటను వ్యాయామావశ్యకత నిరూపితమయినది. సుకుమారముగా వ్యాయామ మొనరింపవలెను. దానివలన అవయవ సౌష్ఠవమేర్పడును. నాట్యమున సౌష్ఠవము పరమావశ్యకము. కావున నిచట వ్యాయామమును సౌష్ఠవమును నిరూపింపవలసియున్నది.

నటు లందరు వ్యాయామ మొనరింపవలెను. వారు వ్యాయామ మొనరించునట్లు చేయువలెను. ఈ వ్యాయామము సౌష్ఠవముతో కూడుకొనిన అంగహారములతో మనోహరముగా హారముగా నుండవలెను. లయ తాళ సమాయుక్తముగా వ్యాయామ ముండుట

యుక్తము. ఇట్టి వ్యాయామము బలమునకు మించియుండరాదు. యథాబలముగా నుండవలెను. వ్యాయామ మొనరించువారు సౌష్ఠవమున మిక్కిలి యత్నము స్వీకరింపవలెను. సాధకునకు సుతరాం సౌష్ఠవమున యత్న మావశ్యకము. సౌష్ఠవము కలవాడె నాట్యమున నృత్తమున శోభించును. హీనాంగుడు నాట్యమున శోభింపడు. నృత్తమున శోభింపడు. ఎందును శోభింపడు. అంగ మత్యంతము మున్నతముగా నుండరాదు. అతిఖర్వముగా నుండరాదు. మరియు ఘొట్టిగుజ్జు కారాదు. అంగ మచంచలముగా నుండవలెను. విశ్రాంతావయవముగా విభక్తావయవముగా నుండవలెను. ఏయంగ మెంతగా నుండవలెనో యంతగానె యుండవలెను. లోలపాదముగా నుండవలెను. వక్షము సమున్నతముగా నుండవలెను. కంఠకటీశీర్షకూర్పరాంసములు సముచిత విన్యాసశోభతో నుండవలెను. ఇట్లంగసౌష్ఠవముండి ప్రయోగించుట యుక్తము. వ్యాయామగోచరమగు నిట్టి విధానమును సౌష్ఠవమందురు. అంగసౌష్ఠవసిద్ధికై పరికరమావశ్యకము. అంగయోగ్యకాలానుసారముగా అంగశిక్షారీతి యుక్తము. వర్తనా క్రమయోజితమయిన సౌష్ఠవము నాశ్రయించి సర్వశోభ యుండుననుట సర్వసమ్మతము స్వవిశ్రాంతిపరిణతమయిన సౌష్ఠవము సంపాదించుటకు మధ్యమోత్తము లాదరమున యత్న మాచరింపవలెను. అధములగువారు వారిభావమున వారుందురు. ఉత్తమమధ్యములట్లుకాదు. వారల కవధానమావశ్యకము.

చతుర్భిరథవాష్టాభిరథ ద్వాదశభిర్మతా
జానువంక్షణ సన్నామాత్త్వంగులైః ఖర్వతా మతా
ఇచ్ఛయా భూమిపాలానాం తత్తద్దేశానుసారతః ౧౯౪
అతః పరం తు ఖర్వత్వం పరం నృత్తే న శోభతే

అంగసౌష్ఠవ సంపాదనమునకై పొట్టిగానుండకుండుట సూచితమయినది. "నాతిఖర్వం" అత్యంతము ఖర్వముగా నుండ రాదు. అనగా కొంతఖర్వముగా నుండవచ్చును. జాను వంక్షణాన మనము వలన ఖర్వతకలుగును. జానువు — మోకాలు. వంక్షణము — ఊరువులసంధి. మోకాలువంచుట ఊరువులువిడదీసి నిలబడుటలూ వానినమనములు. జానువక్షణనమనమున ఖర్వతకలుగును. ఇట్టిఖర్వత యెంతగానుండవచ్చును? ఇంతగానుండవచ్చును. నాలుగంగులముల ఖర్వత, ఎనిమిదియంగులములఖర్వత, పండ్రెండంగులములఖర్వత యుండవచ్చును. ఇందు ద్వాదశాంగులఖర్వత యంతగా నభినంద నీయముకాదు. చతురంగులఖర్వత అష్టాంగులఖర్వత తగును. మిక్కిలి పొడవుగా నుండునర్తకియయినచో ద్వాదశాంగులఖర్వత యుండ వచ్చును. పొట్టిగా నుండునర్తకి చతురంగులఖర్వతకలది కావచ్చును.

ప్రయోక్తలయిన భూమిపాలుర యిచ్ఛానుసారమున తత్తద్దేశానుసారమున నీ చెప్పినఖర్వతయే తగును కాని యింతకన్న నధికముగాఖర్వత యుండుట యుక్తముకాదు. అట్టిది నృత్తమున శోభింపదు.

ఈ గ్రంథముననే నాల్గవ యధ్యాయమున నీ ప్రసక్తి రాగా త్రివిధ ఖర్వతను గుర్తింపవలెనని జాయపతి యని "అంగు లైరిహ నర్తక్యా జానువంక్షణనామనాత్" నర్తకి యొక్క జాను వంక్షణ నామనము వలన చతురంగులములచే అష్టాంగులములచే ద్వాదశాంగులములచే ఖర్వత త్రివిధమగుట నిరూపించెను. ఇంత కన్న నధికఖర్వత శోభింపదనియు ననెను.

### చతురశ్రలక్షణం

వైష్ణవం స్థానకం యత్ర సమున్నతమురః స్థలం

కటినాభిచరౌ హస్తౌ యుగపత్క్రమశోఽథవా
చతురశ్రమిదం ప్రోక్తమంగం నేత్రసుఖావహం

చతురశ్రలక్షణము.

ఇంతవరకు నిరూపితమయిన సౌష్ఠవము సర్వమును శరీరమునకు శోభను సంపాదించును. అది నేత్రసుఖావహము. చతురశ్రవిధానమునకు సౌష్ఠవము తగియుండవలెను. చాతురశ్ర్యమునకే సౌష్ఠవమావశ్యకము. ఈ చాతురశ్ర్యము సర్వసామాన్యభూతము. సంపూర్ణమయిన శోభయుండుట చాతురశ్ర్యసంపత్తి. ఎందు వైష్ణవస్థానకముండునో ఎందుఉరఃస్థలము సమున్నతమై యుండునో ఎందుహస్తములు కటి నాభి చరములై యుండునో అది చతురశ్రమగును. హస్తములు కటినాభిచరములుగా నుండుటయును నదియొగపద్యముగా వచ్చును. క్రమముననుగావచ్చును. పైని చెప్పినవిధముగా నున్న చతురశ్రము నేత్రపర్వముగానుండుట నభిజ్ఞులుచెప్పిరి.

ధనుఃకరణం

అసియుద్ధే యథాన్యాయాః ధనుషః కరణం తథా ౨౦౦
పరిమార్జనమాదానం [సంధానం మోక్షణం తథా]
[ప్రమార్జనం పరామర్శః ఆదానం గ్రహణక్రియా
సంధానం శరవిన్యాసో విక్షేపో మోక్షణం భవేత్]

ధనుఃకరణము.

ఖడ్గయుద్ధమున న్యాయములున్నట్లుగా ధనుర్యుద్ధమునగూడ కొన్నికర్మలున్నవి. అవి యిందు నిర్దిష్టములగును. యుద్ధమున న్యాయములున్నట్లు ధనువునకు సంబంధించిన కరణముకలదు. ఆ కరణము నాలుగువిధములు. పరిమార్జనము — ఆదానము — సంధానము — మోక్షణము నని ఈ చతుర్విధ కరణమును ధనువునకు

కూర్పవలెను. తద్విధానమున ప్రయోగింపవలెను. మొదట ధనుస్సునకు మార్జనము పిమ్మట బాణమున పట్టుట పిమ్మట శరసంధానము అనంతరము మోక్షము — ప్రమార్జనమనునది ధనుఃపరామర్శము. ఆదానమనునది గ్రహణక్రియ. ధనుస్సు నెట్లు పట్టుకొనవలయునో యట్లు పట్టుట సంధానమనునది ధనువునందు శరవిన్యాసము. మోక్షణ మనునది బాణవిక్షేపము. ఇట్టి యీ నాలుగును ధనుఃకరణములు. ఇచట మొదటి శ్లోకము నాల్గవపాదమునుండి పాతమున్నది. నాట్యవేదానుసారమున నిది నిరూపిత మయినది.

ఆ స న వి ధిః

[అథాసనవిధిః కార్యః స్త్రీణాం నృణామథాపి చ
నానాభావసమాయుక్తః తథైవ శయనాశ్రయః]
[స్ఫిక్పార్ష్ణీనాం సమాయోగే]తదుత్కటముదాహృతం
దేవాదితర్పణే సంధ్యాజపహోమాదిషు స్మృతం
చిబుకం కర్కటే న్యస్య హస్తే స్కంధాశ్రితం శిరః
యత్రేంద్రియాణి ఖర్వాణి స్యుః తదోగకృతం స్మృతం
రణరంగపరాభూతే శోకవ్యాకులతాదిషు
క్రాంతమిత్యభిధామస్య కథయంత్యపరే పునః
ఆసనే ద్విగుణః పాదో మనాగన్యః ప్రసారితః
శిరోంచితతయా యత్ర కించిత్పార్శ్వముపాగతం
తత్స్యాచ్చింతాకృతం చింతావిప్రలంభమదాదిషు
అన్యైః పునస్సమాఖ్యాతం మదాలససమాఖ్యయా
భుజాలింగితయోః న్యస్య జానునోశ్చిబుకం యదా
పిండీకృత్య స్థితో దేహమవహిత్థం మతం తదా
అవహిత్థామయ వ్రీడా ధ్యాన నిద్రాదికేషు తత్

## ఆసనవిధి.

ఉపవేశనాత్మకమగు నాసనవిధి నిరూపించుట యిచట గ్రంథకృత్సమ్మతము. కాని ఆసనవిధానమును తద్భేదములను తన్నామములను సంకేతించు శ్లోకములు త్రుటితములయినవి. నాట్యవేదమున నివి స్పష్టముగ నున్నవి. తదాధారమున నిచటి యంశపూరణము సుకరము. ధనుఃకరణప్రసంగమున వీనిని జాయపతి నిబంధించుట యున్నది. భరతుడు ధనుఃప్రసంగమున జెప్పలేదు. గతిప్రచారప్రకరణమున నిరూపించెను. ఇది యుచితము నిరూపితము లయినను ఇచట భావసౌకర్యము సంపాదింపగలవు. ఈ యాసనవిధి యుపక్రమము నందువలె ఉపసంహారమునను శ్లోకములు త్రుటితములయినవి. వీనిని వానిని నాట్యవేదభావమున గుర్తింపవచ్చును.

స్త్రీలకును పురుషులకును ఆసనవిధి-ఉపవేశనవిధి నిరూపింపదగినది. ఇది నానాభావ సమాయుక్తమై యుండును. భక్తి చింతా శోక లజ్జాది భావము లిందభివ్యక్తములగును. స్థానాసనగతి శయనాదులు సంబంధము కలవియె కావున స్థానగతిప్రసంగములో ఉపవేశనా స్థాననిరూపణము యుక్తమె. ఇదియె ఆసనవిధానము. ఇవియన్నియు పూర్వపశ్చాద్భావమున నుండును. గతి నిరూపణమున శయనమును నిరూపణీయము. ఆసనవిధినిరూపణ మావశ్యకమయినట్లు శయనవిధి సమాశ్రయణమునను నిరూపణీయములున్నవి. ఆసనవిధిలో కొన్నిభేదములు కలవు. ఉత్కటము-యోగకృతము-చింతాకృతము-అవహిత్థము నను నాలుగుభేదము లిందు లక్షణవిని యోగములతో నిరూపితములయినవి. వీనిపేర్లు నాట్యవేదమున వేరుగానున్నవి. ఆ భిన్ననామములను జాయపతి సూచించెను. స్వస్తికము-మదాలసము-క్రాంతము-విష్కంభితము-ఉత్కటము-స్వస్థాలసము-జానుగతము-ముక్తజాను-విముక్తాకము నను తొమ్మిది

విధములు భరతాది సమ్మతములుగా నున్నవి. సంగీతరత్నాకర కారాదులు వీనిలో గొన్నిటికి నామాంతరములు చెప్పిరి.

ఇందు ఉత్కటనిరూపణముతో నారంభమున్నది. దీనితో నాలుగు దీనిలో నిర్దిష్టములయినవి. మిగులు వానిభావమును గ్రంథాంతరాధారమున నిర్దేశింపవలసియున్నది.

౧. ఉత్కటము : స్ఫిగ్భాగము పార్ష్ణిభాగములు కూడియుండునట్లు ప్రవేశన ముండునేని ఉత్కటము అను ఆసనవిధియగును. దీనిని దేవపితృఋషి తర్పణములందు సంధ్యాజపహోమాదులందు వినియోగింతురు. శ్రాద్ధాదులలో నిదియుండును. నివాపసలిలమున నిది యున్నది. ప్రతిగ్రహమునకై యితరునకు సలిలదానముచేయుటలో ఆ జలమును ప్రతిగ్రహించుటయందు నిదియుండును.

౨. యోగకృతము : కొందరు దీనికి క్రాంతము అను పేరు పెట్టిరి. చిబుకమును కర్కటహస్తమునం దుంచవలెను. శిరమును స్కంధాశ్రితముగా నుంచవలెను. ఇంద్రియములన్నియు ఖర్వములై యుండవలెను. ఖర్వము లనుట విషయగ్రహణాసమర్థములనిభావము. "సంప్రణష్టేంద్రియమనాః" ఇంద్రియములు మనస్సు ప్రణష్టప్రాయములుగా నుండవలయుట యభిమతము. ఇట్లున్నచో నది యోగకృతమయిన యాసనవిధి. రణరంగపరాభూతుడయిన వానికిది యావశ్యకము. ఇదియే క్రాంతము. దీనిని భరతుడు శోకాపవేశనమనెను. యోగకృతమను జాయపతిపేరు శోకకృతము శోకకృతమగునేమో !

౩. చింతాకృతము : ఇదియే మదాలసము. కూర్చొనుటలో నొకకాలు మడతవేసికొని యుండుట, రెండవపాదము కొంతగా ప్రసారితమైయుండుట, శిర మంచితమై 'కొంచెముగా పార్శ్వమును

పొందియుండుట యున్నచో నది చింతాకృతము అను ఆసనవిధి యగును. దీనిని చింతా విప్రలంభ మదాదులలో వినియోగింతురు.

౪. అవహిత్థము : మోకాళ్లను బాహువులతో నాలింగనము చేసికొనవలెను. ఆ జానువులందు చిబుకము నుంచవలెను. సర్వదేహ మును ముడుచుకొని యుండవలెను. ఇట్లున్న నిది అవహిత్థమగును. దీనిని ఆమయము—జబ్బుఉన్నపుడు వ్రీడకలిగినప్పుడు ధ్యాన నిద్రాది సమయములందును వినియోగింతురు.

ఇట్లు నాలుగాసనవిధులు మాత్రమె యిందున్నవి. మిగిలి నవి పాతము పొందినవి. స్వస్థము ఇందు లేనేలేదు. మదాలసము చింతాకృతమయినది. క్రాంతము యోగకృతమయినది.

విష్కంభితము : ఒకజానువును విస్తారితమొనరించి భూమియందు సాచివేయవలెను. రెండవజానువు యథాస్థితముగా నుండవలెను. ఇట్టిది విష్కంభితాసనము. దీనిని మూర్ఛా మద శ్రమ గ్లాని విషాద సమయములలో వినియోగింతురు. దీనిని ముక్తజానువనియు నందురు.

ఆసనవిధి వినిర్ణయములో భరతుని యీ భాగములను గుర్తించుట యుచితము.

భూమియందు జానువులను మోపియుంచి యధోముఖమున నున్న నది అధోముఖావస్థానము. దీనిని దేవాభిగమనమున వినియో గింతురు. కోపము పొందినవారిని బ్రతిమిలాడుటలో నుపయోగింతురు. శోకమున ఆక్రందనమున నిది యుపకారి. చనిపోయినవారి దర్శన మున నిది యుండును. నీచులగు జనులు శోకమున ఆక్రందన మొన రించు నప్పుడిది యుండునని పరిగ్రాహ్యము. నీచులు చనిపోయిన ప్రాణుల చూచునపుడీ యాసనమె యుండును. కుసత్వములయిన

నక్క మొదలగు వానిని బెదురగొట్టుసమయమున నీయాసన మావశ్యకము. నీచులు యాచన మొనరించునప్పుడు భూమిపై జానుద్వయము మోపుదురు. హోమయజ్ఞక్రియలో కర్మకరులకీ కర్మకూర్పవలెను. ఇట్టి యీ విధానమును జానుగతాసనమని విముక్తాసనమని గ్రహింపవచ్చును. అవహిత్థాసన మీ గ్రంథమునసున్నది. భరతుడాసనవిధానమున అవహిత్థము నిరూపింపలేదు.

## సుప్తస్థానాని

సమం ప్రసారితాభిఖ్యముద్వాహితవివర్తితే
నతమాకుంచితం చేతి స్థానం సుప్తస్య షడ్విధం ౨౨౦
కృత్వా వదనముత్తానం పాణిపాదం ప్రసార్య చేత్
శయీత సమమామ్నాతం స్వస్య సంవేశనే తదా
ఉపధానం భుజం కృత్వా ప్రసార్య యది జానునీ
సుప్యాత్ప్రసారితాభిఖ్యం తదా స్యాత్సుఖనిర్వృతే
స్కంధే మూర్ధానమాధాయ సుప్యాద్భూమిస్థకూర్పరః ౨౨౫
యస్మిన్నుద్వాహితం తత్స్యాత్ లీలయాశ్రితమాస్థితౌ
అధో వదనమాదాయ సంవిశేద్యత్ర తత్స్మృతం
వివర్తితాభిధం తత్స్యాత్ రోగశస్త్రాదిపీడితే
ప్రసృతహస్తద్వయో జంఘే ప్రసార్య చ మనాగ్యదా
నిద్రాయేన్నతముద్దిష్టం తదాలస్యశ్రమాదిషు ౨౩౦
ఆవిద్ధే జానునీ బిభ్రత్ వపుశ్చాకుంచితం యదా
సుప్యాదాకుంచితం ప్రోక్తం తదా శీతేన పీడితే

## సుప్తస్థానములు.

పురుషుల శయనసన్నివేశములిచట నిరూపితములు కానున్నవి. ఇవి యారు కలవు. సమము—ప్రసారితము—ఉద్వాహితము—

వివర్తితము—నతము—ఆకుంచితము నని ఈ యారువిధముల పురుష సుప్తస్థానముల లక్షణ మీా విధమున నున్నది.

౧. సమము : ముఖముత్తానముగా నుంచి వెల్లకిలగానుంచి కరపాదములను ప్రసారితములుగానుంచినచో నట్టి విధానమున శయనించియుండు సన్నివేశమునకు సమమనిపేరు.

౨. ప్రసారితము : తనభుజమునే తలదిండుగా నొనరించుకొని జానువులను చాచి ముఖముగా శయనించియుండుటను ప్రసారిత మందురు.

౩. ఉద్వాహితము : స్కంధమున శిరమునుంచి కూర్పరములను భూమియందె మోపి నిద్రించునపుడు సలీలావస్థానమున నుండగా ఉద్వాహితమగును.

౪. వివర్తితము : దిగువభాగమునకు వదనము చేర్చి శయనింపగా వివర్తితమగును. రోగపీడితులు శస్త్రాదిపీడితు లీ విధముగా శయనింతురు.

౫. నతము : రెండుహస్తములు వ్రేలాడునట్లుచేసి జంఘాభాగములను కొంతగా ప్రసారిత మొనరించి నిద్రించుటను నత మని వ్యవహరింతురు. ఇది అలసత్వమున నున్నప్పుడు శ్రమాదులతో నున్నప్పుడు వినియుక్తమగును.

౬. ఆకుంచితము : సంగతము లావిద్ధములయిన జంఘాభాగములు కూర్చుకొని శరీరము నాకుంచిత మొనరించుకొని శయనించినచో నది యాకుంచిత మగును. శీతపీడితుల విషయమున నిది వినియుక్తమగును.

## స్త్రీణాం స్థానాని

ఆయతాఖ్యావహిత్థాశ్వక్రాంతాని త్రీణి యోషితాం
స్థానాని మునినోక్తాని తేనైవాథాపి చేతి తు
బ్రువతాఽన్యాని కతిచిత్సూచితాని గతాగతం ౨౩౫
వలితం మోటితాభిఖ్యం వినివర్తితనామకం
ప్రోన్నతం చేతి సంభూయ స్యురష్టౌ తాని చక్ష్మహే

## స్త్రీ స్థానములు.

పురుషులకు సంబంధించిన సుస్థానములను నిరూపించిన పిమ్మట స్త్రీలస్థానము లిచట నిరూపితములగును. స్త్రీలకు సంబంధించిన గతులలో ఆభాషణాదులలో కొన్ని స్థానములు కలవు. నాట్యవేదములో భరతుడు స్త్రీ స్థానములను నిర్దేశించుచు;

"ఆయతం చావహిత్థంచ అశ్వక్రాంతమథాపిచ"

ఆయతము — అవహిత్థము — అశ్వక్రాంతము— అను మూడుస్థానములు కలవనెను. అట్లని "అథాపిచ"అని ప్రయోగించెను. అథాపి- అనంతరమును అనుటచే నింకను కొన్ని కలవని భరతుని భావ మూహింపవచ్చును. స్త్రీలకు మూడు స్థానములని ముని యని ఇంకను గొన్నిటిని సూచించెను. అట్టి సూచనానుసారమున ఇందు స్త్రీస్థానముల నిరూపణ ముండును.

గతాగతము — వలితము — మోటితము —
వినివర్తితము — ప్రోన్నతము —

అను నయిదు భరతసూచనానుసారమున సంగృహీతములుకాగా మొదట నిరూపితములయిన ఆయతావహిత్థాశ్వక్రాంతములు మూడు కూడుకొనగా స్త్రీస్థానములెనిమిది యయినవి. వాని లక్షణ వినియోగములిక నిరూపితములగును.

## ౧. ఆయతం

యత్ర పాదస్సమస్సవ్యః వామత్ర్యశ్రోన్నతో భవేత్
గుల్ఫపార్ష్ణ్యోః స్థితో మధ్యే తాలేనోరః సమున్నతం
ప్రసన్నో ముఖరాగః స్యాన్నితంబే పాణిరున్నతే ౨౪౦
అర్ధచంద్రో లతాహస్తో వామః తస్మతమాయతం
కాయస్యాయమనాదస్య దైవతం కమలాలయా
నిర్వర్ణనేషు చింతాయామావాహనవిసర్గయోః
ప్రవేశే రంగమధ్యస్య పుష్పాంజలివిమోచనే
గాంభీర్యప్రభవే మౌనే తర్జనాదావిదం భవేత్ ౨౪౨

## ౧. ఆయతము.

స్త్రీలకు సంబంధించిన యీ యాయతస్థానమున దక్షిణ పాదము సమముగా నుండుట, వామపాదము త్ర్యశ్రమున్నతమగుట, ఒక తాలమాత్రమున గుల్ఫపార్ష్ణిమధ్యనుండుట, ఉరము సమున్నతముగా నుండుట, ముఖరాగము ప్రసన్నముగా నుండుట, ఉన్నత నితంబమున అర్ధచంద్రహస్తము చేర్చియుండుట, వామహస్తము లతాహస్తముగా నుండుట ప్రసిద్ధము. దేహమాయమనముతో నుండుగావున ఆయతమను నామము యుక్తము. శ్రీకమలాలయా దేవి యీ యాయతమున కధిదైవతము. నిర్వర్ణనము — చింత — ఆవాహనము — విసర్గములలో నాయతము వినియుక్తమగును. రంగమధ్యమున ప్రవేశించునపుడు పుష్పాంజలి ప్రసరింపజేయునపుడు గాంభీర్యసముపజాతమయిన మౌనమునందు తర్జనాదులందు నీయాయతము ఉపయుక్తమగును. ఈ ఆయతస్థానకము స్త్రీలకె యుక్తమని కొందరనిరి. రంగావతరణారంభమున పురుషులకు నిది యనుసరణీయమని కొందరనిరి.

భరతగ్రంథమున నీ యాయతవిధి నిరూపణమున పాఠద్వయముకలదు. వామపాదమునకు స్వాభావస్థితి, దక్షమునకు తాలమాత్రాంతరమున త్ర్యశ్రముగా పక్షస్థితముగా నుండుట. ఆననప్రసన్నత వక్షస్సమత్వము హస్తములకు లతాకారమున నితంబస్థితి యుండునేని యది యాయతమని యొక పాఠార్థము. దక్షిణపాదము సమముగా నుండుట వామము పార్శ్వస్థితమగుట సమున్నతమగు కటి ఆయత స్థానకమున నుండునని రెండవపాఠమున్నది. ఈ రెండుపాఠముల యర్థమును జాయపతి స్వీకరించి ఆయతలక్షణము నిరూపించుట స్పష్టము.

కాళిదాసు మాలవికాగ్నిమిత్రమునందు మాలవిక రంగావతరణారంభమున పుష్పాంజలి విసర్జనవిధానమున నున్నస్థితిని కవి వర్ణించుచు—"వామంసంధిస్తిమితవలయం"— శ్లోకమున ఆయతస్థానమును నిరూపించినాడు. ఆ స్థానకములో ఆయతమొకాక అవహిత్థస్థాన లక్షణమును కూడియున్నట్లు సహృదయులు భావింతురు.

## ౨. అవహిత్థం

అన్య పాదకటీహస్త వ్యత్యాసా దవహిత్థకం
అన్వర్థమవహిత్థాఖ్యం భావసంసూచనాద్భవేత్
అధిదైవతమేతస్య దేవీ మహిషమర్దినీ
సల్లాపే సహజే తర్కే పరితోషే వినిశ్చయే
లజ్జాయాం సాంద్రసౌభాగ్యగర్వాదాత్మనిరూపణే ౨౩౦
వరస్యాగమనోత్కంఠావీక్షాదా విద మిష్యతే

## ౨. అవహిత్థము.

ఆయతస్థానమున నిర్దేశించినవాని వ్యత్యాసమున అవహిత్థస్థానమగును. పాదమునకు కటీభాగమునకు హస్తమునకువ్యత్యాస

ముండవలెను. లజ్జాత్మక భావ సంసూచనమున నిది యుండును. కావున అవహిత్థమనుట సార్థకము. వామపాదము సమముగానుం డుట దక్షిణపాదము త్ర్యశ్రిమై పక్షస్థితముగుట వామకటి సమున్నత ముగా నుండుట అవహిత్థస్వరూపము. ఈ స్థానమున మహిషమర్దినీ దేవి యధిదేవత. ఇది సల్లాపమున సహజతర్కమున పరితోషమున వినిశ్చయమున లజ్జాభావమున అతిశయిత సౌభాగ్య గర్వమున స్వాత్మ నిరూపణమున ప్రియుని సమాగమోత్కంఠా వీక్షణమున ఇంకనిట్టి వానిలో నిది వినియుక్తమగును. స్త్రీల విలాస బిబ్బోక లీలాశృంగా రమున నాత్మనిరూపణమున నుపయుక్తమగునని భావము.

### ౩. అశ్వక్రాంతం

అంచితం దక్షిణం పాదం యదా సూచీ సమాహ్వయా
సమస్థితస్య పాదస్య పార్ష్ణిభాగే వినిక్షిపేత్
యద్వా సమాస్థమేవాత్మపార్శ్వే పాదేన సమ్మితే
యత్రాశ్వక్రాంతమేతత్స్యాదే తేనాశ్వాధిరోహణాత్ ౨౫౫
పాదోఽత్రానియతః ప్రోక్తః కైశ్చిత్సంశయితాత్మభిః
అంచితోఽత్రాథవా సూచీ మతో దక్షిణ ఏవ నః
యతోఽశ్వారోహణారంభే మంగలస్యాభివృద్ధయే
దక్షిణేనాంఘ్రిణా పాదకటకాక్రమణం పరం
అధిదైవతమేతస్య స్మృతా దేవీ సరస్వతీ ౨౬౦
పుష్పస్తబకసంగ్రాహే విటపస్యావలంబనే
నీచానాం విశ్రమే చైతన్నరాణాం వినియోజ్యతే

### ౩. అశ్వక్రాంతము.

సూచీముఖముగానుండు దక్షిణపాదము నంచితమొన రించి సమస్థితముగు పాదముయొక్క పార్ష్ణిభాగమున నుంచవలెను.

అథవా; పాదము సమస్థితముగా నుండుట తాలసమ్మితముగా అగ్రి తలమున నుండుట అశ్వక్రాంతమగును. దీనిచే నశ్వాధిరోహణ ముం డును. గావున అశ్వక్రాంత మనుట సంగతము.

ఇందు పాదవిన్యాసవిషయమున కొందరు సంశయితాత్ములు అనియతముగా నుండుటను సూచించిరి. ఇందు పాదమంచితనుగునా? సూచీవిద్ధమగునా ? యని వారిసందేహము కావచ్చును. కాని మేము దక్షిణపాద మంచితముగా సూచీవిద్ధముగానుండుట నభిమానింతుము. ఇచట పాదవిన్యాస విషయమున సంశయమెవరికి కలదో జాయపతి సూచింపలేదు. నాట్యవేదమున "సూచీవిద్ధమవిద్ధంవా" యని కలదు. కాని దానిని జాయపతి సూచింపలేదు. ఈ స్థలమున నభినవభారతీ పంక్తియు లేదు.

"హస్తపాదప్రిచారస్తు తేషు జ్ఞేయో యథోచితం
భట్టాభినవగుప్తస్య మతమేతదుదీరితం"

అని సంగీతరత్నాకరకర్త సూచించెను. ఈ స్త్రీస్థానములందు హస్త పాదప్రిచారము యథోచితముగా నుండవచ్చును. ఇది భట్టాభినవ గుప్తుని మతము. అదియె యిట్లు నిరూపితమని యీ శ్లోకభావము.

ఈ అశ్వక్రాంతస్థానమును అశ్వారోహణా రంభమున మంగలాభివృద్ధికై యాచరింతురు. దక్షిణపాదమున పాదకటకా క్రమణము యుక్తము. శ్రీ సరస్వతీదేవి యీస్థానమున నధిదైవ తము. పుష్పస్తబక సంగ్రిహణమున విటపము నవలంబించినపుడు వినియుక్తమగును. నీచమానవుల విశ్రమమందు నిది వినియోజనము పొందును.

## ౪. గ తా గ తం

గంతుం చరణముత్క్షిప్య మధ్యే గీతాదిహేతునా

హస్తాద్యభినయం యస్మిన్ నర్తకీ ప్రవితన్వతీ
గతిస్థితినిరుద్ధాత్మా తిష్ఠేత్ తత్స్యాద్గతాగతం ౨౬౫
సంభ్రమప్రభృతావస్య వినియోగః ప్రకీర్తితః

### ౪. గతాగతము.

వెళ్లుటకై యొక చరణమెత్తిన నర్తకి మధ్యలో గీతాదులు హేతువుగా హస్తాదుల యభినయ మొనరించునదై గతివిశేషము నందలి స్థితి విధానమున నిరుద్ధయై నిలబడునేని యది గతాగతస్థాన మగును. దీనిని సంభ్రమాదులలో వినియోగింప వలెనందురు. గమనాగమన విశేషములుండుటచే నిది గతాగతము.

### ౫. వలితం

కించిద్వివలమానాంగం పదం వలనపార్శ్వగం
భూమిస్పృష్టకనిష్ఠం చ భూమిగాంగుష్ఠగం పరం
కుర్వీత వలితం ప్రోక్తం సాభిలాషవిలోకితే

### ౫. వలితము.

అంగములు కొంతగా వివలనము పొందుచుండ వలెను. పదము వలనమున పార్శ్వగతము కావలెను. కనిష్ఠము భూమిని స్పృశింపవలెను. అంగుష్ఠము భూమిగతము కావలెను. అపుడది వలిత స్థానమగును. సాభిలాష విలోకితము నందీ వలితము విని యుక్తమగును.

### ౬. మోటితం

అర్ధాంగులితలః పాదః కుంచితోన్యః సముత్థితః ౨౭౦
ఊరోః కుంచితపాదస్య పురతః కర్కటః కరః
యత్ర తన్మోటితాభిఖ్యం కామావస్థాసు కీర్తితం

౬. మోటితము

పాదము అర్ధాంగులితలముగా నుండుటయు వేరొకటి కుంచితమై సముత్థిత మగుటయు కుంచిత పాదముగా నున్న ఊరువెడుటగా కర్కట కరముండుటయు మోటితస్థాన లక్షణము. ఇది కామావస్థలలో వినియుక్తమగునని కీర్తితమయినది.

౭. వినివర్తితం

అస్మిన్నంగ పరావృత్త్యా పృష్ఠతో వినివర్తనం
తద్భేదః స్యాదముష్యాపి వినియోగస్తు పూర్వవత్

౭. వినివర్తితము.

అంగపరావర్తనము పృష్ఠతో వినివర్తనము దీనిలోనుండును. మోటితస్థాన గతములయిన విశేషములు దీనిలోనుండును. ఇది తద్భేదము — మోటితమునకు వలె దీనికిని వినియోగము నిశ్చయించునది.

౮. ప్రోన్నతం

సమపాదతలాగ్రాభ్యామంగులీనాం తలైరపి ౨౭౫
ఆయతీకృత్య గాత్రం చేత్తిష్ఠేత్స్యాత్ప్రోన్నతం తదా
నాసికాద్వయసే తోయే హర్మ్యర్ధ్వానామంతరీక్షణే
ప్రాంశుప్రాప్య ప్రమాణస్థ ఫలాదిగ్రహణాదిషు

౮. ప్రోన్నతము.

సంగీతరత్నాకరమున నిరూపితములయిన వానికన్న నతిరిక్తముగా నీ ప్రోన్నతస్థానమిందు అంగీకృతమయినది. సమానముగా నున్న పాదతలముల యగ్రభాగములచే అంగుళుల తలభాగములచే శరీరమును పొడవుగాజేసి నిలబడినచో నది ప్రోన్నతస్థాన

మగును. నాసికావఘ్నమయిన జలమునందు ప్రోన్నత ముపకరించును. ఎత్తుగానున్న వాని యావల లోపల చూచుటలో నిది సహకారి. పొడవుగానుండు మానవు డందుకొనదగిన అంతటి ప్రమాణము నందున్న ఫలాదులను గ్రహించుటలో ప్రోన్నత ముపకారి. ఇట్టివివి యన్నియు స్త్రీలస్థానములు. ఇంతవరకిది స్థానలక్షణము.

### భూ మండలాని

విచిత్రభూషా లలితాంగయష్టికా
వర్తనాతిభ్రమరాలికాభా ౨౮౦
సంక్రాంతకాంతిర్విహృతాభిరామా
నిరూప్యతే మండలరాజిరామా

వ్యాయామ దృఢగాత్రత సంపాదించి చారీవిధానముల ననుసరింపవలెను. చారీపరంపరా రూపముగా మండలములున్నవి. మండలము లసంఖ్యాకములు. అయినను వాని స్వరూపాదులు నిరూపింపవలసియున్నది. శస్త్రమోక్షణ సంగతములయిన చారీవిధానముల కథనానంతరము మండల కథన మావశ్యకము. మండలరాజిని అభిరామరామాకోపమున జాయపతి యిందు నిరూపించుచున్నాడు. ఇందు మండలముల పరముగా నొకభావమును అభిరామరామాపరముగా వేరొక భావమును గుర్తింపవచ్చును.

మండల పరమయిన భావ మీ విధముగానుండును. విచిత్రము — లలితసంచరము — లలితము — ఆవర్తము — భ్రమరము — క్రాంతము — విహృతము— అను మండలములు—భౌమాకాశమండలము లిందు సూచితము లయినవి. వీనిచే భౌమమండలములు గాని, ఆకాశమండలములు గాని మనోహరములగును. మండలములలో నివియె ముఖ్యము లని కాదు. ఇవియు ముఖ్యము లని భావము.

అభిరామ రామా పక్షమున నిట్లు భావము గుర్తింప వచ్చును. రమణీయ రమణీ చిత్రవిచిత్రము లగు భూషావిశేషము లచే యోగ్యమయిన తన దేహమును లలితముగ నొనరించును. తగిన వర్తన విశేషములు కల తుమ్మెదలవలె నుండు ముంగురులచే శోభాయమానముగ నుండును. అలకల యభివ్యాపనమున అలిక భాగము భాస్వంతముగ నుండును. చక్కని కాంతిసంక్రాంతి కలద్దై విహ్రుతి విశేషమున నభిరామముగ నుండును.

మండలరాజి యందు రామాత్వారోపమువలన నుభయ ధర్మములను వేరు వేరుగా భావించుట యావశ్యకము. ఆ ధర్మ ద్వయము నభిన్నముగ భావించి రూపకనిర్వాహము సంపాదించుట యుక్తము. శాస్త్రీయసాంకేతిక విషయము నిట్లు వర్ణనాత్మక కవితాభిరమ్యముగ కూర్చుట భావుకులకు భావనాపరిపాక మిచ్చును. శ్లిష్టపద గుంభనమున నక్లిష్టముగా నర్థవిశేషము స్ఫురింపజేయు ప్రజ్ఞ జ్యాయన కధికముగా గలదనుట కీ శ్లోకమును సమర్థము. ఇట్టివి పూర్వోపాత్తములు నిరూపితములు. తరువాతగూడ నిరూపితము లగును.

పారంపర్యేణ చారీణాం మండలం చారుగుంఫితం
దామేవ పుష్పజాతీనాం నకస్య నయనోత్సవః
హేతోః చారీప్రయోగస్య ప్రాచుర్యాన్మండలాన్యపి ౨౮౫
భౌమానాకాశగానీతి ప్రసిద్ధాని తదాఖ్యయా
యథాయోగం యథాశోభం సర్వశత్రువిమోచనే
సర్వాణ్యపి గదాయుద్ధే ప్రయోజ్యాని యథోచితం

మండలములు.

చారీపారంపర్యానుసారమున మండములు నిష్పన్నము లగును. పుష్పజాతుల పారంపర్యానుసారమున పుష్పదామ నిష్ప

న్నమగును. చారుగుంభనము మనోహరమగు కూర్పు అందు నుండును. ఇందునుండును. నానావిధపుష్పజాతుల పారంపర్యాను సారమున రమ్యమగు కూర్పుకల దామ—పుష్పమాలవలె నానాచారీ పారంపర్యమున రమ్యఘటనము కల మండల మెవరికి నయనోత్సవ ముగా నుండదు ? సర్వసహృదయుల కది యిది నేత్రానందదాయక మగును.

చారీ ప్రయోగ పారిచర్యముండుటవలన మండలములు కూడ భౌమమండలములని ఆకాశమండలములని రెండు విధముల నున్నవి. ఈ భౌమాకాశమండలముల నామములును చారీనామ ములుగనె ప్రసిద్ధములు. యథాయోగముగా యథాశోభముగా యథోచితముగా నీ భౌమాకాశమండలములను సర్వశస్త్రవిమోచనము లందును గదాయుద్ధముననును ప్రయోగింపదగును. ఈ మండలముల నన్నిటిని శస్త్రగదాయుద్ధములందు ప్రయోగింప వచ్చును. అంతట ప్రయోగింపవచ్చుననుటలో అచటి సంబంధయుక్తిని సంగతశోభను యుక్తౌచిత్యమును సమీక్షింపవలసి యున్నది. యథాయోగ యథా శోభ యథోచిత విధానసమాలోచన మంతటనున్నది. ఇందునున్నది.

భ్రమరాస్కందితే పిష్టకుట్టం చాషగతాడ్డితే
ఏలకాక్రీడితాధ్యర్థే ఆవర్త శకటాస్యకం ౨౯౦
సమోసరితమిత్యేవం భౌమాని బ్యూమహే దశ
సూచీవిద్ధమతిక్రాంత దండపాద మలాతకం
విచిత్రం విహృతం వామ బంధం లలితసంచరం
క్రాంతం లలితమేతాని దశాకాశ భవాన్యపి
అంఘ్రోర్విశేషం నిభృతాః ? చార్యః పుంస్యత్ర సమ్మతా ౨౯౧

భౌమమండలములు పది కలవు. ఆకాశమండలములు పది కలవు. వాని నామములు ఈ విధముగా నున్నవి.

భౌమమండలములు :

భ్రమరము — ఆస్కందితము — పిష్టకుట్టము — చాషగతము — అడ్డితము — ఏలకాక్రీడితము — అధ్యర్ధము — ఆవర్తము — శకటాస్యము — సమోసరితము. అని

ఆకాశమండలములు పది :

సూచీవిద్ధము—అతిక్రాంతము—దండపాదము—అలాతకము— విచిత్రము— విహృతము— వామబంధము— లలితసంచరము — క్రాంతము — లలితము. అని

వీనిలో నాకాశమండలము లందలి వామబంధమనునది నాట్యవేదమున వామవిద్ధమనియు నున్నది. ఈ ప్రఘట్టములోని చివరి పాదముయొక్క భావము నీ విధముగా గ్రహింపవచ్చును. ఈ మండలము లన్నిటియందును పాదముల సన్నివేశములు నిభృతములై యుండును. నిశ్చలములు నియతములై యుండును. స్థిరములుగానుండును. కావున నీ మండలములు పురుషుల విషయముననె ప్రయోజ్యము లగుట యుక్తము. ఇక వీని లక్షణములు క్రమమున నిరూపితములగును. ఇందు ముందుగా భౌమమండలముల స్వరూపకథనమున్నది. నాట్యవేదమున ఆకాశమండల స్వరూపమె ముందుగా నిరూపితము. ఆకాశమండలములనె మొదట నిరూపించుట యుక్తమని యభినవభారతి ప్రతిపాదించినది. "ఆకాశగతానాం యుద్ధపరిక్రమేషు ప్రాధాన్యాత్పూర్వముద్దేశః" యుద్ధపరిక్రమములలో ఆకాశగతమండలములకు ప్రాధాన్యమున్నందున ప్రథమముగా నుద్దేశించిచెప్పుట యుక్తము. అని యీ పంక్తి భావము. చారీకథనమున మొదటగా భౌమములను నిర్దేశించినందున ఇచటకూడ మొదటగా భౌమములనే నిర్దేశించుట తగునని జాయపతి భావించియుండును.

### ౧. భ్రమరీమండలం

దక్షిణం జనితం వామం స్యందితం దక్షిణం పునః
శకటాస్యం తతో వామ మపస్యందితమాచరేత్
దక్షిణాం భ్రమరీం తత్ర ద్విః త్రికం పరివర్తయేత్
వామం తు స్యందితం సవ్యం శకటాస్యాభిధం తతః
వామం చాషగతిం సవ్యం భ్రమరీం స్యందితామపి ౩౦౦
ఆదధ్యాచ్చరణం యత్ర భ్రమరం తదుదాహృతం

### ౧. భ్రమరమండలము.

ఈ మండల లక్షణము లందంతటను చారీ స్వరూపముల వివేకము ప్రతిపదమున నావశ్యకము. మండలము లందు ఆకాశ భూచారీ ప్రాచుర్యమున్నందున "చారీసంయోగ జానీహమండలాని" అనుట యుక్తము. ఈ భ్రమరములో దక్షిణ వామ పాదవిన్యాస క్రమ విశేషములు భావనీయములు. ఇందు ముందుగా దక్షిణపాదము జనితము కావలెను. వామపాదము స్యందితము కావలెను. మరల రెండవ విన్యాసములో దక్షిణపాదము శకటాస్యము వామపాదము అపస్యందితము కావలెను. మూడవ విన్యాసములో దక్షిణపాదము భ్రమరీవిధానము నవలంబిక భాగమును రెండు పర్యాయములు పరివర్తింప జేయవలెను. అప్పుడు వామపాదము స్యందితగతి ననుసరింపవలెను. నాల్గవ విన్యాసములో దక్షిణపాదము శకటాస్యము ననుసరించుటయు వామము చాషగతి ననుసరించుటయు నుండును. అయిదవ విన్యాసములో దక్షిణపాదము భ్రమరీరీతిని స్యందితరీతిని అనుసరించి చరణవిన్యాస మొనరించినచో నది భ్రమర మండలము అగును. ఇందు పదివిధముల చారీగతుల ననుసరింప వలసిన యావశ్యకతకలదు. ఇట్లే యితరములందును నానాచారీ సంచారముండుట యభ్యూహ్యము.

### ౨. ఆస్కందితం

దక్షిణే భ్రమరీ వామే మతం భ్రమరకం చ తత్
దక్షిణం శకటాస్యాఖ్యమూరూద్వృత్తాం తమేవ చ
వామమధ్యర్ధకం తం చ భ్రమరీ దక్షిణం పునః
స్యందితం దక్షిణాదన్యం శకటాననమేవతు ౩౦౫
ఆస్ఫాలితమహీపృష్ఠం పాదమాస్కందితం విదుః

### ౨. ఆస్కందితము.

దక్షిణపాదమున భ్రమరి వామపాదమున భ్రమరకము. రెండవ విన్యాసములో దక్షిణమున శకటాస్యము ఊరూద్వృత్తము వామమున అధ్యర్ధకము తదనుసారమున భ్రమరి యుండవలెను. మూడవ విన్యాసములో దక్షిణమున స్యందితము వామమున శకటాస్యము నుండవలెను. పాదముతో భూతలాస్ఫాలన మొనరించుట యిందున్నది. ఇట్టిదిది ఆస్కందిత మండలమగును. ఆయా పాదములకు చారీగతులను నిర్దేశించుటలో నిందలి విధానమునకు నాట్యవేద విధానమునకు నొకింత భేదమున్నది. అయినను మండలగతిలో నా భేదము విశేషమునె సూచింపగలదు. దానివలన స్వరూపమునకు హానియుండదు. ఇట్టి విశేషమన్నిట భావింపదగును.

### ౩. పిష్టకుట్టితం

సూచీసవ్యమపక్రాంతం వామం తదనుదక్షిణం
భుజంగత్రాసితం వామమపి తం రచయన్ముహుః
మండలం పూరయేద్యత్ర పిష్టకుట్టం తదీరితం

### ౩. పిష్టకుట్టము.

సవ్యపాదము సూచి. వామపాదము అపక్రాంతము. మరల దక్షిణపాదము భుజంగత్రాసితము. వామమును భుజంగ

క్రాంసితము. ఇట్లు మరల మరల నాచరించినచో నది పిష్టకుట్టమను మండలమగును. భుజంగ త్రాసిత పాదములతో మండలావర్తన మొనరించుట యిందుగలదు.

౪. చాషగతం

సర్వైశ్చాషగతైః పాదైః మండలం పరిపూరయేత్ ౨౧౦
భ్రామ్యం తత్ర చతుర్దిక్కు మిదం చాషగతం మమ

౪. చాషగతము.

చాషగతములగు పాదములై యిందు మండల పరిపూరణ మొనర్పవలెను. సర్వపాదములు చాషగతములగుట యిందు నియమము. ఇట్లు చాషగత సర్వపాదములచే మండల పూరణ మొనరించి సర్వదిక్కుముగా భ్రమణ మొనరింపవలెను. ఇట్టిది చాషగత మండలమగుట నాకు సమ్మతము. ఇది నియుద్ధము నందును విని యుక్తమగును.

౫. అడ్డితం

పార్శ్వక్రాంతసమం సవ్యం ఆవర్తం స్యందితం చ తం
శకటాస్యం తతో వామం సవ్యం చాషగతిం తతః
వామమడ్డితమన్యత్తు కుర్యాదధ్యర్ధికం తతః
వామం తు భ్రమరం చాన్యాత్ స్యందితం తేన భూతలం ౨౧౫
యస్మిన్నాస్ఫాలయేదేతత్పరికీర్తితమడ్డితం

౫. అడ్డితము.

అడ్డితమునందు సవ్యపాదము పార్శ్వక్రాంతసమముగా నుండును. ఆ సవ్యముద్ఘట్టితమై యావర్తమనుసరింపవలెను. ఆ పాదమునసే అస్కందిత మొనరింప వలెను. ఆ పిమ్మట వామపాదము శకటాస్యమున సవ్యపాదము చాషగతి ననుసరింపవలెను. పిమ్మట

వామపాదము అడ్డిత చారిని సవ్యమధ్యర్ధికమును అనుసరింపవలెను. మరల వామపాదము భ్రమరమును సవ్యము స్యందితమును అనుసరింపవలెను. ఆస్యందితానుసారి దక్షిణపాదముననే భూతలము నాస్ఫాలనము చేయవలెను. పాదతలమున భూమితాడనమును యుద్ధములలో ఆస్ఫాలన మనుట ప్రసిద్ధము. ఇట్లుండగా నిది అడ్డిత మండలమగును.

౬. ఏలకాక్రీడితం

సూచీవిద్ధైర్మహీసంస్థైరేలకాక్రీడితైరపి
పూర్ణైస్త్రికవివర్తైశ్చ సూచీవిద్ధాపవిద్ధకైః
మండలం తత్క్రమాత్కార్య మేలకాక్రీడితాభిధం

౬. ఏలకాక్రీడితము.

భూగతములయిన పాదములు సూచీవిద్ధములై ఏలకాక్రీడితములై యుండుటయు పూర్ణములయిన త్రికవివర్తనములతో నుండుటయు అనంతరము సూచీవిద్ధములు అపవిద్ధములై యుండుట యావశ్యకము. ఈ విధమున క్రమముగా మండలావర్త మొనరింపవలెను. అప్పుడది ఏలకాక్రీడితమను మండల మగును.

౭. అధ్యర్ధం

విధాయ చరణం సవ్యం జనితం స్యందితం క్రమాత్ ౩౭౦
వామమధ్యర్ధికం సవ్యం శకటాస్యమనంతరం
విదధీత చతుర్దిక్షు మండలభ్రమణం క్రమాత్
యత్రాధ్యర్ధ మిదం ప్రాహుః యుద్ధే ప్రాయేణ కీర్తితం

౭. అధ్యర్ధము.

ప్రథమావర్తములో సవ్యచరణమును జనిత మొనరించి క్రమముగా స్యందితము చేయవలెను. వామచరణము మధ్యర్ధికముగా

నుండవలెను. అనంతరము రెండవ ఆవర్తములో సవ్యపాదము శకటాస్యముగా నుండుట యావశ్యకము. అప్పుడు క్రమముగా నలు దిశలకు మండల భ్రమణ మొనర్పవలెను. పర్యాయమున నిట్టి మండల భ్రమణముండగా దీనిని అర్ధ్యార్ధ మండలమందురు. సామా న్యముగా నిది యుద్ధముననె నుండును. "నియుద్ధేచాపి" నియుద్ధము నందు నుండునని నాట్యవేదము.

ర. ఆవర్తం

ప్రథమం జనితం వామమూరూద్వృత్తమథేతరం
శకటాస్యం తమేవోరూద్వృత్తం చాషగతిం పరం ౩౨౯
దక్షిణం స్యందితం వామం శకటాస్యం తథేతరం
భ్రమరీం చరణం కుర్యాత్ కృతత్రికవివర్తనం
వామం చాషగతిం యత్ర తదావర్తముదాహృతం

ర. ఆవర్తము.

మొదట జనితచారి దక్షపాదమున నుండుటయు పిమ్మట వామమున ఊరూద్వృత్తముండుటయు అనంతరము శకటాస్యము ఊద్వృత్తము చాషగతి యుండదగును. అనంతరము దక్షిణము స్యందిత మనుసరించుటయు వామము శకటాస్యము ననుసరించుటయు నావశ్యకము, పిమ్మట త్రికవివర్తన మొనరించి భ్రమణ మొనరింప వలెను. ఇట్లుండగా నది ఆవర్తమండలమగును.

౯. శకటాస్యం

దక్షిణం జనితం కుర్యాదూరూద్వృత్తం తమేవ చ
శకటాస్యం క్రమేణాథ వామం స్యందితసంజ్ఞితం ౩౩౦
శకటాస్యైస్తతః పాదైః మండలం పరిపూరయేత్
యస్మిన్నేతత్సమాఖ్యాతం శకటాస్యాభిధం బుధైః

౯. శ క టా స్య ము.

దక్షిణపాదము జనిత మొనరించునది. ఆపాదముననే యూరూద్వృత్తము నాచరించునది. ఇచట నికుట్టక మొనరింప వలెనని భరతభావ. ఆ పిమ్మట ఆ దక్షిణపాదముననె శకటాస్య మొనరించునది. క్రమముగా దక్షపాదక్రియ యిట్లు జరిగినపిమ్మట వామ పాదము స్యందితచారి కలది కానలెను. అనంతరము శకటాస్య పాదములతో మండలము పూరింపవలెను. ఇట్లాచరింపగా నిది శకటాస్య మండలమగునని నృత్తబుధులనిరి. ఇది వ్యాయమోస యోగి.

౧౦. స మో స రి త ం

సమపాదైః స్థితస్థానే సంప్రసార్య తథా కరౌ
శిష్టమూర్ధ్వతలావేతావావేష్ట్యోద్వేష్టితౌ క్షిపేత్
కటీతటే తతస్సవ్యవామాభ్యాం క్రమశో భవేత్ ౩౨
చరణాభ్యాం స్థితావర్తాం వామం త్వగ్రే ప్రసారయేత్
చతుర్దిక్కం తతో భ్రామ్యే త్సమోసరిత సంజ్ఞకః

౧౦. స మో స రి త ము.

సమపాదములతో స్థితస్థానమున నుండి కరములను ప్రసారితములను జేసి ఆహస్తములను ఊర్ధ్వతలముగా నుంచునది. పిమ్మట ఆవేష్టన మొనరించి ఉద్వేష్టితల నొనరించి క్షేపముండునట్లు చేయ వలెను. అనంతరము కటీతటమున గూర్చి దక్షిణవామపాదములచే స్థితావర్తము ననుసరింపవలెను. వామచరణమును అగ్రభాగమున ప్రసారితముచేయవలెను. పిమ్మట చతుర్దిక్కముగా భ్రమింపవలెను. ఇట్టిది సమోసరితమగును ఇది వ్యాయామ మండలము.

ఇట్లు భూమండలములు పదియు నిరూపితము లయినవి. జాయపతి యనుసరించిన క్రమానుసారమున నిక పది ఆకాశమండలములను నిరూపింపవలసి యున్నది.

### ఆకాశమండలాని

### ౧. సూచీవిద్ధం

వామం సూచీం ప్రకుర్వీత తదేవ భ్రమరీమపి
దక్షిణః వామతః క్రాంత మతిక్రాంతం తతోఽపరం
అన్యత్సూచీమపక్రాంతం వామం వామేతరం పునః ౨౪౦
పార్శ్వక్రాంతాభిధం యత్ర సూచీవిద్ధం తదుచ్యతే

### ఆకాశమండలములు.

### ౧. సూచీవిద్ధమండలము.

ఇందు వామపాదము సూచీచారితో నుండుట అదియే భ్రమరీచారీ విధమున నుండుట, దక్షపాదము పార్శ్వక్రాంతముతో నుండుట, మరల వామము అతిక్రాంతముతో నుండుట, మరల దక్షము సూచి వామ మపక్రాంతము వామేతరము పార్శ్వక్రాంతముతో నుండుట ఆవశ్యకము అప్పుడది సూచీవిద్ధమండల మగును. మొదట వామము సూచీవిధమున నున్నప్పుడు త్రికపరివర్తనము కూడ కలదు. ఈ సూచీవిద్ధాదు లాకాశమండలములు యుద్ధపరిక్రమములో ఆకాశగత మండలములకు ప్రాధాన్యమున్నందున ప్రథమ నిర్దేశ మావశ్యకమని అభినవభారతి యనుట ప్రథమమున సూచితమయినది.

### ౨. అతిక్రాంతం

జనితం చరణం కృత్వా శకటాస్యం చ దక్షిణం
అలాతమపరం పార్శ్వక్రాంతం దక్షిణమాచరేత్

వామం సమాచరేత్సూచీం పార్శ్వక్రాంతం తు దక్షిణం
వామపాదం తతస్సూచీ మపక్రాంతం తు దక్షిణం ౩౪౫
సూచీం వామేఽనుకుర్వీత సవ్యేన భ్రమరీమపి
తేనోద్వృత్తమలాతంతు వామేన కరణం తతః
భిన్నం సవ్యేన వామేన బాహ్యాతో భ్రమరీం భజేత్
అతిక్రాంతం తమేవాంఘ్రిం దండపాదం తు దక్షిణం
యస్మిన్నిదమతిక్రాంతం వ్యాయామే పరికీర్తితం ౩౫౦

## ౨. అ తి క్రాం త ము.

దక్షిణచరణము జనితము శకటాస్యము వామచరణము అలాతము, దక్షిణము పార్శ్వక్రాంతము వామము సూచి, దక్షిణము అపక్రాంతము వామమున సూచి, సవ్యమున భ్రమరి ఉద్వృత్తమును, వామమున అలాతకరణము, సవ్యమున భిన్నము వామమున బాహ్యముగా భ్రమరి యున్నచో నిది అతిక్రాంత మండలము ఇందలి సూచి అపక్రాంతముల త్రికపరివర్తనము నితరులు చెప్పిరి. ప్రయోగ భంగిలో నావశ్యక మయినప్పుడు త్రికపరివర్తన మన్నిసమయము లందు నభ్యూహ్యము. ఇది వ్యాయామమున నుపయోగించుట నభ్యూహింప దగును.

## ౬. ద ం డ పా ద ం

దక్షిణే జనితం కుర్యాః దండపాదం తమేవ చ
వామం సూచీం భ్రమర్యా చ సవ్యముద్వృత్తసంజ్ఞకం
అలాతం వామతః పాదం పార్శ్వక్రాంతం తు సవ్యతః
భుజంగత్రాసితం తద్వదతిక్రాంతం తథేతరం
దక్షిణం దండపాదం తు వామం సూచీమనంతరం ౩౫౫
తమేవ భ్రమరీం కుర్యాద్దండపాదం తదీరితం.

### ౩. దండపాదము.

దక్షిణపాదమున జనితము దండపాదము, వామమున సూచి, భ్రమరి, దక్షమున ఉద్వృత్తము, వామమున అలాతము, సవ్యమున పార్శ్వక్రాంతము భుజంగత్రాసితము, వామమున అతిక్రాంతము, దక్షమున దండపాదము, వామమున సూచి భ్రమరి అనునవి క్రమమున నుండగా దండపాదమండల మగును. ఇందు చివరివిన్యాసములో త్రికావర్తమును భరతుడనెను. చివరి భ్రమరి పరిసమాప్తి స్థానగతముగనే యుండుట వివక్షితము.

### ౪. అలాతం

విదధ్యాద్దక్షిణం సూచీం అతిక్రాంతం తథేతరం
పార్శ్వక్రాంతం తతస్సవ్యం తస్మాదన్యమలాతకం
షట్కృత్వః సప్తకృత్వో వా చారీరావర్తయంత్విమాః
చతుర్దిక్కం పరిభ్రమ్య లలితైః పాదవిక్రమైః ౩౬౦
అపక్రాంతం పునస్సవ్యం అతిక్రాంతం తథాపరం
భ్రమర్యాఖ్యం చ కుర్వీత యత్రాలాతముశంతి తత్

### ౪. అలాతము.

దక్షిణపాదము సూచి, వామపాదమతిక్రాంతము, దక్షిణము పార్శ్వక్రాంతము వామ మలాతకము. ఇట్లు ఆరుపర్యాయములు కాని ఏడు పర్యాయములు చారీగతులను ఆవర్తింప జేయవలెను. లలితములగు పాదవిక్రమములతో చతుర్దిక్కముగా పరిభ్రమింప వలెను. ఆ పిమ్మట మరల సవ్యపాద మపక్రాంతము వామపాద మతిక్రాంతము కావలెను. పిమ్మట భ్రమరీచారి యుండవలెను. ఇట్టిదానిని అలాత మండలమందురు. ఈ అలాతమండలమున పాదభ్రమరకము రమ్యముగ నుండును. షట్కృత్వః సప్తకృత్వః

క్రమముగా చారీప్రయోగ మొనరింపవలెననుట వలన చతుర్దిక్కుముగా పరిమండలమున భ్రమించి ఆంతరాలికములయిన పాదక్షేపములచే నిట్లిది యిది కార్యమని సూచిత మగును.

## ౨. విచిత్రం

దక్షిణం జనితం కుర్యాదూరూద్వృత్తం తమేవచ
అపరం స్యందితం పార్శ్వక్రాంతం తదను దక్షిణం
వామం సూచీమపక్రాంతం దక్షిణం చరణం పునః ౩౬౯
భుజంగత్రాసితం వామమతిక్రాంతం తతోఽపరం
ఉద్వృత్తమముమేవాంఘ్రిమలాతం వామమాచరేత్
పార్శ్వక్రాంతక్రమం సవ్యం సూచీమన్యమనంతరం
నిక్షిప్య దక్షిణం వామమపాక్రాంతో క్తమాచరేత్
యత్ర తత్స్యాద్విచిత్రాఖ్యం యోగ్యాయాం వినియుజ్యతే ౩౭౦

## ౨. విచిత్రము.

దక్షిణపాదము జనితముగా నొనరింపవలెను. దానినే ఊరూద్వృత్తముగా చేయవలెను. వామము స్యందితము కావలెను. రెండవ ప్రసారములో దక్షిణపాదము పార్శ్వక్రాంతము వామపాదము సూచి కావలెను. మూడవవరుసలో దక్షిణచరణము అపక్రాంతము వామము భుజంగత్రాసితము కావలెను, మరల దక్షిణ చరణము అపక్రాంతము. అదియె ఉద్వృత్తరీతిలో నుండవలెను. అప్పుడు వామపాదమున అలాతమాచరింప వలెను. పిమ్మట సవ్యచరణము పార్శ్వక్రాంతి సనుమగుట యుక్తము. ఆ సమయమున వామపాదము సూచియనుసరింపవలెను. ఇక దక్షిణపాదము నుంచి వామపాదమును అపక్రాంతాచరణమున కూర్పవలెను. ఇట్లుండగా నిది విచిత్ర మండలమగును. దీనిని యోగ్యాయాం = వ్యాయామ మందు వినియుక్తము చేయుదురు.

### ౬. విహృతం

కుర్వీత జనితం సవ్యమూరూద్వృత్తం తమేవ చ
స్యందితం వామముద్వృత్తం సవ్యం వామమలాతకం
సవ్యం సూచీం పునర్వామం పార్శ్వక్రాంతమనంతరం
ఆక్షిప్తం భ్రమరీమదండపాదం సవ్యం క్రమాత్తతః
వామం సూచీం భ్రమర్యా చ భుజంగత్రాసితాభిధం ౩౭౫
సవ్యం వామమతిక్రాంతా యస్మిన్ తద్విహృతం మతం

### ౬. విహృతము.

సవ్యపాదము జనితము ఊరూద్వృత్త మగుటయు వామము స్యందిత మగుటయు సవ్యముద్వృత్త మగుటయు వామమలాతక మగుటయు సవ్యము సూచి యగుటయు పిమ్మట వామము పార్శ్వ క్రాంతమగుట అనంతరము సవ్యపాదము ఆక్షిప్తము భ్రమరి దండ పాదమున నుండుట క్రమముగా జరుగవలెను. పిమ్మట వామపాదము సూచి భ్రమరి కలదగుట సవ్యము భుజంగ త్రాసితమున నుండుట వామ మతిక్రాంతముగా నుండుట యున్నచో నది విహృత మండల మగును. దీని స్వరూప కథనమున మధ్యలో నొక విశేషమున్నది. త్రికసమావర్తనము రెండు పర్యాయము లుండుటను భరతుడు సంకేతించెను. "సమావర్తనం సమ్యగావర్తనం సవ్యాపసవ్యభ్రమరక ద్వయేన" యని నాట్యవేద వివృతి వచనము. కావున త్రికపరివర్తన మును సందర్భోచితముగా సౌందర్యావహమగునట్లు ప్రయోగించుట యావశ్యకము. త్రికపరివర్తనము నడుముమలచుట నృత్తమండల ప్రయోగములందు రమ్యముగా నుండుట నభిజ్ఞులు సూచింతురు.

### ౭. వామబధం

సూచీం వామేతరం కుర్యాదపక్రాంతమథాపరం
దండపాదం తతః సవ్యం సూచీపాదం తు వామతః

తమేవ భ్రమరీం పార్శ్వక్రాంతం వామేతరం తతః
ఆక్షిప్తం దండపాదం చ వామం సవ్యం యథాక్రమం ౩౮౦
ఊరూద్వృత్తం తతః సవ్యం సూచీం చ భ్రమరీమపి
అలాతం చ యథా వామం పార్శ్వక్రాంతం చ దక్షిణం
అతిక్రాంతం పరం యత్ర వామబంధం తదీరితం

౭. వా మ బం ధ ము.

దక్షిణ పాదమున సూచీరచన వామపాదమున అపక్రాంతము, మఱల దక్షమున దండపాదము వామతః సూచీపాదము భ్రమరీరచనము, దక్షపాదమున పార్శ్వక్రాంతము వామపాదమున ఆక్షిప్తము, దక్షపాదమున దండపాదము ఊరూద్వృత్తము, వామపాదమున సూచి భ్రమరి అలాతము, దక్షిణమున పార్శ్వక్రాంతము వామమున అతిక్రాంతము నున్నచో వామబంధమండల మగును. అవసరోచితముగ రెండుపర్యాయములు త్రికవివర్తనమును భరతుడిందు సూచించెను.

౮. ల లి త సం చ రః

ఊర్ధ్వజానుకృతం కుర్యాత్పాదసూచీం చ దక్షిణం
అపక్రాంతం తతోఽప్యన్యం పార్శ్వక్రాంతం తు దక్షిణం ౩౮౫
అతిక్రాంతం తతోఽప్యన్యం పాదసూచీం చ దక్షిణం
అతిక్రాంతం తతో వామం పార్శ్వక్రాంతం తు దక్షిణం
వామం పునరతిక్రాంతం భిన్నాఖ్యం కరణం తతః
బాహ్యభ్రమరకం వామమస్మిన్ లలితసంచరే

౮. ల లి త సం చ ర ము.

ఇందు దక్షిణపాదము ఊర్ధ్వజానుచారిననుసరించి పాదసూచి నాచరింపవలెను. ఇక వామపాద మపక్రాంతమును, దక్ష

పాదము పార్శ్వక్రాంతమును వామము అతిక్రాంతమును, దక్షిణము పాదసూచిని, వామ మతిక్రాంతమును, దక్షిణము పార్శ్వక్రాంతమును వామ మతిక్రాంతమును, దక్షము భిన్నకరణమును, వామము బాహ్యభ్రమరకమును అనుసరించినచో లలిత సంచరమండల మగును. ఇందతిక్రాంతాపక్రాంతము లన్నియు లలిత సంచరములుగా నుండును. మండలమును లలిత సంచరము.

### ౯. క్రాంతం

దక్షిణం చరణం సూచీం అతిక్రాంతం తథా పరం ౩౯౦
కుర్యాత్సవ్యం చ వామం చ పార్శ్వక్రాంతక్రమం తతః
పర్యాయేణాథ చారీభిరేతాభిః పరితో భ్రమన్
సూచీం వామమపక్రాంతం కుర్యాత్సవ్యమనంతరం
తతః సహజయా గత్యా మండలాకారతో భ్రమేత్
యత్ర కాంతతరం క్రాంతం వ్యాయామే నృత్తకోవిదైః ౩౯౨

### ౯. క్రాంతమండలము.

దక్షిణచరణము సూచి, వామచరణము అతిక్రాంతము, అనంతరము సవ్యము వామము రెండును పార్శ్వక్రాంతము నాచరించుట. ఇట్లు పర్యాయమున నీ చారీవిధానములతో నంతట భ్రమణ మొనరించుచు మండల మనుసరింపవలెను. అనంతరము వామమున సూచి దక్షపాదమున అపక్రాంతమును అనుసరింప వలెను. పిమ్మట సహజగతి విధానమున మండలాకారముగ భ్రమింప వలెను. ఇట్టి భ్రమణము కాంతతరముగా నుండును గావున నిది క్రాంత మండల మగును. ఇది వ్యాయామమున నుపయోగించునని నృత్తకోవిదు లందురు.

## ౧౦. ల లి తం

చరణం దక్షిణం సూచీమపక్రాంతం తతోఽపరం
పార్శ్వక్రాంతం తతః పూర్వం భుజంగత్రాసితం చ తత్
అతిక్రాంతం తతో వామమాక్షిప్తం దక్షిణం పునః
అలాతం వామకం పార్శ్వక్రాంతం వామేతరం తతః
అతిక్రాంతం తథా చోరూద్వృత్తం సూచీం చ వామకం ౪౮౦
అపక్రాంతం పునర్వామః యత్ర తల్లలితం భవేత్

## ౧౦. ల లి త ము.

దక్షిణచరణము సూచి వామచరణము అపక్రాంతము మరలదక్షిణము పార్శ్వక్రాంతము భుజంగ త్రాసితము అనుసరింవ వలెను. పిమ్మట వామపాద మతిక్రాంతము దక్షిణపాదము ఆక్షిప్తము కావలెను. వామపాదమలాతము దక్షిణపాదము పార్శ్వక్రాంతము వామ మతిక్రాంతము ఊరూద్వృత్తము సూచి అనుసరింప వలెను. ఇట్లున్నచో నిది లలిత మండలమగును. లలితసంచర మండల మందును లలితమండలమునందును చారీవిధానముల యనుగతి దాదాపు సమముగా నున్నది. భరత గ్రంధమిట్లే నిరూపించినది. మతాంతరానుసారమున లలిత మండలములో తుదిభాగమున కొంత భేదము కలదు. అట్టి భేదసూచనమునకై జాయపతి మతాంతరానుసారమున నున్న చారీచరణ వ్యతిక్రమమును దీనిలో ప్రతిపాదించెను. ఉపక్రమించినవిథమున నీ పరిఘట్టమున భౌమమండలములు ఆకాశ మండలములు నిరూపితము లయినవి. తృతీయాధ్యాయారంభములో నిరూపించిన విధముగా నీ యధ్యాయ మంతయు చారీమండల స్వరూప సమీక్షణమునకు దగియున్నది. ఒక పాదము యొక్క చారము చారికాగా రెండు పాదముల చారము కరణమయినది.

మూడు కరణములుండగా నొక ఖండము. మూడునాలుగు ఖండము లున్నచో నొక మండలము. అట్టిమండలములు పదిపది నిరూపిత ములయినవి ఇందలి భౌమాకాశమండలము లందలివిశేషముల సంబంధమున నింకను మండలముల సంఖ్యాన ముచితమె కావచ్చును. ఆ యంశ మిచట సుపరిష్కృతముగా నిరూపిత మగును.

ఏతాని మండలాన్యత్ర దర్శితాని సమాసతః
అన్యోన్యయోజనాద్యోగ్యచారీణాం చతురాశయైః
అతః పరమపి స్వైరం కల్పనీయాని కాన్యపి
తాని పూర్వోక్తలక్ష్మాణి చారీభిస్త్వేకజాతిభిః

ఏతాని ఖండసహితాన్యపి మండలాని
లీలాంగయష్టిమధురాణి మనోహరాణి
వాద్యానుగాని వివిధాని బుధో నియుద్ధే
యుద్ధేऽథ నర్తనవిధౌ విధివద్విదధ్యాత్

ఆవర్తకాంతం లలితం విచిత్ర
మాస్కందితం కాంతవిధిం దధానం
ఇత్యబ్రవీన్మండలలక్ష్మ సుశ్రీ
స్తురంగతుల్యం గజసైన్యనాథః

నృత్తరత్నావల్యాం
చారీస్థానకమండలలక్షణం నామ
తృతీయాధ్యాయః

ఇప్పటి కింతవఱకీ విధముగా భౌమ మండలములు ఆకాశ మండలములు సంక్షిప్తముగా ప్రదర్శితము లయినవి. ఇట్లివి సంక్షిప్తముగా నిరూపితములనుట సాభిప్రాయము. విస్తరముగా నిరూపించుట శక్యము కాదు. యోగ్యములగు చారీవిధానముల పరస్పర యోజనమున నీ మండలములు కలుగునని చతురాశయము కల భరతాది నాట్యతత్త్వవిదులనిరి. ఈ నిరూపితములయిన మండలములలో చారీవిశేషము లన్నియు సంశ్లిష్టములు కాలేదు. యోగ్యములగు చారీగతులు మాత్రమే యిందు యోజనము పొందె. చారీవిధానములలో గొన్ని యోగ్యములు కొన్ని యయోగ్యము లను భావము యుక్తముకాదు. చారీవిశేషముల యన్యోన్యసంబంధముండుటలో కొన్నియే సంగతము లగును. అన్నియు సంగతములు కావు. సంగతి యోగ్యములగు చారీ విధానములు మేలనము వలన గలుగునివి నిదర్శితములయినవి. చారీ యోగ్యతాను సారమున నింకను మండల విశేషముల యథేష్టముగా కల్పింపవచ్చును. ఏకజాతీయములయిన చారీవిశేషముల కలయిక వలన మండలాంతర కల్పనము సుకరము. ఏకజాతీయతానుసంధానమె చారీయోగ్యత. ఏకజాతీయత యనునది సమచారీరీతి. మొదట నిరూపించిన చారీ లక్షణ భావార్థములను పరిగ్రహించుచు అన్యమండలముల నభ్యూహింపవచ్చును. పరస్పర యోజనోచితములయిన చారులు సమచారులనదగి యున్నవి. సమచారీయోజనా భ్యూహనమున గూడ నియతి ననుసరింప వలెను. సమచారీ సంప్రయోగమున సమమండలమనవచ్చును. ఈ సమత్వముకూడ భౌమములుగా నుండుటలో సమత్వము ఆకాశీయముగా నుండుటలో సమత్వము అను విధానమున భావింపదగి యున్నది. భౌమచారీ విశేషములను ఆకాశచారీ విశేషములను ఒకమండలమున యోజనము చేయుటలో నృత్తవిదులు

భావించు యోగ్యత యుండదు. ఏకజాతీయత యుండదు. ఏక జాతీయములనే ఆ యోజనము చేయుట సముచితము, ఏకజాతీయ యోజనమున గూడ ననేకమండలము లుదయింప వచ్చును కాని వాని నిశ్చయించుటలో ఆచార్య బుద్ధిని ప్రమాణీకరించుకొనవలెను. ఆచార్య బుద్ధి సముపలభ్యమయిన భాగమే ప్రయోక్తలకు ప్రయోగ యోగ్యమగును. కేవలము స్వబుద్ధి కల్పితములు ప్రయోగ యోగ్యములు కాజాలవు. కావున ప్రయోగ యోగ్యములనే ఆచార్యు డుపదేశించును గావున వానినే మండలాంతరములుగా నెన్నిక చేసికొనవలెను, కేవలము శాస్త్రీయ గణనమున గలుగునవి లెక్కకు మాత్రమే కాని గణనీయములు కాజాలవు.

మండలములను నిష్పాదించుటలోని ఖండములకును ప్రాధాన్యము కలదు. ఖండసహితము లయిన మండలములు నానా విధలీలావిశేషములు కల అంగోపాంగములచే మధురములు మనోహారములగును. వివిధములగునవి యన్నియు వాద్యానుగతమ్ములై యుద్ధములందును నియుద్ధములందును నర్తనవిధానములందును యథావిధిగా విధానింపవలెను. మండలములన్నియు వాద్యానుగతములుగా నుండుట యుండనే యున్నది. మండలము లందున్న ఖండములును మండల మహార్థములతో గూడుకొనినవై వాద్యానుగతములు కావలెననుట యిందు సంభావ్యము. వాద్యము, గతి రెండును పరస్పరానుగతి కలవై యుండుట యావశ్యకము. వాద్యప్రాధాన్యమున గత్యనుగతియు గతిప్రాధాన్యమున వాద్యానుగతియు భావనీయము. ఖండప్రాధాన్యము నిరూపింపవలసిన యీ స్థలమున "ఖండసహితాన్యపిమండలాని" అనుటకన్న "ఖండాని సమండలాని" అనుట యుక్తముగ నుండును.

"ఆవర్తకాంతం" అను చివరి శ్లోకము మండలారంభ శ్లోకమునవలె చారీసమారంభ శ్లోకమువలె భావద్వయము మనోహరము. సుశ్రీకుడు గజసైన్యనాథుడు జాయసేనాపతి మండల లక్షణమును తురంగతుల్యముగా నిరూపించెను. తురంగ పరముగా మండల పరముగా రెండు భావముల నిందు గ్రహింపవలెను.

తురంగపరమయిన భావ మిట్లుండును. తురంగము ఆవర్తకములతో మంచిసుములతో రమ్యముగ నుండును. విచిత్రగతి కలదిగా నుండును. ఆస్కందితమను గతివిశేషమున రమ్యవిధాన మును ధరించి యుండును.

మండల పరభావమిట్లుండును. ఆవర్తము, లలితము, విచిత్రము, ఆస్కందితము, కాంతము అను చారీవిధానముల గూడి నదై మండలముండును. ఇట్లశ్వసామ్యప్రతిపాదనమున రమ్యతను రచయిత భావించి నిరూపించెను.

సాహితీవల్లభ వ్యాఖ్య
తృతీయాధ్యాయము.

శ్రీ

శ్రీ జాయసేనాపతి విరచితా

# నృత్తరత్నావలీ

## చతుర్థాధ్యాయః



ఈ యధ్యాయమునకు కరణాంగహార వివేచనమని పేరు. నూటయెనిమిది కరణములు ముప్పదిరెండు అంగహారములు దీనిలో వివేచితము లగును. భీమసేనుని భీముడన్నట్లు నృత్తకరణములను కరణము లందురు. ఈ కరణములు వాక్యార్థాభినయమున ప్రయోగార్హములు. పదార్థాభినయము నందును ప్రయుక్తము లగును. నర్తనారంభమున హస్తపాదవిన్యాసము సముచిత మగుటయు నిందు నిరూపితమగును. కరణముల ప్రయోగమున హస్తపాదముల విన్యాసరీతియు నిరూపిత మగును. అష్టోత్తరశత కరణములకు లక్షణ వినియోగములు ప్రదర్శితము లగును. ఆ యా స్థలములందు తండు కీర్తిధరాదుల మతములు ప్రదర్శితము లగును.

అంగహారముల ప్రయోగరీతి, వాని స్వరూపము, అందుండు కరణములుసంఖ్య, అంగహారశబ్దనిరుక్తి నిరూపితమగును. చతురశ్ర మానమున అంగహారములు "పదునారు" త్ర్యశ్రమానమున పదునారు కలవు. అంగహారము లనంతము లయినను ముప్పదిరెండు అనుట భరతభావము. కరణసంఖ్యానుసారమున అంగహారవిభా

గము నిరూపితమగును. అంగహారసంఖ్యానియమమున హేతువు ప్రదర్శితమగును ఈ ప్రసక్తిలో రేచకముల నిరూపణ మావశ్యక మయినది. రేచకముల ఫలప్రదర్శనము నావశ్యక మయినది. ఇట్లు ఆవశ్యకము లన్నియు నీ అధ్యాయమున ప్రదర్శితములు కానున్నవి.

నృత్తమహార్థమంతయు శివదర్శనముగా సంభావిత మయి నందున శివభక్తుడగు జాయపతి కరణముల సమూహమంతయు అద్రి తనయాకాంతోపమముగా భావించి యిట్లు నిరూపించుచున్నాడు.

ఆశ్లిష్యద్వలితోరువర్తిత శివాక్షిప్త స్ఫురన్నూపుర
క్రాంతాంఘ్రి హరిణప్లుతాశ్రయకరం చంచద్భుజంగాంచితం
పార్శ్వక్రాంతపదాపవిద్ధ వృషభక్రీడోర్ధ్వజానూత్సుకం
వ్యాచష్టే కరణౌఘమద్రితనయాకాంతోపమం జాయనః

ఈ శ్లోకమున కరణముల పరముగానున్న భావమును శివ పరముగా నున్న భావమును గ్రహింపవలసి యున్నది. అందు ముందుగా ఉపమానరూపముగా నిర్దిష్టుడయిన శివుని పరముగానున్న భావము నిట్లు గుర్తింపవచ్చును.

ఆలింగనము చేసికొను దేవి ఊరువుల వర్తనమున కదిలి స్ఫురించు నూపురములచే శివపాదము ఆక్రాంతి మయినది. శివుని కరము నాశ్రయించియున్న హరిణము ప్లుత మొనరించుచున్నది. దేహమునందలి సర్పములు కదలుటచే శివుడురమ్యశోభతోనున్నాడు. పార్శ్వభాగమున అపవిద్ధమయిన వృషభము యొక్క ఊర్ధ్వజాను క్రీడలో శివు డుత్సుకమున నున్నాడు. ఇట్టి ఉమాదేవీవల్లభోపమ ముగా నున్న కరణౌఘమును జాయనుడు నిరూపించుచున్నాడు.

కరణముల సమూహావరముగా నీ భావమును గుర్తింప వచ్చును. అష్టోత్తరశతసంఖ్యాక కరణములలో నిందు కొన్ని కరణ ముల నామములు ముద్రాలంకారభంగీచతురముగా నిరూపితము లయినవి. వలితోరువు – వర్తితము – ఆక్షిప్తము – క్రాంతము – హారిణప్లుతము – భుజంగాంచితము – పార్శ్వక్రాంతము – పదాప విద్ధము – వృషభక్రీడితము – ఊర్ధ్వజానుకము. ఇట్లిందు పది కరణనామములు ఉల్లిఖితము లయినవి. ఏతాదృశము లయిన కరణముల సమూహాము శ్రీ జాయనుడు నిరూపించుచున్నాడు. నానాకరణము లుండగా వీనినే యిచట ఉల్లేఖించుట శివదర్శనము లోని విశేషమును స్ఫురింపజేయుటకె యని భావించుట యుక్తము. కరణములలో నివియె ప్రధానము లనికాదు.

## కరణలక్షణం

స్థానానాం నృత్తహస్తానాం చారీణాం యస్సమాగమః
ఉచితానాం సమాఖ్యాతా ? సేయం కరణమాతృకా
హస్తాంఘ్రిప్రముఖానాం తు పూర్వాధఃకాయవర్తినాం
అంగానాం క్షేత్రతః క్షేత్రప్రాప్తిరూపాత్ర యా క్రియా
విలాసనిర్భరా నృత్తకరణం తదుదాహృతం

## కరణలక్షణము.

ఇచట కరణలక్షణోపక్రమమున నృత్తకరణస్వరూపము కరణశబ్దనిరుక్తి యున్నది. స్వలక్షణసముచితము లయిన స్థానము లకు నృత్తహస్తములకు చారీవిధానములకును యోగ్యమయిన సమా గమము కరణమాతృక యని సమామ్నాత మయినది. తాన, నృత్త, హస్త చార స్వరూపము నిరూపితమయినది. వాని సమ్యక్సంబంధమునకు కరణమాతృక యని పేరు. పూర్వశరీరము

నందును అధశ్శరీరమునందు నున్న హస్తాదులు పాదాదులు నయిన అంగములకు ఒక క్షేత్రమునుండి మరియొక క్షేత్రమునకు ప్రాప్తి రూపమయిన క్రియ విలాసనిర్భరమైనదై నృత్తకరణమని చెప్పదగి యున్నది. ఏకదేశాభిప్రాయమున భీమసేనుని విషయమున భీమ వ్యవహార మున్న విధమున నృత్తకరణమును కరణమని యుక్తసంగత మని గుర్తించునది.

నాట్యవేదము నందలి కరణోపక్రమ భావములను నాట్య వివృతి యగు అభినవభారతిలోని భావముల నీవిధముగా గుర్తించుట ప్రకృతార్థమునకు సహకరించును.

భరతుడు బ్రహ్మసన్నిధిలో నాట్యవేదము గుర్తించి శిష్యుల కుపదేశించెను. భరతనిర్దేశానుసారమున వారు శిక్షితు లైనారు. కొంతకాలమునకు దేవాసురబీజకృతమయిన "అమృత మంథనము" అను సమవకారమును బ్రహ్మ సూచనానుసారమున భరతుడు నిర్మించెను. దానిని వారు ప్రదర్శించిరి. అందరు సంత సించిరి. మరి కొంతకాలమునకు "నాట్య ప్రయోగమును శివ సమక్షమున ప్రదర్శింపవలె"నని బ్రహ్మ యనెను. చక్కగా శిక్షితు లగువారు తద్విదుల సమక్షమున ప్రదర్శించుట యుక్తము. శ్రీ కైలాసమున శ్రీ శివుని సమక్షమున భరతుడు త్రిపురదాహము అను డిమమును ప్రదర్శింపజేసెను. అందరు సంతసించిరి. మహాదేవుడు సుప్రీతు డయ్యెను. ఇట్లనెను.

మయాపీదం స్మృతం నృత్యం సంధ్యాకాలేషు నృత్యతా
నానాకరణసంయుక్తై రంగహారై ర్విభూషితం

సంధ్యాసమయము లందు నర్తనముచేయు నేనును నృత్యము స్మరించు చున్నాను. ఆ నృత్యము నానాకరణసంయుక్తము లయిన అంగహార

ములచే విభూషితము. అంగహారమె నృత్తము. అదియె ప్రయోగ ఫలప్రదము. కరణాదులన్నియు తదంగములు. ముప్పదిరెండు నృత్తకర్మలు అంగహారములు ప్రధానములు. పూర్వరంగవిధిలో నీ నృత్తమును చక్కగా ప్రయోగింపుము. భరతుడు ప్రయోగించిన పూర్వరంగము శుద్ధము. అంగహారవిమిశ్రిత మయినచో నది చిత్రము కాగలదు. వైచిత్ర్య రహితమయిన ప్రయోగము రంజనము సంపాదింపదు. ఈ నృత్తమిశ్రితమై విచిత్రము కాగా నది దృష్టాదృష్టాత్మకమయిన ఫలమును సంపాదింపగలదు. ఇట్లు శివుడనగా భరతుడు శివానుగ్రహపాత్రతాభవనమున సంతుష్టుడయ్యెను. అంగహారప్రయోగము కాంక్షించెను. శివుడు తండువును పిలిచి "ప్రయోగ మంగహారాణా మాచక్ష్వ భరతాయవై" యనెను. తండువంగహారముల నిర్దేశించెను. భరతుడు గ్రహించెను. గ్రథించెను.

అంగహారములు కరణసంయుక్తములు. అంగహారములకె ప్రాధాన్య మున్నది. అందుననె ముందుగా భరతు డంగహారముల నామములను జెప్పెను. అంగహారములు కరణముల సంచయరూపములు గాన, మొదట కరణముల లక్షణముల చెప్పుట యుక్తము. కరణములను జెప్పననె అంగహారముల లక్షణము చెప్పవచ్చును. కరణక్రమపాఠమె కరణలక్షణముకాదు. అంగహార ప్రయోగ మొనరింపవలసి యున్నప్పుడు కరణముల పరిజ్ఞాన మావశ్యకము. ఒక కరణ మొనరించి కరణాంతర సంచార మొనరింపవలసి యున్నపుడు హస్తపాద ప్రచారము నావశ్యకమగును. హస్తపాద ప్రచార ముండుట కరణములకు అంగహారములకు సామాన్యలక్షణము.

నృత్తక్రియకు కరణమని పేరు. హస్తపాద సమాయోగ మనునది నృత్తక్రియ. హస్తసమాయోగము పాదసమాయోగ

ముండుట నృత్తక్రియ. హస్తపదమున హస్తోపలక్షితములగు పూర్వ కాయమునందలి శాఖాంగోపాంగముల సమాయోగమును గుర్తింపవలెను. పాదపదమున పాదోపలక్షితములగు అపరకాయమునందలి పార్శ్వకట్యూరుజంఘాచరణాదుల సమాయోగము గుర్తింపవలెను. సమాగమ మనగా సంగతము లగునట్లుగా అత్రుటితము లగునట్లుగా నాయోజన మొనరించుట యని భావము. "పూర్వక్షేత్ర సంయోగత్యాగేన సముచిత క్షేత్రాంతరప్రాప్తి పర్యంతతయా ఏకా క్రియా" పూర్వదేశసంబంధము విడిచి తగిన దేశాంతరప్రాప్తి పర్యంతము ఒకే క్రియ యుండుట కరణమగును. అంతట ఉత్తరసంయోగాంతముగా కర్మ యుండును. అభిలషితమయిన ఉత్తరసంయోగమె క్రియావధిగా నుండుట లోకమున ప్రసిద్ధము. ఇది యంతయు సౌందర్యానుప్రవేశమున సవిలాసముగా నుండవలెను కావున కరణ మని యనక నృత్తకరణ మనుట యయినది. నృత్తకరణమె కరణము; భీమసేనుడె భీముడు.

అభినవభారతిలో శ్రీమ దభినవగుప్తపాద గుప్తభావరేఖల నన్నిటిని సావధానముగ గుర్తించి శ్రీజాయను డిట్లు నిరూపించుట సముచితముగా నున్నది. ఇటుపై కరణముల నామసంకీర్తన మావశ్యకము.

కరణనామాని

తలపుష్పపుటం క్రాంతం ఛిన్నం సమనఖాంచితే
శకటాస్యం కటిచ్ఛిన్న ముద్ఘట్టిత నికుట్టకే
లలితం వలితం లీనం స్ఖలితం చక్రమణ్డలమ్
నివేశం స్వస్తికం సూచీవిద్ధ మప్యర్ధసూచికమ్
వక్షఃస్వస్తికమున్మత్తమర్ధరేచిత మర్గలమ్ ౧౦

అర్ధస్వస్తికమావర్తం పృష్ఠస్వస్తిక వర్తనే
భుజంగాంచిత విష్కమ్భే విక్షిప్తం దణ్డరేచితమ్
అర్ధమత్తల్లి మత్తల్లీ మదస్ఖలితలోలితే
ప్రేఙ్ఖోలితనితంబోర్ధ్వజానుపార్శ్వనికుట్టకమ్
పార్శ్వక్రాన్త మపక్రాన్త మతిక్రాంతం నికుఞ్చితమ్
విద్యుద్భ్రాన్తం కటిభ్రాన్తమురోమణ్డలసన్నతే
వినివృత్త నివృత్తాపవిద్ధాని గరుడప్లుతమ్
లలాటతిలకం దోలపాదం తలవిలాసితమ్
తలసంస్ఫోటితం దణ్డపక్షమాక్షిప్తరేచితమ్
జనితోపసృతోద్వృత్తాన్యసహిద్ధాని శుంభితే
విక్షిప్తాక్షిప్త మాక్షిప్తం భుజఙ్గత్రస్తరేచితమ్
మణ్డలస్వస్తికం దణ్డపాదం పాదాపవిద్ధకమ్
భుజఙ్గత్రాసితం విష్ణుక్రాన్తం స్వస్తికరేచితమ్
ఏలకాక్రీడసంభ్రాన్తే సింహాకర్షితసర్పితే
నాగాపసర్పితం పార్శ్వజానువృశ్చికరేచితమ్
లతావృశ్చికవైశాఖ రేచితే హరిణప్లుతమ్
దిక్స్వస్తిక గజక్రీడా చతురాణి కటీసమమ్
మయూరలలితాలాతే సింహవిక్రీడకుఞ్చితే
వృశ్చికం వ్యంసితం కంపపరివృత్తవివర్తితే
రేచకాదినికుట్టోరూద్వృత్తే వృశ్చికకుట్టితమ్
తలసంఘట్టితం గణ్డసూచీ భ్రమరనూపురే
ఘూర్ణితం వృషభక్రీడం కరిహస్తం ప్రసర్పితమ్
వలితోరుకగృధ్రావలీనే అర్ధనికుట్టితమ్
గజావతరణం చైవముక్తాన్యష్టోత్తరం శతమ్

## కరణనామములు.

తలపుష్పపుటము — క్రాంతము — భిన్నము — సమనఖము —
అంచితము — శకటాస్యము — కటిచ్ఛిన్నము — ఉద్ఘట్టితము —
నికుట్టకము — లలితము — వలితము — లీనము —
స్ఖలితము — చక్రమండలము — నివేశము — స్వస్తికము —
సూచి — సూచీవిద్ధము — అర్ధసూచి — వక్షఃస్వస్తికము —
౨౧ ఉన్మత్తము — అర్ధరేచితము — అర్గలము — అర్ధస్వస్తికము —
ఆవర్తము — పృష్ఠస్వస్తికము — వర్తితము — భుజంగాంచితము —
విష్కంభము — విక్షిప్తము — దండరేచితము — అర్ధమత్తల్లి —
మత్తల్లి — మదస్ఖలితము — లోల్లితము — ప్రేంఖోల్లిత —
నితంబము — ఊర్ధ్వజానువు — పార్శ్వనికుట్టక — పార్శ్వక్రాంత —
౪౧ అతిక్రాంత — అపక్రాంత — నికుంచిత — విద్యుద్భ్రాంత —
కటిభ్రాంత — ఉరోమండల — సన్నత — వినివృత్తము —
నివృత్తము — అపవిద్ధము — గరుడప్లుతము — లలాటతిలకము —
దోలాపాదము — తలవిలాసితము — తలసంస్ఫోటిత — దండపక్ష —
ఆక్షిప్తరేచిత — జనితము — ఉపసృత — ఉద్వృత్త —
౬౧ అవహిత్థ — నిశుంభిత — విక్షిప్తాక్షిప్త — ఆక్షిప్త —
భుజంగత్రస్తరేచిత — మండలస్వస్తిక — దండపాద — పాదాపవిద్ధ —
భుజంగత్రాసిత — విష్ణుక్రాంత — స్వస్తికరేచిత — ఏలకాక్రీడిత —
సంభ్రాంత — సింహాకర్షిత — సర్పిత — నాగాపసర్పిత —
పార్శ్వజాను — వృశ్చికరేచిత — లతావృశ్చిక — వైశాఖరేచిత —
౮౧ హరిణప్లుత — దిక్స్వస్తిక — గజక్రీడిత — చతుర —
కటీసమ — మయూరలలిత — అలాత — సింహావిక్రీడిత —
కుంచిత — వృశ్చిక — వ్యంసిత — పరివృత్త —

వివర్తిత - రేచకనికుట్టిత - ఊరూద్వృత్త - వృశ్చికకుట్టిత -
తలసంఘట్టిత - గండసూచి - భ్రమర - నూపుర -
౧౦౧ వృషభక్రీడిత - కరిహస్త - ప్రసర్పిత - వలితోరు -
గృధ్రావలీన - అర్ధనికుట్టక - గంగావతరణ.

ఏతేషామేవ ముఖ్యత్వం వాక్యార్థాభినయే సతి ౩౫
పదార్థాభినయేఽప్యేకవాక్యార్థానుప్రవేశతః
ఆదౌ మధ్యేఽవసానే వా కుర్యాత్తాని యథోచితం
ప్రాధాన్యఖ్యాపనాయేతి రహస్యమిదమీరితం
యత్రాభినయహస్తానాం ప్రాధాన్యే కరణే భవేత్
వాక్యార్థాభినయస్తత్ర కార్యో నృత్తే న కేవలే ४०
నృత్తహస్తప్రధానం తు కరణం తత్ర శస్యతే

అష్టోత్తరశతకరణములను వాక్యార్థాభినయమునందు ముఖ్యముగా ప్రయోగింపవలెనని పదార్థాభినయము నందును వానిప్రయోగావశ్యకత యున్నదని యిచట నిరూపిత మగును. వాక్యార్థాభినయ మొనరింపవలసి యుండగా ఈ కరణముల ప్రయోగము ముఖ్యము. పదార్థాభినయము నందును వీని ప్రయోగ మావశ్యకమె. పదార్థాభినయము వాక్యార్థానుప్రవేశము పొందియున్నపుడే వీనినిప్రయోగింపదగును. పదార్థాభినయముల నొనరించునపుడు ఏకవాక్యానుప్రవేశప్రాధాన్యము ప్రఖ్యాపనము చేయుటకు కరణముల ప్రయోగింపవచ్చును. పదార్థాభినయముల ప్రారంభమునగాని మధ్యలోగాని యవసానమున గాని యథోచితముగా కరణముల ప్రయోగింపజనును. ఇట్టి ప్రయోగమంతయు ప్రాధాన్యఖ్యాపనమునకెయగును. యథావసరముగా కరణప్రయోగమనునది నృత్తోపనిషత్తు. ఇది రహస్యప్రాయమయిన తత్త్వము. కరణమున నభినయహస్తములకు

ప్రాధాన్య ముండునేని యచట వాక్యార్థాభినయ మొనర్పవలెను. కేవల నృత్తమునందు కరణముల ప్రయోగ ముచితముకాదు. కేవల నృత్తమునందు నృత్తహస్తప్రధానమగు కరణమె ప్రశస్తము. అభినవగుప్తుని ఉపాధ్యాయుడయిన భట్టతోతుని భావ మీ విషయమున నిట్లున్నది.

"అభినయహస్తప్రధానస్య కరణస్య వాక్యార్థాభినయే ప్రయోగః న తు కేవల వర్తనాప్రధానస్య కేవల నృత్తహస్త ప్రధానస్య వా తస్య తు నృత్తే ప్రయోగః ప్రాధాన్యేన"

అభినయహస్తప్రధానమయిన కరణమునకు వాక్యార్థాభినయమున ప్రయోగముండును. అచట కేవల వర్తనాప్రధానమయిన కరణమునకుగాని కేవల నృత్తహస్తప్రధానమగు కరణమునకుగాని ప్రయోగముండును. అట్టి కరణమునకు నృత్తముననె ప్రధానముగ ప్రయోగముండును. అని ఇచట జాయపతి యభినవభారతిలోని అభినవగుప్త భట్టతోతుల యభిప్రాయమును చక్కగా గుర్తించి పొందుపఱచుట ముఖ్యముగా భావనీయము.

నర్తనారంభమున సముచితముగా నుండదగిన హస్తపాద విన్యాసమును, కరణప్రయోగమున యుక్తమయిన హస్తవిన్యాస ప్రకారమును నిరూపించిన పిమ్మటనే కరణముల లక్షణవినియోగముల ప్రదర్శనము హృదయగ్రాహి యగును. అందుకై యీ శ్లోకముల భావము లావశ్యకములు.

సమపాదం లతాహస్తావంగస్య చతురశ్రతా
సాధారణమిదం నృత్యప్రయోగారంభ ఇష్యతే
కరణేషూరసి ప్రాయో వామః స్యాత్కటకాముఖః
చరణస్యానువాదీ తు కరో వామేతరో భవేత్ ౪౫

యదా వామకరస్యాదౌ ప్రయోగః స్యాత్తదా పునః
వక్షఃక్షేత్రే విధాతవ్యో లతాహస్తస్తు దక్షిణః
చతురశ్రత్వహేతుత్వాద్వైష్ణవం కేచిదూచిరే
కరణాభినయేష్వేషు హస్తో వా చరణోఽథవా
ప్రాథమ్యాద్దక్షిణః ప్రోక్తో విశేషో యత్ర నోచ్యతే ౨౦

నృత్తప్రయోగారంభములో నిట్లుండవలెను. సమపాదమున స్థితి, లతాహస్తరీతితో నుండుట, అంగము చతురశ్రముగా నుండుట అనునది యారంభమున నుండుట సమ్మతము. కరణముల ప్రయోగసమయమున వామహస్తము కటకాముఖవిన్యాసమున సామాన్యముగా వక్షఃస్థలమున నుండవలెను. వామేతరమగు దక్షిణహస్తము చరణవిన్యాసము ననుసరించునదిగా నుండవలెను. వామహస్తమునకె ప్రథమమున ప్రయోగముండునేని అపుడు దక్షిణకరమును లతాహస్తముగా నొనరించి వక్షఃక్షేత్రమున కూర్పవలెను. కొందరు వైష్ణవస్థానమునె సముచితముగా భావించిరి. అది చతురశ్రస్థితికి తగియుండును గావున వారట్లభిమానింతురు. కరణాభినయములలో నంతటను ప్రథమమయినందున హస్తము కాని చరణము కాని దక్షిణమె యగుట యుక్తము. ముందుగా కుడిచేతితో కుడిపాదముతో విన్యాస మారంభించుట యుక్తము. ఇవి సర్వకరణములందును సామాన్యవిధి. కొన్ని కరణములలో మాత్రము వామకరమునకు వామహస్తమునకు ప్రాధమ్య ముండుట నిర్ణీతము కావచ్చును. అట్లు విశేషము సూచితము కానంత వఱకంతట హస్తపాదములు దక్షిణములగుటయె శాస్త్రసమ్మతము.

అంగహారముల కుపకరించునవి యని కరణములు నిరూపితము లయినవి. అవి యష్టోత్తర శతమనుట స్పష్టము. "ఏవముక్త్వా

ష్టోత్తరం శతం'' అని వేరుగా ననేల? ఇట్లు సంఖ్యానిరూపణ మున ప్రయోజన మేమి? ఈ ప్రశ్న లుదయింపగా నిట్లు భావించుట యుక్తము. అభినయవస్తువుగా నృత్తమున్నది కదా! అట్టి నృత్తములో నీ కరణము లుండుట ప్రసిద్ధమె. అభినయమున కభినయమునకు కొంత యంతరాల ముండును. ఆ యంతరాలచ్ఛిద్ర ప్రచ్ఛాదనమునకై యొక ప్రయోగ మావశ్యకము. అట్లే శస్త్రాది యుద్ధములలో బాహుయుద్ధములలో కరణముల ప్రయోగ మావశ్యకము. అంగప్రయోగసౌష్ఠవమునకును కరణప్రయోగ మపేక్షితము. అట్లే నానావిధములగు గతిప్రచారములు కలవుకదా! వాని పరిక్రమములలో పరిక్రమణములలో వేరుగా వేరువేరుగా కొన్నికరణముల ప్రయోగముండుట ప్రసిద్ధముగ గోచరించుచునె యున్నది. అప్పు డీ యష్టోత్తరశతమె యుపయోగి యనలేము. ఇంత కతిరిక్తముగా నితరము లావశ్యకము లగును. ఇచట అష్టోత్తరశతమని యనుట నిరూపితములు కానున్న అంగహారములందు వీని వివియోగము సూచించుటకై యగును. భరతగ్రంథమున గూడ అష్టోత్తర శతమని యనుట గోచర మగును. అచట నీ భావమె పరిగ్రాహ్యము. కొన్ని పాఠములలో భరతగ్రంథములలో నీ ''అష్టోత్తరం శతం'' లేదు.

స్థానములు చారిగతులు నృత్తహస్తములు అనునవి మాతృక సర్వమూలములు. ఉత్పత్తికారణము. ఇవి కరణోత్పత్తికారణము లని భావము. ఈ మాతృకాయోగమున కరణముత్పన్నమగు ననుట కరణముల మహాసామాన్యస్వరూపము. ఇందు అవస్థానము గతి యని రెండు గలవు. కరణ మీ ద్వయ నిర్వర్త్యము. అందవస్థానమునందు స్థానకము కరములకు కాయమునకు నుపయోగించును. గతిలో చారులుపయోగించును. పూర్వకాయగతిలో నృత్తహస్త

ములు దృష్టు లుపకారములు. స్థితిలో పతాకాదు లుపకారులు. కావున కరణము గతిస్థితిసమ్మిలితమని భావము. కాగా కరణము లనంతము లగును. అయినను అంగహారోపయోగము ననుసరించి అష్టోత్తరశత మనుట యుక్తమని తాత్పర్యము.

ఇక ఉద్దేశక్రమానుసారముగా తలపుష్పాదుల లక్షణ వినియోగ కథన మావశ్యకము.

## అష్టోత్తరశతకరణలక్షణాని

### ౧ తలపుష్పపుటం

తలపుష్పపుటం తత్స్యాత్ యత్రాధ్యర్ధిక యా పదం
నిష్క్రామేద్దక్షిణం పార్శ్వవ్యావృత్త్యా సమగౌ కరౌ
పరివృత్త్యా తయోర్వామం సన్నతం పార్శ్వమాగతౌ
వామస్తనసమక్షేత్రే స్యాతాం పుష్పపుటీ కృతౌ
తలసంచరపాదశ్చ కర్తవ్యః ప్రోక్తలక్షణః ౫౫
తలమిత్యేకదేశేన జ్ఞేయోఽత్ర తలసంచరః
తేన పుష్పపుటం యుక్తం తలపుష్పపుటం విదుః
ఏవం సర్వత్ర విజ్ఞేయాః కరణేషు నిరుక్తయః
దీయతే నర్తనారంభే దేవేభ్యః కుసుమాంజలిః
అనేనకరణేనేతి పూర్వమస్య ప్రకీర్తనం ౬౦
అంతే మంగలరూపత్వాద్గంగావతరణం మతం

## అష్టోత్తరశతకరణలక్షణములు

### ౧. తలపుష్పపుటము.

దక్షిణపాదము అధ్యర్ధికచారీవిధానమున నిష్క్రమింపవలెను. కరములు రెండును పార్శ్వవ్యావర్తనమున సమగతములు కావలెను. వానిలో వామహస్తము పరివర్తనమున సంనతము

కావలెను. ఆ రెండును పార్శ్వగతములై పుష్పపుటాకృతి కలిగినవై వామవక్షఃస్థలమున నుండవలెను. పాదము తలసంచరచారీవిధాన మున నుండునట్లు చేయవలెను. ఇట్టిరీతి నుండుటను తలపుష్పపుట కరణమందురు. తలపుష్పపుట మనుటలో తల మను ఏక దేశపద మున తలసంచరమను చారిని గ్రహింపదగును. తలసంచారమున పుష్పపుట యుక్తముగా నున్నందున నిది తలపుష్పమన్న నామము కలదయినది. ఈ విధముగనె కరణములం దంతట నిరుక్తులను గ్రహింపవలెను

నర్తనారంభమున దేవతలకు కుసుమాంజలి ఈ కరణమున సమర్పితమగును. కావున కరణముల నిరూపణమున మొదటగా నీ తలపుష్పపుటప్రకీర్తనము సముచితము. కరణముల యుపసంహార ములో మంగలరూప మగుటవలన గంగావతరణ ముండుట యుక్త మని నాట్యవిదుల స్మృతి.

వామహస్తమున పుష్పపుటమును పార్శ్వమున పాదము అగ్రతల సంచరముగను పార్శ్వము సంనతముగ నుండగా తలపుష్ప పుటకరణమగును. ఇట్లు భరతుడు తలపుష్పపుటమును నిరూపించెను. ఇచట నభినవభారతీ భావ మిట్లున్నది. నృత్తము నం దంతటను సమపాదతలస్థితి హస్తద్వయము లతాహస్తమున నుండుట ప్రచుర ముగా నుండును. అనంతరము అధ్యర్ధిక చారీవిధానమున దక్షిణ పాదనిష్క్రమణము. దానితో సమకాలమున హస్తద్వయము వ్యావర్తితమై దక్షిణపార్శ్వమునకు ప్రసరించును. అనంతరము పరివర్తితకరణ వశమున వామపార్శ్వమున సౌష్ఠవముతో నుండును. హస్తము వామ స్తనక్షేత్రమున పుష్పపుటరీతితో నుండును. అగ్ర తలపాదము పుష్పపుటము అనువాని సంబంధమున తలపుష్పపుట

మగును. రెండు పదములలోని ఏకదేశముల కలయిక వలన "తల పుష్పపుటము" సిద్ధమయినది. ఇట్లె యితరము లందును నామ వాసన లభ్యాహ్యము లగును. ఇట్టి అభినవ భావార్థమును జాయపతి స్వీకరించి నిరూపించుట భావనీయము.

కరణములు వాక్యార్థాభినయమునసే ప్రధానముగా నా యోజితములు కావలెనని, ఏకవాక్యతా సంపాదనమున కయినచో పదార్థాభినయమున నివి యుక్తములగునని యిదివరలో సూచిత మయినది.

కొన్ని కరణముల నాచరించి యీ కరణ మొనరించు నపుడు పూర్వాపూర్వకరణములలోని హస్తపాదాదులు త్యక్తవ్యము లగును. ఉత్తరకరణము నందలి హస్తపాదాగు లాదాతవ్యములు నగును. అపుడు వర్తనాక్రమమున పూర్వము త్యజించుటకాని అతుత్రిటితముగా నుండునట్లు ఇతరము గ్రహించుట కాని సంపన్నము కావలసియున్నది. ఇట్టి దంతయు నృత్తచార్యగోపితమయిన తత్త్వము. నృత్తాచార్యులకు మాత్రి ముపయోగించు రీతి దీని విస్తర మపేక్షితముకాదు. అయినను యథావసరముగా నిరూపించు లయు యుక్తమె గ్రంథమునందు నవి సూచితములగును. అర్ధ్య ర్ధికా స్వరూపము చెప్పునపుడు సవ్యపాదమునకు వెనుక వామపాద మున్నపుడు దాని యపసరణ ముచితమగుట యున్నది. అట్లే కని ష్ఠిక మొదలగు నంగుళులు లోపలి భాగమున ఆవర్తితము లగు నపుడు — అనియు, "కనిష్ఠికాదులు వెలుపలగా క్రమమున ఉద్వర్తి తము లగునపుడు" అనియు నా యా స్వరూపకథనము లందున్నది. ఇచటి వ్యావృత్తపరివర్తనములు త్యక్తవ్యాదాతవ్యవిశేషములనె నిరూపించుట స్పష్టముగనె యున్నది. ఇట్లె యవి యుండగలవు.

ఇట్లె తర్జన్యాదికముగా ఆవేష్టిత పరివేష్టితములు నిట్టివె యని యభ్యూహింపవలెను.

## ౨. క్రాంతం

కృత్వా చారీమపక్రాంతాం పాత్యమానం నికుంచితం
పృష్ఠతః స్థాపయిత్వాంఘ్రిం పురతస్తం ప్రసారయన్
వ్యావర్తితేన నిష్క్రాంతమాక్షిప్తపరివర్తితం
కరం వక్షసి తద్దిక్కం విదధ్యాత్కటకాముఖం
యదాంగాంతరమప్యేవం తదా క్రాంతముదీరితం ౬౩

## ౨. క్రాంతము.

అపక్రాంతచారి నాచరించి పాత్యమానచరణమును పృష్ఠతః నికుంచితముగా గూర్చవలెను. పృష్ఠతః కుంచితమయిన పాదమును ఆకర్షించి పురోభాగమునకు ప్రసారిత మొనర్పవలెను. పిమ్మట హస్తములను విచలితములనుజేసి వ్యావర్తితవిధానమున దేహక్షేత్రమునుండి వెలువడజేసి మరల పరివర్తితవిధానమున హస్తమును వక్షఃస్థలమున నదే దిశగా కటకాముఖముగా జేయవలెను. ఇట్లే అంగాంతరమున గూడ జేయునది. అప్పు డది క్రాంత మను కరణ మగును. ఉద్ధతపరిక్రమము నందు దీనిని వినియోగింతురు. భరతలక్షణము దురూహ్యముగా నున్నదని అభినవుడు స్పష్ట మొనరింపగా తద్వ్యాఖ్యానమును క్రోడీకరించి జాయనుడు శ్లోకీకరించెను. ఇట్లే నానాస్థలములం దభినవానుసరణ మున్నది. అది సర్వమభినవభారతీపరిజ్ఞానగమ్య మనుట పునరుక్త మయిన నావశ్యకము.

## ౩. ఛిన్నం

వైశాఖస్థానకం యత్ర ఛిన్నా స్యాత్క్రమశః కటీ
అలపద్మ స్తథా పార్శ్వక్షేత్రే తస్యాః కరో భవేత్
తత్తాలభంజనే ఛిన్నమంగస్య ప్రతిసారణే

## ౩. ఛిన్నము.

ఇందు వైశాఖస్థానక మున్నది. క్రమముగా కటి ఛిన్న మగుట యున్నది. అలపద్మహస్తము కటిపార్శ్వక్షేత్రమున నుండుట యున్నది. ఇది ఛిన్నకరణము, దీనిని అంగప్రతిసారణములో తాల భంగములో వినియోగింతురు. పార్ష్ణి భాగముల సమనోన్నమనములచే కటిచ్ఛేద మూహింపవలెను. సమనోన్నమనములను పర్యాయమున నొనర్పవలెను. కటిపార్శ్వక్షేత్రమున నట్లుండుట కటిచ్ఛేదము కరతలమున నంగుళు లావర్తనము పొందుట యను అలపల్లవము గ్రాహ్యము. అది యీవర్గతాగత పర్యాయమున హస్తద్వయమున ప్రయుక్తమగును. వైశాఖస్థానకము కూడ కటిచ్ఛేద యగుటయు నిందు భావనీయము, దీని వినియోగ ప్రయోగము స్పష్టము.

## ౪. సమనఖం

పాదౌ సమనఖశ్లిష్టౌ స్యాతాం యత్ర లతాకరౌ
స్వభావావస్థితః కాయః స స్యాత్సమనఖాభిధః ౩౦
నృత్యప్రవేశనారంభే వినియోగోఽస్య సంమతః
జపాదివిషయే ప్రోక్తో విచారవిముఖైః పరైః
ప్రలంబితావితిప్రోక్తౌ భరతేనాత్ర యే కరౌ
తౌ దోలాలితిమన్యంతే యత్తత్కేచిన్న సాంప్రతం
శూకైకవిషయావేతావితి మన్యామహే వయా ౩౧

## ౪. సమనఖము.

ఇందు పాదములు సమనఖశ్లిష్టము లగును. లతాహస్తములతో హస్తము లుండును. దేహము స్వభావావస్థితముగానుండును. ఇట్లున్న నిది సమనఖ మను కరణ మగును. నృత్తప్రవేశసమారంభములో నీ సమనఖకరణ వినియోగ ముండును. కొందరు జప్యమంగ

లాది విషయమునగూడ సమనఖకరణవినియోగము పలికిరి. ఆ పలికినవారు విచారవిముఖులు. దీని లక్షణకథనమున భరతుడు—"శ్లిష్టౌ సమనఖౌ పాదౌ కరౌ చాపి ప్రలంబితౌ"అని యనెను. ఇచటి ప్రలంబిత పదమునకు కొందరు దోలాహస్తములను నర్థము చెప్పిరి. అది యుక్తముకాదు. ప్రలంబితకరము లనగా లతాహస్తము లనియే భావింపవలెను. ఈ స్థలమున నభినవభారతి యిట్లున్నది. "ప్రలంబితకరావితి లతాహస్తౌ మంతవ్యౌ నతు దోలాహస్తౌ తయో రేకవిషయయో రత్రవర్తనాయా శ్చాతురశ్ర్యభంగ హేతుత్వాత్ తిర్యక్ప్రసారితౌ చైవ పార్శ్వసంస్థౌ లతాకరౌ" దీని యర్థమిట్లు భావనీయము. ప్రలంబితకరము లనుట లతాహస్తము లని భావింపవలెను. దోలాహస్తములు అని భావింపరాదు. ఏకవిషయములయిన వాని వర్తనము చాతురశ్ర్యభంగహేతు వగునుగదా! పార్శ్వగతములు తిర్యక్ప్రసారితము లగునని లతాహస్తములని లక్షణము. అభినవభారతిలో "తయో రేకవిషయ యోః"అని యుండగా జాయనుడు "శ్లో కైకవిషయా వేతౌ" అని వ్రాసెను. అందువలన అభినవపాఠము "తయోః శ్లోకవిషయయోః" అని యుండదగును. అభినవభారతి ప్రథమముద్రణములో ద్వితీయముద్రణములో గూడ "తయో రేకవిషయోః" అనియే యున్నది. "అత్రవర్తనాయాః చాతురశ్ర్యభంగ హేతుత్వాత్"అని అభినవపంక్తి ఏకవిషయముగా నుండునది చాతురశ్ర్యభంగ హేతువని యభినవుడు భావించి యుండునా? దోలావర్తనము భంగహేతువని లతాహస్తము భంగ హేతువు కాదని యచటి భావమై యుండునా?

దోలాహస్తములు శ్లోకైకవిషయములనియే మేము భావింతుము. భరతుడు నిరూపించిన కరములు దోలాహస్తములుకావు. లతాహస్తములె అని భావసారము.

### ౫. అంచితం

ఉక్తోఽర్ధస్వస్తికే హస్తో దక్షిణో యస్స ఏవ చేత్
వ్యావృత్త్య పరివృత్త్య చ నాసాదేశేఽలపద్మవత్
అంచితాంఘ్ర్యనుసారీ స్యాత్తదంచితముదాహృతం
ఏతస్య సమ్ముఖీనాత్మవిషయే భృశకౌతుకాత్
వాక్యార్థే వినియోగః స్యాన్మతో నిర్వర్ణనాత్మకే ౭౦

### ౫. అంచితము.

అర్ధస్వస్తికమున నిరూపితమయిన దక్షిణహస్తము వ్యావృత్తికలదై పరివృత్తికలదై అలపద్మమువలె నాసాదేశమున నుండు నేని అంచితపాదము ననుసరించి యుండునేని అంచితకరణ మగును. దీనిని ఆత్మసామ్ముఖ్యముకలవాని విషయమున వినియోగింతురు. స్వాతిశయకౌతుకప్రధానమయిన వాక్యార్థమున వినియోగింతురు. నిర్వర్ణనాత్మకమగు వాక్యార్థమున వినియోగింతురు.

ఈ అంచితకరణము నిరూపించుటకు పూర్వము అర్ధస్వస్తిక కరణమును భావించుట యుక్తము. స్వస్తికచరణము లుండుట దక్షిణము కరిహస్తముగా నుండుట వామహస్తము వక్షఃస్థానమున నుండుట అర్ధస్వస్తికకరణ స్వరూపము. ఇచట కరిహస్త మనుటకు కటిహస్తమును కొందరు భావించిరి. ఈ యంశ మర్ధస్వస్తికకరణ లక్షణ కథనసమయమున స్పష్టము కాగలదు.

అర్ధస్వస్తికకరణములో నిరూపితమయిన కరిహస్తము వ్యావర్తితకరణమున నాసాక్షేత్రమున నుండగా అంచితకరణమగు ననుట యుక్తము. అపుడది యలపల్లవాకృతి కలదై అంచితోదంచిత సారణానుకారి యగును. గావున అంచిత మనుట యుక్తము.

సర్వవిధములయిన అభినయహస్తములకును నానావిధకరణములకును వాక్యార్థాభినయమునందె ప్రయోగము యుక్తము. కేవలము వర్తనాప్రధానమునకు కేవల నృత్తప్రధానమునకు వాక్యార్థాభినయపర్యంతస్థితి యక్కఱలేదు. అట్టిది ప్రధానముగా నృత్తమున ప్రయోగము పొందగలదు. ఇందు కొందరి భావభేదము నిరూపితము కాగలదు.

కరణలక్షణములను యథోద్దేశముగా జాయపతి నిరూపించెను. భరతక్రమ మిందు మారినది, అట్టి క్రమవివరణామమున విశిష్టభావ మేదియులేదు. ఇట్టి మార్పువలననె అంచితకరణము గుర్తించుట కర్థస్వస్తికము గుర్తించుట ఆవశ్యకమయినది. ఇట్టి రీతుల సమాలోచన మావశ్యకము కాదు.

## ౬. శకటాస్యం

పాదేనశకటాస్యాయాం సమంహస్తం ప్రసారయేత్
తద్దిక్కమపరం కుర్యాద్వక్షస్థం కటకాముఖం
యత్ర స్యాత్ శకటాస్యం తత్ క్రీడాగోపాలఖేలనే
అభ్యధత్త కరావత్ర భట్టతండుస్తు రేచితౌ
పాదావాదాయ హస్తాభ్యాం ద్విత్రిః కుర్యాద్గతాగతం ౭౫
శకటాకారతాం బిభ్రదితి క్షైత్రిధరం మతం

## ౬. శకటాస్యము.

శకటాస్య యను చారీగతిలో నిర్దేశించిన పాదముతో సమానముగా హస్తమును ప్రసారితము చేయవలెను. రెండవహస్తమును కటకాముఖముగా నొనరించి యా దిశగా వక్షస్థ మగునట్లొనరింపవలెను. ఇట్టిది శకటాస్యకరణము. క్రీడాగోపాలుని ఖేలనమున నిది వినియుక్త మగును. చిన్నతనపు ఆటలలోనున్న బాలగోపాలుని

క్రీడానుకారమున నుపయోగించును. ఇచటి వినియోగము సూచించుటలో "తథావిధ బాలక్రీడాది విషయే" యని యభినవభారతిలో నున్నది. తదనుసారమున "క్రీడాదే బాలఖేలనే" అను పాఠముండుట యుచితమని కొందరి భావము, సంగీతరత్నాకరమున గూడ "తాదృశే బాలఖేలితే" యని యుండుటయు నిందు నిదానము.

నిషణ్ణాంగుడై తలసంచర చరణము ప్రసారింప జేయుటయు ఉరము నుద్వాహిత మొనరించి శకటాస్యచారి ననుకరించుటయు శకటాస్యకరణ లక్షణముగా భావించుట భరతోక్తి. నిషణ్ణాంగత = నిస్సమీకృతముగా నంగ మొనరించుట, పదములు జానుసమస్థితము లగుట, గుల్ఫదేశమున పాదము కుంచితమగుట ప్రసారితమగుట యిందుండును. తత్సహితముగా రెండవహస్తము వక్షమున కటకాముఖముగ నుండవలెను. ఈ సన్నివేశమున శకటము నుత్క్షేపింపదగును. నెట్టవచ్చును. బండిని త్రోయుటవంటి బాలక్రీడలు కల భాణికాది విషయమున దీని ప్రయోగ మున్నది.

## ౭. కటిచ్ఛన్నం

పార్శ్వాభ్యాం భ్రమరీం కృత్వా మండలస్థానకం భజన్
దధచ్ఛిన్నాం కటిం ఛాయామలపద్మ పతాకయోః
స్కంధే చ విదధ్ధస్తం కుర్యాదంగాంతరేణ చ
ద్విశ్చతుర్వా క్రియా యత్ర తత్కటిచ్ఛిన్నమిష్యతే
విస్మయాత్మని వాక్యార్థే విద్భిరేతద్విధీయతే ౮౫

## ౭. కటిచ్ఛన్నము.

పార్శ్వములచే భ్రమరి నాచరించి మండలస్థానకమున నుండవలెను. పిమ్మట ఛిన్నమగు కటిభాగమును అలపద్మచ్ఛాయను పతాకచ్ఛాయను ధరింపవలెను. స్కంధమున హస్తము నుంచ

వలెను. అంగాంతరమునగూడ నక్లై చేయవలెను. ఇట్లు రెండు పర్యాయము లొనరించునది. నాలుగు పర్యాయము లాచరించునది. అపుడది కటిచ్ఛిన్నకరణము కాగలదు. దీనిని విస్మయాత్మకమయిన వాక్యార్థము నందు నృత్తవిదులు ప్రయోగింతురు. ఇచట లక్షణ వాక్యములలో "ఛాయాం అలపద్మ పతాకయోః" అనుట పల్లవ హస్తమని గుర్తింపవలెను. భరతు డీ స్థలమున పల్లవహస్తములనె పలికెను. అభినవభారతి యిట్టి భావమునె సూచించెను. దానినె జాయపతి స్పష్టముగ గుర్తించెను. కటిమధ్యభాగమున వలనముండగా కటిచ్ఛిన్న మగును. ఇది పర్యాయశః ఉండవలెను. పతాకహస్తములు మణిబంధనముక్తము లగుట పల్లవము లగును. కటి పర్యాయశః ఛిన్నమై యుండగా బాహువుల శిరమున = అగ్రభాగమున పల్లవము లుండగా అట్లు పునఃపునః కరణముండుట కటిచ్ఛిన్న మగును.

దీని యోజనము నభినవభారతి యిట్లు వ్రాసినది. భ్రమరీ చారీ గతి చె పర్యాయమున పార్శ్వద్వయభ్రమణ మొనరించి మండల స్థానకమున నుండి బాహు శిరస్సునందు పతాకాలపల్లవచ్ఛాయా ద్వితీయమయిన పల్లవహస్తమును పర్యాయద్వయమున ధరించి కూర్పవలెను. అన్యాంగమున గూడ నిక్లై యొనర్చునది. "త్రిశ్చతుర్వా ప్యేవ క్రియా" మూడు నాలుగు పర్యాయము లయిన నిక్లై క్రియ యుండదగును. విస్మయప్రధాన వాక్యార్థ మభినయించుటలో దీని ప్రయోగ మున్నది. విస్మయప్రాధాన్యము నిరూపించుటకె యిందు అలపల్లవము చెప్పుటయు నుండును.

## ౮. ఉద్ఘట్టితం

యస్మిన్నుద్ఘట్టితో వంఘ్రీః క్రమాత్పార్శ్వే చ సన్నతే

వర్తితాలతలౌ హస్తావేతదుద్ఘట్టితం మతం
ఉత్సవానందనృత్తేఽస్య ప్రయోగః పరికీర్తితః

౮. ఉ ద్ఘ ట్టి త ము.

ఈ కరణమున పాదము లుద్ఘట్టితము లగును. పార్శ్వభాగములును క్రమముగా సన్నతము లగును. హస్తతలభాగములు తాలవిధితో నుండును. పాదతలాగ్రమున నుండుటయు, భూమియందు పార్ష్ణిభాగముల నుంచుటయు, హస్తములు తాళము వేయుట కుద్యతములై యుండుటయు నిందు న్నేయము. మరల రెండవపాదము ఉద్ఘట్టితమై క్రమముగా పార్శ్వములకు నమనము కూర్చుటయు నభ్యాస్యము. "ప్రమోదవిషయ మేతత్"

౯. ని కు ట్ట కం

మండలస్థానకే స్థిత్వా చాతురశ్ర్యాదనంతరం
హస్తముద్వేష్టితం సవ్యం స్కంధోద్దేశే నికుట్టయేత్ ౯౦
తమేవోద్ఘట్టితం పాదం కుర్యాద్వామం యథాస్థితం
పాణిపాదమథావిద్ధవక్రవర్తనయా కరం
తమేవ చతురశ్రం చ తస్యైవ సమకాలతః
అంగం నికుట్టయేదన్యత్పూర్వవద్యత్ర తత్స్మృతం
నికుట్టకం ముహుర్వాక్యే స్వస్య శ్లాఘాప్రధానకే ౯౫
అలపద్మ కనీయస్యాః పతనోత్పతనాత్మకం
నికుట్టకమిహ జ్ఞేయం స్కంధే కోహలసమ్మతం

౯. ని కు ట్ట క ము.

చాతుర్యశ్రీ ననుసరించిన పిమ్మట మండలస్థానకమునందుండి సవ్యహస్తము నుద్వేష్టిత మొనరించి స్కంధప్రదేశమున నికుట్టితముగా నొనరింపవలెను. "ఉన్నమనం వినిమనం స్యాదంగస్య

నికుట్టనం" అని కోహలవచనము. అంగమును పైకెత్తుట ఉన్నమనము క్రిందికి దింపుట వినిమన మని గుర్తింపవచ్చును. మండలస్థానకమునందున్న వామపాదమును యుద్ఘట్టిత మొనరించి యథాస్థితముగ జేయవలెను. పాణిపాదము యథాస్థితముగ నుండగా ఆవిద్ధవక్రవర్తనమున హస్తమును చతురశ్రముగ గూర్చునది. ఆవిద్ధవక్రవర్తనమున కరము చతురశ్రముగా నున్నపుడే ఆ సమకాలముననె అంగమును నికుట్టిత మొనరింపవలెను. పూర్వమువలెనె అంగమునకు ఉన్నమన వినిమనము లుండునట్లు కూర్పవలెను. అపు డది నికుట్టకకరణ మగును. స్వశ్లాఘాప్రధానమయిన పునఃపునః ప్రయోగించు వాక్య మభినయించుటలో నీ కరణ ముపయుక్త మగును. అలపద్మహస్తమునకు సంబంధించిన కనీయసి — చివరివ్రేలు పతనోత్పతనముల స్వరూపమున నుంచుట నికుట్టకమని అది స్కంధప్రదేశమున నుండదగునని కోహలమతము. కోహల సమ్మతము.

ఈ కరణము నందలి భావము సర్వ మభినవభారతీప్రసూతము. అంగముయొక్క ఉన్నమన వినిమనములు నికుట్టమని సంభావించినందున అలపల్లవహస్తముయొక్క కనిష్ఠాంగులి పతనోత్పతనప్రకారము నికుట్టన మగును. భరతగ్రంథమునగూడ భావ మిట్లె పరిగ్రాహ్యము. అర్ధనికుట్టకము చెప్పునపుడు భరతుడు పాదములంచితములగుట నిరూపించెను. అపుడు పాదమునకును ఉద్ఘట్టితరూపత యున్నది. పాదతలాగ్రముననుండి పార్ష్ణిభాగమును భూమియందు నిపాతిత మొనరింపగా ఉద్ఘట్టిత మగును. మండలస్థానకమునందుండి స్వబాహుశిరోంతరమున హస్తములు నికుట్టితము లగుటయు పాదములు నికుట్టితము లగుటయు నికుట్టకకరణము. అంగద్వయమున పర్యాయప్రయోగ మావశ్యకము. దక్షిణహస్తమున ప్రయో

గముండుచో దక్షిణపాదమె వామహస్తమున ప్రయోగముండుచో వామపాదమె ప్రయుక్తమగును. కాగా భావార్థ మిట్లు సిద్ధమగును. మండలస్థానకమున నుండి చాతురశ్ర్యము నవలంబించి తదనంతరము ఉద్వేష్టితకరణమున హస్తము సారించి స్కంధశిరమున నికుట్టిత మొనరింపవలెను. ఆ పాదమునె ఉద్ఘట్టిత మొనరింపవలెను. వామ హస్తము నావిద్ధవక్రవర్తన విధానమున చతురశ్రీకరింపవలెను. ఈ చెప్పిన విధముననె రెండవ యంగమును సమకాలముననె నికుట్టితము చేయవలెను. ఇట్లు అభినవుడా యోజన మొనర్పగా జాయనుడు శ్లోకీకరించెను. ఆత్మసంభావనా ప్రధానమగు వాక్యార్థ మభినయింప వలసియున్నపు డీ కరణ ముపయుక్త మగును.

## ౧౦. లలితం

కేశబంధనితంబాఖ్యహస్తయోరనుసారతః
అసకృద్దక్షిణం హస్తమపవర్తితమాచరేత్
పాదం చోద్ఘట్టితం కుర్యాద్వామః కరికరః పరః ౧౮౦
ముహురంగద్వయేనైష యత్ర తల్లలితం మతం
స్యాన్నృత్యనృత్తయోరస్య ప్రయోగస్సవిలాసయోః

## ౧౦. లలితము.

కేశబంధము నితంబము అను హస్తముల యనుసారమున దక్షిణహస్తమును మఱలమఱల నపవర్తిత మొనరింపవలెను. పాద ముద్ఘట్టితము చేయవలెను. వామహస్తము కరిహస్తముగా నుండ వలెను. ఇట్లు మఱలమఱల అంగద్వయమున నీ విధాన మనుసరించు నది. ఇట్టిది లలితము కాగలదు విలాససహితములయిన నృత్య నృత్తములందు లలితకరణ ప్రయోగ మావశ్యకము.

వామము కరిహస్తమై దక్షిణము వివర్తితమై పాదము బహుశః కుట్టితమై యుండుట లలితకరణము. వామము సమున్నతమై లతాహస్తముగా పార్శ్వమునుండి పార్శ్వమునకు విలోలితమై యుండుట యుదక్షిణము వివిధముగా వర్తితమగుటయు నితంబహస్తములు బాహుశీర్ష వినిష్క్రాంతములగుటయు కేశబంధహస్తములు కేశదేశ వినిష్క్రాంతములై పార్శ్వోత్థితములగుటయు నభినవానుసారమున దెలియవలయును. ఇట్లిందు నృత్తహస్తయోజన మున్నది. వర్తనాంతమున కరిహస్తము హస్తానుసారమున పాదము నికుట్టితము. ఇట్లే యితరాంగమునగూడ యోజనీయము. ఈ కరణము సవిలాసనృత్త విషయము. కావున లలితము.

## ౧౧. వలితం

అపక్రామతి దేహస్య క్షేత్రాత్సూచీముఖే కరే
సూచీపాదోప్యపక్రామే త్తద్దిక్కో భ్రమరీ తతః
పునరంగాంతరేణైవ యత్ర తద్వలితం మతం ౧౦౫

## ౧౧. వలితము

సూచీముఖహస్తము శరీరప్రదేశమునుండి యపక్రాంతమగునపుడు సూచీపాదముకూడ అపక్రాంతము కావలెను. పిమ్మట తద్దిక్కముగా భ్రమరి యుండవలెను. ఇట్లే అంగాంతరమున గూడ నొనరింపవలెను. ఇట్లుండగా నది వలితమనుట మతము. ఇందు భ్రమరికాచారీక్రియానంతరము త్రికపరివర్తన మావశ్యకము. త్రిక వలనమున్నందున వలితము.

## ౧౨. లీనం

ఊర్ధ్వమండలినౌ కృత్వా తతో వర్తనయానయోః
వక్షఃస్థలేఽంజలిం కుర్యాత్ శిరో యత్ర నిహంచితం
తల్లీన మితి విజ్ఞేయం ప్రియాయాః ప్రార్థనం ప్రతి

## ౧౨. లీనము.

లీనకరణమునందు ఊర్ధ్వమండలరూపములయిన నృత్తహస్తములను మొదట ప్రయోగింపవలెను. అనంతరము వాని వర్తనాక్రమమున వక్షోదేశమునందు అంజలిహస్తమును కూర్పవలెను. ఇట్లుండుటయె పతాకాగ్రహణమునకు ప్రయోజనము. అంజలిహస్తమును నలినీపద్మకోశవర్తనమున సంపన్నముచేయుట యుక్తము కాదు. ఊర్ధ్వమండలవర్తనముననె సంపాదింపవలెను. అపుడె పతాకాహస్తములకు స్ఫుటప్రయోగము ఉపపన్నమగును. ఇచటి అంజలిని పతాకాంజలి యని భరతు డనెను. ఇట్లనుటవలననె ఊర్ధ్వమండలవర్తనమున పతాకాస్ఫుటత యుండవలెనని భాసించును. ఇది లౌకికమయిన అంజలికాదని సూచించుటకు "పతాకాంజలి" యని భరతు డనెనని భావించుట యుక్తముకాదు. లౌకికాంజలి శంకాశమనము యుక్తఫలముకాదు. "లౌకికాంజలి శంకాశమనంతు సతితాంత్రికే తుచ్ఛఫలం" శాస్త్రీయ ఫలముండగా లౌకికశంకాశమనము చెప్పుట తుచ్ఛఫలమె. ఇట్లిది హస్తవిధి. పిమ్మట శిరము నిహంచిత మొనరించుట యుక్తము. నిహంచిత శిరోయోగమున అంసకూటముల నిహంచితత్వముండుట నూహింపవలెను. ఇట్లుండగా నిది లీనకరణ మగును. దీనిని ప్రియాపార్థనోద్దేశమున వినియోగింతురు. ప్రియుపార్థనా వాక్యార్థాభినయమున ప్రయోగింపదగును. అంజలి వక్షస్థము కావున దేవతాప్రణామమున దీని ప్రయోగింపరాదు. దేవతాప్రణామమున అంజలి శిరస్థమగుట తంత్రసిద్ధము.

## ౧౩. స్ఖలితం

గమనాగమనే దోలాపాదపాదం సమాచరేత్
తద్వద్బాహుశ్చ తద్దిక్కో హంసపక్షోపలక్షితః ౧౧౦
ఏవ మంగాంతరం యత్ర స్ఖలితం తదుదాహృతం

## ౧౩. స్ఖ లి త ము.

గమనాగమనములను దోలాపాదమునకు సంబంధించిన పాదప్రసారము ననుసరించియుండవలెను. దోలాపాద గమనాగమన సమకాలముననె బాహువులు హంసపక్షసముపలక్షితములు కావలెను. గమనాగమనము లేదిశగా నుండునో హంసపక్షబాహువు నా దిశగనె యుండవలెను. ఇట్లె యితరాంగమునకూడ గమనాగమన యుక్తముగా నంగవిధానము కూర్చునది. ఇట్లుండగా నిది స్ఖలితమను కరణమగును.

## ౧౪. చ క్ర మ ం డ ల ం

స్ఖలితా ప్రథమం చారీ దోలాంచిత బాహుకః
పూర్వకాయో నతో యత్ర చక్రవద్భ్రమణం భవేత్
అభ్యంతరాపవేధేన తద్విద్యా చ్చక్రమండలం

## ౧౪. చ క్ర మ ం డ ల ము.

ప్రథమమున స్ఖలితచారియుండుట పిమ్మట దోలాలంబిత బాహుకమయిన పూర్వకాయము నతముగా నుండుట, పిమ్మట అభ్యంతరాపవేధమున చక్రాకారమున భ్రమణముండుట చక్రమండల కరణమున నుండును. ఇందు మొదట అడ్డితచారి యుండును. అగ్రతః వృష్ఠతః పాద మగ్రితలసంచరముగా నుండుట అడ్డితచారిలో కలదు. ఈ కరణము ఉద్ధతపరిక్రమణ పరిష్కారణాది విషయమున ప్రయుక్తమగును.

## ౧౫. ని వే శ ం

మండలస్థానకం వక్షో నిర్భుగ్న మవహిత్థకః ౧౧౫
కరౌ వక్షస్థితౌ యత్ర నివేశో గజవాహనే

## ౧౫. నివేశము.

నివేశకరణమునందు మండలస్థానక ముండుట వక్షము నిర్భగ్నమగుట, అవహిత్థకకరము వక్షస్థితమగుట యుండును గజ వాహనాది విషయమున నివేశకరణముచే ప్రయోగ మాచరింప దగును గాత్రమునకు విశ్రమణము లేనందున నివేశకరణము సంగతము వక్షము నిర్భగ్నమగుట = స్తబ్ధము నిమ్న పృష్ఠము నిర్భుగ్నాంసము సమున్నతము నగుటగా భావనీయము మండలస్థానక మనుట ఐంద్రి మండలమని భావము, ఐంద్రిమండలమున పాదములు చతుస్తా లాంతరితములుగా నుండుట నభ్యూహించునది.

## ౧౬. స్వస్తికం

నిష్క్రమయ్య కరౌ యస్మి న్నుద్వేష్టిత పురస్సరౌ
వ్యావర్తనే సహోత్ప్లుత్య కరయోః పాదయో రపి
స్వస్తికౌ యుగపత్కుర్యాః తత్స్వస్తిక ముదాహృతం
అపరాన్వేషణే వేగే నిషేధే చ ప్రయుజ్యతే ౧౨౦

## ౧౬. స్వస్తికము.

హస్తములు పాదము లేక కాలమున స్వస్తికమున నున్న స్వస్తికకరణము కల్గును. ఉద్వేష్టితపురస్సరముగా కరములను నిష్క్రమింపజేసి వ్యావర్తనమున నుత్ప్లుతితో కరములకు పాదములకు యుగపత్కాలమున స్వస్తికరచన మున్నచో స్వస్తికకరణమగును. కరణ సమకాలమున నెగిరి హస్తపాదములకు స్వస్తికము రచింప వలెను. ఇది అపరాన్వేషణమున వేగమున నిషేధమునను ప్రయుక్త మగును. యుక్తాన్వేషణ నిషేధరాభస్వరూపమయిన వాక్యార్థ మభినేతవ్య మగునేని స్వస్తికకరణ ప్రయోగ మావశ్యకము. కరణార్థ లీకరణము నీ విధముగా నభిమానించిరని భరతోక్తి,

కరణార్థులనుట వాక్యార్థాభినయలక్షణము. నృత్తాంగహారరూపము లయిన గతిపరిక్రమాది స్వభావరూపములగు క్రియలన్నియు నర్థవంతములు. ఒక్కొక కరణమాధ్యమున నట్లు నిరూపించుటచే భంగి వచనమున ప్రతిపాదించుటచే సర్వకరణములకు ప్రయోజనము సూచించినట్లగును.

౧౭. సూ చీ క ర ణ ం

ఉత్థాప్య స్థాప్యతే సూచీచరణోఽస్పృష్ట భూః పురః
తద్దిక్కః కటకో వక్షస్యన్యః శీర్షోఽలపల్లవః
యస్మి న్నంగాంతరేప్యేవం తత్......విస్మయే

౧౭. సూ చీ క ర ణ ము.

కుంచితమగు పాదమును పైకెత్తి భూమిని స్పృశింపకుండు నట్లుగనె కూర్చవలెను. వక్షస్థలమునందు తద్దిక్కముగానొక హస్తము కటక మొనరింపవలెను. అన్యహస్తము అలపల్లవముగ గూర్చవలెను. అంగాంతరమున గూడ నిట్లె యాచరించునది. హస్తము లిట్లు ప్రయోగవశములుగా నుండుట యుక్తము, దీనిని విస్మయమున వినియోగింతురు.

౧౮. సూ చీ వి ద్ధ ం. ౧౯. అ ర్ధ సూ చీ.

సూచీవిద్ధోఽన్యపార్శ్వస్థః వక్షస్థః కటకాముఖః
పక్షవంచితకోఽన్యోఽర్ధచంద్రో వా కటి మాశ్రితః ౧౨౩
హస్తః స్యాద్యత్ర చింతాదౌ సూచీవిద్ధం తదిష్యతే
అర్ధాంగేన కృతే సూచి న్యర్ధసూచీ నిగద్యతే

౧౮. సూ చీ వి ద్ధ ం.

సూచీపాదము అన్యపార్ష్ణిగతముకావలెను. కటకాముఖము వక్షస్థము కావలెను. రెండవ హస్తము కటిగతమై పక్షవంచితకముగా

గాని అర్ధచంద్రముగాగాని యుండవలెను. ఇట్లున్న నిది **సూచీవిద్ధ** కరణమగును. చింతావిషయమున దీని ప్రయోగముండును.

### ౧౯. అర్ధసూచి.

సూచీకరణమును అర్ధాంగమున నొనరించినచో అర్ధసూచికరణమగును. అలపద్మము శిరోహస్తము సూచీవిద్ధమని భావము. శిరోహస్తమనుట శిరఃక్షేత్రమున హస్తముండుట యని గ్రహింపదగును. సూచీకరణములో కుంచితపాదోత్క్షేపణాదికములు కలవు. అవి యిందుండవు. అర్ధభాగముననె సూచి కావున అర్ధసూచి యయినది.

### ౨౦. వక్షఃస్వస్తికం

చతురశ్రావురఃక్షేత్రే భవతో యత్ర రేచితౌ
వ్యావర్త్యక్రియయా వక్షస్యాభుగ్నే స్వస్తికౌ కరౌ
పాదౌ చ స్వస్తికౌ జంఘాగుల్ఫస్య వలనాన్మిధః ౨౦౦
తద్వక్షః స్వస్తికం ప్రోక్తం లజ్జానుశయగోచరః
ఉత్ప్లుత్య ఘటయేత్ప్రాణిపాదేన స్వస్తికావితి
ఊచే కీర్తిధరాచార్యః క్వచిల్లక్ష్యనిరీక్షణాత్

### ౨౦. వక్షఃస్వస్తికము.

ఈ కరణమున మూడు ముఖ్యగ్రాహ్యములు. చరణములు స్వస్తికములు, వక్షమున కరములు రేచితములు, వక్షము నికుంచితము ఈ మూడును ముఖ్యముగా నున్నచో వక్షఃస్వస్తికము. వీని విస్తరణ మీ విధమున గ్రాహ్యము. వక్షః ప్రదేశమునందు హస్తములు చతురశ్రములై రేచితములు కావలెను. వక్షమాభుగ్నము కాగా వ్యావర్తన క్రియావిధానమున హస్తములు స్వస్తికములు కావలెను.

జంఘాగుల్ఫముల మిథోవలనమున పాదములును స్వస్తికములు కావలెను. ఇది వక్షఃస్వస్తికము. లజ్జానుశయ గోచరముగానుండునని దీని వినియోగము నిరూపితమయినది. ఒకచో తగిన లక్ష్యము నిరీక్షితమయినందున కీర్తిధరాచార్యుడు; హస్తములచే గాని పాదములచేగాని స్వస్తికముల నెరిగి[illegible]వలయు నని చెప్పెను.

దీని యోజన మిట్లు భావనీయము. వక్షమున చతురశ్రముగా నున్న హస్తములను రేచిత మొనరించి, వ్యావృత్తాకరణమున ఆభుగ్నవక్షమునందు స్వస్తికములుగా నొనర్పవలెను హస్తస్వస్తికానుసారమున పాదము లన్యోన్యగా జంఘానుగత గుల్ఫవలనమున స్వస్తికములనుగా నొనర్పవలెను. ఇందు నృత్తయోగమున సౌష్ఠవ ప్రాధాన్య ముండును. లజ్జిత, జాతానుతాప ప్రధానమయిన వాక్యార్థమునవె దీని ప్రయోజనమున్నది.

## ౨౧. ఉన్మత్తం

ఆవిద్ధ మంచితం పాదం కరౌ చ క్రమరేచితౌ
యత్ర కుర్యా త్తదున్మత్తం గర్వే సౌభాగ్యజే మతం ౨౦౩

## ౨౧. ఉన్మత్తము.

అంచితపాదము నావిద్ధ మొనరించుట కరములను క్రమముగా రేచితముల నొనరించుట యున్నచో ఉన్మత్తకరణ మగును. సౌభాగ్యజన్యమయిన గర్వమున నిది వినియుక్తమగుట సమ్మతము. అంచితపాదము రేచితకరములు నిందుండును. అంచితపాదమును అవిద్ధచారితో ప్రయోగించుట యుక్తము. "పాదం — కరౌ" ఏకవచన ద్వివచనములచే సంఖ్యాపర్యాయము సూచితమగును. "అతి సౌభాగ్యాదిజనిత గర్వవిషయః ప్రయోగః" అని అభినవభారతి.

## ౨౨. అర్ధరేచితం

మండలస్థానకే స్థిత్వా వక్షఃస్థం కటకాముఖం
సూచ్యాస్యనృత్తహస్తే నాపసృత్యా గచ్ఛతా యుతం
పార్శ్వం చ సన్నతం వామం బిభ్రత్పాదం నికుట్టయేత్
యత్రార్ధరేచితం తత్స్యాదసమంజస చేష్టితే

## ౨౨. అర్ధరేచితము.

ఇందు మండల స్థానకమునం దుండవలెను. కటకాముఖ హస్తము వక్షోగతముగా నుండవలెను. సూచీముఖమను నృత్త హస్తమున అపసరణ మొనరింపవలెను. సూచీ ముఖహస్తమున అపగమ పూర్వకముగా విద్ధతి కూర్పవలెను అది సమీపమున నాయోజితము కావలెను. తదపసరణసమయమున వామపార్శ్వము సమ్యక్ప్రాప్తవముతో నతము కావలెను అట్లు సన్నతముగా వామ పార్శ్వము ధరించి పాదము నికుట్టిత మొనరింపవలెను. అప్పు డది యర్ధరేచిత మగును. శరీరార్ధము పర్యాయమున రేచనము పొందుట వలన బహిర్గమనమున్నందున నిది యర్ధరేచిత మయినది. ఇది అసమంజస చేష్టాప్రధానమయిన వాక్యార్థాభినయనము నందు వినియోగము పొందును.

## ౨౩. అర్గలం

వామపాదకనిష్ఠాయాః క్షేత్రగో దక్షిణః పునః ౨౧౦
సార్ధతాలద్వయం స్వస్తజంఘః పాదః ప్రసారితః
తస్యైవామగతస్తద్వద్బాహుస్స న్నలపల్లవః
కరో వామేతరో యత్ర తదర్గల ముదీరితం
ఏతదంగదముఖ్యానాం ప్లవంగానాం పరిక్రమే
పాదోనూపురపాదావ త్పృష్ఠతః ప్రసృత స్తతః ౨౧౧

ప్రసార్య పురతః కార్యావుభౌ పాదానుగౌ కరౌ
ఇత్యత్రి కరణే ప్రోక్తం వ్యాఖ్యానే భట్టతం తునా

## ౨౩. అర్గలము.

దక్షిణపాదము వామపాదము యొక్క కనిష్ఠికాక్షేత్రము పొందినది యగుట, సార్ధతాలద్వయము రెండున్నర తాలకాలము ప్రసృతజంఘమై ప్రసారితమగుట, ఈ సమకాలముననె బాహువు పార్శ్వమునుండి కొంతగా ప్రసరించి అలపల్లవాకారమున నుండుట యుక్తముకాగా అర్గలకరణ మగును. దేహము నియంత్రణము పొంది యుండును. గావున అర్గలమనుట తగును. ఈ అర్గలకరణమును అంగదుడు మొదలగాగల వానరముఖ్యుల పరిక్రమమునందు వినియుక్తమగును.

భట్టతందు ఏ కరణవ్యాఖ్యానమున నిట్లు నిరూపించెను. పాదము నూపురపాదిక యను చారీవిశేషము వలె పృష్ఠమున ప్రసారము పొంది యుండగా రెండు హస్తములను ఎదుట ప్రసారిత మొనరించి పాదముల ననుసరించునట్లుగా కూర్పవలెను. ఇట్టి కూర్పు అర్గలకరణ మగును. అని.

## ౨౪. అర్ధస్వస్తికం

చరణౌ స్వస్తికౌ హస్తః కరిణో యత్ర దక్షిణః
అపరో వక్షసః స్థానే తదర్ధ స్వస్తికం విదుః
సవ్యం కీర్తిధరాచార్య భట్టతండు పురోగమాః ౨౨౦
కటిహస్తం పరం త్యక్త్వా వ్యాఖ్యానం తస్య కథ్యతే
అర్ధచంద్రాభిధః కట్యాం సక్షప్రోద్యోతక్షోఽథవా
పక్షవంచితకో వాపి యథా శోభం విధీయతే

## ౨౪. అర్ధస్వస్తికము.

చరణములు స్వస్తికములుగా నుండుట దక్షిణహస్తము కరిహస్తముగా నుండుట వామహస్తము పక్షఃస్థానమునందుండుట అర్ధస్వస్తికకరణమునకు స్వరూపము ఈ కరణవిషయమున కీర్తిధరాచార్య భట్టతందు ప్రముఖులు కరిహస్తముకాక దక్షిణహస్తము కటిహస్తముగ నుండుటనే నిరూపించిరి. దాని వ్యాఖ్యాన మిచట నిరూపితమగును. కటిప్రదేశమునందు అర్ధచంద్రమను పేరుగల హస్తము కాని పక్షప్రద్యోతకహస్తముకాని పక్షవంచితక హస్తము గాని శోభానుకూలముగా నుంచవచ్చునని వారి యభిప్రాయము. యథాశోభముగా హస్తమును కూర్పవచ్చును. వక్షఃస్థమగు వామ హస్తము కటకాముఖముగా నుండుటను అభినవభారతి నిర్దేశించు చున్నది. పాదములతోడనె స్వస్తికము కూర్పవలసి యున్నందున నిది యర్ధస్వస్తిక మయినది. ఈకరణము అభినయహస్త రహితమె.

## ౨౫. ఆవర్తం

చాషగత్యా ప్రయోగేణ యత్ర పాదక్రియా భవేత్
డోలాప్రయోగతః కించిత్కృతోద్వేష్టా పవేష్టనౌ ౨౨౫
కరౌ స్యాతాం తదావర్తం సంత్రాసా దుపసర్పణే
రేచనం హస్తపాదస్య భట్టితందు రిహాబ్రవీత్
కేచిదాహుః స్థిరావర్తా మలాతా మపరే విదుః
బ్రూతే కీర్తిధరాచార్యో భ్రమరీ మేవ లక్ష్యవిత్

## ౨౫. ఆవర్తము.

ఈ అవర్తకరణమునందు పాదక్రియ చాషగతిచే నయిన ప్రయోగమున నుండును. దోలాహస్తప్రయోగమున కొంతగా కరములు ఉద్వేష్టనము అపవేష్టనములతో నుండును. ఇది యావర్త

కరణము దీనిని భయమువలన గలుగు ఉపసర్పణములో వ్రియోగింతురు. ఇందు హస్తపాదములకు రేచన ముండునని భట్టతండు వనెను. కొందరు స్థిరావర్తచారి యుండవలె ననిరి. మరికొందరు అలాతచారి యుండవలె ననిరి. లక్ష్యవిదుడయిన కీర్తిధరాచార్యుడు భ్రమరీచారియె యుండవలెననెను. "ఆ ఈషద్వర్తనం హస్తపాదస్య యత్ర" అని అభినవనిర్వచనము. హస్తపాదములకు ఈషద్వర్తన ముండుట అని భావము. రత్నావలిలో సాగరికాపాశబంధాద్యవసరమున నాయకోపసర్పణమున నిది ప్రయోజ్యమగును.

## ౨౬. పృష్ఠస్వస్తికం

చారీం కుర్వ న్నపక్రాంతాం భుజావుత్క్షిప్య విక్షిపేత్
అవేష్టోద్వేష్టితశన్నేవ సూచీమేకాంఘ్రిణా భజేత్
తత్రి స్త్రికవివర్తేన విదధీత పరాఙ్ముఖః
పృష్ఠే సవ్యస్య పాదస్య వామేన స్వస్తికం యదా
పృష్ఠస్వస్తిక మాఖ్యాతం పృష్ఠస్థాన్వేషణే తదా
అన్యే స్వస్తిక మిచ్ఛంతః పృష్ఠతః కరయో రపి
వినియోగం వదంత్యస్య సంగ్రామస్య పరిక్రమే
ఆవిద్ధ[illegible]కౌ హస్తౌ కృత్వాంఘ్రిం స్వస్తికం తతః
అపక్రాంతాం విధాయార్ధసూచినా పరివృత్త్య చ
సభ్యాభిముఖ పృష్ఠోంఘ్రిస్వస్తికం రచితోత్ప్లుతిః
హృది కుర్యా త్కరం వామం పక్షవంచితకం పరం
పరావృత్తం శిరశ్చేత్త మత్ర కీర్తిధరోభ్యధాత్

## ౨౬. పృష్ఠస్వస్తికము

పృష్ఠమునందు స్వస్తికముండుటచే నిది పృష్ఠస్వస్తికమనదగియున్నది. దీని లక్షణ మీ విధముగా భావనీయము.

అపక్రాంతచారీగతి ననునరించుచు భుజముల నుద్వేష్టన మొనరించి నిక్షేపము చేయవలెను. ఆవేష్టన మొనరించి ఉత్క్షేప మొనరించుచునే ఒక పాదముచే సూచి ననుసరింపవలెను. పిమ్మట త్రికనివర్తనమున పరాఙ్ముఖముగానుండి సవ్యపాదపృష్ఠమున వామపాదముతో స్వస్తికమును ప్రదర్శింపవలెను. ఇట్లుండగా నిది పృష్ఠస్వస్తికకరణమగును. పృష్ఠభాగమున నున్న దాని నన్వేషించుటలో దీనిని వినియోగింతురు కొందరీ విధముగా నందురు. పృష్ఠభాగమునందు కరములకును స్వస్తికముండుట సమ్మతము యుద్ధమునందలి గతి పరిక్రమములో నిది వినియోగము పొందును. అని.

ఈ కరణవిషయముననె ఈ విధముగా నిరూపించెను. హస్తములను ఆవిద్ధవక్త్రములుగా నొనరింపవలెను. పిమ్మట పాదమున స్వస్తికము కూర్పవలెను. అపక్రాంచచారి ననుసరింపవలెను. అర్ధసూచీవిధానమున పరివర్తనమును పొందవలెను. పృష్ఠముసఖ్యాభిముఖముగా నుంచవలెను. అంఘ్రిస్వస్తిక మాచరింపవలెను. ఉత్ప్లుతి కూర్పవలెను. హృదయమునందు వామహస్తమును కూర్పవలెను. దక్షహస్తమును పక్షవంచితకముగా ధరింపవలెను. శిరము పరావృత్తకర్మతో నుండవలెను. ఇన్ని విధానము లిట్లుండగా నిది పృష్ఠస్వస్తిక కరణమగును. అని,

బాహువులు విక్షిప్తములు ఆక్షిప్తములునై చరణములు స్వస్తికములై అపక్రాంతార్ధసూచీవిధానములుండగా పృష్ఠస్వస్తికమగునని భరతుడనెను. ఇందలి సూచీవిన్యాసములో నొక విశేషమున్నది. ఒక పాదము కుంచితమై యుత్క్షిప్తముకాగా ద్వితీయపాదమున సూచి నాచరింపదగును. కాని మొదటిపాదముననె కుంచితోత్క్షేపము మరల నా పాదముననె పర్యాయమున సూచీకరణమని

---

(344 పే.లో చివరిలైను భావింపరాదు...
పేజి మొదట ఉద్వేష్టిత...అనుదానికి ముందు చదువవలెను.)

ఉద్వేష్టితక్రియచే బాహుద్వయనిక్షేపసమకాలముననె అపక్రాంత చారి యుండదగును. అట్లే అపవేష్టితమాచరించు సమకాలముననె రెండవపాదమున సూచీ నాచరింపవలెను. పిమ్మట పాదములచే స్వస్తికము హస్తములచే స్వస్తికము కూర్పవలెను. దక్షిణపృష్ఠమున వామ పాదముచే స్వస్తిక మాచరించి త్రికవలనమున పరాఙ్ముఖముకావ లెను. అప్పటి స్వస్తికవిధానము పృష్ఠస్వస్తిక మగును. కొందరు పృష్ఠమున హస్తస్వస్తిక ముండుట నభిమానించి యుద్ధవిషయ పరి క్రమమున దీని వినియోగముండుటను సూచించిరి. ఈ మతాంతర మును కీర్తిధరమతమును జాయపతి యిందు సూచించెను.

౨౩. వర్తితం

ఉన్ముఖౌ స్వస్తికాకారావశ్లిష్టౌ మణిబంధతః
వక్షఃక్షేత్రే కరౌకృత్వా తత్రైవయుగప త్పునః
వ్యావృత్తిపరివృత్తిభ్యాం పతాకౌ యత్ర పాతయేత్
స్వోర్వోరుత్తానితావేవ వర్తితం తత్ప్రకీర్తితం ౨౪౫
ఆవిద్ధవర్తనాఘృష్టావధస్తలనిపాతితౌ
ఏతౌ యదా తదా దోషవాక్యార్థాభినయే మతం
శుకతుండాదయో ప్యత్ర ప్రయోక్తవ్యా యథోచితం
మునినాప్యత ఏవాత్ర విశేషో న నిరూపితః
తత్రాప్యనంతరోక్తత్వా త్తలపుష్ప పుటాదితః
పాదోఽనుమత ఇత్యేకే మునే రాశయవేదినః ౨౫౦
కథయామాసురాచార్యాశ్చరణం తలసంచరం
అపరే తు విదుః పాదం హస్తావిత్యానుసారతః

౨౩. వర్తితము.

హస్తములు మణిబంధమున కుంచితములై వ్యావృత్త పరి వర్తితములు ఊరువులందు నిపతితములుకాగా వర్తితకరణ మగుననుట భావింపరాదు. కావున నిచట నిట్లు యోజన మొనరింపదగును.

భరతోక్తి. కరయుగలము వక్షఃక్షేత్రమున కున్ముఖముగనుండి స్వస్తికమువలె ఆశ్లిష్టముగనె మణిబంధనగతములై యుండవలెను. అచట విహస్తములు కావలెను. సమకాలముననె వ్యావృత్తపరివర్తనముల పొంది ఉత్తానములుగనె తొడలపై పడవేయవలయును. అసూయా వాక్యార్థాభినయమున పతాకము లుత్తానములై ప్రయుక్తములగును. ఆ పతాకాహస్తములె అధోముఖముగా పృష్ఠపాతములతో నున్నపుడు రోషవాక్యార్థాభినయమున వినియుక్తమగును. ఇట్టీ కరణమున కటకాముఖ శుకతుండహస్తాదులనుగూడ యోజన మొనరింపదగును. కావుననె యిచట ముని హస్తావశేషమును వేరుగా నిరూపింపలేదు. ఇం దగ్రతలసంచారపాద ముండుటను కొందరు చెప్పిరి. హస్తౌచిత్యానుసారముగా పాదగతులుండవలెనని వ్యాఖ్యాతలుపదేశింతురు. ఇట్టి విషయమును సగము అభినవభారతీవివృతి సూచితము. ఇట్టి యీ విషయసంగతిని జాయపతి ఈ కరణనిరూపణమున కూర్చినాడు.

హస్తములు వక్షఃక్షేత్రమున కెదురుగా నున్ముఖములై స్వస్తికాకారమున నశ్లిష్టములై మణిబంధమున కూర్పు పొందవలెను. అచటనే ఏకకాలమున వ్యావృత్తపరివృత్తములతో పతాకముల ప్రసరింపజేయునది. పిమ్మట ఊరుభాగములందు ఉత్తానితములై పాతితములు కావలెను. అపుడది వర్తితమగును. పిమ్మట ఆవిద్ధ వర్తనాపృష్టములై అధస్తలనిపాతితములు కావలెను. ఇట్టి హస్తముల విధానము రోషవాక్యార్థాభినయమున యుక్తముగా వినియుక్తమగును. శుకతుండాది హస్తములనుగూడ ఇందు యథోచితముగా ప్రయోగింపదగును. కావుననె ముని విశేషము నిరూపించలేదు. తల పుష్పపుటకరణము నిరూపించిన యనంతరము ఈ వర్తితమును భరత

తుడు నిరూపించుటచే ఇచట పాదప్రసారము యుక్తమే యని ముని యాశయవిదులు సూచించిరి. తలసంచర పాదము ప్రయుక్తమగుటను కొందరాచార్యులు సూచించిరి. నృత్తవిదులు కొందరు హస్తాచిత్యా నుసారమున పాదప్రసారముండుటను నిశ్చయించిరి. ఇట్లుగా జాయ సేనాపతి నిరూపణమంతయు అభినవభారతీ భావార్థముతో నున్నది. అభినవుడు చెప్పిన అసూయావాక్యార్థాభినయవినియోగమును జాయ పతి సూచింపలేదు. ఇతరముల నన్నిటిని సూచించినట్లు స్పష్టముగనె యున్నది.

౨౮. భుజంగాంచితం

భుజంగత్రాసితాంఘ్రిః స్యా ద్దక్షిణో రేచితః కరః
యత్ర వామో లతాసంజ్ఞః తద్భుజంగాంచితం భవేత్ ౨౩౩

౨౮. భుజంగాంచితము.

పాదము భుజంగత్రాసితమను చారీగతిలో నుండును. దక్షిణహస్తము రేచితమగును. వామహస్తము లతాఖ్యనృత్త హస్తముగా నుండును. పాదము చారీగతిలో కుంచితమగుట హస్తము రేచితమగుటలో హంసపక్షముగా నుండుట పూర్వమునందువలె సంగ్రాహ్యము.

౨౯. విష్కంభం

సవ్యం సూచీముఖం నృత్తహస్తోపగమపూర్వకం
వామం వక్షఃస్థితం దద్యాత్తద్దిక్కాంఘ్రిః నికుట్టితః
ఏవమంగాంతరం భూయః సూచీపాదోఽలపల్లవః
నికుట్టితో దక్షిణః స్యాత్కరో వామో యథాపురా ౨౬౦
ఇత్థం ముహుః క్రియా యత్ర తద్విష్కంభః ప్రకీర్తితం

## ౨౯. విష్కంభము.

సవ్యహస్తము సూచీముఖముగా నుండి నృత్తహస్తోపగమ పూర్వకముగా, వక్షఃస్థితమయిన వామహస్తమును విద్ధ మొనరింప వలెను. ఆ దిశగా నున్న పాదము నికుట్టితము కావలెను. ద్వితీయాంగమునను నికుట్టితమగుట యుక్తము. మరల వంగాంతరమున గూడ నిట్లె యొనరింపవలెను. పాదము సూచీచారితో కూడుకొనుట, రెండవపాదము నికుట్టిత మగుట, వామహస్త మలపల్లవమగుట, సర్వము మొదట చేసిన విధముననే చేయునది. ఇట్లు పునఃకరణ విధానమున్నచో నిది విష్కంభమను కరణమగును. క్రియావిష్కంభనము విస్తరణ మున్నందున నిది విష్కంభాఖ్య కరణమయినది.

## ౩౦. విక్షిప్తం

సవిద్యుద్భ్రాంతయా దండపాదయా చతస్వష్వపి
దిక్షు పాదస్య విక్షేపః కృతోద్వేష్టాపవేష్టయోః
పాదానుకూలయోః పాణ్యోః రేచనాంచితయోరపి
క్రియతే యత్ర విక్షిప్తం తదుద్ధత పరిక్రమే

## ౩౦. విక్షిప్తము.

విద్యుద్భ్రాంతము దండపాదము అను చారీద్వయమున నాలుగుదిక్కులందును పాదవిక్షేప మొనరింపవలెను. అప్పుడు ఉద్వేష్టితాపవేష్టితో రేచకవర్తనమున పార్శ్వములందును పృష్ఠమునందును అగ్రిభాగమునందును హస్తపాదవిక్షేపము కూర్పవలెను. ఉద్వేష్టాపవేష్టములు కలిగి పాదముల కనుకూలముగానున్న హస్తములు రేచకాంచితములు కావలెనని భావము. ఇట్టి విధానము లుండగా నది విక్షిప్తకరణ మగును. దీనిని ఉద్ధతగతి పరిక్రిమమున వినియోగింతురు.

### ౩౧. దండరేచితం

దండపాదాభిధాచారీ దండపక్షౌ కరావపి ౨౬౯
యత్ర రేచనసంయుక్తౌ తద్భవేద్దండరేచితం
నృత్తే ప్రమోదయుక్తేఽస్య ప్రయోగస్తాండవే యథా

### ౩౧. దండరేచితము.

దండపాదము పేరు కల చారీగతి దండపక్షము పేరుకల హస్తములు రేచనముతో కూడియున్నచో దండరేచకమను కరణమగును. ప్రమోదయుక్తమయిన నృత్తమునందు దీని ప్రయోగింతురు. ప్రమోదముతో నున్న తాండవమునం దిది వినియుక్తమగును. ఈ విషయమున భరతగ్రంథమునం దొక విశేషము కలదు మొదట నూపురపాదికాచారి ప్రయోగింపవలెను. అనంతరము దండపాదము ప్రసారింపవలెను. వేగముగా నపవిద్ధకరణముండుట దండపాదముకదా! కాగా దండపాదసహితముగా త్వరితహస్తమును కూర్పవలెను. ఈ దండరేచితము సాటోపపరిక్రమాదివిషయము ఈ భావ మీ గ్రంథమున సూచితమె యయినది.

### ౩౨. అర్ధమత్తల్లి

స్ఖలనాపసృతౌ పాదౌ హంసపక్షౌ ద్రుతభ్రమః
వామః సవ్యోఽర్ధచంద్రస్తు యత్ర కట్యాం విధీయతే
అర్ధమత్తల్లి తత్త్వజ్ఞైర్జ్ఞేయం తత్తరుణే మదే ౨౭౦
పక్షవంచితకం కట్యా మత్ర కీర్తిధరోఽబ్రవీత్
హస్తం నితంబ మత్రైవ పరే ప్రాహుర్మనీషిణః

### ౩౨. అర్ధమత్తల్లి.

ఇందు పాదములు స్ఖలనమున అపసరణము పొందును. స్ఖలితము అపసృతమగుట గ్రాహ్యము. కటిభాగమున స్ఖలితమగు

టయు రెండవది పాదసమీపము పొందుటయు నుండును. వామ హస్తము హంసపక్షముగా నుండి వేగభ్రమము కలది కావలెను. సవ్యహస్తము అర్ధచంద్రముగా నుండి కటిభాగమునం దుండవలెను. ఇట్టి దిది అర్ధమత్తల్లి కరణము. ఇట్లే తత్త్వజ్ఞులు దీని గుర్తించిరి. ఇది శృంగారమదవిషయముగా ప్రయుక్తమగును. కీర్తిధరు డిందు భావ భేదము చూపెను. కటిభాగము నందు పక్షవంచితముగా హస్త ముండుట కీర్తిధరమతము. ఇచట నితంబహస్తముండుటనే కొంద రభిజ్ఞు లభిమానించిరి. ఇట్టివన్నియు యథాశోభముగా గ్రాహ్యములు.

### ౩౬. మత్తల్లి

ఘూర్ణమానస్య పాదస్య యత్స్యా దుపసర్పణం
గుల్ఫస్వస్తికపర్యంతం తస్యైవానుచరః కరః
ఉద్వేష్టితో నితంబః స్యాదేష పాదోపసర్పణే ౨౭౩
అపవేష్టితమాదధ్యాదేవ మంగాంతరేణ చ
క్రియైవం బహుశః ప్రోక్తా తన్మత్తల్లి బుధైర్మదే

### ౩౬. మత్తల్లి.

ఘూర్ణమానమగు పాదము గుల్ఫస్వస్తికపర్యంతము ఉప సర్పణము పొందునేని, హస్తము ఆ పాదమునకు అనుచరముగా నితంబహస్తముగా నుద్వేష్టితమగునేని, అపవేష్టితముగూడుకొనునేని, ఇట్లే యంగాంతరమున బహుపర్యాయము లీ క్రియ యుండునేని యది మత్తల్లి కరణమగునని నాట్యబుధు లందురు. ఇది మద మభిన యించునప్పుడు ప్రయుక్తమగును.

ఘూర్ణమానోపసర్పణమున నున్న వామదక్షిణపాదములును ఉద్వేష్టితాపవిద్ధములుగా నున్న హస్తములున్న మత్తల్లికరణమని

మూలము. మత్తల్లి పేరుగల చారీగతియు నిట్లే యుండును. పాదములు ఘూర్ణమానములగుట ఉపసర్పణము పొందుట యిందున్నది. ఒక పాదము రెండవ పాదము యొక్క గుల్ఫస్వస్తికపర్యంతము చేరుట. తత్సమకాలమునందే నితంబాఖ్యహస్తములు ఉద్వేష్టితములగును. ఉపసర్పణకాలమునందు అపవిద్ధములు అపవేష్టితములు నగును. ఇట్లే ద్వితీయాంగమున గూడ నాచరింపవలెను. పునఃపునః ఇట్టి క్రియయుండుట యిందావశ్యకము. ఇట్లున్న నిది మత్తల్లి కరణ మగుననుట యిందలి యోజనము. "మదనం మత్తం కరోతీతి మత్తల్లి" మదనుని మత్తు నొనరించునది కావున నిది మత్తల్లి. శ్రీహర్షుని నాగానందమునందలి మత్తశేఖరకాది విషయమున నీ కరణము ప్రయోగార్హము.

### ౩౪. మదస్ఖలితం

యత్ర దోలౌ కరౌ స్యాతాం మస్తకం పరివాహితం
పర్యాయేణ ముహుః పాదౌ స్వస్తికీభూయ విచ్యుతౌ
మదస్ఖలిత మేతత్స్యా త్ప్రయోజ్యం మధ్యమే మదే
అత్ర భ్రమరికావిద్ధే చార్యౌ కీర్తిధరోఽభ్యధాత్ ౨౮౦

### ౩౪. మదస్ఖలితము.

ఎందు దోలాహస్తము లుండునో శిరము పరివాహితకర్మతో నుండునో పర్యాయక్రమమున పాదములు మఱలమఱల స్వస్తికీకృతములై విచ్యుతములగునో అచ్చట మదస్ఖలితమను కరణమగును. దీనిని మధ్యమ మదాభినయమునందు ప్రయోగింతురు. ఇందు భ్రమరిక ఆవిద్ధములనెడు చారీవిశేషము లుండునని కీర్తిధరుడనెను.

## ౩౫. లోలితం

వైష్ణవం స్థానకం హస్తౌ రేచితోఽన్యోఽలపల్లవః
వక్షస్థోలోలితం శీర్షం విశ్రాంతిః పార్శ్వయోః క్రమాత్
యత్ర కుర్వీత తత్ తజ్ఞైర్లోలితం ప్రతిపాదితం
అత్ర చారీమలాతాఖ్యాం భట్టతందురమన్యత ౨౮౫

## ౩౫. లోలితము.

వైష్ణవస్థానకమునుండి యొక హస్తమును రేచిత మొనరించి వేరొక హస్త మలపల్లవముగానుంచి శీర్షమును లోలితకర్మయుతముగా జేయగా లోలితకర్మ యగును. శిరమునకు పార్శ్వములందు విశ్రాంతియు నిందుండును. ఇట్లు క్రమముగానున్న లోలితము. లతాఖ్యచారి యిందుండదగునని భట్టతందువు భావించెను.

హస్తములు రేచితములు అంచితములు, శిరము లోలితముగా నుభయపార్శ్వములం దుండుట లోలితకరణము కాగా దీని యోజన మిట్లు భావనీయము. వైష్ణవస్థానమున మొదట హస్తద్వితయము హంసపక్షదు్రితభ్రమరూపముగా రేచితమై వక్షమునందలపల్లవాకారమున నంచితము కావలెను. పిమ్మట శిరము లోలితమగును. అంతట లోలితమయినను పార్శ్వములందు వర్తితము—విశ్రమితము కావలెను.

## ౩౬. ప్రేంఖోలితం

దోలాపాదాంఘ్రిమాదాయ తదన్యోత్ప్లుతిం భజేత్
చారీ చ భ్రమరీ యత్ర తత్ప్రేంఖోలితమీరితం

## ౩౭. ప్రేంఖోలితము.

ఒక పాదమును దోలాపాదముగానుంచి వేరొకపాదమున ఉత్ప్లుతి నాచరింపవలెను. భ్రమరీచారీగతులను కూర్పవలెను. త్రిక పరివర్తనము కూర్పవలెను. పాదము దోలాపాదముగా నుంచుటలో మొదట పాదము కుంచితముగా నుండుట అభ్యూహ్యము. ఇట్టి విధానము ప్రేంఖోలితకరణ మగును.

## ౩౭. నితంబం

వ్యావర్తితం శిరోదేశ మానీయాభిముఖాం గుళీ
పతాకే పరివర్త్యోర్ధ్వే నిష్క్రామిత భుజౌ కరౌ
యధా స్వమంసయోర్న్యస్యే దితరేతర సమ్ముఖౌ ౭౯౦
తతస్తౌ యత్ర కుర్వీత నితంబౌ దేహసమ్ముఖౌ
బద్ధయా సహితాచార్యా తన్నితంబం నిరూపితం

## ౩౭. నితంబము.

ఈ కరణస్వరూపమును భరతు డీ విధముగా నిరూపించెను. భుజములు ఊర్ధ్వవినిష్క్రాంతములుగా నుండుట, హస్తములు అధోముఖాంగుళులుగా నుండుట, బద్ధ యను చారీగతి యుండుట నితంబకరణము నం దుండును. దీని యోజన మీా విధముగా నుండును. పతాకహస్తములు అభిముఖాంగుళులుగా నుండి వ్యావర్తితాకరణమున శిరోదేశము చేరవలెను. పిమ్మట పరివర్తితకరణమున బాహువులను పై భాగముగా వెలువడునట్లుచేసి తగినస్థానమున పతాకాహస్తములు అన్యోన్యము చూచుచున్నట్లుగా కూర్పవలెను. అప్పుడు నితంబహస్తముల పట్టవలెను. ఆ నితంబహస్తములు దేహాభిముఖాంగుళులు కావలెను. అప్పుడు రేచితములు ఆఘూర్ణితములునై

నితంబహస్తములు శోభించును. నితంబహస్తములనుటచే నితంబ క్షేత్రమున నుండునవని గ్రాహ్యము.

ఈ యంశముల సంభావనమున నిందు నితంబకరణలక్షణ మీవిధముగ నున్నది. పతాకహస్తమును వ్యావర్తితమయిన శిరో దేశమునకు దెచ్చి అభిముఖాంగుళులుగా నుంచి పరివర్తింపజేయ వలెను. పై భాగముగా భుజములను వెలువరింపజేసి పరస్పరము సమ్ముఖముగా నుండునట్లు అంసప్రదేశమున నుంచునది. అప్పుడు నితంబహస్తములను దేహసమ్ముఖముగా నుంచునది. బద్ధ యను చారీవిశేషముతో నుంచునది. అప్పు డది నితంబకరణమగును.

౩౮. ఊర్ధ్వజాను

ఊర్ధ్వజానుం దధచ్చారీం పక్షవంచిత మున్ముఖం
అలపద్మ మరాలం వా నిజస్యోపరి జానునః
స్తనక్షేత్రే యథా యస్మి న్నపరం కటకాముఖం ౨౯౫
వక్షఃస్థలస్థితం కుర్యాత్ ఊర్ధ్వజాను తదీరితం

౩౮. ఊర్ధ్వజానువు.

ఉర్ధ్వజానువను చారీధారణము, ఉన్ముఖమయిన పక్షవం చితము, జానూపరిభాగమున స్తనక్షేత్రమున అలపద్మముగాకాని అరాలముగాగాని ఒక హస్తముండుట, రెండవహస్తము కటకా ముఖముగా వక్షస్థలస్థితమగుట ఉర్ధ్వజానుకరణముయొక్క రూపము. కుంచితమగు పాదమెత్తి జాను స్తనసమముగా నుంచవలెను. హస్తము లును ప్రయోగవశగతములై యుండవలెను. అప్పు డది ఉర్ధ్వజాను వని సూక్ష్మలక్షణము. పార్ష్ణిభాగ ముత్క్షిప్తమై అంగుళులు కుంచిత ములై యుండుట కుంచితపాదస్వరూపము. కుంచితమయిన సమకాల

ముననె హస్తము ఊర్ధ్వముఖమై అలపల్లవ మరాలముగా కుంచితా స్తన సమజానూపరిభాగమున నుండును. రెండవహస్తము వక్షఃస్థకట కాముఖము. ఇది లక్షణయోజనవిధి.

౩౯. పార్శ్వ నికుట్టకం

యత్పార్శ్వే స్వస్తికౌ హస్తౌ పర్యాయేణ నికుట్టితౌ
ఉన్ముఖాధోముఖౌ స్యాతాం తత్పాదశ్చ నికుట్టితం
యస్మిన్నంగాంతరేణైవం తత్స్యాత్పార్శ్వ నికుట్టితం
ప్రకాశాచరణాభ్యాస వాక్యార్థాభినయే మతం ౩౦౦

౩౯. పార్శ్వ నికుట్టితము.

ఏ పార్శ్వమున స్వస్తికహస్తములు పర్యాయమున నికుట్టితములై ఉన్ముఖములధోముఖములు నగునో ఆ పార్శ్వముననె పాదము నికుట్టితము కావలెను. అంగాంతరమున గూడ నిట్లే యొనరించునది. అపుడది పార్శ్వనికుట్టిత కరణమగును. దీనిని ప్రకాశాచరణాభ్యాసవాక్యార్థాభినయమున ప్రయోగింతురు. ప్రకాశనసంవరణాభ్యాస ప్రిధానమయిన వాక్యార్థమున వినియోగమును అభినవభారతి సూచించినది. పార్శ్వగతిహస్తనికుట్టిత యోగమున్నందున నిది పార్శ్వ నికుట్టిత మయినది.

౪౦. పార్శ్వ క్రాంతం

యత్రాన్యస్య పురః పార్శ్వక్రాంతాయాం చరణం క్షిపేత్
హస్తౌ పాదానుగౌ యద్వా ప్రయోజ్యాభినయోచితౌ
పార్శ్వక్రాంతమిదం రౌద్రే భీమాదేః స్యాత్పరిక్రమే

౪౦. పార్శ్వ క్రాంతము.

కుంచితమగు పాదము నెత్తి పార్శ్వస్థానము నం దుండునట్లు చేసి పార్శ్వక్రాంతచారి ననుసరింపవలెను. ఆ చారీగతిలో

పాదాగ్రమునందు పాదము కూర్పవలెను. పాదప్రయోగానుసారముగ హస్తములను కూర్పవలెను. యద్వా, ప్రయోజ్యాభినయోచితముగా హస్తముల నుంచవలెను. ప్రయోగవశగపదము భరతమూలమున నున్నది. "ప్రయుజ్యతే ఇతి ప్రయోగః గతిప్రచారయుద్ధాదిః" అని అభినవభారతి గతి ప్రచారయుద్ధాదిసముచితముగా పాదములు హస్తములు నుండవలెనని భావము. ఇట్లుండగా నిది పార్శ్వక్రాంతమను కరణమగును. దీనిని రౌద్రప్రధానమయిన భీమాదుల పరిక్రమమున వినియోగింతురు

## ౪౧. అతిక్రాంతం

యత్ర చారీ మతిక్రాంతాం ప్రయోగానుగతౌ కరౌ
కుర్వీత తదతిక్రాంత ముద్ధతస్య పరిక్రమే 205
హస్తౌ గరుడపక్షాఖ్యౌ భట్టశండు రిహాబ్రవీత్

## ౪౧. అతిక్రాంతము.

దీనిలో అతిక్రాంతచారి ప్రయోగానుగతముగా హస్తములను కూర్పవలెను. అది అతిక్రాంతకరణము అగును. దీనిని ఉద్ధతుని పరిక్రమమునందు ప్రయోగింతురు. గరుడపక్షహస్తముల నిందు ప్రయోగింపవలెనని భట్టశండు ననెను. అతిక్రాంతచారి యిదివరలో నిరూపితమయినది. ఉద్ధతపరిక్రమముదీని వినియోగము. ఇట్లిది గతి పరిక్రమాది విషయము. ప్రత్యేకముగా నభినయవిషయమున నుపయోగము నిరూపితము కాకపోయినను అట్టి దానికి గతిపరిక్రమమె విషయముగా భావింపదగును. ఇం దుద్ధతపరిక్రమము నిరూపితమయినది.

## ౪౨. అపక్రాంతం

యత్ర బద్ధాం విధాయాపక్రాంతాం చారీం సమాచరేత్
ప్రయోగానుగుణౌ హస్తౌ తదపక్రాంత మీరితం

### ४२. అ ప క్రా ం త ము.

దీనిలో మొదట బద్ధ యను చారి నాచరించి అనంతరము అపక్రాంతచారి నాచరింపవలెను. హస్తములు ప్రయోగానుగతము లుగా నుండవలెను. అప్పు డది అపక్రాంతచారి యగును. నాట్యవేద మున నిట్లు కలదు. పాదమును ఉరువలిత మొనరించి అపక్రాంత క్రమము విన్యసింపవలెను. హస్తములు ప్రయోగవశీగములుగా నుండుట సామాన్యము. అపక్రాంతక్రమమాచరించి, అన్యోన్య జంఘాసంయోగమున ఊరువలనమున బద్ధచారి ననుసరింపవలెను. స్వస్తికము ఊరువుల వలననుండుట అపక్రాంతకరణము. చార్యను సరణములలో పూర్వాపరపరిశీలన మంతగా నుపకారి కాదు. చార్యను సరణమున గలిగిన కరణస్థితి సౌందర్యమె వర్ణనీయము. ఊరువలన జంఘాసంయోగస్వస్తికాదులు ఆ యా చారీ గత్యనుసారముననె సిద్ధము లగు ననుట చారీనామకథనముననె స్పష్టము. ఇట్టి యభ్య నుజ్ఞానము నభినవుడె సూచించెను.

### ४३. ని కు ం చి త ం

వృశ్చికే కరణే యోఽసౌ పాదస్తం విధివద్ధత్
ఏతద్దిక్కమరాలం చ శిరసః పార్శ్వతః కరం
తథైవాన్య మురఃక్షేత్రే నాసికాగ్రానుసారిణం
యత్ర కుర్వీత తత్త్వజ్ఞైః నికుంచిత ముదాహృతం ౩౧౦
నాసికాగ్రే పతాకోన్యైః ప్రోక్తః సూచీముఖోఽపరః
అలాలపల్లవః కీర్తిధరాచార్యేణ కీర్తితః
ఆకాశోత్పతనోత్కంఠా వితరాదా విదం మతం

### ४३. ని కు ం చి త ము.

ఈ నికుంచితకరణమునందు వృశ్చికకరణములో నిరూ పించిన పాదమును యథావిధిగా ధరింపవలెను. ఆ దిక్కుగనె అరాల

హస్తము పట్టవలెను. ఈ అరాలహస్తము శిరస్సునకు పార్శ్వమున నుండదగును. అట్లె రెండవహస్తమును ఉరఃక్షేత్రమునందు నాసికాగ్రానుసారిగా నుండునట్లు ధరింపవలెను. ఇట్టి విధానమున్నచో నిది నికుంచితకరణ మగునని వృత్తతత్త్వజ్ఞు లుదాహరించిరి.

వృశ్చికకరణము నంవ కరణముగా నిరూపితము కాను న్నది. "అతీవనమితం పృష్ఠం పాదో వృశ్చికపుచ్ఛవత్" అని వృశ్చిక కరణము నందలి పాదస్వరూపము. పృష్ఠమత్యంతము నమితము— వంగినది యగుటవలన వృశ్చికపుచ్ఛమువలె నుండును. ఇట్టి వృశ్చిక కరణపాదమును ఈ నికుంచితకరణమున యథావిధిగా ధరించుట యావశ్యకము.

నాసికాగ్రమున పతాకహస్తము ధరింపవలెనని, రెండవ హస్తము సూచీముఖముగా నుండవలెనని కొందరు నిరూపించి పలికిరి. ఇచట అలపల్లవహస్తము ఉండదగునని కీర్తిధరాచార్యుడు కీర్తించెను. ఈ నికుంచితకరణము ఆకాశోత్పతనాదులందును ఉత్కంఠావితర్కాలందును వినియుక్తమగును. ఆకాశగమనోన్ముఖవితర్కపరిణిధానాది ప్రధానవాక్యార్థభినయమున నికుంచితము ప్రయోగార్హమని అభినవభారతీసూచనము. హనుమంతుడు— ఇదిగో ఆకాశ మార్గమున వేగముగా సంచరింతును. ఆలస్యమేల? అనుటలో నికుంచితకరణ ప్రయోగమున్నది.

### ౪౪. వి ద్యు ద్భ్రా ం త ం

విద్యుద్భ్రాంతా భవే ద్యత్ర చారీ తద్వశగా కరౌ
విద్యుద్భ్రాంతం తదాఖ్యాత ముద్ధతస్య పరిక్రమే ౩౬౩
అత్ర పాదక్రియాం కేచిత్సౌకర్యా త్పురతో జగుః

## ౪౪. వి ద్యు ద్భ్రాం త ము.

ఇందు విద్యుద్భ్రాంతచారి యుండును. హస్తములు చారి ననుసరించి యుండును. అప్పుడది విద్యుద్భ్రాంతకరణ మగును. దీని నుద్ధతక్రమమున ప్రయోగింతురు. వెనుకగా వలితమగు పాదమును శిరోఘృష్టమగునట్లు ప్రసారము కలదగునట్లు చేయవలెను. అంతట మండలావిద్ధమగు గతి కూర్పవలెను. ఇట్టి విధానమునకీ యోజన మావశ్యకము. పాదమును వెనుకగా పృష్ఠప్రదేశమున ఊరుమూల దేశమునుండి వలిత మొనరించి చక్రాకారమున భ్రమింపజేసి తన శిరఃక్షేత్రమున శ్లిష్ట మగున ట్లొనర్పవలెను. అప్పుడు మండలగతి యుండునట్లు చతురత మొనరించి పాదము సారింపవలెను. బాగుగా సర్వదిక్కులకును క్రమముగా ప్రసరింపజేయుచవలెను. అప్పుడు పదము నకు విద్యుత్తునకు వలె ఉద్భ్రమణ మున్నందున విద్యుద్భ్రాంతకరణ మయినది.

## ౪౫. క టి భ్రాం త ం

విధాయ దక్షిణం సూచీం తంజవా దపసారితం
పాదం పార్శ్వే క్షిపే త్పృష్ఠపరావృత్తేన కర్మణా
కటి మారీచయే ద్యద్వా బాహ్యతో భ్రమరీం దధత్
హస్తౌ ప్రయోగతః కుర్యా ద్వ్యావృత్త పరివర్తతౌ ౨౨౦
యత్రాంతే చాతురశ్ర్యం చ కటిభ్రాంతం వదంతి తత్
పరిక్రమే గతీనాం తత్తాలేషు యతిపూరణే.

## ౪౫. క టి భ్రాం త ము.

దక్షిణపాదమును సూచీపాదముగా నొనర్చునది. దానిని వేగముగా నపసరింపజేసి పార్శ్వము నందుంచునది. పృష్ఠపరావర్తన మొనరించునది. బాగుగా కటి నారేచితము చేయునది. అప్పు డది

కటిభ్రాంత మగును. యద్వా; బాహ్యతః భ్రమరీచారి ధరించునది. హస్తములను ప్రయోగానుగతముగా నుంచునది. అప్పుడా హస్తములకు వ్యావర్తనము, పరివర్తనము కూర్చునది. తుదకు చాతుర శ్ర్యము కూర్చునది. అప్పుడది కటిభ్రాంతకరణ మగును. ఇది గతి పరిక్రమములో నుపయోగించును. యతిపూరణమున నాయా తాల విధులందు నుపకారి యగును.

కటిభ్రాంత కరణమునకు రెండు రూపములు ఇచట. నిరూపితముల యినవి. సూచి వామాపసరణము దక్షిణన్యసనము పృష్ఠపరావర్తనము కటిరేచనము అనునవి భరత సూచితములు. ఇది ప్రథమ రూపము. భ్రమరీచారి ప్రయోగ వశకరస్థితి కటిభ్రమణము కరవ్యావర్తనపరివర్తనములు చతురశ్రావస్థానము అనునవి అభినవగుప్తుడు పక్షాంతరముగా సూచించిన రెండవ రూపము. ఈ రెండును తాలాంతరాలాది యతిపూరణ విషయమున ప్రయోగింప దగిన వనుట వినియోగము.

### ౪౬. ఉ రో మ ం డ ల ం

చారీం బద్ధాం విధాయాస్యాం స్వస్తికస్యాపసారణే
స్థితావర్తావదాదధ్యాదురోమండలినౌ కరౌ
యత్ర తత్కరణం ప్రోక్తమురోమండలసంజ్ఞకం.		౩౭౩

### ౪౬. ఉ రో మ ం డ ల ము.

మొదట బద్ధచారి నిర్మించి యుండునది. పిమ్మట స్వస్తిక మపసరింపజేయునది. స్థితావర్తయను చారీవిధానమున స్వస్తికాపసరణ మొనరించునది. అప్పుడు ఉరోమండల నామము కల హస్తములను గూర్చునది. ఇట్లు కాగా నిది ఉరోమండలమను కరణమగును ఉరః ప్రదేశము నందొక హస్తము ద్వేష్టితమగుటయు వేరొక హస్తమపవేష్టితమగుటయు నట్లవి భ్రమితములగుటయు ఉరోమం

డల హస్తములగుట స్పష్టముగ పూర్వము నిరూపిత మయినది. ఈ కరణము గతిపరిక్రమమున నుండుట యభ్యూహ్యము.

౪౭. సన్నతం.

హరిణప్లుతయోత్ప్లుత్య పాదయోః స్వస్తికం పురః
యత్ర కుర్వీత హస్తౌ తు దోలా తత్సన్నతం మతం
ఏతన్నీచస్వభావానాముపసర్పణగోచరం
భట్టతండురిహ బ్రూతే పాదవత్స్వస్తికౌ కరౌ
దేహవత్యా భువం ప్రాప్తావితి కీర్తిధరోభ్యధాత్ ౩౩౦

౪౭. సన్నతము.

హరిణప్లుతి చారిచే నుత్ప్లుతి నొనర్చి పాదములకు స్వస్తికము కూర్చి దోలాహస్తములు పట్టినచో సన్నత కరణమగును. ఈ కరణము నీచస్వభావుల యుపసర్పణంబులలో గోచరించును. ఈ కరణ విషయమున భట్టతండువు, పాదముల వలె హస్తములును స్వస్తికములుగా నుండవలె ననెను. కీర్తిధరుడు వేరొకవిధముగా ననెను. దోలాహస్తములు దేహాసమనమున భూమిని పొందినవిగా నుండ వలెను. అని. పామరుల స్వభావములు దేశదేశమున భిన్నభిన్నములుగా నుండును గాపున నిట్టివన్నియు సన్నతము లగును. ౭౫ వ సంఖ్యకల కరణ చిత్రములో పాదములు స్వస్తికములుగా నున్నవి. హస్తములు వక్షోదేశమున స్వస్తికముల వలె నున్నవి. "సన్నతే చ తథా హస్తౌ" అని భరతమూలము. "సన్నతౌ చ దోలాహస్తౌ" అని అభినవభారతి.

౪౮. వినివృత్తం

పార్ష్ణిభాగే యదన్యాంఘ్రేః సూచ్యా స్వస్తికమాచరేత్
వివర్త్య త్రికమేకత్ర ప్రత్యావృత్త్యైవ పార్శ్వతః
ఊర్ధ్వోర్ధ్వలనమాదధ్యా బద్ధయా రేచితౌ కరౌ
వినివృత్తం తదామ్నాతముద్ధాతస్య పరిక్రమే

### ౪౮. వినివృత్తము.

సూచీచారి ననుసరించి అన్యాంఘ్రిపార్ష్ణిభాగమునందు ఆ సూచిచే స్వస్తిక మాచరింప వలెను. ఒకపార్శ్వమున త్రికవివర్తన మొనరించి అన్యపార్శ్వమున ప్రత్యావర్తన మొనరింప వలెను. ఇట్లు త్రికనివృత్తినొనరించునది. అన్యోన్యజంఘావేధమున బద్ధచారిచే ఊరువలన మొనర్పదగును. అప్పుడు హస్తములు రేచిత మొనర్ప వలెను. హంసపక్షములుగా హస్తములు వేగభ్రమముతో నుండద గును. ఇట్లుండగా నిది వినివృత్తమను కరణమగును. ఉద్ధత గతి పరిక్రమమున దీని ప్రయోగముండును.

### ౪౯. నివృత్తం

పాదమాక్షిప్తయాక్షిప్య తతో హస్తేన సంయుతం ౩౩౫
వ్యావృత్తపరివృత్తేన స్వదేహాదపసారితం
ప్రత్యావృత్య ప్రకుర్వీత భ్రమరీం రేచయత్కరౌ
యత్ర తత్స్యాన్నివృత్తాఖ్యముద్ధతస్య పరిక్రమే

### ౪౯. నివృత్తము

నివృత్తకరణమె వివృత్తకరణమను నామముతో నాట్య వేదమున నున్నది. హస్తపాదము లాక్షిప్తము లగుట, త్రికమునకు వివర్తనము, హస్తములకు రేచితవిధి వివృత్త— నివృత్త కరణరూపము. దీని యోజన మీా విధమున నుండును. ఆక్షిప్తచారిచే వామ పాద మాక్షిప్త మొనరింపవలెను. తన దేహక్షేత్రము నుండి యప సారిత విధానమున హస్తమును వ్యావర్తన పరివర్తన విధానములతో నాక్షిప్త మొనరించి ప్రత్యావర్తన మొనరింపవలెను. భ్రమరిక విధానమున త్రికమునకు వలనము కూర్పవలెను. హస్తములు హంస పక్షరూపమున రేచితములై వేగభ్రమణమున నుండవలెను. ఇట్లుం

డగా నిది నివృత్తకరణ మగును. త్రికవివర్తనమున్నందున నివృత్తకరణ మయినది. దీనిని ఉద్ధతగతి పరిక్రమమున ప్రయోగింతురు.

### ౨౦. అపవిద్ధం

చతురశ్రతయా స్థిత్వా సవ్యమావర్తితం కరం
ఆక్షిప్తయా వినిష్కాస్య శుకతుండకృతం పునః ౩౪౦
న్యస్యోరోః పృష్ఠతో న్యస్యేత్తతస్తు కటకాముఖా
వక్షఃస్థలస్థితం వామం వర్తనా చాతురీవశాత్
కుర్యాద్యత్రాపవిద్ధం తదసూయాకోపయోః స్మృతం

### ౨౦. అపవిద్ధము

చతురశ్రముగా నుండుట, సవ్యహస్తమును ఆవర్తిత మొనరించుట, ఆక్షిప్త చారీవిధానమున నా హస్తము విడిచి శుకతుండ మొనరించుట, తన ఊరువునకు పృష్ఠమున నుంచుట, పిమ్మట వామహస్తము కటకాముఖముగ వక్షఃస్థలస్థిత మగుట అపవిద్ధకరణములో నుండును. వర్తనాచాతురీ వశముగా నీ క్రియ లిందుండును. అసూయాకోపప్రధానమయిన వాక్యార్థమున అపవిద్ధకరణ ప్రయోగ ముండుట గ్రాహ్యము. ఇందలి యీ విశేష మంతయు నభినవభారతి నుండి సంగృహీతమయినది.

శుకతుండహస్త మావర్తింపజేసి ఊరు పృష్ఠమున కూర్చుట వామహస్తము వక్షఃస్థమగుట యనునంశమాత్రము భరతోక్తి. ఇందభినవయోజన మీ విధముగ నున్నది. వక్షమున కష్టాంగుల గతములుగా కటకాముఖ హస్తములు ప్రాఙ్ముఖములుగా కూర్చి చాతురశ్ర్యమున నుండవలెను. పిమ్మట హస్తమును ఆవర్తితమున నిష్క్రమింపజేసి తత్సమ కాలమునని ఆక్షిప్తికచారి ననుసరింపవలెను. ఆహస్తమునే శుకతుండముగా కూర్చి ఊరుభాగమున

కూర్పవలెను. వామహస్తము కటకాముఖముగా వక్షమునందే యుండవలెను. దక్షిణ కరపాదాపర్యవసానమున తదుపలక్షితముగా వేగనిస్సరణ మున్నందున అపవిద్ధ మయినది. దీని నామ విశేషము ననె వర్తనాచాతుర్యము సూచిత మగుచున్నది. ఇట్లే యభినవ వాణి జాయసేనాపతి వాణిగా నిందు సంగతమయినది. ఇట్టి రీతి గ్రంథ మంతట గోచరించుచునె యుండును.

### ౫౧. గ రు డ ప్లు తం

వృశ్చికే కరణే హస్తౌ లతాఖ్యౌ రేచితః పరః
వక్షస్సముద్ధతం యత్ర తదుక్తం గరుడప్లుతం ౨౪౫
ఆహురన్యర్థమేవాస్య వినియోగం విచక్షణాః
పతాకే మణిబంధాంతే ముహురంచితకుంచితౌ
యత్ర లక్ష్యానుకూల్యేన కథితౌ భట్టతండునా

### ౫౧. గ రు డ ప్లు త ము.

వృశ్చికకరణము నందు నిరూపిత మయిన లతాహస్త ముండుట, రెండవ హస్తము రేచిత మగుట, వక్షము సముద్ధతముగా నుండుట కూడుకొన్నచో నది గరుడప్లుత కరణ మగును. ఈ గరుడ ప్లుతమున కన్యార్థమయిన వినియోగమునె విచక్షణులు నిరూపించిరి. ఈ కరణవిషయమున భట్టతండు వీ విధముగా ననెను. పతాక హస్తములు మణిబంధాంతమున ముహుర్ముహుః లక్ష్యానుకూల్యమున అంచితములు కుంచితములు కావలెను. ఇట్లున్న గరుడప్లుతీకరణము. అని "వక్షస్సముద్ధతం" అని యిందు లక్షణభాగమున నున్నది. "సమున్నతంశిరశ్చైవ" అని భరతవచనము. "సమున్నతమురశ్చైవ" అని యచటి పాఠాంతరము. శిరోవక్షములు రెండును సమున్నతములుగా నున్నను గరుడప్లుతస్వరూపము సుందరముగనె యుండును. "ప్రయోగోఽస్య నామోచితఏవ విషయే".

### ౫౨. ల లా ట తి ల కం

అన్వర్ధనామ యత్పృష్ఠం వృశ్చికం చరణం యధా
తదంగుష్ఠేన కుర్వీత యత్ర భాలే విశేషకం ౩౫౦
లలాటతిలకం విద్యాద్విద్యాధరగతావిదం

### ౫౨. ల లా ట తి ల క ము

లలాటతిలక మనునది సార్థకనామము. పృష్ఠభాగమున వృశ్చిక చరణము కూర్చి ఆ పాదాంగుష్ఠమున ఫాలతలమునందు తిలకము కూర్చునది. అది లలాటతిలక కరణమగును. పాదాంగుష్ఠ మును తిలకక్రియాహేతువుగా నుపలక్షిత మగునట్లు సంశ్లేషము కూర్పవలెను. విద్యాధరుల గతివిషయమున నిది ప్రయుక్తమగునని గాఖ్యాము.

### ౫౩. దో లా పా దం

ఊర్ధ్వజానువిధానేన పాదమాధాయ కుంచితం
దోలాపాదం భజన్ దోలౌ ప్రయోగవశగౌ కరౌ
యత్ర కుర్వీత తత్త్‌జ్ఞైః దోలాపాదముదీరితం

### ౫౩. దో లా పా ద ము

ఊర్ధ్వజానుచారీవిధానమున పాదమును కుంచితముగా నొనర్చి అనంతరము దోలాపాదచారి ననుసరింపవలెను. పిమ్మట దోలాహస్తములను ప్రయోగవశగములుగా నొనర్చునది. అప్పుడు దానిని తద్విదులు దోలాపాదకరణ మని వ్యవహరించిరి. దోలా పాదచారి హస్తస్వరూపములు నిరూపితములయినవి.

### ౫౪. త ల వి లా సి తం

పార్శ్వకర్ణసమక్షేత్రే భవేత్పాదః సముత్థితః ౩౫౫
ఊర్ధ్వాంగులితలోఽస్యాగ్రభాక్పతాకాంచితస్థలే

యత్రాంగాంతరమప్యేవం తత్స్యాత్తలవిలాసితం
పాదోద్ధారాభిధానేన సూత్రధారాదిగోచరః
భట్టతండుమతేఽత్రాంఘ్రిసంగతౌ యుగపత్కరౌ
రేచితావస్య పార్శ్వ స్తః కరౌ కీర్తిధరే మతే ౨౬౦

### ౫౪. తలవిలాసితము.

ఇందు సముత్థితమయిన పాదము పార్శ్వమున కర్ణసమాన ప్రదేశమున నుండునట్లు కూర్చవలెను. అట్లూర్ధ్వగతమయిన పాదముతో నంగులితలము అంచితతలముగా శ్లిష్టతలముగా నుండవలెను. పతాకాంచితస్థలమున నంగులి తలము సంగతము కావలెను. అంతరమున గూడ నిట్లె యొనర్చునది. ఇట్లే ప్రయోగము అభ్యాసమున గూడ నుండవచ్చును. పతాకహస్తములు పరస్పరోపసంశ్లిష్టములై యుండును. ఇట్టిది తలవిలాసిత మనుకరణమగును పాదతలమునకు హస్తతలమునకు నికృష్టమయిన ప్రదేశమున అనగా నాకాశమున లసితము = శ్లేషణమున్నందున నిది తలవిలసితము అయినది. ఇదియే తలవిలాసితము, తల—వి—లసితము కాగా తలవిలసితము, పాదోద్ధార సంజ్ఞయుండుటచే నాట్యాచార్యులు సూత్రధారాది విషయమున దీనిని యోజనము చేయుచున్నారు.

### ౫౫. తలసంస్ఫోటితం.

చార్యాతిక్రాంతయా దండపాదయా వాంఘ్రిముద్ధృతం
ద్రుతం నిపాతయన్నగ్రే సశబ్దం తాపయేన్మిథః
కరౌ యత్ర పతాకౌ తత్తలసంస్ఫోటితం మతం
హస్తేన హస్తతాలేఽన్య వినియోగః ప్రకీర్తితః

### ౨౫. త ల సం స్ఫో టి త ము.

అతిక్రాంతచారిచే గాని దండపాదచారిచే గాని పాదము నుద్ధృతముచేయుట, అగ్రభాగమున ద్రుతముగా నిపాతనము పరస్పరము సశబ్దముగా తాడనము, కరములు పతాకములుగా నుండుట తలసంస్ఫోటిత కరణము యొక్క స్వరూపము. హస్తముచే హస్తతాల మొనరించుటలో దీనికి వినియోగము కలదు.

### ౨౬. ద ం డ ప క్షం

ఊర్ధ్వజానులతాహస్తౌ జానున్యేకస్తయోర్యది ౧౬౫
స్యాదంగాంతరమప్యేవం దండపక్షం సమీరితం

### ౨౬. ద ం డ ప క్ష ము.

ఊర్ధ్వజానుచారి నాచరించుచు, తిర్యక్ప్రసారితములుగా నుండు లతాహస్తములను కూర్చి ఒకలతాహస్తమును జానువుయొక్క ఉపరిప్రదేశమున నుంచవలెను. పిమ్మట అంగాంతరమున గూడ నిట్లే యొనర్పవలెను. ఇట్లిది దండపక్ష కరణమగును. ఒక పార్శ్వమున దండమువలె బాహు సమవస్థానమున్నందున దండపక్ష కరణమయి నది.

### ౨౭. ఆ క్షి ప్త రే చి తం

చతురశ్రాఖ్యయోరేకో వ్యావృత్తకరణాశ్రితః
ఊర్ధ్వే పార్శ్వద్వయే క్షిప్తో హంసపక్షో ద్రుతభ్రమః
అధస్తలకరో నేయో వక్షోదేశమథాపరః
రేచితో బాహ్యతః క్షేప్యః తద్వశాచ్చరణోంచితః ౧౭౦
ఏకోఽపరస్తు సూచ్యాఖ్యో యస్మిన్నాక్షిప్తరేచితం
త్యాగోపాదానయోర్థే తద్ధేయం బహుశః కృతే

## ౫౭. ఆక్షిప్త రేచితము.

ఈ కరణమున భరత భాష యిట్లున్నది. వామహస్తము హృదయమున నుండుట, సవ్యహస్తము ఆక్షిప్త రేచితమగుట రేచితము అపవిద్ధ మగుట ఉన్నచో ఆక్షిప్తరేచిత కరణమగును. అని ఇందు అభినవయోజన మీ విధముగ నున్నది. హృదయక్షేత్రమున వామహస్త ముండును. సవ్యహస్తము ఊర్ధ్వప్రదేశమున పార్శ్వద్వయమున వ్యావర్తిత కరణము నక్షిప్తముగును. అది హంస పక్ష ద్రుతభ్రమాత్మకముగా రేచిత మగును. వక్షోదేశము చేరి అధోముఖమై అంచితము రేచితము అపవిద్ధము నగును. గాత్రక్షేత్రము నుండి నిష్క్రామిత మగుటచే నిది ఆక్షిప్త రేచిత కరణ మగుచున్నది. ఇందు పాదములు ప్రయోగానుసారమున అంచితసూచీ రూపమున నుండును. త్యాగోపాదాన పరస్పరాత్మకమయిన వాక్యార్థ మభినేతవ్యమగునేని దీని ప్రయోగింతురు. ఇది యిట్లుండగా నీ గ్రంథము నందలి వచనార్థము విశదము కాగలదు.

చతురశ్రము లను పేరుగల హస్తములలో నొకటి వ్యావృత్తకరణము నాశ్రయించినదై ఊర్ధ్వభాగమునందును పార్శ్వద్వయము నందును క్షిప్తమై హంసపక్షము ద్రుతభ్రమము నగును. క్రిందుగానున్న కరము వక్షోదేశమున నుండవలెను. రెండవది వెలుపలగా రేచితమై క్షిప్తము కావలెను. హస్తవశమున నొక చరణ మంచితమై యుండదగును. రెండవ పాదము సూచీపాదముగా నుండదగును. ఇట్లున్నదిది యాక్షిప్త రేచిత కరణమగును. పునఃపునః క్రియమాణమగు త్యాగోపాదాన యాపార్థమున నీ కరణము ప్రయుక్త మగును.

ఇట్లు అభినవ యోజనమును జాయానుసరణము వ్రాయుట కొన్నిట పునరుక్తముగా నున్న నావశ్యకమని నిరూపిత మయినది.

## ౫౭. జ ని త ం.

జనితాయాః కరో యత్ర లతాఖ్యో దక్షిణో భవేత్
జనితం తత్సమస్తానాం క్రియాయా జనికం యతః

## ౫౭. జ ని త ము.

ఒక హస్తము వక్షఃస్థితము రెండవది ప్రలంబితము పాదము తలాగ్రసంస్థితము కాగా జనిత కరణమగును. వక్షమున హస్తము ముష్టిహస్తము, ప్రలంబితహస్తము లతాఖ్యహస్తము దక్షిణము జనితాచారీవశమున నిందలి సర్వము సమాసీతమగును ఇతరములయిన సర్వక్రియల యారంభ కాలముననె తత్తత్సన్నివేశ మును ఈ జనితక్రియ సంపాదించును. కావున నీ జనితకరణము సమస్త క్రియలకు జనికకరణమని భావింప దగును.

## ౫౮. ఉ ప సృ త ం

అంఘ్రిరాక్షిప్తయా యుక్తో వామో యద్యపతం వ్రజేత్ ౨౭౫
వ్యావృత్తిపరివృత్తిభ్యామరాలత్వముపాగతః
తద్వైవానుగతో హస్తో దక్షిణం పార్శ్వమానతం
తదోపసృతమాఖ్యాతం దినయేనోపసర్పణే
అగ్రతశ్చరణౌ కార్యే క్రమాద్దాతౌ కరౌ తతః
ఇత్యంగీకురుతో భట్టతండుకీర్తిధరా విహ ౨౭౦

## ౫౮. ఉ ప సృ త ము

వామపాద మాక్షిప్త చారితో నుండుట అన్యపాదము చేరుట, తదనుగతమయిన హస్తము వ్యావర్తన పరివర్తనములతో గూడుకొనినదై అరాలహస్త స్వరూపము పొందుట, దక్షిణ పార్శ్వమానతమగుట ఉపసృత కరణమునకు రూపము సంపాదిం చును. ఇది వినయమున సమీపము చేరుటలో వినియోగము పొం-

దును. ఈ కరణవిషయమున భట్టతండుకీర్తిధరులీ భావము సూచించిరి. అగ్రభాగమున పాదములను కూర్పవలెను. క్రమముగా హస్తములు దోలాహస్తములుగా నుండవలెను. ఇట్లు వారిద్దరంగీకరించిరి. ఆక్షిప్తచారి ననుసరించి వామతో వ్యావర్తన మొనరింప వలెను. కరపరివర్తనమున గాత్రమును వంచి దక్షిణమురాల మొనర్పవలెనని అభినవుని యాయోజనము.

## ౪౮. ఉద్వృత్తం

ఆపసార్య క్షిపేత్పాదం హస్తం చోద్వృత్తయా సహ
యస్మిన్నశేషమంగం చ తదుద్వృత్తముదాహృతం
భట్టతండురిహాక్షిప్తాం చారీం పాదక్రియాం జగౌ

## ౪౮. ఉద్వృత్తము

ఉద్వృత్త చారి ననుసరించి పాదక్షేప మొనరింపవలెను. హస్తక్షేపము నొనరింప వలెను. ఇట్లు సర్వాంగము క్షిప్తము కావలెను. ఇట్టి దది ఉద్వృత్తకరణము, భట్టతండు విందు పాదక్రియ ఆక్షిప్త చారిగా నుండుటను నిరూపించెను. హస్తపాదము లాక్షిప్తము లాసారితా నీతములగుట యిందున్నది. సర్వదేహాక్షేప మెట్లుకలుగును? ఇట్లు కలుగును. హస్తపాదములు ఉద్వృత్తచారీయుక్తములయిన నవి యట్లగును. ఆవిద్ధపాదము నావేష్టిత మొనరించి సముత్ప్లుతి నాచరించి విపాతిత మొనర్పవలెను. పిమ్మట పరివర్తనము భ్రమణము నంకుట ఉద్వృత్తచారిలో కలదు. అది యిందు గలదు కావున సర్వము కలదు. కావుననె యిది యుద్వృత్త కరణ మయినది.

## ౪౯ అవహిత్థకం

కుర్వీత జనితాం చారీం కరావభిముఖాంగులీ
యత్రాలపల్లవారాలౌ వక్షస్తటలలాటయోః ౩౭౫

వ్యావృత్తోద్వేష్టితౌ గ్రాహ్యౌ కరాభ్యామవహిత్థకం
ఏతద్గోపనవాక్యార్థే విద్వద్భిర్వినియుజ్యతే
అవహిత్థకరం చాత్ర భట్టతండు రవోచత.

## ౬౧. అవహిత్థము

జనితచారి నాచరింపవలెను. కరము లభిముఖముగా నుండవలెను. అలపల్లవహస్తము వక్షఃస్థలమందును. అరాలహస్తము లలాటమందును ఉండవలెను. కరములచే వ్యావర్తనము ఉద్వేష్టనము గ్రహింపవలెను ఇట్టిదిగ అవహిత్థకరణ మగును. విద్వాంసులు దీనిని గోపన వాక్యార్థాభినయము నందు వినియోగింతురు. భట్టతండు విందు అవహిత్థకర ముండుటను చెప్పెను.

ఇచట లక్షణవచనములో "వ్యావృత్తోద్వేష్టితౌ గ్రాహ్యౌ కరాభ్యామవహిత్థకం" అని యున్నది. అవహిత్థక సంపూర్ణ లక్షణ వివేచనమునకు "కరాభ్యాం" అని మరల కరముల నిరూపించుట స్పష్టభావముగ లేదు. హస్తచాలనములు పార్శ్వములకు ప్రసరించి వక్షఃస్థానమునకు జేరుట యిందు నిర్ణీతము, అట్టి భావ మిందు పరిగ్రాహ్యము, జనితకరణము, హస్తము లభిముఖాంగులులుగా నుండుట శనైర్నిపతితము లగుట భరతోక్త లక్షణము. అభినవు డిట్లు యోజన మొనరించెను. జనితాచారీ విధానమున ముష్టిహస్తము వక్షఃస్థమయి నను అరాలము అలపల్లవముగా హస్తములు లలాట వక్షఃక్షేత్ర గతము లగునట్లొనరించి మెల్లగా నా కరములను ఉద్వేష్టితముల నొనర్ప వలెను. అధరోర్ధ్వక్రమమున పార్శ్వగతములనుగా జేయ వలెను. మరల అపవేష్టిత పరివర్తిత క్రియలతో అరాలాలపల్లవము లన్యోన్యము సమ్ముఖముగా వక్షోదేశమున కూర్పుపొంద వలెను. గోపన ప్రధానవాక్యార్థమున ప్రయోగ ముండును. కొందరవహిత్థ

హ స్త ముందుట చెప్పిరి. ఇట్టి అవహిత్థకరణము చింతాదౌర్బల్య విషయ మనియు ననిరి. ఈ అన్యమతమునె జాయపతి తండుమత ముగా జెప్పెను.

౬౨. నిశుంభితం.

అంచితం పాదమన్యాంఘ్రేః పార్ష్ణిభాగే వినిక్షిపేత్
వక్షఃసమున్నతం చిబుత్కటకాముఖమధ్యమాం ౩౯౦
కుర్యాత్తిలకవత్ఫాలే యత్ర తత్స్యాన్నిశుంభితం
అనేన కరణేన స్యాదభినేయ స్త్రిలోచనః
అత్ర కీర్తిధరస్త్వాహ సూచీముఖ మధోముఖం
తస్యాభినయనే హస్తో యస్మాదయముదీరితః
ఏతస్మిన్కరణే పాదం వృశ్చికం కేచిదూచిరే ౩౯౧

౬౨. నిశుంభితము

ఈ నిశుంభిత కరణమునకు నిస్తంభిత కరణ మనియు పేరు కలదు. లక్షణారంభములో "అంచితం" అను పదమును "కుంచితం" అని గ్రహింపనలెను. అభినవ భరతులు కుంచిత మనియే పేర్కొనిరి. ఒక పాదము రెండవ పాదము యొక్క పృష్ఠమున పార్ష్ణిభాగమున కుంచితమై యుండవలెను. వక్షము సమున్నతము. అనగా నిర్భుగ్నము స్తబ్ధము నిమ్నపృష్ఠముగా నుండుట. కటకాముఖ హస్తమునకు సంబంధించిన మధ్యమాంగులిని లలాటమున తిలకము వలె ధరింపవలెను. ఇట్లున్నచో నిది నిశుంభిత కరణమగును. పాదముచే భూమికి ఆఘాత మొనరించుట యిందుండును గావున నిది నిశుంభిత మయినది. దీనిచే త్రిలోచను డభినేయు డగును. ఇది మహేశ్వరాభినయ విషయము. ఈ కరణ విషయమున కీర్తిధరు డిట్లనెను. ఈ నిశుంభాభినయము నందు సూచీముఖ హస్త మధో

ముఖముగా నుంచును. కొందరు ఇందు పాదము వృశ్చికపాదముగా నుండుటను నిరూపించిరి.

౬౩. విక్షిప్తాక్షిప్తం.

వ్యావృత్తకరణం యేన కరేణ ప్రవిధీయతే
తేనైవ సహ విక్షిప్తః స ఏవ చరణో బహిః
ఆక్షేపే హస్తపాదస్య తస్యైవ పరివర్తనాత్
అన్యాంగే చ భవేదేవం విక్షిప్తాక్షిప్తకాభిదే
ఏతన్నాట్యాంగవిచ్ఛేదే ప్రయోజ్యం సంధిగుప్తయే ౪౦౦
తాలానామనుసంధానే గతీనాం వా పరిక్రమే
చారీణాం వా నియుద్ధాదౌ సంచారేషు యథాక్రమం
కేచిద్గతాగతేష్వస్య వినియోగం ప్రచక్షతే.

౬౩. విక్షిప్తాక్షిప్తము.

హస్తపాదములు విక్షిప్తములగుట, అవియే మఱల ఆక్షిప్తములగుట విక్షిప్తాక్షిప్త కరణ రూపమని భరతుని వచనము. ఇందభినవ యోజన యీ విధముగ నున్నది. ఒక హస్తమున వ్యావర్తన మొనరించు సమయమున పాదమునకు బహిర్నిష్క్రమణ రూపమగు విక్షేపము ఉండవలెను. రెండవ హస్తము చతురశ్రముగనె యుండును. మఱల పరివర్తిత కరణమున నా హస్తపాదమునకు ఆక్షేపమును రెండవ దానికి విక్షేపము నుండును. గమనాగమన ప్రధానమయిన వాక్యార్థమున దీని ప్రయోగ ముండును. ఇట్లు విక్షిప్తాక్షిప్త రీతులున్నందున నిది విక్షిప్తాక్షిప్త కరణ మగును. అని

అభినవ గుప్తోపాధ్యాయుడు భట్టతోతుడు ఈ విషయమున నిట్లుప పాదించెను. అభినయ హస్త ప్రధానమయిన కరణమున కంతట వాక్యార్థాభినయము నందు ప్రయోగము ఉండుట

సమ్మతము, కేవలము వర్తనాప్రధానమునకు గాని, కేవలము నృత్త హస్త ప్రధానమునకుగాని వాక్యార్థాభినయము నందు ప్రయోగము సమ్మతము కాదు. అట్టి వానికి ప్రధానముగ నృత్తమున ప్రయోగ ముండును.

కేవల వర్తనాప్రధానము కేవల నృత్తహస్తప్రధానము నగునది కేవలము నృత్తముననె ప్రధానముగ ప్రయుక్తమగునను భట్టతోతుని భావానుబంధమున కొందరీ విధముగ ననిరి. ఏదేని నాట్యాంగము లోపించినపుడు ధారావాహికతకు లోటురాకుండుటకై సంధిగోపనమునకై ఛిద్రాచ్ఛాదనమునకై వర్తనాప్రధానములు నృత్తహస్త ప్రధానములగు వానిని ప్రయోగింప దగును. మర్మగోపనమునకు మోద రక్షణమునకు వాని ప్రయోగ మావశ్యకము. అట్లే యట్టివి యథాయోగముగా నభినయముల యంతరాలములందు ప్రయోగింప నర్హములు. గతి పరిక్రమములలో పూర్వపు తాలగతి మార్చి వేరొక తాలము కూర్చునపుడు ఇట్టి వానిని ప్రయోగింప వలెను. ఇంకను యుద్ధ నియుద్ధ విశేషములలో చారీగతులందు స్థానకములందును సంచార విశేషములందును వీనిని ప్రయోగింప జనును. అని ఇట్లు భట్టతోత భావానుబంధముగా కొందరనిరి. ఇట్టి విధానముల నంతట పరిశీలించి యనుసరింప దగును.

పై విధముగా భరతాభినవుల వచన సారమున్నది. ఈ విక్షిప్తాక్షిప్త కరణ లక్షణమును జాయసేనాపతి యిట్లు భావించుట యిందు గాననగును.

ఏ హస్తమున వ్యావర్తన మాచరింతురో ఆ హస్తము తోడనే ఆచరణము బహిర్విక్షిప్తము కావలెను, హస్తపాదము సాక్షిప్తములు కాగా నా హస్తపాదములకె పరివర్తనము నుండుట.

అన్యాంగము నందును ఇట్టి విక్షేపాక్షేపము లుండదగును. ఇట్టి స్వరూపము ఈ విక్షిప్తాక్షిప్త కరణము నందుండును. ఈ కరణమును నాట్యాంగవిచ్ఛేదమున సంధిగోపనమునకై ప్రయోగింప వలెను. తాలానుసంధానము నందును ప్రయోగింపదగును. గతపరిక్రమమున ప్రయోజ్యము. చారీ విశేషములకు సంబంధించిన నియుద్ధాంకులలో యుద్ధోచితముగా సంచార క్రమములందును వీని ప్రయోగింప వచ్చును. కొందరు గతాగతము నందు దీని ప్రయోగమును వినియోగమును పలికిరి.

ఇట్టి భావము జాయపతి నిరూపణములో నున్నది కరణ లక్షణ మట్లై యున్నను, వినియోగ సూచనము వేరుగ నున్నది. ఈ విక్షిప్తాక్షిప్త కరణము కేవల వలనాప్రధానము కాదు కేవల నృత్త హస్త ప్రధానమును కాదు. లక్షణమున నున్నట్లిది యింతకన్న భిన్నమయి నందున అభినవగుప్తుడనినట్లుగా, గమనాగమన ప్రధానమయిన వాక్యార్థముననె ప్రయోగము సముచితము. ఉపాధ్యాయులు (భట్టతోతుడు) నిరూపించినట్లు భావించినట్లు ఈ విక్షిప్తాక్షిప్తమును అభినయ హస్త ప్రధానమగు కరణమె కావున వాక్యార్థాభినయము ననె ప్రయోగార్హమగును. ఇది వర్తనా ప్రధానము నృత్తహస్త ప్రధానము కానందున ప్రధానముగా నృత్తమున ప్రయోగింప దగదు. అంగవిచ్ఛేదమున సంధిగోపనమున తాలానుసంధానాదులలో దీనికి ప్రయోగ ముండుననుట యుక్తము కాదు. జాయసేనాపతియు నిట్టి విషయవివేచనమున నభిజ్ఞ భావములనె నిబంధించెను. ఈ యధ్యాయముననె మొదట కొంత చెప్పి చెప్పి యిట్లు చెప్పెను.

"యత్రాభినయహస్తానాం ప్రాధాన్యం కరణే భవేత్
వాక్యార్థాభినయస్తత్ర కార్యః నృత్తే న కేవలే
నృత్తహస్తప్రధానం తు కరణం తత్ర శస్యతే"

ఇట్లు పూర్వము నిరూపించిన కర్త యిచట ఇట్లు నిరూపించుట వ్యత్యస్తముగా నుండవచ్చును. అందుకనే యిది యింతగా నిరూపిత మయినది.

## ౭౪. ఆక్షిప్తం.

ఆక్షిప్తాయాం యదా చార్యాం పాదాక్షేపో ద్రుతో భవేత్
తదైవ చతురః పాణిరాక్షేప్యః కటకోఽథవా ౪౦౫
యత్ర పార్శ్వం నతం కించిత్తదాక్షిప్తం ప్రచక్షతే
విహితో వినియోగోస్య విదూషకపరిక్రమే

## ౭౪. ఆక్షిప్తము.

ఆక్షిప్తయను చారీగతి విశేషములో పాదాక్షేపము వేగముగా నున్నచో నప్పుడె చతురహస్తము ఆక్షేప్యము కావలెను. అప్పుడు కటకాముఖ హస్తమయినను ఆక్షేప్యము కావలెను. ఆ సమయమున పార్శ్వభాగము కొంతగా నతము కావలెను. అప్పుడది ఆక్షిప్తమను కరణ మగును. విదూషకుని పరిక్రమములో నీ యాక్షిప్త కరణమునకు వినియోగము విహితమయినది.

## ౭౫. భుజంగత్రస్తరేచితం.

భుజంగత్రాసితౌ హస్తౌ రేచితౌ వామపార్శ్వగౌ
యత్ర కుర్వీత తత్రోక్తం భుజంగత్రస్తరేచితం.

## ౭౫. భుజంగత్రస్తరేచితము.

భుజంగ త్రాసితములను హస్తములు రేచితములై వామ పార్శ్వగతములై యుండున ట్లొనరించినచో నది భుజంగ త్రస్తరేచిత కరణ మగును. నామోపపత్తిని పూర్వనిరూపితానుసారమున గుర్తించునది.

## ౬౬. మండలస్వస్తికం.

విచ్యవాయాః ప్రయోగేణ సహోద్వేష్టితవర్తితౌ ౪౧౦
కృతోర్ధ్వమండలం కుర్వన్ కుర్వీత స్వస్తికౌ తతః
బధ్నీయాన్మండలస్థానం మండలస్వస్తికం భవేత్
విలాసపరిసంఖ్యానే ప్రత్యక్షేఽర్థే భవేదిదం.

## ౬౬. మండలస్వస్తికము

మొదట విచ్యవ అను పేరుగల చారి ప్రయోగించునది. ఆ ప్రయోగ సమయముననే ఉద్వేష్టిత వర్తనమున హస్తములను స్వస్తికములనుగా నొనర్చునది. ఉద్వేష్టిత వర్తనముననె ఊర్ధ్వ మండలి వర్తనము కూర్చునది. పిమ్మట మండలస్థానకమును గూర్చునది. అప్పుడది మండల స్వస్తిక కరణమగును. ఇది విలాస పరిసంఖ్యానమున ప్రత్యక్షమగు నర్థమున వినియోగము పొందును.

మొదట చతురశ్ర హస్తములతో నుండుటయు విచ్యవా ప్రయోగము ఉద్వేష్టిత వర్తనము ఊర్ధ్వ మండలి వర్తనము స్వస్తిక యుక్తిమండల స్థానక బంధములను అభినవభారతి వరుసగా నిరూపించినది. ఇది నికార వాక్యార్థాభినయమున వినియోగము పొందునని అభినవుడు సూచించెను. జాయపతి "ప్రత్యక్షేఽర్థే" అనెను.

## ౬౭. దండపాదం.

యత్ర నూపురపాదోత్థాం దండపాదాం సమాచరేత్
హస్తం దండవదుత్క్షిప్తమన్తర్జంఘం ద్రుతం నయేత్ ౪౧౫
దండపాదం సమాఖ్యాతం తత్సాటోపపరిక్రమే
అత్రాదౌ జనితా భట్టతండుకీర్తిధరోదితా
ఏకః స్యాదూర్ధ్వతః క్షిప్తః పరో జంఘాముపాగతః
కరోఽభవదితి ప్రాహ భట్టతండుః ప్రయోగవిత్

### ౭౩. దండపాదము.

ఇందు ముందుగా నూపుర పాదికాచారీరీతి ననుసరింప వలెను. పాద మగ్రతలమున పృష్ఠభాగముగా నభ్యంచిత మొనరించి వేగముగా భూమి యందు నిపాతిత మొనరించుట నూపురపాదిక చారి. అనంతరము నూపుర పాద సముత్థమయిన దండపాదచారి నాచరింప వలెను. హస్తమును దండము వలె విక్షిప్త మొనరించి జంఘాంతిర్భాగమున వేగముగా పాదింప వలెను. అప్పుడది దండ పాదకరణ మగును. ఇది నాట్యోపకరిక్రమములలో వినియోగింతురు. ఈ విషయమున భట్టతండులు కీర్తిధరు లీ విధముగా ననిరి. దీనిలో జనితాచారి మొదట నుండవలయును. జనితాచారి సర్వకరణములకు సామాన్యముగా జనిత కావున నది యుండుట యుచితము. ప్రయోగ విదుడయిన భట్టతండువు; ఒక హస్తము ఊర్ధ్వ భాగముగా క్షిప్తము కావలెనని, రెండవ హస్తము జంఘాభాగము ననుసరించి యుండ వలయునని చెప్పెను.

### ౭౪. పాదాపవిద్ధం

వరాఙ్ముఖౌ యదా నాభిక్షేత్రే హస్తః కటకాముఖౌ ౪-౨౦
సూచీపాదః పరః పాదో విద్ధావక్రాంతయాన్వితః
భవేదేవం ద్వితీయోపి తదా పాదాపవిద్ధకః

### ౭౪. పాదావవిద్ధకము

కటకాముఖ హస్తములు నాభిప్రదేశము నందు పరాఙ్ముఖ ములుగా నుండగా ఒకపాదము సూచీపాదముతో నుండి ద్వితీయ పాదమును విద్ధ మొనరింప వలెను. ఆ సూచీపాదమే అతిక్రాంతచారీ యుక్తము కావలెను. ఇట్లే రెండవ పాదమున గూడ జేయునది. అప్పుడది పాదాపవిద్ధక కరణ మగును. పాదమున పాదాంతరము

అపవిద్ధము= అపసారితము అగును గావున నిది పాదాపవిద్ధ కరణ మయినది. పార్ష్ణిభాగ ముత్క్షిప్తమై పాదాగ్రమున సంస్థిత మగుట సూచీపాదమని, ఊరువలన మొనర్పగా నపక్రాంతమని గ్రాహ్యము.

౬౮ భుజంగత్రాసితము.

భుజంగత్రాసితాం కృత్వా వ్యావృత్తపరివృత్తకం
ఏకం పాదవశాద్దోలమపరం కటకాముఖం
విదధీత యదా జ్ఞేయం భుజంగత్రాసితం తదా ౪౨౩

౬౮. భుజంగత్రాసితము.

కుంచితపాదమును ఉత్క్షేపించుట, ఊరువును త్ర్యశ్రముగా వివర్తింపజేయుట, కటిజాను నివర్తన ముండుట భుజంగత్రాసిత కరణ లక్షణముగా భరతుని వచనము. దీనిపై నభినవభారతీ యోజనానుసారమున నిచటి లక్షణమున్నది. భుజంగత్రాసితచారి నాచరించుట కాగా వ్యావర్తన పరివర్తనములతోనున్న హస్తములలో నొక హస్తము పాదానుగతముగా దోలాహస్తముగా నుండవలెను. ఇట్లున్న నిది భుజంగత్రాసిత కరణము. హస్తములు పాదవశమున వ్యావృత్త పరివృత్తము లగుట యిందు శోభ సంపాదించును.

నృత్తమనాది సిద్ధము, సమీపమున సర్పమున్నదని యూ శంకించి చూచి సర్పత్రాసాగతసంవర్తము కలవాడగును. వాని గమనము వలె నిందలి గమన ముండును గావున నిది భుజంగత్రాసిత కరణ మయినది. సర్పత్రావిష్టసాదృశ్య మున్నందున ఈ కరణసాదృశ్య మున్నందున భుజంగత్రాసితచారియు నిరూపిత మయినది. ఇట్లె చారీవిశేషములం దన్నిటను కరణ తుల్యమయిన నామము నిరూపించి భావించుట యుక్తము.

### ౬౦. విష్ణుక్రాంతం

యదాగ్రే కుంచితః పాదః ప్రసృతో గమనోన్ముఖః
రేచితౌ చ స్థితౌ కరౌ విష్ణుక్రాంతం తద్విక్రమే హరేః

### ౬౦. విష్ణుక్రాంతము.

అగ్రభాగమున పాదము కుంచితమగుట, అది ప్రసృతమై గమనోన్ముఖమగుట, కరములు రేచితములగుట విష్ణుక్రాంత కరణమునకు లక్షణము. విష్ణు విక్రమమున నిది వినియుక్తమగును. భరతుడు నిరూపించిన లక్షణమున "పాదః కుంచితో గగనోన్ముఖః" అని యున్నది. "పాదః కుంచితోఽగ్రతోన్ముఖః" అని పాఠాంతరము నున్నది. కరణచిత్రమున పాదము గగనోన్ముఖముగా లేదు గగనోన్ముఖ గమనోన్ముఖ పదములను సంగతపరచుకొనవచ్చును. గమనమున కెత్తిన పాద మొకింత గగన ప్రసారముతో నుండుట నభ్యూహింపవచ్చును. విష్ణువున కిట్టి క్రమణముండును. తత్తద్విషయముగా దీని ప్రయోగ ముండును.

### ౬౧. స్వస్తికరేచితం

ప్రథమం రేచితౌ పశ్చాత్ శీర్షాద్వ్యావర్తనాదధః
నీతోర్ధ్వం పరివర్తేనావిద్ధవక్రౌ పురస్యథ
స్వస్తికౌ విప్రకీర్ణౌ చ పక్షవంచితకౌ తతః ౪౩౦
పక్షప్రద్యోతకౌ నృత్తకరషట్కమితి క్రమాత్
తత్కరానుగతా చారీ స్థానమంతేఽవహిత్థకం
యత్ర తత్కరణం ప్రోక్తం బుధైః స్వస్తికరేచితం
నృత్తాభినయే మాభ్యే ప్రహర్షాదౌ ప్రయుజ్యతే

### ౬౧. స్వస్తికరేచితము.

ఈ కరణము నృత్తహస్త షట్కస్వరూపమున నుండును. రేచితములు ఆవిద్ధవక్రములు స్వస్తికములు విప్రకీర్ణములు పక్షవంచి

తకములు పక్షప్రద్యోతకములు అను నాలుగు విధములుగా నృత్తహస్త ములు వినియోగనిరూపణమున నుండును. భరతుడు స్వస్తిక రేచితావిద్ధ విక్షిప్త కటీ సంశ్రిత హస్త సంజ్ఞల నందు నిరూపించెను. నృత్త శాస్త్రాచార్య ప్రౌఢుడయిన అభినవగుప్తుడీ హస్తముల యోజనావిధమును నిరూపించెను. అది యాధారముగా జాయపతి స్వస్తిక రేచిత స్వరూప సౌందర్యము నిరూపించెను.

నృత్తహస్తములు మొదట రేచితములు కావలెను. అనంతరము శీర్షమునుండి దిగువభాగమునకు వ్యావర్తనము పొందినవై ఊర్ధ్వము ప్రసరింపవలెను. పిమ్మట పరివర్తనమున ఉరమునందు ఆవిద్ధవక్రములు కావలెను. అనంతరము స్వస్తికములై విప్రకీర్ణములై పక్షవంచితకములై పక్షప్రద్యోతకములు కావలెను. ఇట్లు క్రమముగా నృత్తహస్తము లుండును. ఆ నిరూపిత హస్తానుగతముగా శారీరకగతి యుండవలెను. తుదకు అవహిత్థక స్థాన సూచితము, ఇట్లున్న నిది స్వస్తిక రేచిత కరణ మగునని బుధులు నిరూపించిరి. నృత్తత్వ సంపాదకమగు నృత్తమె ముఖ్యమయినప్పుడు దీని ప్రయోగ ముండును. ప్రహర్షాదులందు నిది యపేక్షితము.

మొదట రేచితములు పిమ్మట నావిద్ధములు వక్రములునై యనంతరము దేహాక్షేత్రము పొంది స్వస్తికములు కావలెను. పిమ్మట విక్షిప్తములు—విప్రకీర్ణములు కావలెను. కటీసంస్థములు — పక్షప్రద్యోత పక్షవంచితక రూపమున నుండవలెను. రేచితాదుల స్వరూపము నిరూపిత మయినది.

ఇందు యోజన యిట్లుండును.

చాతురశ్ర్య మొనరించు నంతరమున రేచితవర్తనమున పక్షములను కూర్చి, వ్యావర్తన మొనరించుచు శిరఃక్షేత్రము నుండి

అధర గమనము ఉపరి గమనములు [illegible] వర్తివర్తి నము కూర్చవలెను. ఆ విధానమున నక్షత్రాకారమునందు స్వస్తికములను సంధానించునది. ఆ స్వస్తికములచే విప్రకీర్ణముల నొనరించి మరల పక్షవంచితములుగను ఇరుల పక్షప్రద్యోతములను కూర్చునది. ఇట్లొనరింపగా నిది స్వస్తికరేచిత మగును.

ఈ కరణ విషయమున కొందరి భావముల సంగతము లుగా నున్నవని అభినవుడనెను. దీనిలో నచ్చటచ్చట నృత్తహస్త ప్రయోగ వశమున అలాతచారి మండల సంస్థానము సమనఖరీతి యనువర్తనము పొందుటను కొందరనిరట. ఈ స్వస్తిక రేచిత కర ణము నృత్తమె ప్రధానముగా నభినేయమగు నపుడు పరిహాసాది సం బంధముండగా ప్రయుక్త మగుట యుక్తము.

## ౭౨. ఏలకాక్రీడితం

ఏలకాక్రీడితా చారీ సన్నతం వలితం వపుః ౪౩౭
యత్ర ప్రయోగతో హస్తావేలకాక్రీడితాభిధా
అధమప్రకృతీనాం తద్గమనే వినియుజ్యతే

## ౭౨. ఏలకాక్రీడితము.

ఏలకాక్రీడిత యను చారీగతి ననుసరించుటలో శరీరము సన్నతము వలితము నగునేని హస్తములు ప్రయోగానుసారమున నుండునేని, ఏలకాక్రీడితమను కరణమగును. దీని నధమప్రకృతుల గమనము నందు వినియోగింతురు. తల సంచర పాదములచే "ఉత్ప్లుత్య పతనం" అనిరిపుటను భరతుడు చెప్పెను. పతన కాల మున గాత్రమునకు నమనము సమ్యగ్వలనము నుండును. అధమ ప్రకృతి గతి విషయ మేతత్.

౭౩. సం భ్రాం తం

సమమావిద్ధయా చార్యా వ్యావర్త్య పరివర్తితం
ఊరుపృష్ఠే కరం యత్ర నిదధ్యాదలపల్లవం
సంభ్రాంతం కథయంత్యేతత్ ససంభ్రమపరిక్రమే ४४०
పద్మకోశోఽథవా త్ర స్యాదితి కీర్తిధరోఽభ్యధాత్

౭౩. సం భ్రాం త ము.

ఆవిద్ధ చారితో సమముగా అలపల్లవ హస్తము వ్యావర్తితమై పరివర్తితమై ఊరుపృష్ఠమున కూర్పుకలది కావలెను. అప్పుడది సంభ్రాంతమను కరణ మగును. దీనిని ససంభ్రమ పరిక్రమమున ప్రయోగింతురు. ఇందు అలపల్లవ హస్తమె కాక పద్మకోశ హస్తమేని యుండదగునని కీర్తిధరు డనెను.

౭४. సిం హా క ర్షి తం.

వృశ్చికం చరణం కృత్వా మణిబంధనికుంచితౌ
స్వస్తికేన సమాయుక్తౌ పద్మకోశౌ యదా కరౌ
విదధ్యాదూర్ధ్వనాభౌ వా వర్తనావశతః పునః
అపసార్య క్రియామేతాం కుర్యాదంగాంతరం తథా ४४౨
సింహాకర్షితమాఖ్యాతం సింహవ్యాఘ్రాదిదర్శనే
ఆవేష్ట్య స్యందితాం చారీమంచితౌ మకరౌ కరౌ
అత్ర కీర్తిధరో భట్టతండుర్నూపురపాదికాం

౭४. సిం హా క ర్షి త ము

పాదము పృష్ఠప్రసర్పితము హస్తములు నికుంచితములు ఇట్లిట్లు చేయుట సింహాకర్షితమని సంక్షిప్త లక్షణము. ఒకపాదము వృశ్చిక పాదముగా నుండుట, దక్షిణహస్తము పద్మకోశముగా వామహస్తము ఊర్ధ్వనాభముగా నుండి స్వస్తికముతో కూడినవై

మణిబంధభాగమున నికుంచితములుగా నుండుట ఇం దావశ్యకము. వర్తనా విశేషమున ఈ విధానమును మార్చి, అంగాంతరమున గూడ నిట్లె యొనరించినచో నిది సింహాకర్షిత కరణమగును. అనగా; రెండవ పాదమున వృశ్చిక పాదమనుసరించుట అప్పుడు క్రియా వర్తన విశేషవశమున మార్చి పద్మకోశోర్ణనాభములను పట్టినచో సింహాకర్షితమగునని భావము. సింహవ్యాఘ్రాది దర్శనమున నీ కరణమును ప్రయోగింప దగును. "సింహాద్యభినయ విషయం సింహాకర్షితకం"

కీర్తిధరభట్టతండువు లీ విషయమున నిట్లు చెప్పిరి. స్యందిత చారి ననుసరించి మకరకరముల నంచితములనుగా నొనరించినచో నూపురపాదికచారి కూర్చినచో సింహాకర్షిత మగును. అని.

## ౭౫. సర్పితం

అంచితం పాదమన్యస్య సమీపాదపసర్పయన్
తద్దిక్కం రేచితం హస్తశిరశ్చ పరివాహితం ౪౫౦
కృత్వా యత్ర ప్రకుర్వీత పునరంగాంతరేణ చ
సర్పితం తద్భవేత్పాదకృతమత్తాగతాగతే

## ౭౫. సర్పితము.

అన్య పాద సమీపము నుండి అంచిత పాదమును అపసర్పిత మొనరించి, తద్దిక్కముగనె హస్తరేచితము శిరోరేచిత మొనరించి పరివాహిత శిరఃకర్మ నాచరింప వలెను. ఇట్లే యంగాంతరమున గూడ నాచరించునది. అప్పుడది సర్పిత మనుకరణమగును. ఈ కరణము పాదముచే నొనరించు మత్తుడయిన వాని గతాగతములలో ఉపసర్పణాపసర్పణములలో వినియోగము పొందును.

పాదములు అంచితములు అపసృతములు, శిరము పరివాహితము, హస్తములు రేచితములు, ఇంతమాత్రము స్వరూప లక్షణము. దీనిని యోజనము చేయుటలో క్రియాప్రక్రియల నభినవుడు చూపగా జాయపతి కూర్చెను. ఒక పాదమంచితపాదమై ద్వితీయపాద నికటమున నపసృతమై యుండగా తత్సమకాలముననె శిరము తత్పార్శ్వగతము కావలెను పార్శ్వగతి యగుట వలననె శిరము పరివాహిత మగుట సంగతము. హస్తమును తత్పార్శ్వగతముగా రేచితము కావలెను. ఇట్లు ద్వితీయ కరపాద విధియు గ్రాహ్యము. సర్పితమను నామ బలమున పాదకృత మదోపసర్పణ విషయముగా నిది యుండునని గోచరించును.

౬౬. నాగాపసర్పితం.

రేచితౌ చ కరౌ యత్ర హంసపక్షౌ భ్రమత్భ్రమే
చరణౌ స్వస్తికీభూయ విచ్యుతౌ పరివాహితం
శిరశ్చేత్తరుణే తత్స్యాన్మదే నాగాపసర్పితం ౪౨౫
మత్తల్లియోగతః పాదౌ స్ఖలితావపసర్పితౌ
*కరీకురుతో భట్టతండుకీర్తిధరావిహ

౬౬. నాగాపసర్పితము.

ఈ కరణమునందు కరములు రేచితము లగుట హంసపక్షములై భ్రమత్భ్రమము లగుట, చరణములు స్వస్తికములై విచ్యుతము లగుట, శిరము పరివాహితమగుట యుండును. ఇట్టిది నాగాపసర్పిత కరణము. తరుణమదము ప్రయోగింప వలసి యున్నప్పుడిది వినియుక్త మగును. భట్టతండువు కీర్తిధరులు తమ యంగీకృత భావము నిట్లు సూచించిరి. మత్తల్లిచారీ సంబంధము వలన పాదములు స్ఖలితములు అపసర్పితములు అగును. అని కుటిలగతి యోగము వలన

నిది నానాసన్విత మయినది. పరివర్తితశిర మనగా పర్యాయశః పార్శ్వగతమగు శిర మని భావము.

౭౭. పార్శ్వజాను

యస్మిన్సమస్థితస్యాంఘ్రేరూరుపృష్ఠే వ్యవస్థితః
అన్యోఽంఘ్రిరథ వక్షస్థో ముష్టిః స్యాదపరః కరః
అర్ధచంద్రః కటీసంస్థః పార్శ్వజాను తదీరితం ౪౬౦
బుధైర్యుద్ధే నియుద్ధే చ వినియోగోఽస్య కీర్తితః
ఊరోరభ్యంతరే పార్శ్వే పరపాదాగ్రసంస్థితిం
భట్టతండురిహ బ్రూతే పాఠాంతరవిలోకనాత్

౭౭. పార్శ్వజానువు

దీనిలో సమరీతిలో నున్న పాదమునకు పృష్ఠభాగమున మరియొక పాదముండును. ముష్టినామక హస్తము వక్షఃస్థమై యుండును. వేరొక హస్తము అర్ధచంద్ర హస్తముగా కటీగతమై యుండును. ఇట్లున్న నిది పార్శ్వజానుకరణ మగును. యుద్ధము నందును నియుద్ధము నందును దీనికి వినియోగ ముండునని నాట్య విదులనిరి. భట్టతండు వీ విషయమున పాఠాంతరము పరిశీలించి ఊరువు యొక్క అభ్యంతర పార్శ్వము నందు వేరొక పాదాగ్రముండుటను నిరూపించెను. పార్శ్వజానుపదవ్యుత్పత్తి నిర్వచన మీా విధముగ నున్నది. "పార్శ్వఊరుపృష్ఠః తస్య పాదస్య సంబంధి జాను యత్రేతి" పార్శ్వ మనునది ఊరుపృష్ఠము, అట్లున్న పాదమునకు సంబంధించి జాను విందుండును కావున నిది పార్శ్వజాను వయినది.

౭౮. వృశ్చికరేచితం

హంసపక్షౌ ద్రుతభ్రాంత్యా రేచితౌ భవతః కరౌ
స్వస్తికౌ విప్రకీర్ణౌ చ యత్ర పాదస్తు వృశ్చికః ౪౬౨
వ్యోమయానే ప్రయోక్తవ్యమేతద్వృశ్చికరేచితం

౭౮. వృ శ్చి క రే చి త ము

హంసపక్ష హస్తములు వేగభ్రమణమున రేచితములై స్వస్తికములై విప్రకీర్ణములు కాగా పాదము వృశ్చికపాదముగా నుండునేని వృశ్చికరేచితకరణ మగును. దీనిని వ్యోమయానమున ప్రయోగింతురు.

౭౯. ల తా వృ శ్చి క ం

లతాసంజ్ఞః కరో వామః పాదశ్చ యది వృశ్చికః
తల్లతావృశ్చికం ప్రోక్తం పతనే గగనాదధః
వామో లతాప్రయోగాత్స్యాద్దక్షిణో ఽత్ర హృది స్థితః

౭౯. ల తా వృ శ్చి క ము

వామహస్తము లతాహస్తము గను పాదము వృశ్చిక పాదముగను ఉన్నచో లతావృశ్చికకరణ మగును. దీని నాకసము నుండి దిగుటలో ప్రయోగింతురు. వామహస్తము లతాహస్త ప్రయోగమున నుండగా దక్షిణ హస్తము హృదయగతమై యుండును. వామచరణము భూమి యందుండుట యిందు నిగ్రాహ్యము.

౮౦. వై శా ఖ రే చి త ం

వైశాఖస్థానకం కుర్వన్ గ్రీవాపాదకటిక్రమాత్ ౪౭౦
రేచయేద్యత్ర తద్ధీరైః ప్రోక్తం వైశాఖరేచితం
వైష్ణవం స్థానమత్రాదౌ ప్రోక్తం కీర్తిధరాదిభిః

౮౧. వై శా ఖ రే చి త ము.

వైశాఖ స్థానకమున హస్త, పాదములు కటిగ్రీవ రేచితము లయినచో వైశాఖరేచిత కరణము. వైశాఖ స్థానక మాచరించుచు గ్రీవాపాద కటిక్రమమున రేచన మొనరించినచో నది వైశాఖ రేచితకరణ మని నృత్తధీరు లందురు. ఇందు మొదట

వైష్ణవ స్థాన ముండవలెనని కీర్తిధరాదు లనిరి. ఈ గ్రంథము నందలి లక్షణములో హస్తరేచనము నిరూపితము కాలేదు. అయిన నది అర్థసిద్ధ మగుట పరిగ్రాహ్యము. రేచితములగు నృత్తహస్తములు హంసపక్షములై ద్రుతభ్రమములుగా నుండదగును. రేచిత హంస పక్ష నృత్తహస్తానుకారమున పాదగ్రీవా కటిగత మయిన రేచితమును గుర్తింప వలెను. "గ్రీవాయాం కరయోః కట్యాంపాదయోశ్చ పృథక్పృథక్, భ్రమణం రేచితం విద్యాత్" అని రాహులకు డనెనని అభినవగుప్తు డనెను. గ్రీవాహస్త కటీపాదములందు వేరు వేరుగా భ్రమణ ముండుటచే రేచితమని గ్రహింపవలెనని తద్భా వము. ఈ కరణ మభివాహానమున నిరూపణీయము.

### ౮౧. హరిణప్లుతం

చార్యా తదాఖ్యయా జ్ఞేయం కరణం హరిణప్లుతం
కరా సామాన్యతః ప్రోక్తా వక్షఃపాదానుగాలిహ
చార్యా ఏవ ద్విరావృత్త్యా భట్టతండువిదం జగౌ ౪౭॥

### ౮౧. హరిణప్లుతము

హరిణప్లుతి యను చారీగతి యనుసరణమున నీ హరిణప్లుత కరణము సిద్ధమగును. హస్తము లిందు వక్షఃపాదానుగాములై యుం డుట సామాన్యముగనె యుండుట పరిగ్రాహ్యము. భట్టతండు విట్లు భావించెను హరిణప్లుతి చారియె రెండుపర్యాయము లావృత్తములు కాగా నీ కరణమగును. అని

ఇందు సంకేతించిన హరిణప్లుతి చారిని చారీనిరూపణ సమయమున జాయపతి "మృగప్లుతి" అను పదముతో సంకేతించెను. మృగమె హరిణము. అతిక్రాంతచారి పూర్వము నిర్దిష్ట మయినది. అతిక్రాంత చారిలో నిరూపిత మయిన పాదక్రమానుసారముగా

సముత్ప్లుతి నాచరించి ఎగిరిదూకవలెను. దూకుటలో అగ్రిదేశమున పాదమును స్వస్తికముగా నొనర్పవలెను. పృష్ఠదేశమున జంఘను కూర్పవలెను. అంచితాంఘ్రిగా సముత్క్షేప మాచరింపవలెను. ఈ హరిణప్లుతి కరణమున నీయ శముులు గ్రాహ్యములు. సన్నతికరణము వలె నిదియు అధమ ప్రకీర్తనము ఉపసర్పణము మొదలగువాని విషయమున ప్రియోజ్య మగును.

౮౨. దిక్స్వస్తికం

కుర్యాదత్రుటితాంగేన దిఙ్మఖేషు చతుర్ష్వపి
ప్రత్యేకం స్వస్తికం యత్ర తద్దిక్స్వస్తికముచ్యతే
గీతస్య పరివర్తేషు వినియోగోఽస్య కీర్తితః
స్వస్తికాంతరమప్యేతదుపజీవ్య ప్రవర్తతే.

౮౨. దిక్స్వస్తికము.

నాలుగు దిఙ్ముఖము లందును అత్రుటితాంగ విధానమున స్వస్తికమును ప్రత్యేకముగా నొనర్చినచో దిక్స్వస్తిక కరణమగును. గీతముల పరివర్తనములలో ఒక గీతము నుండి గీతాంతర ముపక్రమించుటలో నీ కరణమునకు వినియోగము ప్రకీర్తిత మయినది. ఈ కరణము స్వస్తికాంతరమును గూడ నాధారము చేసికొని యుండుటయు కలదు.

పార్శ్వము లందును అగ్రభాగము నందును కరము శ్లిష్టముగా నుండునేని, హస్తపాదముల స్వస్తికములు నుండునేని దిక్స్వస్తిక కరణమగునని భరత లక్షణము. ఇందు "అత్రుటితాంగేన" అని కలదు. భరతుడనిన—"శ్లిష్టఃకరః" అను పదమున కిది వివరణము. ఈ స్థలమున అభినవభారతిలోని శుద్ధపాఠమునందు "అత్రుటితేనాంగేన" అని యుండుటయే జాయపతి నిశ్చయమునకు మూలము.

స్వస్తిక కరణమున నిరూపిత మయిన విధానము చతురస్రముఖము లంగము లట్టుంటి తాంగమున నుండగా అంగశ్లిష్టత యేర్పడును. అట్టి అంగశ్లిష్టత యున్నందుననె యిది దిక్స్వస్తిక మగుచున్నది. ఈ కరణ మిట్లు కరణముల మధ్యభాగమున నిరూపిత మగుటచే నటునిటు నున్న కరణముల కన్నిటికి నిట్టి ప్రయోగము సుశ్లిష్టాంగత యుండుట సముచితమని భరతుడంగీకరించినట్లగునని అభినవభారతిసూచనము. గీతపరివర్తములలో దీని ప్రయోగము విహితము "యదాగీతివశా దంగం భూయోభూయో నివర్తతే" గీతివశమున అంగము మఱల మఱల మరలునప్పుడిట్టి కరణముల ప్రయోగింప దగును. ఇట్లు భరతుడు సూచించెను.

౭౩. గజక్రీడితం.

కర్ణాంతే కరిహస్తస్స్య త్రిపతాకో యదాంచితః ౪౮౦
దోలాపాదా చ చారీ స్యాదేవమంగాంతరే తదా
గజక్రీడితమాఖ్యాతం గజో యేనాభినీయతే

౭౩. గజక్రీడితము.

కర్ణాంతమున కరిహస్తముండుట, త్రిపతాక హస్తమంచితమై యుండుట, డోలాపాద యనుచారి యుండుట, ఈ విధముగనె యంగాంతరమున గూడ నుండుట గజక్రీడితకరణ మగును. గజము దీనిచే నభినీతము కాగలదు. సమున్నత మయిన లతాహస్తము పార్శ్వాత్పార్శ్వమునకు విలోలితముగా నుండునేని కరిహస్తము కదా! కర్ణాంతమున నది యంచితమై యుండగా నా కరిహస్తమునకె సంబంధించిన త్రిపతాక మంచిత క్రియావిష్టమై యుండుట, అంగపర్యాయమున గూడ నిట్లే యుండుట భరతార్థము ఇం దభినవానుసారమున భావము విశదీకృత మయినది. నామోచితముగనె దీని ప్రయోగమున్నది.

౮౪, చ తు ర ం

అలపద్మః కరో వామో వక్షఃస్థః చతురః పరః
భవేదుద్ఘట్టితః పాదో యత్ర తచ్చతురం విదుః
విదూషకేణ సంసూచ్యే విస్మయాభినయాదికే. ౪౮౫

౮౪. చ తు ర ము.

వామహస్తమలపద్మము గను దక్షిణహస్తము చతురహస్తమై వక్షోగతముగను పాదము ద్ఘటితముగను నున్నచో నది చతుర కరణమగును. దీనిని విదూషకుడు సూచించు విస్మయాభినయము మొదలగు వానియందు వినియోగింతురు. వామమంచితమై సవ్యము చతురమై దక్షపాదము కుట్టితమయినచో చతురకరణమయినదని సూత్రభాష. అంచితమనుట అలపల్లవమె కుట్టితమనుట ఉద్ఘట్టితమె. విస్మయమున విదూషకుడు సూచించు నభినయమున చతురకరణము యుక్తముగా నుండును.

౮౫. క టీ స మ ం

యత్రాక్షిప్తామపక్రాంతాం చారీం కుర్వన్ క్రమాత్తతః
స్వస్తికీభూయ విశ్లిష్టౌ కరౌ నాభికటీచరౌ
కటకాఖ్యార్ధచంద్రాఖ్యౌ సమున్నతనతే క్రమాత్
పార్శ్వే వైష్ణవమాదధ్యాత్ స్థానమేవం పునర్విధిః
భవేదంగాంతరేణాపి కీర్తితం తత్కటీసమం ౪౯౦
సూత్రధారప్రయోక్తవ్యే జర్జరస్యాభిమంత్రణే

౮౫. క టీ స మ ము.

ఇందు మొదట ఆక్షిప్తచారి నాచరింపవలెను. పిమ్మట అపక్రాంతచారి నాచరింపవలెను. ఇట్లు క్రమముగా నొనర్చుచు పిమ్మట కరములను స్వస్తికములుగా నొనరించి విశ్లిష్టములుగా జేసి

నాభిదేశము నందును కటీదేశమునందును సంచరించునట్లుగా జేయ
వలయును. ఆ పిమ్మట కటకాముఖ హస్తమును సమున్నతము
చేయునది. అర్ధచంద్రహస్తమును నతముగా నొనర్చునది. అప్పుడు
పార్శ్వమునందు వైష్ణవస్థానము కూర్చునది. ఇట్లె యంగాంతరమున
గూడ నాచరించుట యుండవలె విధానము ఇట్లుండగా నిది కటీసమ
మను కరణమగును. సూత్రధారుడు ప్రయోగింపదగిన ; జర్జరాభి
మంత్రణమునందు ఈ కటీసమకరణమును వినియోగింప వలెను.

ఈ కటీసమకరణ వివరణమున నీ విషయమును గుర్తిం
చుట యావశ్యకము. పాదము స్వస్తికాపసృతము, కరములు నాభి
కటీగతములు, పార్శ్వము ద్వాహితము అను మూడు భరతసూత్రము.
స్వస్తికాపసృతమనుటచే స్వస్తిక రచనానంతర మపసృతమని
యర్థము. దీనిచే ఆక్షిప్త చారీ ప్రయోగము అనంతరము అపక్రాంత
చారీ ప్రయోగము సూచిత మగుచున్నది. ఇట్లె కరములు స్వస్తికము
లగుట అవధృతము (అపసృతము) లగుట సూచితము లగును.
అప్పుడు నాభీగతముగా కటకాముఖమును కటీగతముగా అర్ధచంద్ర
మును కూర్చవలసి యున్నది. పార్శ్వ ముద్వాహితమగుటలో గూడ
నీ భావమున్నది. అర్ధచంద్రహస్తము కల కటీపార్శ్వము నతమగు
టయు నపర ముద్వాహితమగుటయు నభ్యూహ్యము. ద్వితీయాంగ
మున గూడ నిట్లె యొనర్చవలసి యున్నది. చారీరూపములు హస్త
రూపము లిదివరలో నిరూపితము లయినవి. పార్శ్వ ముద్వాహిత
మనగా; ఉరమూర్ధ్వగత మగుట. "ఉద్వాహితం తూర్ధ్వగత మురో
జ్ఞేయం" కటిసమ తత్త్వబంధము వలననె వైష్ణవస్థానకము నుండ
వలెనని గోచరించును. ఇట్లు సర్వార్థమును అభినవభారతి వివరించి
నది. ఇట్లు వివృతార్థమును జాయసేనాపతి నిబంధించినాడు. భరతుని
నాట్యవేదశాస్త్ర గ్రంథమంతయు సూత్రరూపమున నున్నట్లు భావ

నీయము. పదపదమునను జాయసతి అభినవార్థమును నిబంధించుట గుర్తింప వలసి యున్నది.

### ౮౬. మయూరలలితం

యత్రాంఘ్రిం వృశ్చికం కృత్వా పక్షవద్రేచితే కరౌ
నికుంచ్యాథాన్యమేవోరుదేశే భ్రమరికాం భజేత్
మయూరలలితం నృత్తే మయూరస్య తదిష్యతే.

### ౮౬. మయూరలలితము.

పాదమును వృశ్చిక మొనరించి హంసపక్షము వలె కరములను రేచిత మొనరించి అన్యపాదమును ఊరు భాగమున నికుంచిత మొనరించి భ్రమరికా రీతి ననుసరించునది. ఇట్టిది మయూర లలిత కరణమగును దీనిని మయూర నృత్తము నందు వినియోగించుట యుక్తముగా నుండును. ఇందు శ్లోకమున "పక్షవత్" అని యున్నది. హంసపక్షవత్ అని యర్థము. "నామైకదేశే నామ గ్రాహిణః." అని ప్రసిద్ధ సూక్తి కలదు గదా! అభినవగుప్తుడీ స్థలమున హంసపక్షములు అని స్పష్టముగా నిర్దేశించెను. అదియే యాధారముగా నిది హంసపక్షము.

### ౮౭. అలాతం.

దక్షిణేనాంఘ్రిణాలాతాం కుర్వన్ తేనైవ పాణినా
నితంబం చతురశ్రం చ విధాయ క్రమశః కరం
వామేన చరణేనోర్ధ్వజానుచారీం ప్రకల్పయేత్
వామాంగేనాపి కుర్వీత భూయోఽలాతాదికం క్రమం
యస్మిన్నిదమలాతాఖ్యం లలితే నృత్త ఇష్యతే
హిత్వా నితంబమత్రాహ దోలం కీర్తిధరః కరం,

## ౮౭. అలాతము.

దక్షిణపాదమున అలాతచారి నాచరింపవలెను. దక్షిణ హస్తమునందె నితంబహస్తమును చతురశ్రహస్తమును ధరింపవలెను. ఇట్లు క్రమముగా నాచరించునది. పిమ్మట వామపాదమున ఊర్ధ్వజానుచారి నేర్పఱచునది. ఇట్లే వామాంగమున గూడ అలాతాది క్రమముననుసరించునది. అప్పుడది అలాతమను కరణమగును. లలిత నృత్తము నందు దీనిని ప్రయోగింతురు. కీర్తిధరుడు భావభేదము చూపెను. ఇందలి లక్షణము లోని నితంబహస్తమును చెప్పక విడనాడి దోలహస్తము కూర్చుటను చెప్పెను.

అలాతము అలాతకము రెండు నొకటియె. ఇందు అలాతచరణ కరణము దక్షిణకర వ్యంసనము ఊర్ధ్వజానుక్రమము మూడు ముఖ్యములు. వ్యంసన మనునది అంసమునుండి వినిష్క్రమణము. ఈ దక్షిణ హస్తము నృత్తహస్తములలో నితంబ హస్తమును చతురశ్రముగనే యొనర్పవలెను. పిమ్మట వామ పాదమున ఊర్ధ్వజాను వాచరించుట యుండును. ఇం దిట్లు అలాతచారిచే రెండు పర్యాయములు ప్రయోగమున్నందున నిది అలాతకరణ మయినది. దీని వినియోగము నిరూపితమయినది. "ప్రయోగశ్చా స్యలలిత నృత్తవిషయే".

## ౮౮. సింహవిక్రీడితం

అలాతాంఘ్రిం పురః కుర్యాదూర్ధ్వనాథమపి ద్రుతం
యదాంగాంతరమప్యేవం సింహవిక్రీడితం తదా
విషయోఽస్య వినిర్దిష్టో రౌద్రప్రాయః పరిక్రమః
తుల్యాకారే క్షరావత్ర స్యాతాం కైర్తిధరే మతే.

ఌఌ. సిం హ వి క్రీ డి త ము.

ఈ కరణము నందు పురోభాగమున అలాతాంఘ్రిని కూర్చవలెను. వెంటనే ఊర్ణనాభహస్తమును ధరింపవలెను. అంగాంతరమున గూడ నిట్లే యాచరింపవలెను. అప్పుడది సింహావిక్రీడితమను కరణమగును. రౌద్ర ప్రాయమయిన పరిక్రమము ఈ కరణమునకు విషయముగా నిర్దిష్టమయినది. కీర్తిధరుని మతము నందు ఇందు రెండు హస్తములును తుల్యాకారముగా నుండదగునని నిరూపించెను. సింహాకరఘాత సామ్యముండుట వలన నిది సింహావిక్రీడిత మయినది. ఇది రౌద్రగతి విషయము.

ఌ౯. కుం చి తం

తలసంచరభావేన పాదశ్చేద్దక్షిణో నతః ౫౦౯
అలపద్మతయా సవ్యః కుంచితో వామతః కృతః
కుంచితం తత్పరానందనిర్భరాభినయే భవేత్

ఌ౯. కుం చి త ము.

దక్షిణపాదము తలసంచర రూపముగా నతమగుట యుండుండును. దక్షిణహస్తము నతమై–ఉత్తానమగు అలపద్మ రూపముగా వామ పార్శ్వమున గూర్చదగును. ఇట్టిదిది కుంచిత కరణమగును. ఇది ఆనంద నిర్భరమయిన అభినయమున ప్రయుక్తమగును. "తదేతన్నిర్భరానంద పూర్ణ దేవస్య అభినయవిషయే ప్రయోక్తవ్యం" అని అభినవభారతి.

౯౦. వృ శ్చి కం

అతీవ నమితం పృష్ఠం పాదో వృశ్చికపుచ్ఛవత్
క్రమాత్కరికరో యత్ర వృశ్చికం తదుదాహృతం
ఇదమింద్రగజేంద్రాదిగతౌ స్యాద్గగనాంగణే. ౫౧౦

## ౬౦. వృశ్చికము.

పృష్ఠము మిక్కిలి నమితమైయుండగా, పాదము వృశ్చికము యొక్క పుచ్ఛము వలె నుండునేని క్రమముగా కరిహస్తము కూర్పు పొందునేని వృశ్చిక కరణమగునని యనిరి. ఇది యింద్ర గతిలో గజేంద్రగతిలో గగనాంగణ సంచారమున వినియుక్తమగును.

ఇందు మూడు లక్షణ భాగము లున్నవి. నమితపృష్ఠము వృశ్చికపాదము కరిహస్తము నని భరతకథనములో మూడుకలవు. హస్తములు బాహుశీర్షాంచితము లగుట పాదము పృష్ఠాంచిత మగుట పృష్ఠము దూరసన్నత మగుట. అని హస్తపాదస్థితి అంగ పరిహారము లేకపోవుటను సూచించును. హస్తము బాహుశీర్షాంచిత మనుట కరిహస్తమునకు సూచకము. దూరసన్నతపృష్ఠత్వ మనునది వృశ్చిక ప్రయోగమున నాంతరీయకముగా నుండునది. కావున వృశ్చిక ప్రయోగము లందంతట నుండును. "అతీవ నమితం పృష్ఠం" అనుట వలననె వృశ్చిక పుచ్ఛము వలె పాదముండుట స్పష్టమగును గాని స్పష్టార్థ విశదీకరణమునకై పుచ్ఛసాదృశ్యము నిరూపితమయి నది. వృశ్చికాపుచ్ఛ స్థానీయముగా చరణ ముండును గావున నిది వృశ్చిక కరణమయినది. తదుపలక్షిత పాదమును వృశ్చికమగును. ఆకాశగతిలో ఐరావతాది విషయమున దీని ప్రయోగ ముండుననుట యిందు విశదముగనె యున్నది.

## ౬౧. వ్యంసితం

ఆలీఢం స్థానకం హస్తౌ స్యాతాం వక్షసి రేచితౌ
సహోద్వేష్టాపవేష్టాభ్యామూర్ధ్వాస్యాధోముఖే క్రమాత్
విప్రకీర్ణత్వమాపన్నౌ యత్ర తద్వ్యంసితం మతం
మారుతిప్రముఖ ప్రౌఢప్లవంగమ పరిక్రమే.

## ౯౧. వ్యంసితము.

ఆలీఢ స్థానకముండుట హస్తములు వక్షమున రేచితము లగుట, ఆ హస్తములు ఉద్వేష్టనమున ఊర్ధ్వాస్యములు అపవేష్టనమున అధోముఖము లగుట హస్తములు విప్రకీర్ణము లగుట వ్యంసిత కరణము యొక్క లక్షణము. ఇట్టి వ్యంసితకరణమును ఆంజనేయాది ప్రౌఢ కవుల పరిక్రమమున వినియోగించుట యుక్తము. హస్తములు ఊర్ధ్వాధో విప్రకీర్ణము లగుటలో నొక విశేషము కలదు. తర్జన్యాదుల ఉద్వేష్టనమున నధోవిప్రకీర్ణతయు, తర్జన్యాదుల పరావర్తిత కరణమున అధోవిప్రకీర్ణతయు నుండును. ఈ యంశమే ఉద్వేష్టాపవేష్ట పదములచే నిరూపిత మయినది.

## ౯౨. పరివృత్తం

ఊర్ధ్వమండలినౌ సూచిచరణో బద్ధయాంచితః ॥౧॥
విచిత్రత్వేన యత్రాన్యపాదే భవతి వర్తితః
భ్రమర్యాథ త్రికభ్రాంతిః పరివృత్తం తదీరితం
అత్ర కీర్తిధరో బాహ్యభ్రమరీమపి మన్యతే.

## ౯౨ పరివృత్తము,

ఇందు హస్తములు ఊర్ధ్వమండల రూపమున నుండుటయు పాదము సూచీపాదముగా నుండుటయు అది బద్ధయను చారిచే నంచిత మగుటయు, బద్ధచారి యుండుటచే, విచిత్రరూపమున ద్వితీయ పాదమున వర్తిత మగుటయు నుండును. అన్యోన్య జంఘాసంవేధము వలన నట్లది వర్తిత మగును. ఆ పిమ్మట భ్రమరికా విధానమున త్రిక పరివర్తనము నుండును. ఇట్టి దిది పరివృత్తకరణ మగునని నాట్యవిదులు భావించిరి. కీర్తిధరు డిందు బాహ్యభ్రమరి యుండుటను గూడ నభిమానించెను.

## ౯౩. వివర్తితం

హస్తమాక్షిప్తపాదం చ త్రికం యత్ర వివర్తయేత్
రేచయేదపరం హస్తం కీర్తితం తద్వివర్తితం. ౫-౨౦

## ౯౩. వివర్తితము.

హస్త మాక్షిప్తపాదమును త్రికమును వివర్తింప జేయునేని అపరహస్తము రేచిత మగునేని యది వివర్తిత కరణముగా కీర్తితమయినదాని శ్లోక తాత్పర్యము హస్త పాదము లాక్షిప్తము లగుట త్రికము వివర్తిత మగుట రెండవ హస్తము రేచిత మగుట అను త్రితయము మిందున్నది. ఆక్షిప్తమయిన హస్తమున కన్న రెండవ హస్తము రేచితమగుట వివక్షితము. అది హంసపక్షమున ద్రుత భ్రమక్రమముతో నుండునట్లుగా నొనర్పవలెనని భావము.

## ౯౪. రేచకనికుట్టితం

రేచితో దక్షిణో హస్తః పాదశ్చోద్ఘట్టితో యది
వామో దోలాయుతో దోలా స్యాద్రేచితనికుట్టితం.

## ౯౪. రేచకనికుట్టితము.

దక్షిణహస్తము రేచితము కావలెను. దక్షిణ పాదముద్ఘట్టితము కావలెను. వామహస్తము దోలా హస్తమై దోలాయితము కావలెను. అప్పుడది రేచక నికుట్టిత కరణ మగును. ఉద్ఘట్టితము నికుట్టితము సమార్థములు. పాదతలాగ్రమున నుండి పార్ష్ణి భాగమును భూమి యందు నిపాతిత మొనరించుట యుద్ఘట్టిత క్రియ. "దోలాచైవ భవేద్వామః" అని భరత మూలము. దోలా శబ్ద స్త్రీలింగ యోగమున దోలాశబ్దము ప్రేంఖోలితమగుట సమ్మతము. తద్వర్తనమున గమనాగమనములు సూచితము లగునని అభినవభారతీ వచనము. తదనుసారమున నిచట గూడ "వామోదోలాయుతో దోలా" అని యుండుట యుక్తము.

### ౯౨. ఊరూద్వృత్తం

ఊరూద్వృత్తాం దధచ్చారీమరాలకటకాముఖౌ
యత్ర వ్యావర్తితే హస్తౌ నిక్షిపేచ్చోరుపృష్ఠయోః
ఊరూద్వృత్తం భవేత్ప్రేమకోపేర్ష్యాప్రార్థనాసు తత్ ౨౨౯
అత్ర హస్తః పతాకః స్యాదితి కీర్తిధరం మతం.

### ౯౨. ఊరూద్వృత్తము.

ఊరూద్వృత్తచారీ గతి ననుసరించుచు అరాలము కటకాముఖమునను హస్తములకు వ్యావర్తనము సంపాదించి ఊరుపృష్ఠము లందు కూర్చవలెను. అప్పుడది ఊరూద్వృత్త కరణమగును. దీనిని ప్రేమ–కోప–ఈర్ష్యా–ప్రార్థనములలో వినియోగింతురు. ఇందు పతాకహస్తముండదగునని కీర్తిధరుడు తనభావ మావిష్కరించెను.

### ౯౩. వృశ్చికకుట్టితం

పదా వృశ్చికమాధాయ స్వబాహుశిరసోః కరౌ
నికుట్టితౌ విధీయేతే పర్యాయేణాలపల్లవౌ
యదా తదా సమామ్నాతం బుధైర్వృశ్చికకుట్టితం
వాక్యార్థే విస్మయాకాశగమనేచ్ఛాప్రధానకే. ౨౩౦

### ౯౩. వృశ్చికకుట్టితము.

పాదముచే వృశ్చిక మాధానించునది. హస్తములను తనబాహువునందును తనశీర్షమునందును నికుట్టిత మొనరించునది. పర్యాయమున వానిని అలపల్లవములనుగా కూర్చునది. అప్పుడది వృశ్చిక కుట్టిత మగునని బుధు లందురు. దీనిని విస్మయ ప్రధానమయిన ఆకాశగమనేచ్ఛా ప్రధానమయిన వాక్యార్థము నందు వినియోగింతురు. వృశ్చిక పాదము నికుట్టిత హస్తమును మాత్రమే భరతుడు చెప్పెను. అభినవు డిందీ విధముగా చెప్పెను. వృష్ఠభాగ

మున చరణమును వృశ్చి కోపలక్షితముగా కూర్పవలెను. అది రేచిత జంఘమై యుత్తాన తలముగా నుండవలెను. రెండుహస్తము లును స్వబాహుశీర్షమున పర్యాయమున నలపల్లవములు నికుట్టిత ములు కావలెను. ఇట్లు భరతుని అభినవుడు వివరింపగా మొత్త మిందు సంగృహీతము.

౯౭. తలసంఘట్టితం

దోలాపాదసమౌ హస్తౌ మిథస్సంఘట్టితౌ తలే
తతః స్యాద్వైష్ణవం స్థానం కట్యాం చేద్దక్షిణః కరః
రేచితోఽన్యత్త్రికే పార్శ్వే తలసంఘట్టితం తదా
అత్ర కీర్తిధరో హస్తమూచే వక్షసి దక్షిణం.

౯౭. తలసంఘట్టితము,

హస్తములు దోలాపాద సమముగా నుండుటయు తల ప్రదేశమున మిథస్సంఘట్టితము లగుటయు పిమ్మట వైష్ణవస్థాన ముండుటయు దక్షిణకరము కటియందుండుటయు రెండవ హస్తము త్రికమున పార్శ్వభాగమున రేచితముగా నుండుటయు తలసంఘట్టిత కరణలక్షణము. ఇందు కీర్తిధరుడు వక్షోభాగమున దక్షిణ హస్త ముండుటను నిరూపించెను. అనుకంపా ప్రధానమయిన వాక్యార్థమున దీని వినియోగమున్నది. దోలాపాదచారి నాచరించు సమయముననె పతాకాహస్తములు సమ్యక్తల సంఘట్టితము లగుట యుండును గావున నిది తలసంఘట్టిత మయినది.

౯౮. గండసూచి

పాదః సూచీ కరః క్షేత్రే వక్షసః కటకాముఖం ౹౹౯౹౹
కపోలాంతే కరోఽన్యః స్యాదలపద్మతలాంచితః
యత్ర పార్శ్వం నతం తద్ధి గండసూచి తదిష్యతే

వినియోగో౽స్య మంతవ్యః కర్ణగండాస్యమండనే
సూచీపాదం పరే ప్రాహుః కపోలప్రాంతగామినం
నృత్తహస్తోదితం సూచీముఖమన్యే ప్రచక్షతే ३४०
తమసంయుతహస్తోక్తమపరే త్వనుమన్వతే
త్రిపతాకాభిధం హస్తం భట్టతండురభాషత.

## ౬౮. గండసూచి

సూచీపాదము వక్షఃక్షేత్రమునందు కటకాముఖమగు కరము, అన్యకర మలపల్లవాంచితమై కపోలాంతమున నుండుట, పార్శ్వము నతమగుట యున్నచో నది గండసూచి కరణమగునని తజ్జ్ఞులు తలంతురు. కర్ణమండన కపోలమండన ముఖమండనము లం దీ కరణమును వినియోగింతురు.

కొందరు సూచీపాదము కపోల ప్రాంతము పొంది యుండుటను నిరూపించిరి. నృత్తహస్తములందు నిరూపిత మయిన సూచీ ముఖహస్తమును కొందరు నిరూపించిరి. అసంయుత హస్తము లందు నిరూపిత మయిన సూచీహస్త మిచట నుండవలెనని కొంద రనిరి. భట్టతండువు త్రిపతాకా హస్త మిచట యుక్తమనెను.

ఈ కరణమున భరతు డిట్లనెను. ఇందు సూచీపాదము నతపార్శ్వము వక్షోగతహస్తము గండాంచితకరము అను నాలుగు గండసూచి యగును. అని గండమున నుండు కరము అలపల్లవ మని యభినవు డనెను. అదియె యిందున్నది. సూచీపాదము గండగత మగుట, సూచీముఖ నృత్తహస్తము గండాంచితమై పునఃక్రియావిష్ట మగుట, సూచ్యాస్య మను నభినయ హస్తమె యుండుట యను మతాంతరముల నభినవుడు సూచించెను. జాయ నిరూపించెను. సూచీ

ముఖ హస్తము గండగతముగా నున్నప్పుడు గండ సంశ్రయ మయిన ప్రధాన భూషణాభినయ విషయముగా దీని ప్రయోగ ముండుట నభినవుడు సూచించెను.

౫౨. భ్రమరం

ఆక్షిప్తాం యత్ర కుర్వాణస్సమముద్వేష్టయన్కరౌ
జంఘయోః స్వస్తికం కృత్వా కుర్వీత భ్రమరీం తతః
ఉల్బణే వా కరావేవ ద్వితీయాంగే పునర్విధిః ౫౪౫
భ్రమర్యాం తద్బుధైర్జ్ఞేయముద్ధతస్య పరిక్రమే.

౫౨. భ్రమరము.

ఆక్షిప్తచారి ననుసరించుచు కరములను సమముగా నుద్వేష్టన మొనరించుచు జంఘా భాగములకు స్వస్తికమాచరించుచు భ్రమరి నొనరింపవలెను. కరములు ఉల్బణములుగా నయిన నుండ దగును. ద్వితీయాంగమున గూడ నిట్లె యాచరించునది. అప్పుడది భ్రమర కరణ మగును. ఇది యుద్ధతుని పరిక్రమమున వినియుక్త మగును.

స్వస్తిక పాద మాక్షిప్త మగుట కరము లుద్వేష్టితము లగుట త్రికవలన ముండుట అను త్రికము భ్రమరకరణరూప మని భరతోక్తి. ఆక్షిప్తచారిలో జంఘాస్వస్తిక సంయోగమున్నది. ఇట్లు దీని నాయోజింప దగునని అభినవ సూక్తి. స్వస్తికానంతరము పాద మాక్షిప్త మొనరించి, తత్కాలముననె యుద్వేష్టన మొనరించి, ఒక హస్త ముద్వేష్టన మొనరించి, త్రికవలన మొనరించి పిమ్మట ద్వితీయాంగమున నిట్లే చేయునది. వలనానంతరమున పాదమును స్వస్తికముగనె యుంచవలెను. పర్యాయ ప్రయోగ మిందు స్వారస్యమున సూచిత మగును. యద్వా; ఉద్వేష్టిత పదమున ఉల్బణము

లను నృత్తహస్తము లుపలక్షితము లగును. యుగపత్కాలముననె ఉల్బణ ప్రయోగ మాచరింప వలెను. పిమ్మట పాదస్వస్తిక భ్రమణ ముంచుట యిందలి విధానము. భ్రమరమె భ్రమరకము "సంజ్ఞా యాం కన్," ఈ పర్యాయము జాయ రచనలో సంగత మయినది.

౧౦౦. నూ పు రం

విధాయ భ్రమరీం చారీం కుర్వన్నూపురపాదికాం
యేన పాదేన తద్దిక్కం హంసపక్షం ద్రుతభ్రమం
హస్తమన్యల్లతాసంజ్ఞం యత్ర తన్నూపురం విదుః
లతాఖ్యే రేచితే చాత్ర స్యాతాం కైత్తిధరే మతే. ౨౨౦

౧౮౦. నూ పు ర ము.

భ్రమరీచారి నాచరించుట నూపురపాదికాచారి నాచరించుట, యిందుండును. ఏ పాదమున నిది యుండునో తద్దిక్కముగనె హంసపక్షహస్తము ద్రుతభ్రమముతో నుండును. రెండవహస్తము లతాహస్తముగ నుండును. ఇట్లున్న నిది నూపుర కరణ మగును. కీర్తిధరుడు ఇందు లతాహస్తములు రేచితము లగుటను అభిమానించెను. ఇందు భ్రమరీచారీ విధానమున త్రికవలన ముండుటయు నుందరము.

౧౮౧. ఘూ ర్ణి తం

ఊర్ధ్వాన్యః పార్శ్వతః క్షిప్తో వ్యావర్త్య పరివర్తయన్
అధోముఖం చతుర్దిక్కం భ్రమయన్దక్షిణం కరం
జంఘాస్వస్తికమాదాయ తద్దిక్కం చరణం దధత్
అపక్రాంతసమాయుక్తం వామం దోలావిధం కరం
యత్ర కుర్వీత తద్ధీరైః ఘూర్ణితం పరికీర్తితం ౨౨౨
ఉత్ప్లుత్య స్వస్తికం కుర్యాదత్ర కైత్తిధరే మతే.

### ౧౧౧. ఘూర్ణితము.

సవ్యహస్తము వర్తితాఘూర్ణితము వామహస్తము దోలితము పాదము స్వస్తికాపసృతము నగుట ఘూర్ణిత కరణ రూపము. అది యిచట విస్పష్ట మయినది. దక్షిణ హస్తము పార్శ్వ భాగము నుండి యూర్ధ్వ ముఖముగా వ్యావర్తితమై అధోముఖముగా పరివర్తితమై చతుర్దిక్కులుగా భ్రమణము పొందునది కావలెను. జంఘా స్వస్తికము ననుసరించి యా దిక్కుగా పాదము ధరింప వలెను. దోలా హస్తముగా నున్న వామహస్తము అపక్రాంతముతో కూడుకొన వలయును. ఇట్టి విధాన మాచరించినచో నది ఘూర్ణితకర మగును. కీర్తిధరమతమున ఉత్ప్లుతి నాచరించి స్వస్తిక మొనరింప వలసి యున్నది. హస్తములకు పాదముల కిట్లు ఘూర్ణన మున్నది.

### ౧౦౨. వృషభక్రీడితం

అలాతాం కుర్వతశ్చారీం కరౌ కుర్వీత రేచితౌ
వ్యావృత్తకరణేనాథ కుంచితే మణిబంధకౌ
అలపద్మతలౌ బాహ్వోశ్శిరసోఽరంచితౌ స్థితౌ
వృషభక్రీడితే(ఉ)త్రాహుః పతాకావపరే కరౌ ౫౬౮

### ౧౦౨. వృషభక్రీడితము.

అలాతాచారి నాచరించుచు కరములను రేచితములుగా నొనర్ప వలెను. వ్యావృత్త కరణమున మణిబంధములు కుంచితములు కావలెను. అలపద్మతలము లగు అలపల్లవాకృతి కల హస్తములు బాహుశీర్షము లంచితములై యుండవలెను. ఇట్లున్న నిది వృషభక్రీడిత కరణ మగును. ఇందు కొందరు పతాకా హస్తము లుండుటను చెప్పిరి. హస్తము లిందు కుంచితము లంచితములై యుండుట యుక్తము.

### ౧౦౩. కరిహస్తం

వక్షస్థః కటకో వామః కర్ణే సోద్వేష్టనః పరః
త్రిపతాకః కరః పాదః తద్దిక్కసమమంచితః
యత్ర నిశ్రాఙ్కమణీయః స్యాత్కరిహస్తం తదీరితం.

### ౧౦౩. కరిహస్తము.

వామహస్తము కటకాముఖముగా వక్షోగత మగుటయు దక్షహస్తము కర్ణభాగమున నుద్వేష్టనముతో నుండుటయు కరము త్రిపతాక మగుటయు పాదము తద్దిక్కముగా సమంచిత మగుట యుండగా నిష్క్రమణీయమగుటయు కరిహస్త కరణ లక్షణముగా నున్నది. ఒక హస్తము వక్షఃస్థిత మగుట, వేరొక హస్తము ప్రోద్వేష్టిత తలముగా నుండుట, చరణ మంచితముగా నుండుట యను మూడంశము లిందు గలవు. ఈ కరణ మొక యంశమున కరిహస్త మను నృత్తహస్తమున సదృశముగా నుండుటచే నట్టి పేరు సిద్ధ మయినది.

### ౧౮౪. ప్రసర్పితం

యత్ర వామో లతాసంజ్ఞో రేచితస్త్వపరః కరః
తద్దిక్కో ఘృష్టభూః పాదః పాదాంతరసమీపతః ౩౬-౩౭
మందం మందం చరేదేవం భవేదంగాంతరేణ చ
ప్రసర్పితమిదం ప్రాహుః దేవమర్త్యనిరూపణే.

### ౧౦౪. ప్రసర్పితము.

ఇందు వామహస్తము లతాహస్తముగను దక్షహస్తము రేచితహస్తముగను పాదము ఆ దిశగనె పాదము పాదాంతర సమీపమున భూమిని ఉద్ఘృష్టము చేయునదిగను ఉన్నచో మందమంద ముగ సంచరించునది యయినచో అంగాంతరమున గూడ నిశ్లే

యయినచో నిది ప్రసర్పితమను కరణ మగును. మందమందముగా భూమిని ఘర్షణము చేయుచు రేచితకర దిక్కుముగా నున్న పాదము పాదాంతరము నుండి చలిత మగును. "ఏతస్య ఖేచర సంచార విషయే ప్రయోగః" అని అభినవభారతి దీనిని ఖేచర సంచార విషయమున ప్రయోగింతురు. ఈ గ్రంథశ్లోకమున "దేవదత్త నిరూపణే" అని యున్నది. అది సంగతముగ లేదు. అది "దేవదూత నిరూపణే" యగునా? "దేవమత్త నిరూపణే" యగునా? ఆకాశమున సంచరించువాని సంచారము నిరూపించుటలో నిది విని యుక్తమగు నను భావము ముఖ్యము.

అత్ర పాదద్వయస్యాపి పార్శ్వయోః స్యాత్ప్రసర్పణం
యేగపద్యాత్క్రమాచ్చేతి భట్టతండురభాషత
సమోసరితమత్తల్లీ మత్ర కీర్తిధరః పునః ౫౭౦

ఈ కరణ విషయమున భట్టతండు వీ విధముగ ననెను. ఇందు పాద ద్వయమునకు పార్శ్వములకు ప్రసర్పణ ముండును. ఆ ప్రసర్పణము యేగ పద్యమున నుండును. క్రమమున నుండును. అని కీర్తిధరు డీ విధముగ జెప్పెను. ఈ కరణమునందు సమోసరితమత్తల్లి యను చారీ ప్రయోగము యుక్తము, అని. ఇట్లె యొక్కొక కరణ విషయమున మతభేదములు కన్పించు చున్నవి.

## ౧౦౫. వ లి తో రు

ఉరసో యేగపద్యేన కృత్వా వ్యావర్తితే కరౌ
ఆనీయాక్షిప్తయా సార్ధం తత్రైవ పరివర్తనాత్
స్థాపయిత్వా యదా సమ్యక్ శకటుండావధస్తలౌ
బద్ధయా చావతిష్ఠేత వలితోరు తదీరితం
అపత్రపిత మేతేన ముగ్ధాయాస్సంప్రదర్శ్యతే. ౫౭౫

## ౧౦౫. వ లి తో రు వు.

వక్షస్థలము నుండి ఒకే పర్యాయము యేకకాలమున హస్తములు వ్యావర్తితము లగునట్లొనర్చి ఆక్షిప్తచారితో పాటుగా నచటనే పరివర్తన మొనరించునది. శుకతుండ హస్తములను బాగుగా నధస్తలము లగునట్లు కూర్పవలెను. ఈ సర్వము బద్ధాచార్యవస్థానముననేని సిద్ధ మొనరింప వచ్చును. ఇట్టిది. వలితోరుకమను కరణమగును. ఈ కరణమును ముగ్ధావనిత యొక్క అపత్రపితావస్థా ప్రదర్శన మొనరింపవచ్చును. అపత్రప=సిగ్గులేకుంట లజ్జా రాహిత్యము. ముగ్ధ యయినందున నత్యంత రాహిత్యము భావింప రాదు.

హస్తములు శుకతుండములై వ్యావృత్త పరివర్తితము లగుట, ఊరువులు వలితములగుట వలితోరుక రూపము. జాను వభ్యంతరమున నున్నచో వలిత మందురు. అభినవుడు ఇట్లు యోజనము సూచించెను. హస్తములు వక్షము నుండి సమకాలముననె వ్యావర్తితములు కావలెను. అవి ఆక్షిప్తయను పాదచారితో పాతముపొంద వలెను. పిమ్మట పరివర్తనమున వక్షఃప్రదేశమునందు శుకతుండ హస్తములను అధోముఖముగా కూర్పవలెను. పిమ్మట బద్ధాచారీ విధానమున స్థితి యుండును. "బద్ధయా వా వర్తితేత" అని జాయ పాఠ మున్నది. "బద్ధయా చ చార్యాస్థితిః" అని అభినవభారతి యున్నందున "బద్ధయా చా వర్తితేత" అన్న పాఠము యుక్తమని తోచును. "ఏత న్ముగ్ధా విషయం" అని అభినవభారతి. "అపత్రపితం ముగ్ధాయాః" అని జాయ అపత్రపిత మనుట ఆలోచనీయము.

### ౧౦౬. గృధ్రావలీనం

అంగుష్ఠేన మహీం చుంబన్ కించిదంచితజానుకః
పృష్ఠతః ప్రసృతః పాదః పార్శ్వగౌ చ లతాకరౌ
యత్ర గృధ్రావలీనం తత్పృథుపక్షినిరూపణే
తార్క్ష్యపక్షవిహారోక్తావుచితౌ భట్టతండునా

### ౧౦౬. గృధ్రావలీనము.

పాదాంగుష్ఠమున భూమిని స్పృశించుచు కొంచెముగా నంచిత జానువుతో నుండి పృష్ఠభాగమునకుగా పాదము ప్రసారిత మొనరింప వలెను. లతాహస్తములు పార్శ్వగతములుగా నుండ వలెను. అప్పుడది గృధ్రావలీన కరణ మగును. పక్షినిరూపణమున నిది ప్రయుక్త మగును. పృథుపక్షి నిరూపణమున నుపయుక్త మగుట యిందున్నది. తార్క్ష్య పక్షి హస్తము లిచట సముచితములని భట్టతండువు నిరూపించెను. గృధ్రావలీనము గృధ్రావలీనకము. "స్వార్థే కన్".

### ౧౦౭. అర్ధనికుట్టనం

స్యాన్నికుట్టకమేవార్ధేనాంగేనార్ధనికుట్టనం ౩౮౦
అంచితాలితిశబ్దేన క్రియావైశిష్ట్యమీరితం
మునినైవాలపద్మస్య స్మరతా పూర్వలక్షణం
స్వదేహాభిముఖం పృష్ఠభాగేనాకర్షణం మతం
శంకుకప్రముఖైః ప్రోక్తమంచితం, తన్న సంగతం
అప్రరూఢనిజశ్లాఘారూపవాక్యే తదిష్యతే. ౩౮౩

### ౧౦౭. అర్ధనికుట్టనము.

కరణములలో నికుట్టన మను కరణ మిందు ౯ తొమ్మిదవ కరణముగా నిరూపిత మయినది. ఆ నికుట్టనమునకు ఈ అర్ధ

నికుట్టనమునకు పరస్పరము సంబంధము కలదు. హస్తములు బాహు శీర్షాంతర భాగమున నిలకుట్టితము లయినచో పాదములు నికుట్టితము లయినచో నికుట్టన (క) కరణ మగునని నికుట్టన కరణమునకు సామాన్యముగా లక్షణము—దీని వివరణమును ౯ వ కరణమున జూడ దగును. అర్ధనికుట్టన కరణ లక్షణమును, భరతు డీ విధముగా నిరూపించెను.

"అంచితౌ బాహుశిరసి హస్త స్త్వభిముఖాంగులిః
నికుంచితార్ధయోగేన భవే దర్ధనికుట్టకం"

నికుట్టితార్ధయోగేన—నికుంచితార్ధయోగేన అను రెండు పాదములు సంగతములు. భరతుని యీ లక్షణానుసారమున నీ కరణార్థ మిట్లు గ్రాహ్యము. బాహుశీర్షమున హస్తములు అంచితము లగుట, హస్తమభిముఖాంగులిగా నుండుట, ముఖ్యముగా నికుట్టిత కరణ లక్షణములోని సగము లక్షణభాగమున సంగతమై యుండుట అర్ధ నికుట్టన కరణ లక్షణ మని భరతార్థ సారము.

ఈ కరణ వివృత్తిలో అభినవభారతి యిట్లు నిరూపించు చున్నది. భరతుని కరణ లక్షణ కారికలో చరమార్ధమె లక్షణము. "నికుట్టితార్ధయోగము" అనునది మాత్రమె లక్షణము. పూర్వార్ధ భాగమున హస్తయుక్త్యనుసారమున నికుట్టితమునకు లక్షణము నిరూపిత మయినది. ఇందు అలపల్లవము అని చెప్పవలసి యుండగా అంచిత గ్రహణము క్రియావిశిష్టత్వ ప్రదర్శకము. కరతలమున నావర్తనముతో నుండు నంగుళులు పార్శ్వగతములు వికీర్ణములు నగుట అలపల్లవ హస్త స్వరూపము. అలపల్లవ హస్తము నందలి కనిష్ఠాంగులి యొక్క పతనోత్పతన ప్రకారము నికుట్టన మనదగి యున్నది. అంగముల ఉన్నమన వినమనములు నికుట్టన మగునని

కోపాలుడు ననెను. అంచితత్వమనునది పాదమునకును ఉద్ఘట్టిత రూపత్వమును సూచించును.

శ్రీశంకుకాదులు వేరువిధముగా తలచిరి. "అంచితౌ" పదమున గ్రాహ్యమగు అంచనము "స్వదేహాభిముఖముగా పృష్ఠభాగమున మనాక్ ఆకర్షించుట" అని ఇట్లు శంకుకాదులు వ్యాఖ్యానమొనరించుట సంగతముగ లేదు. అంచితమను నామముతో నట్టి వ్యాఖ్య సంగతము కాదు. అది యట్లుండు గావుత.

ఇట్టి సర్వార్థమును భావించి జాయసేనాపతి యీ కరణ లక్షణము ప్రతిపాదించెను. నికుట్టక కరణార్థములోని సగము భాగము ఏకాంగమున నొనర్చు విధానము అర్ధనికుట్టక కరణ లక్షణ లక్షణమగును. భరతుని లక్షణవాక్యములో "అంచితౌ" అని యున్నది. బాహుశీర్షములందు అలపల్లవ హస్తమె నికుట్టిత మగును గావున నిచట అలపల్లవ పదమునె ప్రయోగింపవలసినది. కాని భరతుడు అంచిత పదమును ప్రయోగించెను. ఈ అంచితశబ్ద ప్రయోగమున క్రియా వైశిష్ట్యము నిరూపిత మగుచున్నది. అలపద్మమునకు సంబంధించిన పూర్వలక్షణము స్మరించుచు భరతముని 'అంచిత' పదము ప్రయోగించుటలో క్రియా వైశిష్ట్య సూచనమునె తలచెనని నిశ్చయింప వచ్చును. "స్వదేహాభిముఖం పృష్ఠభాగేనాకర్షణం" అని దేహాభిముఖముగా పృష్ఠభాగమున నాకర్షించుట అంచిత శబ్దార్థమని శంకుక ప్రముఖులు పలికిరి. ఆ యర్థము సంగతము కాదు.

ఇట్టి యీ అర్ధనికుట్టిత కరణము స్వాత్మశ్లాఘా విషయమయిన అపరిగూఢ వాక్యార్థమున ప్రయుక్తమగును.

ముద్రితమయిన అభినవభారతిలో నక్షర ప్రమాదము లున్నవి. వానిని జాయపతి యాధారమున సవరించుకొనవచ్చు ననుట యీ యంశమునను విశదమయినది.

## ౧౬౮. గంగావతరణం.

అంచితం పాదమత్యర్ధముత్క్షిప్యోర్ధ్వతలం తతః
తస్యోపరి కరౌ కార్యౌ త్రిపతాకావధస్తలౌ
శిరశ్చ క్రమశో యత్ర పాదార్ధమవరోపయేత్
గంగావతరణం విష్ణోః పాదాద్గంగావతారణే

## ౧౬౮. గంగావతరణము.

అంచిత పాదమును బాగుగా పైకినెత్తవలెను. అది యూర్ధ్వతలమునకు త్క్షిప్తము కావలెను. అనంతరము త్రిపతాకా హస్తములను అధస్తలములుగా నుండునట్లు కూర్పవలెను. పాదార్ధమున్న భాగమునకుగా శిరమును క్రమముగా అవరోపిత మొనర్పవలెను. ఇట్టిదిది గంగావతరణమను కరణమగును ఇది విష్ణువు పాదమునుండి గంగ యవతరించుటలో వినియుక్తమగును.

పాదము లూర్ధ్వాంగులితలములుగా నుండుట త్రిపతాకా హస్తము లధోముఖములుగా నుండుట శిరస్సు నన్నత మగుట గంగావతరణ కరణముగా భరత సంకేతిత మయినది.

ఇందు భరతుని నిరూపణములో ఊర్ధ్వాంగులితల పదమున్నదని సమపాదాంచితావస్థానము చెప్పినట్లగునని కొందరు భావించిరి. ఇది శబ్దార్థము కానందున యుక్తముకాదు. కాన పాదమిచట నంచితముగ నుండదు. కొందరిట్లు భావించిరి. ఇట్లిందలి క్రమమున వృశ్చిక పాదక్షిమగ్రితల సంచారమున నుండుననిరి. మరి కొందరి ట్లనిరి. పాదమునకు త్రిపతాకా హస్తములకు నన్నతత్వమున్నందున మొదట పాదోద్ధారముననుండి పాదమూర్ధ్వముగా కూర్చి అటుపై పతాకాహస్తములను కూర్పవలెను. ఆపాదమును క్రిమముగా అగ్రితల సంచారముకల వృశ్చిక పాదముగా కూర్ప

వలెను. తదనుసారమున త్రిపతాకాహస్తము నసన్నత మొనర్ప వలెను. అట్లే శిరమును సన్నతము చేయవలెను. అని భరతుని లక్షణ శ్లోకములోని "చ" కారముల అన్వయ క్రమవిశేషమున నిట్టి యర్థములను వ్యాఖ్యానించిరి.

ఈ విధముగ త్రివిక్రమ పాద ప్రసరణ పూర్వకముగా గంగా దేవి యవతరణ ముండును. గంగావతరణ మను నామమె కరణ విషయమును నిరూపింపగలదు. ఇట్లు అష్టోత్తర శతకరణములు నిరూపితములయినవి.

వినియోగో న యే ప్రోక్తః కరణేషు సమాసతః ౪౯౦
ఉద్ధతాంగతయా న స్యాత్ తత్రోద్ధతపరిక్రమః

కొన్ని కరణములలో వినియోగము నిరూపితమయినది. కొన్ని కరణము లందు వినియోగము చెప్పలేదు. అయినను ఉద్ధతాంగములగుటచే నుద్ధత పరిక్రమ మాయా కరణముల కుండును. వినియోగము చెప్పనపుడు తత్తదౌచిత్యానుసారమున వినియోగమ నూహింప వచ్చును. ఈ చెప్పిన కరణములన్నియు చారీ నిష్పన్నములు నృత్యహస్త సాధ్యములు స్థానక సంపాద్యములు. చారీస్థాన హస్తములకు వానివాని స్వరూప పరామర్శ సమయమున వినియోగము నిరూపిత మయినది. ఆయా వినియోగముల నిందును సంగతి పఱచుకొన వచ్చును. చారీస్థానహస్తముల వినియోగము లేక రూపముగా లేకున్నను అవి యన్నియు నొక కరణ మాతృకాను సారమున నుండునవి. కావున భిన్నభిన్న వినియోగములు ప్రధాన వినియోగమున సంగతములు కాగలవు. సామాన్యముగా కరణ ముల నామములు చారీనామములు ఏకరూపముగా నున్నందున నామ సాదృశ్యము ననుసరించి చారీవినియోగమును కరణ వినియోగముగా

భావింపవచ్చును. అన్నియు నిరూపితము లయినవి. ఎచటనేని విశేష మున్నచో నది స్పష్టముగా కరణవినియోగముగా ప్రతిపాదితమె యయినది. అభినవభారతిలో అభినవగుప్తుడు సూచించినట్లుగా కరణనామమె కరణ వినియోగమును భావింప జేయగలదు

వైశాఖరేచిత వశీకృత నృత్తలీలం
సచ్చక్రమండలకరం గరుడప్లుతోత్కం
విక్రాంతకుంచితగతం మురవైరిరమ్యం
శ్రీజాయనః కరణలక్షణ మభ్యధత్త ౩౯౩

శ్రీజాయనుడు కరణ లక్షణము నీ విధముగా నిరూపించినాడు. మురవైరి — శ్రీవిష్ణువు. మురవైరి రమ్యముగా కరణ లక్షణము చెప్పినాడని యన్వయము. మురవైరివలె రమ్యమని ఉపమాలంకారము. అభిన్నశబ్ద కృతమయిన సమానధర్మ మీ ఉపమాలంకారమును సిద్ధ మొనరించుచున్నది. కావున నీ శ్లోకమున కరణపరముగా నొక భావమును మురవైరి పరముగా నన్యభావమును గుర్తింప వలసియున్నది.

కరణ పరకమయిన భావము వైశాఖరేచితము చక్రమండలము గరుడప్లుతము విక్రాంత=విశిష్టములయిన క్రాంత కరణములు క్రాంతకము, అతిక్రాంతము, అపక్రాంతము, విష్ణుక్రాంతము, పార్శ్వక్రాంతము, కుంచితము అను కరణ నామములిందు సూచితము లయినవి. ఈ సూచితములె ప్రధానములని కాదు. ఇవి మురవైరి సామ్య ప్రతిపాదనమునకై ముద్రాలంకార భంగిగా సూచితము లయినవి.

మురవైరి పరభావము విశాఖ యను కృష్ణప్రియకు సంబంధించినది. వైశాఖము విశాఖాదేవీ సంబద్ధము లయిన రేచితములచే వశీకృత నృత్తలీలలు కలవాడు కృష్ణుడు. చక్ర మండలము కర

మున కలవాడు గరుడవాహనుడు. శాపున గరుడుని స్తుతివిశేషములం దుత్సుకము కలవాడు త్రివిక్రమావతారమున వామనుని విక్రమణమున కుంచిత గతము కలవాడు నగు దేవుడు మురవైరి శ్రీవిష్ణువు.

## అంగహారములు.

ఆంగికాభినయము సర్వస్వము క్రియా సంప్రహార పరాయణము. పూర్వప్రకాశితము లన్నియును ఉత్తరోత్తర గ్రంథములకు అంగములై రూపశోభా సంపాదకములుగా నున్నవి. ఇమిడ్చి స్వరూపములయిన కరణములలో నొక విధముగు ఆంగికాభినయ పూర్ణత యున్నది. అట్లు పూర్ణభావాపన్నములగునవి కూడ పరిపూర్ణ స్వభావకము లగు అంగహారములకు అంగములై యగును. అంగముల నిరూపణానంతరము అంగితాసంభావనీయములగు అంగహారముల స్వరూపము నిరూపింపవలెను. ప్రసంగ ప్రాప్తము లగుటచే వాని యుపక్రమమును జాయసేనాపతి సోపష్టంభముగా ప్రతిపాదింప దలచెను.

### అంగహారః

నిష్పాద్యాన్కరణై రేభిరంగహారాన్ ప్రచక్ష్మహే
చతురశ్రేణ తాలేన కేచిత్ త్ర్యశ్రేణ కేచన
ఏతే ప్రయోజనీయాః స్యుః వ్యాకీర్ణా మునినోదితాః
విభజ్య వివిధానేతాన్ సోద్దేశాన్ బ్రూమహే వయం

ఇట్లింత వఱకు నిరూపితములయిన కరణములచే నిష్పాద్యములగు అంగహారములను ఇటుపై నిరూపింతుము. ముప్పది రెండు అంగహారములను భరతముని నాట్యవేదమున నిరూపించెను. ఆ చెప్పిన వానిలో స్థిరహస్తము మొదటిది. అర్ధనికుట్టకాంగహారము చివరిది. ఆంగికము లందు అంగహారము సర్వముఖ్యము. శివుని

నృత్తమహార్ఘము అంగహార విభూషితము. అంగహారములు నానా కరణ సంయుక్తములు. అంగహారప్రయోగము నిరూపింప తెలెవని బ్రిహ్మ యడిగెను. అంగహార ప్రయోగము భరతునకు దెలియజెప్పు మని శివుడు తండువు నాదేశించెను. తండువు భరతునకు అంగహారములను జెప్పెను. ద్వాత్రింశ దంగహారములు కరణాశ్రయ ప్రయోగమున నున్నవి. "సర్వేషా మంగహారాణాం నిష్పత్తిః కరణైః" అంగహారము లన్నియు కరణములచే నిష్పన్నములగును. హస్త పాద సమాయోగము ఒక నృత్తకరణము. రెండు నృత్తకరణము లొక నృత్తమాతృక, రెండు మూడు నాలుగు మాతృకలున్న నొక అంగహారమగును. ఆరే డెనిమిది తొమ్మిది కరణములతో సంయుక్తములగు నవియు నంగహారములు. అంగహారముల విషయమున నీ విశేషములన్నియు నిరూపిత చరములె. అయినను ప్రకృతస్మృతి దార్ఢ్యమునకు పునఃస్మృతము లయినవి.

భరతముని నాట్యవేదమున నిరూపించిన స్థిరహస్తాద్యర్ధ నికుట్టకాంతాంగ హారములు నియతక్రమమున లేవు. అవి వ్యాకీర్ణములై యున్నవి. వానిలో గొన్ని చతురశ్రతాలమున ప్రయోజనీయములు. కొన్ని త్ర్యశ్రతాలమున ప్రయోజనీయములు. ఇట్టి భావమున ముని వానిని వేరువేరుగా నిర్దేశింపలేదు. వాని నన్నిటిని తాలమానమున విభజించి ఉద్దేశ సహితముగా మేము నిరూపింతుము. ఇట్టి నిరూపణ మావశ్యకము.

ఈ విషయమున అభినవభారతి యిట్లువదేశించుచున్నది. అంగహారములకు సంబంధించిన కరణము లందన్నిటను నియత పరిమాణమున్నది. కలానిర్వర్తన కాలనియతి యున్నది. కాలపరిపూర్ణానుసరణమున వర్తనాక్రమ ముండును. ఇట్టి నియత వర్తనమున

కరణముల సమ్యక్కరణము శక్యమగును. అంగహారములలో గొన్ని యంగహారములు షట్కరణాత్మకములు. కొన్ని ద్వాదశకరణాత్మకములు. కొన్ని చతుర్వింశతి కరణాత్మకములు. ఈ కరణములలో కొన్ని కరణములు ఆవృత్తములగును "ఆరు పండ్రెండు ఇరువదినాలుగు" అను కూటములలో ఒకే కరణము మఱల మఱల ప్రయుక్తము కావచ్చును. రెండు కరణములావృత్తములు కావచ్చును. ఇట్టివన్నియు త్ర్యశ్రతాల మానమున ప్రయుక్తము లగునని గుర్తింప వలెను. ఒక్కొక్క కరణమధ్యమున గాని రెండుకరణముల మధ్యమున గాని తాలకలాన్యనుసంధాన మావశ్యకము శక్యము నగును. ఇట్టివి షోడశాంగహారములు కలవు. ఇట్లే చతురశ్రతాల విషయములు పదునారు కలవు. అంగహారములలో కొన్ని అంగహారములు అష్టకరణాత్మకములు. కొన్ని షోడశకరణాత్మకములు. ఇంకను కొన్ని కరణముల కలన ముండును. వానిలో గూడ ఒక కరణము కాని రెండు కరణములు కాని అభ్యసితములగును. మఱల మఱల నిరూపితములు ప్రయుక్తము లగును. ఇట్టివన్నియు చతురశ్రతాల విషయములుగా నుండునని గ్రహింపదగును. ఇట్టివి పదునారు కలవు. ఒక్కొక్కపుడొక యంగహారము తగ్గినను మరియొక దానిని మఱల నాచరించుట వలన పునఃక్రియావిశేషమున తాలపూరణము శక్యమె యగునని గుర్తించునది. త్ర్యశ్రతాలకములగునవి పదునారు కలవు. వాని నీ విధముగా గుర్తించునది.

అపవిద్ధ—ఉద్ఘట్టిత— విష్కంభ— తదపస్సృత—
స్వస్తికరేచిత — వృశ్చికాపసృత — మత్తస్ఖలిత—
గతిమండల — పరివృత్తకరేచిత — పరావృత్తక—
అలాతక — ఉద్వృత్తక — రేచిత — ఆక్షిప్త
రేచిత _ సంభ్రాంత — అర్ధనికుట్టకములు.

చతురశ్ర తాలాశ్రయములగునవియు పదునారు కలవు. ద్వాత్రింశ దంగహారములలో నివి కాక శిష్టములు చతురశ్రాశ్రయములని గుర్తించునది. కాగా;

అంగహారములు రెండు విధములు. త్ర్యశ్ర తాలాశ్రయములు - చతురశ్ర తాలాశ్రయములు నని. ఒక్కొక వర్గమున పదునారవాంతర భేదములు కలవు. వీనిలో పదునారు ఉద్ఘాపనాది పరిరోచనాంతము లయిన ప్రలోచనాంగములు లందు ప్రయుక్తము లగు, మరి పదునారు బహిర్యవనికాంగతములుగా ప్రయుక్తము లగును. కావున అంగహారము లందు ద్వాత్రింశ ద్రూపతసిద్ధమగునని కొందరందురు.

మరికొంద రిట్లందురు. నలుగురు వనితలు నర్తన మొన రించుచు త్ర్యశ్ర తాలమానమున నాలుగంగహారములను ప్రయో గింతురు. ఆ నాలుగంగహారములు పిండీరూపముగా రేచకరూపముగా న్యాసరూపముగా అపన్యాసరూపముగా నాలుగు విధములు కాగా త్ర్యశ్ర తాలానుగతములు షోడశాంగ హారములగును. ఇట్లే చతురశ్ర తాలప్రమాణమున నలుగురు నాలు గంగహారములను ప్రయో గింపగా నవియు పిండీ రేచక న్యాస అపన్యాస రూపమున నాలుగు విధములై షోడశాంగహారము లగును. మొత్తమున్నయు ద్వాత్రింశ దంగహారము లగును.

కొంద రిట్లందురు. గీతకములు అంగ నిబంధనములు వస్తు నిబంధనములు అనువాని వస్తువు త్రివిధముకాగా నవవర్ధమాన కరణముల సంబంధమున నిరువదియేడు భేదములు కలుగును. కనిష్ఠా సారితముల యాంతరము మధ్యమాసారితము జ్యేష్ఠాసారిత మను చతుర్విధాసారితములు నాలుగు కలవు. యజుర్వేద సంబంధి బ్రహ్మ

ప్రోక్తమగు గీతరూపమయిన వాణిక అనునది యేకపరికాము. మొత్తమిా విధముగా బ్రహ్మగీతి వైచిత్ర్యము ద్వాత్రింశద్భాషిత మగును. తత్ప్రయోగ రూపమయిన అంగహార సమూహమును ద్వాత్రింశద్భాషిత మగును. కావున అంగహారములు ముప్పది రెండుగ నున్నవి.

మరి కొందరిట్లందురు. అంగహారములు ద్వాత్రింశత్సంఖ్యాకములు. పరమేశ్వర భాషితములు. పక్షసంఖ్య త్రి వీని పంచనె యున్నది. కావున నంగహారములు ముప్పదిరెండే. ఇట్టి భావము లన్నియు పరిశీల నార్హములు. ఇట్టి భావముల మనమున నూహించి భరతుడంగహారములు ద్వాత్రింశత్సంఖ్యాకము లనెను. భరత భావము భావించి జాయసేనాపతి అంగహారములు నిరూపించుట కుపక్రమించెను.

వ్యాపారైః సహజైః వ్యాపి స్యాదేకం కరణం సకృత్ 　　౬౦౦
నృత్యతీతి పరిజ్ఞానం తద్ద్వయేన యతో భవేత్
కరణద్వయసంయోగః తతః స్యాన్నృత్తమాతృకా
తద్ద్వే త్రిస్ర శ్చతస్రో వేత్యంగహారః ప్రకీర్తితః
ఇతి ప్రాయికమాఖ్యాతం కుత్రచిద్వ్యభిచారతః
వా శబ్దేనోక్తవానత్ర న్యూనతాధికతే మునిః　　౬౦౫
కేచిద్ద్వి త్రి చతుః పంచ కరణైః సంచయాన్ విదుః
క్రమాన్మాతృకలాపాఖ్యఖండసంఘాతికాభిధాన్
కరణానాం యథాకామం షట్కం సప్తక మష్టకం
నవకం యావదేతేషామంగహారో మత స్తదా
తరణానాం వినిష్పత్తౌ ప్రయోజ్యానాం న లక్ష్యతే　　౬౧౦
యథా సంధి స్తథా హస్తపాదాద్యంగైర్వ్యః క్రియాక్రమః
వర్తనాదిబుధైర్నృత్తా నంగవిద్భిః ప్రకీర్త్యతాం

## అంగహారప్రయోగ ప్రకారము.

ద్వాత్రింశ దంగహారముల నేయే విధమున ప్రయోగింపవలెనో యా ప్రకారమంతయు నిచట నిరూపిత మగును. సామాన్యముగా సహజములగు కొన్ని ఆంగిక వ్యాపారము లుండగా నొకానొకప్పు డొక కరణ మేదేని కలుగవచ్చును. కాని యంత మాత్రమున "నృత్యతి" నృత్య మొనరించుచున్నా డన్న పరిజ్ఞానము కలుగదు. నృత్య మొనరించుచున్నాడన్న పరిజ్ఞానము కరణాద్వయ ప్రయోగముననె కలుగును. కరణాద్వయ ప్రయోగమున్నను నృత్తము విశిష్టముగా నిర్వృత్తమయినదన్న అభిమానము కలుగదు. కాని కరణాద్వయము ప్రయోగించినచో "నృత్యతి" నర్తన మొనరించుచున్నాడన్న భావ ముదయించును. కావుననె కరణాద్వయ సంయోగముండునేని నృత్తమాతృక యందురు. "ద్వేనృత్తకరణే చైవ భవతః నృత్తమాతృకా" అని భరత వచనము. రెండు నృత్త కరణములె నృత్తమాతృక యగునని భావము. నృత్తమాతృకలో రెండుకరణములె యుండవలెను తగ్గరాదు. హెచ్చరాదు. రెండు నృత్తమాతృకలున్న అంగహార మగును. మూడు మాతృకలున్న నంగహార మగును. నాలుగు మాతృకలున్న నంగహార మగును. భరతు డిట్లె చెప్పెను. "ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భి ర్వాప్యంగహారస్తు మాతృభిః" రెండు మూడు నాలుగు నృత్తమాతృకలున్నచో నంగహారమగు నని భరతుడనుట ప్రాయిక కథనము. సామాన్యముగా చెప్పుటయు కాని వస్తుకథనము కాదు. అంతట నిట్లె యుండదు. ఈ నియమము వ్యభిచరిత మగును. భరతవచనములో "ద్వాభ్యాం త్రిభిశ్చతుర్వాప్యంగహారస్తు మాతృభిః" అను స్థలమున "వా" కారమున్నది. ఆ "వా" శబ్దమున నీ యర్థము లభించును. కొన్ని యంగహారములలో చెప్పిన వాని కన్న న్యూనత యుండవచ్చును.

ఆధిక్యము నుండవచ్చును. న్యూనత—అధికత 'వా' శబ్దమున ముని సూచించినాడని గుర్తింపదగును. ఈ 'వా' కారభావమును నిరూపించు అభినవభారతిలోని పంక్తిని ఏతత్పరముగనె శుద్ధమొనరించుకొనుట యుక్తము. "వా గ్రహణాత్ న్యూనతాధిక సంగ్రహః" అని యభినవపంక్తి యుండదగును. అభినవభారతిలో "ఏవ గ్రహణాద న్యూనాధిక సంగ్రహః" అని ముద్రితాభినవ పాఠము. ఈ పంక్తి "ద్వేనృత్తకరణే చైవ భవతో నృత్తమాతృకా" అనుస్థలమున నున్న 'ఏవ' గ్రహణమున నన్వయము సంగతమగును. "ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిర్వా" అను స్థలమున 'వా' భావము న్యూనతాధికతా పరము. అంగహారముల విషయమున అభినవగుప్తు డితర స్థలములందు వ్యక్తము చేసిన భావబలమె యిచట స్వీకార్యము. భావబలానుసారముననె యితరుల పంక్తి భావమును భావించుట యుక్తము. "నా శబ్దేనా నియమః సూచితః ఇతి వ్యాఖ్యాత మభినవగుప్తాదిభిః" అని సంగీతరత్నాకర వ్యాఖ్యా పంక్తి యుండుట యుక్తము.

కొందరిట్లు భావించిరి. రెండుకరణములచే మూడుకరణములచే నాలుగుకరణములచే నయిదుకరణములచే సంపాద్యములు కొన్ని గలవు. సంచయములు సంపాదింపదగినవి. అభినవగుప్తు డభినవభారతిలో నాట్యవేద చతుర్థాధ్యాయమున ౧౦ మొదలు ౧౯ వఱకు భరతశ్లోకములు వ్యాఖ్యానించుచు "ఉపాయత్వాత్ తత్రికరణానాం పూర్వం లక్షణం తత్సంచయాత్మకత్వాత్తేషాం" అను పంక్తిలో 'సంచయ' పదము ప్రయోగించెను "తాన్వః కరణసంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్" అని భరతపంక్తి. కరణసంయుక్తములయిన రేచక సహితములయిన అంగహారములను మీకు వ్యాఖ్యానమొనరించి తెలియజెప్పెదనని భరతుడనెను. ఇందు అంగహారములు

విశేష్యరూపములు. కరణములు విశేషణములు. కావున అంగహారములు ప్రధానములు. కావుననె అంగహారముల నామములనె మొదట జెప్పెను. ఉపాయ రూపము లయినందున కరణములకు మొదట లక్షణము చెప్పుట యుక్తము. అవి తత్ప్రంచయాత్మకములుకదా ఇచటి సంచయ పదమును జాయపతి సముచితముగా నుపయోగించుకొనెనని భావించుట యుక్తముగా నుండును.

కరణముల కలయిక వలన గలుగు నామసంకేతములను ఈ విధముగా గుర్తించునది. మాతృక, కలాపము, ఖండకము, సంఘాతకము.

౧. మాతృక : రెండుకరణముల కలయిక యున్నచో నది మాతృక. నృత్తమాతృక కరణద్వయ సంచయము మాతృక.

౨. కలాపము : మూడుకరణముల కలయిక యున్నచో నది కలాపము. కరణత్రయ సంచయము కలాపాఖ్యము.

౩. ఖండకము: నాలుగుకరణముల కలయిక యున్నచో నది ఖండకము. కరణచతుష్టయ సంచయము. ఈ ఖండకమునకె మండకమని పేరు.

౪. సంఘాతకము: అయిదు కరణముల కలయిక యున్నచో నది సంఘాతకము. కరణపంచక సంచయము.

ఇట్లనుట కొందరి మతము అని జాయపతి యనుట యుక్తముగనె యున్నది. కలాపక మండక సంఘాతకముల జెప్పు శ్లోకము భరత గ్రంథమున ముద్రితమయినది. కాని అది కొన్ని ప్రతులలో లేదు. దీనిపై అభినవ వివృతియు లేదు.

కరణముల షట్కము సప్తకము అష్టకము నవకము యథాకామముగా ప్రయోగింప వచ్చును. ఎన్నిటిని ప్రయోగించిన.

అంగహార మభిమతమగునో అన్నిటి నచట ప్రయోగింపదగును కొన్ని అంగహారము లారు కరణముల కలయికతో నుండవచ్చును. కొన్ని ఏడు కరణముల సంకలనమున నుండవచ్చును కొన్ని యెనిమిది కరణముల కూడికతో నుండవచ్చును. కొన్ని తొమ్మిది కరణముల సంబంధమున నుండవచ్చును.

ప్రయోగింపదగిన కరణముల వినివృత్తిలో సంధి ఛిదము లేకుండ నట్లుగా హస్తపాదా ద్యవయవముల క్రియాక్రమమును నిరూపించుట యావశ్యకము. కరణ మొకటి ప్రయోగించి వేరొక కరణ మొనరించునపుడు కరణమునకు కరణమునకు మధ్యలో నుండు నెడము వ్యవధానము భాసింపకుండు నట్లుగా హస్తపాదాదుల క్రియాక్రమ ముండుట యావశ్యకము. ఛిద్రిచ్ఛాదనోపయోగ విశేషములను సావధానముగా గుర్తించి ప్రయోగించుట యుక్తము. అటే వర్తన ములను వలనములను అంగప్రయోగవిదులు గుర్తించి నృత్తమును ప్రయోగమున గూర్చుట అత్యంత మావశ్యకమని భావింపవలెను.

### అంగహారనిరుక్తిః

అంగానాం యోగ్యదేశేషు హరణేన నిరుచ్యతే
అంగహారోఽథవా హారః ప్రయోగో హారయోగతః
అంగనిర్వర్తనీయత్వాదంగహారః ప్రకీర్తితః ౬౧౫
తథా చ మనయే శంభోరాదేశాత్తండురబ్రవీత్
దృష్టాదృష్టఫలోపేతాన్పూర్వరంగాంజనాయ తాన్

### అంగహారనిర్వచనము.

అంగహార పదము నందు అంగ హార పదములున్నవి. అంగానాం హారణం—ప్రాపణం=అంగహారః ఆయా యోగ్య దేశము లందు ఆయా యంగములకు ఆయా యభినయముల ద్వారమున

వైచిత్ర్య రహితముగా నున్నది. అది అంగహారాత్మకమయిన శివుని నృత్తమున మిశ్రితమయినచో చిత్రము కాగలదు. అప్పుడది “భరతము” అను ప్రసిద్ధి పొందును. భరతుడు అప్పుట ప్రయోగించినదంతయు, ఏమేని ప్రయోగింపవలెనన్న భావమున నృత్తవిరహితముగనె యున్నది. భరతప్రయుక్త మయిన అంగదశకము దృష్టాదృష్టోభయ ప్రయోజన సంపాదక మయినను ఏమాత్రము రంజకత్వము కలది కాదు. ఈ అంగహారాత్మక నృత్త విమిశ్రము అయినచో విచిత్రమై దృష్టాదృష్టాత్మక మయిన ఫలమును సమ్యక్ చక్కగా నీయ గలదు. అనునట్టి నాట్యవేదములోని మహావాక్యార్థ భావమును సారసంగ్రహ రూపముగా నిచట జాయసేనాపతి నిరూపించెను.

పార్శ్వచ్ఛేదపరావృత్త గతిమండల సంకులం
కుర్మో లక్ష్మాంగహారాణామిదం కులమివ ద్విషాం

అంగహారముల లక్షణము నిరూపింతుము ఇది ద్విషాం కులము శత్రువుల సమూహమువలె నున్నదని ఉపమ శ్లేషాధారముగా శబ్దసామ్యము కలదు. పూర్వార్థమట్టి సామ్యము నిరూపించును. దాని వలన రెండు భావములు గోచరించును. అంగహార లక్షణ పరమయిన భావ మిట్లుండును. అంగహారములలో పార్శ్వచ్ఛేదము, పరావృత్తము గతిమండలము ననునవి కలవు. వానిచే నిది సంకులము వ్యాప్తము. ద్విట్కుల పరమయిన భావ మిట్లుండును. యుద్ధములో శత్రువులు పార్శ్వచ్ఛేదము వలన పరావృత్తులు యుద్ధనివృత్తు లయినారు. అట్టి వారి పారిపోవు వారి గతిమండలములచే శత్రుసమూహము సంకులమై యున్నది. ఇట్లు శత్రుకుల సామ్యమున అంగహార లక్షణ మిందున్నది. అంగహారములలో నిరూపితము లయిన పార్శ్వచ్ఛేద పరావృత్త గతి

హారణము ప్రాపణముండుట అంగహారము "అంగానాం దేశాంతరే ప్రాపణ ప్రకారోఽంగహార" అని అభినవభారతి. వేరొక వ్యుత్పత్తియు కలదు. "హారస్య చాయం ప్రయోగో హారః అంగనిర్వర్త్యో హారః అంగహారః" ఈ ప్రయోగము హారునకు సంబంధించినది కావున హారము అంగములచే నిర్వర్తింపదగిన హారుని ప్రయోగము అంగహారము ప్రయోగము హారయోగమున హారము. అది అంగ నిర్వర్తనీయముకాగా అంగహార మయినది. "మహేశ్వరస్య చరితం య ఇదం సంప్రయోజయేత్ సర్వపాప విశుద్ధాత్మా శివలోకం సగచ్ఛతి" అని నాట్యవేదమున నున్నది. ఈ నృత్తము మహేశ్వరుని చరితము. కావున హారము ఇంకను హార ప్రియము హారము. అంగములచే సంపాదింపదగు హారప్రీతి వీని యందు గలదు. కావునను ఇవి అంగహారము లయినవి. ఈ అంగహారములను శివుని యాదేశమున తండువు మునికి నిరూపించెను. ఈ నిరూపితములగు అంగహారములు దృష్టాదృష్ట ఫలోపేతములు. రూపకము లందలి పూర్వరంగ రంజన సంపాదకములు.

ఇచట నీ విషయ మవధారణము చేయువలెను. బ్రహ్మ వచనానుసారముగా భరతుడు శివసన్నిధిలో పరమేశ్వర చరిత ప్రధానముగా "త్రిపురదాహము" పేరుగల డిమము ప్రయోగించెను. పరీక్షక పరితోషమునకై ప్రయోక్త లేమేని ప్రయోగింప వలెను కదా!. భరత ప్రయోగము చూచి శివపరివారము హర్షము పొందినది. శివమహాదేవుడు సుప్రీతుడయినాడు. తననృత్తము నుపదేశించుటకు తండువును నియమించినాడు. శివసన్నిధిలో భరతుడు ప్రయోగముకొఱకుగా కొంతగుర్తించుకొని నియమించి ప్రయోగించినాడే కాని యది యంతగా సుశ్లిష్టము కాదు. సమ్యగుపదేశము లేనందున నంతగా సుశ్లిష్టము కాలేదు. భరతుడు ప్రయోగించిన పూర్వరంగము

మండలము లుద్ధతిములు ... నామ ... కేతి ... చట ముద్రాశోభతో నున్నది.

అంగహారోద్దేశః

స్థిరహస్తః పరిచ్ఛిన్నః పార్శ్వచ్ఛేదోఽపరాజితః ౬౨౦
పర్యస్తభ్రమరాలీఢమత్తాక్రీడాపసర్పితాః
మదాద్విలసితో విద్యుద్భ్రాంతవైశాఖరేచితౌ
సూచీవిద్ధాక్షిప్తపార్శ్వస్వస్తికాచ్ఛురితాః ఇతి
చతురశ్రస్య మానేన షోడశామీ ప్రకీర్తితాః
గతిమండలవిష్కంభౌ పరావృత్తాపవిద్ధకౌ ౬౨౧
మదస్ఖలితసంభ్రాంతాక్షిప్తరేచిత రేచితాః
విష్కంభాపసృతోఽలాతోద్వృత్తావర్ధనికుట్టకం
ఉద్ఘట్టితో వృశ్చికాపస్వస్తికరేచితౌ
రేచితః పరివృత్తాదిః త్ర్యశ్రమానేన షోడశ

అంగహారనామములు.

ఇచటి శ్లోకములలో అంగహారముల నామములు నిరూపితము లయినవి. పూర్వము చెప్పిన విధముగా చతురశ్ర తాలమానమున పదునారును త్ర్యశ్ర తాల మానమున పదునారు నంగహారములు కలవు. మొదటి అయిదు పంక్తులలో చతురశ్రాంగ తాంగహార షోడశకము, తరువాతి పంక్తులలో త్ర్యశ్రమానాను గతాహార షోడశకము నిరూపిత మయినది.

చతురశ్రమానమున షోడశాంగహారముల నామము లీవిధముగ నున్నవి.

స్థిరహస్తము—పరిచ్ఛిన్నము—పార్శ్వచ్ఛేదము—
అపరాజితము—పర్యస్తము—భ్రమరము—

ఆలీఢము—మత్తాక్రీడము- అపసర్పితము
మదాద్విలసితము—విద్యుద్భ్రాంతము—వైశాఖ రేచితము
సూచీవిద్ధము—ఆక్షిప్తము—పార్శ్వస్వస్తికము—అచ్చురితము

క్రియాక్రమానమున షోడశాంగహారముల నామము లీ విధముగ నున్నవి.

గతిమండలము—విష్కంభము—పరావృత్తము—
అపవిద్ధము—మత్తస్ఖలితము సంభ్రాంతము—
ఆక్షిప్త రేచితము—రేచితము—విష్కంభాపసృతము
అలాతము—ఉద్వృత్తము—అర్ధనికుట్టకము
ఉద్ఘట్టితము—వృశ్చికాపసృతము—స్వస్తిక రేచితము
పరివృత్తక రేచితము—

"రేచితః పరివృత్త్యాది;" అనుశ్లోకము నందలి పదముల వలన పరివృత్తక రేచితము పరివృత్తి రేచితము సిద్ధమగుటగ్రాహ్యము. భరతుని నామ నిర్దేశము సంకీర్ణము ఇందలి సంకేతము తాల మానానుగత మగుట నిరూపితమయినది.

లక్షణేష్వంగహారాణాం భరతేన సమాసతః ౬-१०
ఏకదేశగ్రహేణోక్తః సమగ్రం కరణం క్వచిత్
ఆలోచ్య తానహం వ్యక్తం కథయామ్యనుపూర్వశః

అంగహారముల లక్షణము నిరూపించుటలో భరతుడు ఒక్కొక స్థలమున సమగ్రకరణమును ఏకదేశ గ్రహణమున జెప్పెను. నామైక దేశ గ్రహణమున నామగ్రహణమను న్యాయమున్నది కదా! అట్టివానిని నేను బాగుగా సమాలోచన మొనరించి అనుపూర్వీ సహితముగా స్పష్టముగా జెప్పెదను.

## అంగహారలక్షణం

### ౧. స్థిరహస్తః

క్రమాల్లీనం సమనఖం తతో వ్యంసితమాచరేత్
అత్ర త్వపసృతావూర్ధ్వస్థానప్రాప్తౌ కరావుభౌ
ఆలీఢవ్యత్యయేనాస్య ప్రత్యాలీఢం సమాశ్రయేత్ ౬౨౫
ఊరూద్వృత్తాం తతః కుర్యాన్నికుట్టకపురస్సరం
స్వస్తికాక్షిప్తకే పశ్చాన్నితంబకరిహస్తకం
కటిచ్ఛిన్నం చ యత్రైష స్థిరహస్తో హరప్రియః

## అంగహారలక్షణము.

### ౧. స్థిరహస్తము.

అంగహారము లందన్నిటను అభినవుని అభినవభారతిలోని అభిప్రాయములు ఆదరపాత్రములుగా నున్నవని జాయసేనాపతి సకలముగా తదాదరమును ప్రదర్శించెను. భరతుడు స్థిరహస్తాంగహార లక్షణము చెప్పుటలో నివి యుండుటను సూచించెను. కరప్రసాదము ఉత్క్షేపము సమనఖప్రయోగము వ్యంసితము అపసృతము సవ్యహస్తమున కూర్ధ్వప్రసారము ప్రత్యాలీఢము నికుట్టకము ఊరూద్వృత్తము ఆక్షిప్తము స్వస్తికము నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము ఉండగా నీ యంగహార మగును. అది హరప్రియము అని అభినవగుప్తుని యోజనానుసారమున స్థిరహస్తస్వరూపము విశదమగును.

కరములను ప్రసారితములను చేసి ఉత్క్షేపింపజేసి త్రిపతాకాంజలి హస్తమును వక్షఃస్థముగా జేయుగా నీ క్రమమున లీనమను కరణము ప్రయోగింపదగి యున్నది. ప్రథమమున లీనాఖ్యకరణము ఇతికర్తవ్యతానిరూపణముగా నుపలక్షిత మగును. ఈ కరణము హస్తపాదాదుల యౌచిత్యమయిన వర్తవమున చారీయోజనమున

నుండగా అవిచ్ఛిన్నముగా శుభంకరముగా నుండును. అలాతచక్రము వలె ఏక బుద్ధ్యనుసంధానము కూర్చును. ఇటుపై సమనఖకరణము కూర్పదగును. పాదములు శ్లిష్టములు సమనఖములుగా నుండుట సమనఖకరణముగా నిరూపితమయినది. అనంతరము వ్యంసిత కరణమాచరింపవలెను. ఆలీఢస్థానకమునందుండి కరములను వక్షఃస్థలమున రేచితమొనరించి ఊర్ధ్వాధో విప్రకీర్ణములుగా నొనరించిన వ్యంసిత కరణము. ఇట్టి యీ వ్యంసితకరణ ముపస్కృతము కాగా హస్తములు రెండును ఊర్ధ్వస్థానగతములు కావలెను. పిమ్మట ఆలీఢస్థానకమును పరివర్తింపజేసి ప్రత్యాలీఢస్థానకము నాచరింపవలెను. అనంతరము నికుట్టకకరణ పురస్సరముగా ఊరూద్వృత్తకరణ మాచరింప వలెను. నికుట్టిత కరణమున కరములు నికుట్టితము లగుటయు ఊరుపృష్ఠకరణమున కరములావృత్తము లగుటయు నున్నది. పిమ్మట హస్తములచే పాదములచే స్వస్తిక మాచరించునది. పిమ్మట నితంబగతి అనంతరము కరిహస్తము తుదకు కటిచ్ఛిన్నము ప్రయోగింపదగును. ఇట్లున్న నిది స్థిరహస్తమను హరప్రియమయిన అంగహారము.

ఇట్లిందు కరణగ్రామ సమ్యగ్యోజన మావశ్యకము. వీని నొనర్పగా నివి స్థిరహస్తమను అంగహారమును నిర్వర్తింపజేయుగలవు. అంగహారములన్నిటను ప్రయోగించు కరణముల నన్నిటిని నాలుగు దిఙ్ముఖములందును ప్రయోగింపవలెనని నాట్యాచార్యుల యభిప్రాయము. అతీతానాగతవేదియగు భరతముని యీ భావమును యుక్తముగ భావించినట్లు తోచదు. పరివృత్తక రేచితమును అంగహారము నిరూపించునప్పుడు "పరాఙ్ముఖ విధిర్భాయ ఏవమేవభవేదిహ" అని వ్రాసెను. ఇందు పరాఙ్ముఖ విధి యిట్లై యుండుననెను. అంగహారములమధ్యలో నిట్లు నిరూపించు భరతముని భావమును ఇట్లు గ్రహింపవలెను. అంగహారములన్నిటియందును చివరి రెండు

కరణములుతప్ప మిగిలిన కరణములన్నియు వర్తనీయములై యగును వానిని నాలుగు దిశలందును ప్రయోగింపవచ్చును. ఆ పిమ్మట కరణద్వయమున ఆ అంగహారమును పూర్తిచేయవలయును. అని. ఇట్టి యీ భావము ఇటుపై విశదము కాగలదు.

ఆదౌ సర్వాంగహారాణాం కైశ్చిత్కరణసంచయః
స్థిరహస్తోక్తలీనాది ప్రత్యాలీఢాంత ఇష్యతే ౬౪౦
కరణాన్యంగహారేషు ప్రత్యేకం చతసృష్వపి
దిక్షు కుర్యాత్పరావృత్త్యా భ్రమణం కరణం భజన్
అంత్యం తు కరణద్వంద్వం సభామభిముఖః సకృత్
రేచితే పరివృత్తాదావంగహారేఽవదన్మునిః
పరాఙ్ముఖవిధిర్న్యాయ ఏవమేవ భవేదిహ ౬౪౫
ఇత్యత్రేవశబ్దేనాముమర్థం పర్యభాషత

స్థిరహస్తమను నంగహారము హరప్రియమని యున్నది. అన్నియు హరప్రియములు అయినను ఇందు ప్రాధమ్య పురస్కృతమయిన విశిష్టత కలదు. కొందరీ అంగహార విషయమున నిట్లనిరి. సర్వాంగహారముల సమారంభము నందు, స్థిరహస్తాంగహార నిరూపితము లయిన లీఢాది ప్రత్యాలీఢాంతకరణ సంచయ ముండుట యభీష్టము. అని, ప్రథమాంగహార సంగతములయిన కరణముల కన్నిట ప్రథమ మయిన యితికర్తవ్యతను వారాయోజనము చేయుదురు. కొందరు ఆయా యంగహారముల కన్నిటికిని సముచితము లయిన సాధారణము లయిన ప్రయోగ ప్రక్రియలను న్యాయముగా నభ్యూహించి కూర్చుట యుక్తమని భావించిరి. కొందరిట్టి భావ లేశములను సహించుటలేదు "శ్రుతహానౌకోగుణః!" ఉన్న వానిని విడనాడుటలో నేమి గుణముండునని వారిభావము.

అంగహారము లందున్న కరణముల నన్నిటిని పరావర్తనమున భ్రమణ మాచరించుచు నాలుగు దిశలందును ప్రయోగించుట యుక్తము. ఇది నాట్యాచార్యుల భావమని అభినవభారతి యనినది. ప్రత్యంగహారము నందును చివరనున్న కరణద్వయమును సభాభిముఖముగా ప్రయోగించుట యుక్త సముచితమని భరతభావము. ఇట్టి భావమును పరివృత్త రేచితాంగహారమున సూచించెను. "పరాఙ్ముఖ విధిర్న్యాయ ఏవమేవ భవేదిహ" అని భరతవచనము. అభిముఖముగా కరణప్రయోగవిధి యయిన పిమ్మట మఱల నట్లే పరాఙ్ముఖ విధియు నుండదగునని తద్భావము. ఈ వచనములోని "ఇహ" శబ్దమున ఈ పరివృత్త రేచితమునందె యిట్లుండునని యాతని భావము. అంగహారముల మధ్యమున ప్రత్యేకముగా జెప్పుటచే నంతట చతుర్దిక్ప్రయోగ ముచితము కాదని భరతుడు భావించి యుండును. ఇట్టి భావమున నిచటి శ్లోకముల నన్వయించికొనుట యుక్తము.

౨. పరిచ్ఛిన్నః

క్రమాత్సమనఖచ్ఛిన్నసంభ్రాంతాని విధాయ చేత్
వామేనాంగేన కుర్వీత భ్రమరాఖ్యార్ధసూచినీ
అతిక్రాంతాభిధం పశ్చాద్భుజంగత్రాసితం తతః
కరిహస్తం కటిచ్ఛిన్నం పరిచ్ఛిన్నస్తదా భవేత్ ౬౫౦

౨. పరిచ్ఛిన్నము.

ఈ అంగహారము నందు క్రమముగా సమనఖము ఛిన్నము సంభ్రాంతము భ్రమరకము అర్ధసూచి అతిక్రాంతము భుజంగత్రాసితము కరిహస్తము కటిచ్ఛిన్నము అను తొమ్మిది కరణములను ప్రయోగింప వలెను. అప్పుడది పరిచ్ఛిన్నాంగహారమగును. ప్రథమముగా పాదశ్లిష్టత సమనఖత కల సమనఖ కరణ మాచరింపవలెను.

పిమ్మట ఛిన్నకరణము. ఛిన్నకరణమునకు పరిచ్ఛిన్నకరణ మనియు పేరు. తరువాత ఆవిద్ధపాదమున ఆవిద్ధచారిలో సంభ్రాంత కరణము కూర్పవలెను. పిమ్మట భ్రమరకము, పిమ్మట వామపాదమున అర్ధ సూచి, తతః అతిక్రాంతము. తతః భుజంగత్రాసి తాదులు మూడు కరణములు కూర్పదగును. ఈ కరణనవకమున పరిచ్ఛిన్నమునకు రూపసిద్ధి యున్నది

## ३. పా ర్శ్వ చ్ఛే దః

కరణం యత్ర కుర్వీత పూర్వం వృశ్చికకుట్టితం
ఊర్ధ్వజానుకమాక్షిప్తం స్వస్తికం భ్రమణం త్రికే
ఉరోమండలకాభిఖ్యం నితంబం కరిహస్తకం
కటిచ్ఛిన్నం తమిచ్ఛంతి పార్శ్వచ్ఛేదం విపశ్చితః

## ३. పా ర్శ్వ చ్ఛే ద ము.

ఈ అంగహారమున నీ కరణము లుండును. వృశ్చిక కుట్టితము ఊర్ధ్వజానుకము ఆక్షిప్తము స్వస్తికము భ్రమణము ఉరోమండలము నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము. వక్షఃస్థలమునందు కరముఃను నికుట్టిత మొనరించుట యను వృశ్చిక కుట్టిత కరణము ప్రథమము నుండును. వృశ్చికచరణము కూర్చి రెండు హస్తములను నికుట్టిత మొనర్చుట తదూర్పము. పిమ్మట కుంచితపాద రూపమయిన ఊర్ధ్వజానువు, హస్తపాదాక్షిపతా రూపమగు ఆక్షిప్తకము హస్తపాదములచే గూర్పదగు స్వస్తికము, హస్తద్వారమున ఉరోమండల కరణము, పూర్వాంగహారములలో వలె నితంబాదిత్రయ ప్రయోజ్యము. ఇట్టిదిది పార్శ్వచ్ఛేదమను అంగహారమగును.

## ४. అ ప రా జి తః

దండపాదం యదా కుర్యాద్వ్యంసితాఖ్య ప్రసర్పితం ౬౫౨

నికుట్టార్ధనికుట్టాఖ్యాక్షిప్తోరోమండలాన్యథ
కరిహస్తకటిచ్ఛిన్నే తదా స్యాదపరాజితః

౪. అ ప రా జి త ము.

ఈ అంగహారమునందు దండపాద వ్యంసిత ప్రసర్పిత నికుట్టార్ధ నికుట్టాక్షిప్తోరోమండల కరిహస్త కటిచ్ఛిన్న కరణములు తొమ్మిది యుండును. నూపురపాద మొనరించి దండపాద ప్రసారము చేయుటయను దండపాద కరణము ప్రథమమున నుండదగును. ఇందు విక్షేపాక్షేపము లున్నవి. పిమ్మట ఆలీఢస్థానకముతో నుండు వ్యంసిత కరణ మావశ్యకము. స్థిర హస్తాంగహారమునందు వలె వ్యంసిత ముండ దగును. అనంతరము రేచిత వామహస్తము లతాఖ్యధక్షు హస్తము కల ప్రసర్పిత కరణ మపేక్షితము. హస్తములు నికుట్టిత ములు అంచితము లగుట కల నికుట్టితార్ధ నికుట్టిత కరణముల నాచ రించి ఉరోమండల కరణ మొనర్పవలెను. అది కాగా కరిహస్త కటిచ్ఛిన్న కరణముల నొనర్పవలసి యున్నది. అప్పు డపరాజితాం గహార మగును. పర్యస్తకాంగహారములో వలె నిందు తుదిలో నాలు గంగహారములు సమముగానున్నవి.

౫. ప ర్య స్తః

తలపుష్పపుటాత్పశ్చాదపవిద్ధాఖ్యవర్తితే
నికుట్టకం భవేదూరూద్వృత్తమాక్షిప్తకాభిధం
ఉరోమండలనామాథ నితంబం కరిహస్తకం ౬౦
కటిచ్ఛిన్నం చ యత్ర స్యాత్పర్యస్తోయం భవప్రియః

౫. ప ర్య స్త ము.

ఈ యంగహారమున నీ కరణము లుండును. తలపుష్ప పుటము అపవిద్ధము వర్తితము నికుట్టకము ఊరూద్వృత్తము ఆక్షిప్త

కము కటిచ్ఛిన్నము. భరతుని పరిగణనములో స్థిరహస్తము మొదటిది. ఈ పర్యస్తకము రెండవది. స్థిరహస్త కరణములో నిరూపించిన కరప్రసార సమనఖ వ్యంసి తాపస్వృతి పరిత్యాలీఢములు దీనిలో గూడ నుండవలెనని సర్వాంగహారములలో నవి యుండవలెనని యితికర్తవ్యతను కొందరాయోజన మొనరించిరి. తత్తదంగహారములకు సముచితము లయినవి కొన్ని యుండునని భరతోక్తిలో లేకపోయినను వానిని స్వయముగా నభ్యూహించి కూర్పదగునని కొందరందురు. భరతుడు చెప్పిన వానిని విడువనేల? లేనివానిని దెచ్చుటేల?

వామపార్శ్వమున పుష్పపుట హస్తము అగ్రతల సంచరమయిన పాదము పార్శ్వము సన్నతి మగుట యను తలపుష్పపుట కరణమును ప్రథమమున నాచరింపవలెను. శుకతుండీమావర్తింపచేయుట వామహస్తము వక్షఃస్థ మగుట కల అపవిద్ధ కరణము రెండవది. మణిబంధమున కుంచితహస్తము లుండుట కల వర్తిత కరణము మూడవది. హస్తములు నికుట్టితములుగా నుండుట యను నికుట్టక కరణము నాలవది. ఉరూద్వృత్త మయిదవది. హస్తపాదాక్షేపము కల ఆక్షిప్తకరణ మారవది. ఉరోమండల మేడవది. నితంబ కరణ మెనిమిదవది. కరిహస్తము తొమ్మిదవది. కటిచ్ఛిన్నము పదవది. ఇట్లు కరణదశమున పర్యాప్తాంగహార మగును. ఈ అంగహారము భవ ప్రియమని యిందు గలదు. హరోద్భవమని భరతుని మాట. అన్నియు హరభవములె. అన్నియు భవప్రియములె అయినను కొన్నిటి నట్లు చెప్పుట వాని విశిష్టతాసూచనము.

౬. భ్రమరః

"కృత్వా నూపురపాదం తు తథాక్షిప్తకమేవ చ
కటిచ్ఛిన్నం చ కర్తవ్యం సూచీపాదం తథైవ చ

నితంబం కరిహస్తం చాప్యురోమండలకం తథా
కటిచ్ఛిన్నం తతశ్చైవ భ్రమరః స తు సంజ్ఞితః" ౬౬౫
కరిహస్తాభిధం తస్మాదురోమండల సంజ్ఞకం
కటిచ్ఛిన్నం [తతః కుర్యాత్ భ్రమరః స తు కీర్తితః]

౬. భ్రమరము.

ఈ అంగహార లక్షణ శ్లోకము గ్రంథమున త్రుటితమయినది. చివరి శ్లోకమున ఇరువది యక్షరములు మాత్రమున్నవి. నాట్యవేదమున భరతుడు నిరూపించిన భ్రమరాంగహార లక్షణ మిచట సౌకర్యమునకై ఘటితమయినది.

నూపుర పాదము అక్షిప్తకము కటిచ్ఛిన్నము సూచీపాదము నితంబము కరిహస్తము ఉరోమండలకము కటిచ్ఛిన్నము అను ఎనిమిది కరణములు భ్రమరమను నంగహారమున నుండును. కటిచ్ఛిన్న కరణము రెండు పర్యాయములు ప్రయోగింప వలసి యున్నది. ఇట్లే కొన్ని అంగహారము లందు కొన్ని కరణములు శోభా సంపాదనము నకై యావృత్తము లగును.

మొదట నూపుర పాదము పట్టి నూపురకరణ మొనరింప వలెను శిరోదేశమున అలపద్మము కల ఛిన్నమను కరణము కూర్పవలెను. ఈ ఛిన్నమునే పరిచ్ఛిన్న మనుటయు గలదు. పరిచ్ఛిన్నకరణము కాక ఇచట కటిచ్ఛిన్నకరణ ముండవలయుననుట పాఠాంతరమున నున్నది. పిమ్మట సూచీపాదము నితంబము కరిహస్తము ఉరోమండలము కటిచ్ఛిన్నము అనుకరణములు గూర్ప దగును. చివరికరణముల కూర్పు పూర్వాంగహారములలో గూడ గలదు.

### ౭. ఆలీఢః

విధాయ వ్యంసితం యత్ర ప్రకుర్వీత నికుట్టకం
నూపురం వామతోఽలాతాక్షిప్తకే తు తతోన్యతః
ఉరోమండలకాభిఖ్యం కరిహస్తసమాహ్వయా ౬౭౦
కటిచ్ఛిన్నం చ యత్రాయమాలీఢః పరికీర్తితః

### ౭. ఆలీఢము.

దీనిలో వ్యంసితము, నికుట్టకము, నూపురపాదిక, అలాతము ఆక్షిప్తకము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నము అను కరణాష్టక ముండును. ఆలీఢ స్థానకమున నుండి పక్షమునందు హస్తములను రేచిత మొనర్చి ఊర్ధ్వాధో విప్రకీర్ణములనుగా జేయుట యను వ్యంసితకరణమును ప్రథమముగా కూర్పవలెను. బాహుశీర్షమున హస్తములు నికుట్టిత మొనరించుటయును నికుట్టితకరణమాచరింపవలెను. వామభాగమున నూపురపాదిక కూర్పవలెను. దక్షిణపాదమున అలాతము ఆక్షిప్తము నాచరింప వలెను. పిమ్మట పూర్వమువలె ఉరోమండల కరిహస్త కటిచ్ఛిన్నములను కూర్పునది. ఇట్టిదిది ఆలీఢాంగహారమగును. ఉరోమండలాది కరణ త్రియమంతమున నియతముగానున్నది.

### ౮. మత్తాక్రీడః

భ్రమరాన్నూపురం తస్మాద్భుజంగత్రాసితాభిధం
అంగేన దక్షిణేనైవ తతో వైశాఖరేచితం
ఆక్షిప్తకమథాచ్ఛిన్నం వామేన భ్రమరాభిధం
యత్రోరోమండలం కుర్యాన్నితంబం కరిహస్తకం ౬౭౫
కటిచ్ఛిన్నం చ సంప్రోక్తో మత్తాక్రీడో హరప్రియః

### ౮. మత్తాక్రీడము.

హరప్రియమగు నీ మత్తాక్రీడాంగహారమున పదునొకండు కరణములున్నవి. భ్రమరము, నూపురపాదిక, భుజంగత్రాసితము,

వైశాఖరేచితము, ఆక్షిప్తకము, ఆచ్ఛిన్నము, భ్రమరము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము నని. మొదటగా త్రికము నువలిత మొనరించి భ్రమరక కరణ మాచరింపవలెను. అనంతరము నూపురకరణము పిమ్మట కుంచిత పాదము కల భుజంగ త్రాసితము నొనరింపవలెను. పిమ్మట దక్షిణ పాదమునవె వైశాఖ రేచిత మాచరించునది. ఆక్షిప్తహస్తపాదములు కల ఆక్షిప్త కరణ మాచరింప వలెను. అనంతరము ఆచ్ఛిన్నము. పిమ్మట వామ భాగమున భ్రమరకము కూర్చునది. ఇది బాహ్యభ్రమరకము. అనంతరము వెనుకటి వలె ఉరోమండల నితంబ కరిహస్త కటిచ్ఛిన్న కరణములు కూర్చునది. కాగా నిది మత్తాక్రీడాంగహార మగును. ఇది హారప్రియాంగహారము.

౯. అపసర్పితః

క్రమతుః కుర్యాదపక్రాంతం వ్యంసితేన కరక్రియాం
కేవలం కరిహస్తార్ధసూచివిక్షిప్తకాన్యథ
కటిచ్ఛిన్నాభిదానోరూద్వృత్తమాక్షిప్తనామకం
కరిహస్తం కటిచ్ఛిన్నమపసర్పితనామకః ౭౨౦

౯. అపసర్పితము.

ఈ అంగహారమున అపక్రాంతము వ్యంసితము కరిహస్తము అర్ధసూచి విక్షిప్తము కటిచ్ఛిన్నము ఊరూద్వృత్తము ఆక్షిప్తము కరిహస్తము కటిచ్ఛిన్నము అను పదికరణము లున్నవి. వీనినన్నిటిని క్రమముగా నీ యంగహారమున కూర్చవలెను. ఊరువలన మపక్రాంత క్రమము కల అపక్రాంత కరణము మొదట, ఆలీఢస్థానకమున నుండు. వ్యంసితకరణ మొనర్పదగును గాని వ్యంసితకరణము నుండి కరక్రియనే గ్రహింపవలెనని "కేవల" పదమున గోచరించును కరముల క్రియ కరక్రియ రెండుహస్తములను వక్షము నందు కూర్చుట వ్యంసి

తము నందున్నది దానినే యిందు గ్రహింపవలెను. పిమ్మట కరిహస్తకరణము. ఊర్ధ్వోద్వేష్టితమని భరతుడన్న దానికి కరిహస్తమని యె భావము. నాయుడు విక్షేపతమై వలయము ప్రోద్వేష్టిత తలముగా మంగుట కరిహస్త కరణ లక్షణములో నున్నది. అనంతరము శిరోదేశము అలపద్మముకల అర్ధసూచీకరణము హస్తపాద విక్షేపము కల విక్షిప్తకరణము, కటిచ్ఛిన్న కరణము ఊరూద్వృత్త కరణము కూర్పవలెను. భరతుడు నామైక గ్రహణమున ఉద్వృత్త పదమునె నిరూపించెను. అది యూరూద్వృత్తమని అభినవుడనుటను జాయపతి గ్రహించెను. పిమ్మట ఆక్షిప్త కరిహస్త కటిచ్ఛిన్న కరణములు కూర్పవలెను. అప్పుడిది అపసర్పితాంగహార మగును. దీనిలో కరిహస్తము కటిచ్ఛిన్నము మఱల మఱల ఆవృత్తమగుట విశిష్ట సౌందర్య సంపాదకము.

## ౧౦. మ దా ద్వి ల సి తః

మదస్ఖలితమత్తల్లి తలసంస్ఫోటితాని చేత్
గుంభేన త్రిచతుః కృత్వా పంచకృత్వోథవా పునః
విదధీత నికుట్టోరూద్వృత్తాఖ్యే కరిహస్తకం
కటిచ్ఛిన్నం సమాఖ్యాతో మదాద్విలసితస్తదా

## ౧౦. మ దా ద్వి ల సి త ము.

మదాద్విలసితమని యిందున్నది. ఇది మదవిలసితము. దీనిలో నేకరణములున్నవి. మదస్ఖలితము మత్తల్లి తలసంస్ఫోటితము నికుట్టము ఊరూద్వృత్తము కరిహస్తము కటిచ్ఛిన్నము. అని కరణ సప్తక మిట్లు నిర్దిష్ట మయినది. కాని మొదటి కరణములను త్రిరావృత్తిగా నొనరింపగా త్రయోదశకరణము లగును. నాలుగు పర్యాయము లొనరింపగా షోడశకరణము లుండును. "పంచకృత్వః"

అయిదు పర్యాయము లావృత్తము చేయగా ద్వావింశతి కరణము లగును, కరణసప్తకమునకు త్రిరావృత్తి యొనర్పగా నిరువది యొకటి కరణ సంఖ్యయగుట నభినవభారతి సూచించినది. చతుఃపంచకృత్వః ఆవృత్తిని అభినవుడు సూచింపలేదు. మొదటిమూడు మూడుపర్యాయము లావృత్తములగుట యౌచిత్య ప్రాప్తము కావచ్చును. నాట్యవేదములో భరతుని లక్షణ మీ విధముగా నున్నది.

"దోలైః కరైః ప్రచలితైః స్వస్తికాపసృతైః పదైః
అంచితైర్వలితైర్వ్యస్తైః తలసంఘట్టితైస్తథా
నికుట్టితం చ కర్తవ్యమూరూద్వృత్తం తదైవ చ
కరిహస్తం కటిచ్ఛిన్నం మదాద్విలసితే భవేత్"

ఈ శ్లోకముల భావము నభినవ గుప్తుడీ విధముగ నిరూపించెను. దోలైఃకరైః అనుటచే మదస్ఖలిత కరణము సూచితము. స్వస్తికాపసృతైః పదైః అనుటచే మత్తల్లి కరణము సూచితము. తలసంఘట్టితైః అనుటచే తలసంస్ఫోటిత కరణము సూచితము. వలితైర్వ్యస్తైః అనుటచే నీ మూడు కరణములు బహువిధ చిత్ర గుంఫములు కలవని సూచితము. అనంతరము నికుట్టకాది కరణ చతుష్క ప్రయోగ మావశ్యకము. ఇచట కొందరీవిధముగా నందురు దోలాది కరణములు మూడింటికిని మూడు పర్యాయములావృత్తి యుండగా నీ అంగహారమున త్రయోదశ కరణము లుండును. అని. మరికొందరు కరణ సప్తకమునకును మూడావృత్తులు కూర్పగా ఏకవింశతి కరణము లగును. అని.

మొదటి మూడు కరణములను భరతుడు సూచించుటలో "దోలైః కరైః, స్వస్తికాపసృతైః పదైః తలసంఘట్టితైః" అని బహువచనము కూర్చినందున, బహువచనత్వోపపత్తికై మూటి

నంగీకరింపవలెను గావున నాలు గయిదు పర్యాయములని యంగీకరింప నవసరము లేదు. కావున ఆద్యకరణ త్రియమునకు త్రిరావృత్తి యౌచిత్య లభ్య మగును. అంతిమ కరణ చతుష్కమున కావృత్తి సూచించుటలో నిట్టి యౌచిత్యము కానరాదు.

నాలు గయిదు పర్యాయము లావృత్తి చెప్పినను వైరుధ్యము లేదని భావించెను. సప్తకమునకు త్రిరావృత్తి యుక్తి సంగతము కాదని జాయ భావించి యుండును.

వీని నావర్తింపజేసి ప్రయోగించుటలో దృశ్య మనోహరత సంభావనీయము. నాట్యవిత్సహృదయులు ప్రమాణము. ఇట్టి ప్రయోగ మెట్లుండునో భావుకులు భావింపవలసి యున్నది.

మదస్ఖలితము, మదస్ఖలితము, మత్తల్లి, మత్తల్లి, తలసంఘట్టితము తలసంఘట్టితము, మదస్ఖలితము మత్తల్లి తలసంఘట్టితము నికుట్టితాది చతుష్టయము.

మదస్ఖలితమె మూడు పర్యాయములు మత్తల్లియే మూడు పర్యాయములు, తలసంఘట్టితమె మూడుపర్యాయములు ప్రయోగించినచో గలుగు భావమును, మూడిటిని మూడు పర్యాయము లావృత్త మొనరించుటలోని భావమును పరిశీలించుట బాగుండును. సప్తకము త్రిరావృత్తమయినపుడు మూడు పర్యాయములు మదవిలసితము ప్రయోగించినారన్న భావము వేరొక భావ ముదయింప జేయుట యుక్తమగును. సర్వము మదవిలసిత మయినను విలసితముగా నుండుట యుచితము. ఇంత వ్రాయుగా జాయపతి భావము వ్రాసి నట్లయినది.

## ౧౧. విద్యుద్భ్రాంతః

అర్ధసూచి భవేద్వామే విద్యుద్భ్రాంతం తు దక్షిణే ౯౭౫
వ్యత్యాసేన పునర్ద్వంద్వమేతచ్ఛిన్నమతః పరం
వామేఽతిక్రాంతమాదధ్యాల్లతావృశ్చికసంజ్ఞకం
కటిచ్ఛిన్నం చ యత్రాయం విద్యుద్భ్రాంతః ప్రకీర్తితః

## ౧౧. విద్యుద్భ్రాంతము.

అర్ధసూచి విద్యుద్భ్రాంతము. అర్ధసూచి విద్యుద్భ్రాంతము పరిచ్ఛిన్నము అతిక్రాంతము లతావృశ్చికము కటిచ్ఛిన్నము అను ఎనిమిది కరణముల కలయిక యీ యంగహారమున గలదు. మొదటి రెండును వామదక్షు వృత్తులుగా న్యావృత్తము లయినవి. పరిగణనములో ఆవృత్తములతో కూడుకొనిన పరిగణనమె సంప్రదాయ ధర్మము.

ఇందు ప్రథమమున అర్ధసూచీ కరణము వామాంగ ప్రయోజ్యము దక్షిణ భాగమున విద్యుద్భ్రాంత కరణము ప్రయోజ్యము. మఱల నీ రెండిటిని అంగ విపర్యయమున ప్రయోగింపవలెను. అనగా, దక్షిణమున అర్ధసూచి, వామమున విద్యుద్భ్రాంతము ప్రయోజ్యమగును. పిమ్మట వైశాఖస్థానకమున కటీదేశమున పల్లవహస్తము లుంచి ఛిన్నకరణము ప్రయోగింపవలెను. అనంతర మతిక్రాంతక్రమ మొనరించి లతావృశ్చికకరణ మాచరింపవలెను. తుదకు కటిచ్ఛిన్న కరణము నాచరించునది. అప్పుడది విద్యుద్భ్రాంత కరణమగును.

## ౧౨. వైశాఖరేచితః

అంగద్వయేన వైశాఖరేచితం యత్ర నూపురం
భుజంగత్రాసితోన్మత్తే మండలస్వస్తికాభిధం ౬౯౦

నికుట్టకం తతః కుర్యాదూరూద్వృత్తమతః పరం
అక్షిప్తకాహ్వయం పశ్చాదురోమండలసంజ్ఞకం
కరిహస్తకటిచ్ఛిన్నే సోయం వైశాఖరేచితః

### ౧౨. వైశాఖరేచితము.

ఈ వైశాఖ రేచితాంగహారము నందీ కరణములు కలవు. వైశాఖరేచితకరణము నూపురపాదము భుజంగత్రాసితము ఉన్మత్త కరణము మండలస్వస్తికము నికుట్టకము ఊరూద్వృత్తముఆక్షిప్తకము ఉరోమండలము కరిహస్తము కటిచ్ఛిన్నము. అని ఏకాదశ కరణము లుండవలెను. వీని యోజన మీ విధముగ నుండును. అంగద్వయమున వైశాఖ రేచిత కరణమును పరిధమముగా ప్రయోగింపవలెను. ఈ యంశమును జెప్పుటకై భరతు డీ శ్లోకము వ్రాసెను.

"రేచితౌ సహాగాత్రేణ హ్యాపవిద్ధౌ కరే యదా
ఘనస్తైనైవ దేశేన గాత్రమున్నమ్య రేచయేత్."

ఈ శ్లోకముచే వైశాఖరేచిత కరణము అంగద్వయమున ప్రయోజ్య మని చెప్పినట్లయినదని యభినవభారతి యనినది. తత్పూర్వార్ధమును జాయపతి లిఖించెను. అపవిద్ధకరములు గాత్రముతో రేచితము లగునేని అను భావము కల పూర్వార్ధము హస్తపాద రేచనము కల వైశాఖ రేచిత కరణమును సూచించును. మఱల నా విధముననె యొనర్చి గాత్రమున్నమితము చేసి రేచన మొనర్పదగు నను నుత్త రార్ధ భావము. అంగద్వయమున గాత్రము రేచిత మగుటను సూచించును. ఈ భావము సర్వము "అంగద్వయేన వైశాఖరేచితం" అను పదద్వయమున నిందు సూచిత మయినది. అనంతరము త్రికవలనము లతారేచితక హస్తములు కల నూపురోర్ధ్వ పాద కరణమును కూర్పవలెను. కుంచిత పాద రూపమయిన భుజంగ

త్రాసితము కూర్పవలెను. పిమ్మట ఉన్మత్త కరణ ప్రయోగ మావశ్యకము. ఇది రేచిత పదమున భరతోక్తిలో సూచితమయినది. పిమ్మట మండల స్వస్తిక కరణ మావశ్యకము. ఇది మండల పదముననె నిరుక్త మయినది. పిమ్మట నికుట్టకము ఊరూద్వృత్తము ఆక్షిప్తకము ఉరోమండలము కరిహస్తము కటిచ్ఛిన్నము అనుకరణములను కూర్పజనును. ఇట్టిది వైశాఖ రేచితాంగహార మయినది.

## ౧౩. సూచివిద్ధః

కృత్వార్ధసూచివిక్షిప్తమావర్తం చ తతః పరం
కుర్యాన్నితంబవర్జ్యాని పర్యస్తోక్తాని షట్క్రమాత్ ౬౯౫
నికుట్టాదీని యత్రాయం సూచివిద్ధః ప్రకీర్తితః

## ౧౩. సూచివిద్ధము.

దీనిలో అర్ధసూచి విక్షిప్తము ఆవర్తకరణము నికుట్టకము ఊరూద్వృత్తము ఆక్షిప్తము ఉరోమండలము కరిహస్తము కటిచ్ఛిన్నము అను కరణనవక మున్నది. అలపల్లవోపలక్షితమయిన అర్ధసూచి కరణము ప్రథమమున ప్రయోగింపదగును. హస్తపాద విక్షేపముకల విక్షిప్తకరణము రెండవదిగా ప్రయుక్తముకావలెను. కుంచిత పాదప్రసారము ప్రయోగ వశగహస్తములు కల ఆవర్తకరణము మూడవది. అనంతరము పర్యస్తకాంగహారములో నిరూపితములయిన వానిలో నితంబకరణ రహితముగా మిగిలిన ఆరు కరణములను, నికుట్టాదికముగా ప్రయోగించునది. అనగా పర్యస్తక కరణమునందు తలపుష్పపుటము అపవిద్ధము వర్తితము నికుట్టకము ఊరూద్వృత్తము ఆక్షిప్తము ఉరోమండలము నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము అను దశకరణము లుండగా నికుట్టకాదు లేదు కరణములుకాగా మధ్యలోనున్న నితంబ కరణమును విడువగా మిగిలిన వానిలో నారు కరణము

లను కూర్పవలెనని భావము. ఇన్ని కరణముల నిట్లిందు కూర్పగా నిది సూచివిద్ధాంగహారమయినది.

### ౧౪. ఆక్షిప్తః

నూపురం యత్ర విక్షిప్తమలాతాక్షిప్తకే భవేత్
ఉరోమండలకాభిఖ్యం నితంబం కరిహస్తకం
కటిచ్ఛిన్నం చ కుర్వీత సోయమాక్షిప్తకో మతః
యత్ర యత్ర పునః శబ్దం కరణేఽత్రాభ్యధాన్మునిః ౨౦౦
ప్రయోజ్యత్వం జగుస్తత్ర, తస్యాభిప్రాయవేదినః
ఇతి న్యాయేన విక్షిప్తాలాతకాక్షిప్తకాభిధం
కరణత్రయమత్రాపి ద్విః ప్రయోజ్యత్వమర్హతి

### ౧౪. ఆక్షిప్తము.

ఈ కరణము లిందున్నవి. నూపురము, విక్షిప్తము, అలాతము, ఆక్షిప్తము, ఉరోమండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము ఇవి యెనిమిది కరణములు. వీనిలో విక్షిప్తము, అలాతకము, ఆక్షిప్తకము అను మూడు కరణములను మరల నిరూపించుటను జాయపతి చెప్పినందున మొత్తము పదునొకండు కరణము లిందున్న ట్లగును.

త్రికవలనము కల నూపుర కరణము ప్రథమ ప్రయోజ్యము. హస్తపాద విక్షేపము కల విక్షిప్తము రెండవది. అలాతకము మూడవది. పిమ్మట ఆక్షిప్తక కరణ మొనరింపవలెను. అనంతరము ఉరోమండము నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము అను కరణములను పూర్వము వలె కూర్పదగును. "యత్రయత్ర పునర్గ్రహణం తత్రతత్ర కేచిత్ ద్విర్యోగ మాహుః" భరతుని లక్షణ వాక్యములలో నెచట నేని "పునఃపునః" అని యుండునేని అచట నున్నవానిని

రెండుపర్యాయములు ప్రయోగింపదగునని కొందరనిరి. అని అభినవభారతి సూచించినది. అది అన్యమతమని అభినవుడు అనెను. దానినభిమానించిన జాయసేనాపతి తదాదరమున నిచటి లక్షణము సుపరిష్కృతము చేసెను.

ఈ అంగహారమునకు లక్షణము చెప్పు భరతోక్తిలో "విక్షిప్తాలాతకే పునః పునరాక్షిప్తకం కుర్యాత్" అని యున్నది. ఇచట విక్షిప్తాలాతకములకు పునః యున్నది. ఆక్షిప్తకమునకు పునః యున్నది. కావున "ఏయే కరణమున ముని పునః శబ్దమును ప్రయోగించెనో అచట నా కరణమునకు పునః ప్రయోజ్యత్వము కలదని భరతాభిప్రాయమిదు లనిరి." అని జాయసేనాపతి వ్రాసెను. ఈ న్యాయము ననుసరించి విక్షిప్తా లాతకాక్షిప్తకములను కరణత్రయము ద్విః ప్రయోగము పొందదగి యున్నది. పునః ప్రయుక్తములగుటలో నవి యున్న స్థలముననె పునః ప్రయుక్తములగుటను భావింపవచ్చును. ఇది ఆక్షిప్తాంగహారము.

పునః శబ్దప్రయోగమున లభించు విశేషార్థమును అభినవుడు సూచించినాడు. కాని అది అన్యమతమనెనె కాని స్వాభీష్ట మతముగ భావించి నట్లు తోచదు. భరతోక్తి గూఢార్థముల నభినవుడు నిరూపించును. ఇచటి యీ "పునః పునః" స్వారస్యవిషయమున నాతని భావ మిట్లే యుండునా?.

### ౧౫. పార్శ్వస్వస్తికః

దిక్స్వస్తికాఖ్యమేకేన పార్శ్వేనార్ధనికుట్టకం
అన్యేనైతద్ద్వయం భూయో విదధ్యాదపవిద్ధకం ౨౦౫
ఊరూద్వృత్తాఖ్యమాక్షిప్తం నితంబం కరిహస్తకం
కటిచ్ఛిన్నం చ యత్రైష పార్శ్వస్వస్తిక ఇష్యతే

## ౧౫. పా ర్శ్వ స్వ స్తి క ము

దీనిలో దిక్స్వస్తికము అర్ధనికుట్టకము, మరల దిక్స్వస్తికము అర్ధనికుట్టకము అపవిద్ధము. ఊరూద్వృత్తము ఆక్షిప్తము, నితంబము కరిహస్తమున కటిచ్ఛిన్నము నను పది కరణములు కలవు. వీని యోజన మీా విధముగా నున్నది. మొదట దిక్స్వస్తికము ప్రయోగింపదగును దీని విషయమున భరతుడు "పార్శ్వేతు స్వస్తికం బద్ధ్వా" అనెను. పార్శ్వము లందును అగ్రభాగమునను స్వస్తికరచనము కల దిక్స్వస్తికము గ్రాహ్యమని అభినవభారతి ఆ కరణమునే జాయ నిరూపించెను. ఈ కరణ కరణానంతర మేకాంగమున అర్ధనికుట్టక కరణ మాచరింపవలెను. "కార్యంత్వర్ధనికుట్టకం" అని భరతుడు. రెండవ పార్శ్వమునకు నీ విధి చెప్పుటచే నొక పార్శ్వమున బాహు శీర్షమున అంచిత హస్తముంచుట యను అర్ధనికుట్టక మిచట గ్రాహ్యము. మఱల నన్య పార్శ్వమున గూడ నీ ద్వయము నాచరింప వలెను. అనగా మఱల దిక్స్వస్తిక మాచరించి ద్వితీయ పార్శ్వమున అర్ధనికుట్టక కరణము నాయోజింపవలెను. అనంతర మపవిద్ధకరణము కూర్చునది. కరము నావర్తింపజేయుట యిందుండును. పిమ్మట నించే శుకతుండ హస్తా వర్తనమును కూర్పదగును. ఇది యర్థసిద్ధము. అనంతరము హస్త పాదాక్షేపము కల ఆక్షిప్తకరణము కర్తవ్యము. ఇక పూర్వము వలె నితంబము కరిహస్తము కటిహస్తమునను కరణ త్రయమును కూర్ప వలెను. ఇట్టిదిది పార్శ్వస్వస్తికమను నంగహార మగును.

## ౧౬. ఆ చ్ఛు రి తః

నూపురభ్రమరాభిఖ్యే వ్యంసితాహ్వ మలాతకం
నితంబ మథ సూచ్యాఖ్యం కరిహస్తాహ్వయం తతః
కటిచ్ఛిన్నం చ యత్ర స్యాద్ద్వయ మాచ్ఛురితః స్మృతః ౭౧౦

## ౧౬. ఆచ్ఛురితము.

ఈ ఆచ్ఛురితాంగహారము నందీ కరణములున్నవి. నూపురము భ్రమరము వ్యంసితము అలాతకము నితంబము సూచీ కరణము కరిహస్తము కటిచ్ఛిన్నమునని. ఈ కరణాష్టకమును యథాక్రమముగా నిందు కూర్పవలెను. మొదట నూపురకరణ మాచరించి త్రికపరివర్తన మొనరింపవలెను. ఇట్లనుటచే భ్రమరకరణ మాచరింపవలెనని భావము. పిమ్మట వ్యంసితకరణము. వ్యంసిత హస్తమున త్రికమునే నివర్తింపజేయుట యిందలి కార్యము. త్రికమునే అనుటచే నితంబమునని భావము. పిమ్మట అలాతకరణము నితంబకరణ మావశ్యకము. అనంతరము సూచికరణము, తుదకు కరిహస్తము కటిచ్ఛిన్నమను ద్వయము నుంతగా నిది ఆచ్ఛురితాంగహారమయినది.

ఇంతవఱకు నిరూపితము లయిన ఈ పదునారు అంగహారములు చతురశ్రతాలమానమున నుండునవి యని పరిగ్రాహ్యము. ఇటుపై త్ర్యశ్రతాలమానమున నుండు షోడశాంగహారములను నిరూపింపవలసి యున్నది. గతిమండలాది పరివృత్తి రేచితాంతము లయిన యంగహారములు త్ర్యశ్రమానమున నుండును. ౧౭ మొదలు ౩౨ వఱకు రెండవవిభాగమని పరిగ్రాహ్యము.

## ౧౭. గతిమండలః

మండలస్వస్తికం పూర్వం నివేశోన్మత్తకే తతః
ఉద్ఘట్టితకమత్తల్యాక్షిప్తోరోమండలాన్యథ
కటిచ్ఛిన్నం చ కుర్వీత యత్రాయం గతిమండలః

## ౧౭. గతిమండలము.

గతిమండలాంగహారమున నెనిమిది కరణము లున్నవి. మండలస్వస్తికము నివేశకరణము ఉన్మత్తకము ఉద్ఘట్టితకము మత్తల్లి

ఆక్షిప్తము ఉరోమండలము కటిచ్ఛిన్నమునని ప్రథమముగా మండల స్వస్తిక కరణ మాచరింపవలెను. ఇది ఏకదేశ గ్రహణమున మండలమని భరత గృహీతమయినది. దీనిని మండలస్థానకమున నుండి యాచరింపవలెను. ఈ స్థానక సన్నివేశముననె నివేశ కరణ మాచరింప దగును. మండల స్థానకముననె రెండు కరణములు సూచితములయినవన్న అభినవభావ మిందు విశదమయినది. అనంతరము ఉన్మత్తకరణము కూర్పవలెను ఇది "హస్తాచ రేచితౌ" అనుటచే సూచితము. పిమ్మట పాదోద్ఘట్టనము కల ఉద్ఘట్టిత కరణ మావశ్యకము. దాననే మత్తల్లి కరణమును తుదకు ఆక్షిప్తము ఉరోమండలము కటిచ్ఛిన్నము లను కరణత్రిక ముండును. ఇట్లు కరణాష్టకము కలయిది గతిమండలాంగహార మగును. మండలస్థానక సన్నివేశమున్నందున గతిమండల మయినది.

## ౧౮. విష్కంభః

కృత్వా నికుట్టితం యత్ర నికుంచిత మథాంచితం
ద్వయమంగద్వయేనైవ కృత్వోరూద్వృత్తమాచరేత్ ౩౧౫
పశ్చాదర్ధనికుట్టకాఖ్యం భుజంగత్రాసితం తతః
కిం చాత్ర కరణే హస్తౌ చతుర్భిః కరణైర్యుతౌ
తదైవ భ్రమణేనాథ ఛిన్నాముభయతః కటిం
కరిహస్తం కటిచ్ఛిన్నం సవిష్కంభః ప్రకీర్తితః

## ౧౮. విష్కంభము.

ఈ యంగహారములో నీ కరణము లున్నవి. నికుట్టితము కుంచితము, అంచితము, మరల కుంచితము అంచితము ఊరూద్వృత్తము అర్ధనికుట్టకము భుజంగత్రాసితము, భ్రమరకము, ఛిన్నము, కరిహస్తము, కటిచ్ఛిన్నము నని పండ్రెండు కరణములు ఇది విష్కంభాంగ హారము. ఇందు వీని యోజన రీతి యిట్లుండును. ప్రథమ

ముగా నికుట్టిత కరణ మొనరింపవలెను. హస్తములు పర్యాయమున నుద్వేష్టితము లగుట, పాదములు నికుట్టితములగుటగా భరతవాక్కు. తరువాత నికుంచితకరణము కుంచితకరణము ప్రయోజ్యము. ఈ కరణద్వయము "కుంచితౌ అంచితౌ" అను భరత పదములచే సూచితము లయినవి. హస్తపాదములు కుంచితము లంచితములు కావలెనని భావము. ఈ రెండు కరణములను అంగద్వయమున, పర్యాయమున ప్రయోగింపవలసి యున్నది. వృశ్చిక చరణము కూర్చి, కరమును పార్శ్వమున నికుంచిత మొనరించి, నాసాగ్రమున దక్షహస్త ముంచుట నికుంచిత కరణములో కలదు. అంచిత కరణములో, స్వస్తిక చరణములు కూర్చి, దక్షిణహస్తము కరిహస్తముగ కూర్చి, వామ హస్తమును వక్షః స్థానమున కూర్పగా, ఆ హస్తమె వ్యావృత్తము పరివృత్తము కాగా నది నాసికాగ్రమున నుండగా గలుగు రమ్యత యున్నది. ఇట్లే రెండు కరణముల ననుసంధానించి ఊరూద్వృత్త మాచరింపవలెను. అనంతర మర్ధనికుట్టకము భుజంగత్రాసిత కరణ మావశ్యకము ఇచటి యర్ధనికుట్టకము "చతురశ్రం కరం కృత్వా పాదేన చ నికుట్టకం" అను వాక్యమున సూచితము. అనంతరము భుజంగత్రాసిత మాచరణీయము. ఇచటి భుజంగత్రాసిత కరణము నందు హస్తములు నాలుగు విధానములతో కూడుకొని యుండును. అభినవగుప్తుడు, "భుజంగ త్రాసితం చతుర్విధం. అత్ర ఏవ కారేణ హస్తప్రయోగ మనుక్తం నిరూపయతి." అని సూచించెను. భరతోక్తిలో "భుజంగత్రాసితం చైవ కరం చోద్వేష్టితం పునః" అని యున్నది. ఇందలి "ఏవ" కారమున అనుక్త మయిన హస్తప్రయోగము నిరూపిత మగును. "కరంచోద్వేష్టితం పునః" "కరము మఱల ఉద్వేష్టితము కావలెను." అనుటచే నిది సిద్ధమగును. భుజంగత్రాసిత కరణములో హస్తములను ఉద్వేష్టితములు నొనర్పగా నీ కరణము

నాలుగు స్వరూప విశేషములు కలదగును. ఆ యంశమునే జాయపతి యిందు నిరూపించెను. ఈ కరణసమకాలమున భ్రమరక కరణ మొనరింప వలెను. పిమ్మట ఉభయాంగ ప్రయోగమున ఛిన్నత్రిక మాచరింపవలెను. "ఉభయతః కటింఛిన్నం కుర్యాత్" అటునిటు త్రికవివర్తన ముండగా కటిమధ్య వలనము కలుగును. గావున ఛిన్న కరణము సిద్ధమగును. అనంతరము కరిహస్తము కటిచ్ఛిన్నము నాచరించునది. ఇట్టి కరణాచరణమున నిది విష్కంభాంగహార మయినది.

## ౧౫. ప రా వృ త్తః

జనితం సవ్యతః కుర్యాత్ శకటాస్య మలాతకం ౬౨౦
భ్రమరం కరిహస్తం తు గండం కరనికుట్టితం
కటిచ్ఛిన్నే చ యత్రాయం పరావృత్తః ప్రకీర్తితః

## ౧౫. ప రా వృ త్త ము.

జనితకరణము శకటాస్యము అలాతకము భ్రమరము కరిహస్తము కటిచ్ఛిన్నము అను నారు కరణములున్నవి. ప్రథమముగా జనిత కరణము కూర్పవలెను. ఒకకర మురమునందు మరియొకటి ప్రలంబితముగను పాదము తలాగ్రసంస్థితముకాగా జనితకరణమనుట స్పష్టము. "ఆద్యంతు జనితం" అని భరతోక్తి. ఇచటి ఆద్యశబ్దము దక్షిణాంగ ప్రయోజ్యత్వము చెప్పునని అభినవభారతి ఇందు "సవ్యతః" అనుట తదామోదము. దక్షిణ పాదమున జనిత కరణ మొనరించి యొక పాదమును ప్రసారితము కావింపవలెను. ఇట్లనుటచే శకటాస్యకరణ ప్రయోగము సూచితము. అనంతర మలాతక కరణము భ్రమర కరణము కూర్పదగును. పిమ్మట కరిహస్త కరణము. కరిహస్తములోని కరము గండమున నికుట్టితము కావలె ననుటకు "గండం కరనికుట్టితం" అని యున్నది. తుదకు కటిచ్ఛిన్న కరణము. ఇట్టిది పరావృత్త కరణమయినది.

### ౨౦. అపవిద్ధః

అపవిద్ధాభిధాత్సూచివిద్ధం కృత్వా తతః కరః
ఉద్వేష్ట్యబద్ధయా చార్యా త్రికభ్రమణమాచరేత్
ఊరూద్వృత్తమనేనైవ కృత్వోరోమండలం తతః ౭౨౫
కటిచ్ఛిన్నం చ కుర్వీత యత్రాయ మపవిద్ధకః

### ౨౦. అపవిద్ధకము.

దీనిలో అపవిద్ధకరణము సూచీవిద్ధకరణము ఉద్వేష్టితకరణము ఉరోమండలకరణము కటిచ్ఛిన్నకరణము నను కరణపంచకమాచరింపవలెను. శుకతుండహస్త మాకర్షింపజేసి ఊరుపృష్ఠమున ప్రసరింపజేసి వామహస్తమును వక్షోగతముగా నొనరించుటకు అపవిద్ధకరణమును ప్రథమముగా ప్రయోగించునది. పాదసూచిచే రెండవపాద మావిద్ధముచేయుట హస్తములు కటీవక్షః స్థితము లగుట కల సూచీవిద్ధకరణ మొనరించునది. ఇట్లు కరణద్వయ మొనరించిన పిమ్మట ఉద్వేష్టితకరణమున బద్ధయను చారీ విధానమున త్రికవలన మొనరించి ఉరోమండల హస్తోపలక్షితమగునట్టి ఉరోమండల కరణమాచరింపవలెను. అనంతరము కటిచ్ఛిన్న మొనరింపవలెను.

"అపవిద్ధోఽంగహారశ్చ విజ్ఞేయోఽయం ప్రయోక్తృభిః"

అని భరతోక్తి. ప్రయోక్తలీ అపవిద్ధాంగహారమును గుర్తింపవలెనని దాని భావము ప్రయోక్తలు ప్రయోగకుశలురు, మంచి విద్వాంసుల కయినను స్వాభావముగా అంగగతి విధానము తెలియ శక్యము కాదు. ప్రయోగ కౌశలమున్ననే తెలియ శక్యమగును. ఈ కరణములలో నానావిధముల యోజనములుకలవు. వానిలో మధ్యవర్తనముండును. శిరఃకర్మలు భ్రూకర్మలు నేత్రకర్మ లుండును. ఇట్లు నానా విశేషము లుండును. నృత్తస్వరూప తత్త్వ విదుడా యోజన మంగీక

రింపగలడు. అచటి యంశమును గుర్తింపగలడు. అతత్త్వవిదునకు చెప్పినను ప్రయోజనము కలుగదు. అట్టివానికది ప్రయోగింప శక్యమును కాదు. తత్త్వవిదుడు కానివానికి నిరూపించుటయు కానిపని. గీత వాద్య లయ యతి వాక్యార్థభేదమున యోజన ముండును. యోజనము లెన్నియో కలవు. సుశిక్షితుడగు లక్షణకారుడును వాక్యములకు ప్రతిపదము లక్షణ మొనర్ప శక్తుడుకాడు. దీని యనంతరము దీనిని ప్రయోగింప వచ్చును." అని యెవరేని జ్ఞాపితము చేసినచో తన మనస్సంహిత మయిన యోజనమునను అనుసంహిత మొనర్పవచ్చును. ఇట్టి నియమములు గతిప్రయములు సూచితములె యయినవి. అస్తాం.

## ౨౧. మత్తస్ఖలితః

కృత్వా మత్తల్లి కుర్వీత గండసూచ్యథ లీనకం
అపవిద్ధం ద్రుతం పశ్చాత్తలసంస్ఫోటితం తతః
కరిహస్తం కటిచ్ఛిన్నం మత్తస్ఖలితసంజ్ఞకే

## ౨౧. మత్తస్ఖలితము.

ఇందు మత్తల్లి కరణము గండసూచిలీన కరణము అపవిద్ధము తలసంస్ఫోటితము కరిహస్తము కటిచ్ఛిన్నము అను కరణసప్తక మున్నది. ప్రథమమున వామ దక్షిణ పాదములచే నొనర్పదగు మత్తల్లి కరణ మొనరింపవలెను పిమ్మట దక్షిణహస్త మావర్తింపజేసి కపోలప్రదేశమున కూర్చుటతో గండసూచి కరణ మొనరింప దగును. పిమ్మట సూచీపాదోన్నత మయిన పార్శ్వము కల సమ్యక్ నికుంచిత రూపమయిన లీనకరణ మావశ్యకము. అనంతర మపవిద్ధకరణ ముండదగును. ఈ యపవిద్ధగతముననె వేగముగా తలసంస్ఫోటిత మొనర్పవలెను. అనంతరము పూర్వమువలె కరి

హస్తము కటిచ్ఛిన్నము అంతమున గూర్పదగును. అప్పుడది మత్తస్ఖలితాంగహార మగును.

౨౨. సంభ్రాంతః

విక్షిప్తమంచితం గండసూచి గంగావతారణం ౭౩౦
క్రమాత్కృత్వార్ధసూచ్యాఖ్యం దండపాదం చ వామతః
చతురభ్రమరాభిఖ్యే నూపురాక్షిప్తనామనీ
అర్ధస్వస్తికనామాథ నితంబం కరిహస్తకం
ఉరోమండలకం యత్ర కటిచ్ఛిన్నం సమాచరేత్
సంభ్రాంతం కథయంత్యేతమంగహారం విచక్షణాః ౭౩౫

౨౨. సంభ్రాంతము.

ఇందు విక్షిప్తము అంచితము గండసూచి గంగావతరణము అర్ధసూచి దండపాదము చతురము భ్రమరకము నూపురము ఆక్షిప్తము అర్ధస్వస్తికము నితంబము కరిహస్తకము ఉరోమండలకము కటిచ్ఛిన్నము అను పదునైదు కరణములు కలవు. వీని యోజన యీ విధముగా నుండును.

ప్రథమమున విక్షిప్తకరణ మొనరింప వలెను. ఇందు హస్త పాదములు విక్షిప్తములగుట కలదు. హస్తపాదములు ముఖానుగములుగా నుండవలెనని భరతవచనము కలదు. దీనిచే అంచిత కరణము గండసూచి గంగావతరణము లను కరణములు సూచితము లగును. నాసికాగ్రమున కరము వ్యావర్తన పరివర్తనములతో నుండగా నంచితకరణ మగుటయు, పార్శ్వము సూచీపాదోన్నత మగుట యుండగా గండసూచి యగుటయు, పాదమూర్ధ్వాంగులితల గతమై హస్తములు త్రిపతాకము లధోముఖములై యుండగా గంగావతరణ మగుటయు నాట్యాలక్షణాన సారమున గుర్తింపవచ్చును. అనంతరము అర్ధసూచి దండపాద కరణము లుండదగును. అవియు వామసూచీ

సహాకృతమ్మను భరతవచనమున సూచితము లగుచున్నవి. ఈ రెండును వామాంగముననె యొనర్పదగియున్నవి. అప్పుడు సవ్యహస్తము వక్షమున నుండును. ఇట్లు చెప్పగా చతురకరణము సూచిత మగును. చతురము తరువాత భ్రమరకరణము, త్రికము వలితమగుటచే నిది సూచితము. అనంతరము నూపుర కరణము ఆక్షిప్త కరణము పిమ్మట అర్ధస్వస్తికము, నితంబాది చతుష్టము, అనగా నితంబము కరిహస్తము ఉరోమండలము కటిచ్ఛిన్నము అనునవి పూర్వమువలె ప్రయోజ్యములు, కాగా నిది సంభ్రాంతాంగహార మయినది.

### ౨౩. ఆక్షిప్తరేచితః

వైచిత్ర్యేణ ప్రకుర్వీత యత్ర స్వస్తికరేచితం
ఉరోమండలకం పార్శ్వనికుట్టిత కటీసమే
ఘూర్ణితం భ్రమరం సింహాకర్షం వృశ్చికరేచితం
సన్నతం పృష్ఠదిగ్వక్షఃపూర్వకం స్వస్తికం త్రిధా
నాగాపసర్పితం చేతి కరణాన్యంఘ్రిహస్తయోః
రేచితస్వస్తికావాభ్యామంచితాని త్రయోదశ
ఉత్క్షేపయంత్యథాక్షిప్తమూరూద్వృత్తాద్వినాకృతం
లలాటతిలకం దండపక్షం తలవిలాసితం
విద్యుద్భ్రాంతం గజక్రీడం నిశుంభితనితంబకే
విష్ణుక్రాంతాభిధానోరోమండలాఖ్యే నితంబకం
కరిహస్తం కటిచ్ఛిన్నం యథాశోభం యథారుచి
విదధీత యథాప్రజ్ఞం సోయ మాక్షిప్తరేచితః
రేచితౌ స్వస్తికౌ పాదావిత్యత్ర వదతో మునేః
ఉద్దిష్టం కరణం యద్యద్రేచితం స్వస్తికాంచితం
పునరుత్క్షేపణం చేతి వదతోऽస్య మతాని తు
కరణాని సముత్క్షేపసమాయుక్తాని కాన్యపి

## ౨౩. ఆక్షిప్తరేచితము.

ఈ అంగహారము దీర్ఘము సంకీర్ణము విషయబహులము, పాదములు రేచితము లయినప్పుడు స్వస్తికము లయినప్పుడు విశ్లేషము పొందినప్పుడు మఱల రేచితములు స్వస్తికములయినప్పుడు ఉత్క్షేపణము పొందినప్పుడు కలుగు కరణములన్నియు నిందుండును. అట్లే హస్తములు రేచితములు స్వస్తికములు విశ్లిష్టములు రేచితములు స్వస్తికములు ఉత్క్షిప్తము లయినప్పుడు కలుగు కరణములన్నియు నిందున్నవి. సామాన్యముగా నన్ని కరణము లందును హస్తపాదముల రేచిత స్వస్తిక విధానము లుండును గావున నాయా కరణముల ప్రయోగ యోగ్యతా నిర్ణయమున భావభేద ముండును. కావుననె అభినవగుప్తు డొక విధముగా ప్రయోజ్య కరణ నిర్ణయ మొనరింపగా సంగీతరత్నాకర కారుడు వేరొకవిధమున కరణ పరిగణనము చేసెను. ఇది చూచి అదిచూచి తాను చూచినదిచూచి జాయసేనాపతి వేరొక విధముగా కరణములను నిరూపించెను. అన్నిటిని చూచినవా తన్యవిధమున కరణకరణ మాదేశింప వచ్చును. ఇట్టి యవకాశము నీ యంగహార మిచ్చుచున్నది. ఇట్లనాన్యాన్య భావము లన్యాంగహారము లందునుండునా? తండూపదేశమున నిశ్చితభావుడయిన భరతు డంగహారము లందుండదగిన కరణములను “నామతః కర్మతః” తానే నిర్దేశించెను. భరతదర్శనము గుర్తించిన అభినవు డందుననే “శ్రుతహానాశోగుణః” అనెను. అభినవ దర్శనమున భావితులయినవారి భావములును గలవు. నృత్తదర్శనమున సంభావ్యములగువానిని నిశ్చయించి జాయసేనాపతి యిందు నిబంధించెను.

అభినవదర్శనమున నిర్ణీతములయిన కరణములిం దీ విధముగా నున్నవి.

స్వస్తిక రేచితము—పృష్ఠస్వస్తికము—దిక్స్వస్తికము
కటీసమము—ఘూర్ణితము—భ్రమరము
వృశ్చిక రేచితము—పార్శ్వనికుట్టకము—ఉరోమండలము
సన్నతము—సింహాకర్షితము—నాగాపసర్పితము

ఇంకను వైచిత్ర్య యోగమున నింక కొన్ని కరణములు ఉండదగునని యభినవుడె యనెను.

దండపక్షము—లలాటతిలకము—తలవిలాసితము
నిశుంభితము—విద్యుద్భ్రాంతము—గజక్రీడితము
నితంబము—విష్ణుక్రాంతము—ఊరూద్వృత్తము
ఆక్షిప్తము—ఉరోమండలము—కటిచ్ఛిన్నము

ప్రథమవర్గములో ద్వాదశ కరణము లున్నవి. ద్వితీయవర్గములో ద్వాదశ కరణములున్నవి. ప్రథమ వర్గములో వక్షః స్వస్తికమును కొందరి భావమున నున్నదని అభినవగుప్తుడు సూచించెను.

జాయసేనాపతి సూచనమున నీ కరణములున్నవి.

స్వస్తిక రేచితము—ఉరోమండలము
పార్శ్వనికుట్టితము—కటీసమము
ఘూర్ణితము—భ్రమరము
సింహాకర్షము—వృశ్చిక రేచితము
సన్నతము—పృష్ఠస్వస్తికము
దిక్స్వస్తికము—వక్షఃస్వస్తికము
నాగాపసర్పితము —

ఇట్లిచట ప్రథమవర్గమున త్రయోదశ కరణములను నిరూపించెను. మఱల ఆక్షిప్త రేచిత విధానములు హస్తపాదముల కుండుటను సంభావించి మరికొన్ని కరణములు నుండుట నిరూపించెను.

ఆక్షిప్తము — ఊరూద్వృత్తము
లలాటతిలకము — దండపక్షము
తలవిలాసితము — విద్యుద్భ్రాంతము
గజక్రీడము — నిశుంభితము
నితంబకము — విష్ణుక్రాంతము
ఉరోమండలకము — నితంబకము
కరిహస్తము — కటిచ్ఛిన్నము.

ఈ ద్వితీయవర్గ కరణములు పదునాలుగు కలవు. మొత్తము సప్తవింశతి కరణములీ అంగహారమున గలవు. ఈ కరణముల సన్నివేశమున జాయపతి సంభావితౌచిత్యము నీ విధముగా గుర్తించునది. కరపాదముల రేచిత స్వస్తిక విశేషముల వలనగలుగు వైచిత్ర్యానురోధమున నీ స్వస్తికరేచితతాది కరణములు కలుగును. ఊరూద్వృత్తము లేకుండునట్లుగా కరపాదముల ఆక్షేపము రేచితములతో నుండునట్లు ఆక్షిప్త కరణ మొనరించి లలాటతిలకాదులను కూర్పవలెను. ఈ కరణములన్నియు శోభానుసారమున అభిరుచ్యనుసారమున నృత్తప్రజ్ఞానుసారమున కూర్పవలసి యున్నది. ఇట్టిదిది ఆక్షిప్తరేచితాంగహారమగును.

భరతముని చెప్పాటలో "రేచితౌ స్వస్తికౌ పాదౌ రేచితౌ స్వస్తికౌ కరౌ" అని యున్నది. కావున నేయే కరణము రేచితము స్వస్తికాంచితమునై యుద్దిష్ట మగునో యాయా కరణముల నాయోజింప దగునని కరణముల విషయమున అభ్యనుజ్ఞ సూచించుటచే నీ కరణములు ప్రయోజ్యములుగా నిరూపితము లయినవి. "పునరుత్క్షేపణం చైవ రేచితై రేవ కారయేత్" కరపాదములకు మరల రేచితములతో నుత్క్షేపణ మొనరింపవలెనని భరతుడు సూచించుటచే

సముత్క్షేప సమాయుక్తములగు మరికొన్ని కరణములను గూడ నీ అంగహారమున కూర్పవచ్చునని సూచితమయినది. అందువలన నిందు రెండవ వర్గమునకు సంబంధించిన కరణములును నిరూపితములు.

అభినవభారతిలో అభినవగుప్తుడీవిషయమున నిట్టి భావముల నావిష్కరించెను.

ఏయే కరణమున కరములకు గాని పాదములకు గాని రేచిత స్వస్తిక సాహిత్యము కలదో అదియది యిచట గూడ నభ్యాను జ్ఞానమున సూచించినట్లయినది. కరపాదములకు కరణములలో రేచితస్వస్తికములున్నను మఱల వానిని భరతముని వేరుగా చెప్పుటలో నీ భావమే యున్నది. ఈ అంగహారములో కూర్పదగు కరణములన్నియు రేచిత స్వస్తిక విధానములతోడనే యుండవలయును. వక్షఃస్వస్తికాదులలో కరపాద రేచనము లేనందున దాని నిచట సంగ్రాహ్యముగ ప్రయోజ్యముగ భావించుట లేదు. కొందరంగ పరివర్తన క్రమమున వక్షఃస్వస్తికమున గూడ రేచిత ముండుట నంగీకరించుచు దానిని గూడ నిందు కూర్చుచున్నారు.

హస్త పాదములకు స్వస్తికమును రేచితమును వైచిత్ర్యాను సారమును నాచరింపగా స్వస్తిక రేచితాదికరణములను ఈ యంగ హారమున నిరూపించుట యయినది. మఱల నా విధానముననె అతుంిటిత విధానమున హస్త పాదములకు ఉత్క్షేపణమును సంపాదింప వలసి యున్నది. కావున నేయే కరణమునం దీ యుత్క్షేపణము కలదో యాయా కరణములను భరతుడు సూచించెను. అవి దండపాదాదులు వీనిలో "ఉన్వృత్త" మను నామైక దేశగ్రహణమున ఊరూద్వృత్తము కూడ సూచితమయినది. ఆ కరణము సమాక్షిప్త కరణముల మధ్యలో చేరి యుండుటచే నదియు నిచట గృహీతము [జాయసేనాపతి "ఊరూ

ద్వృత్తాద్యైనాకృతం ] అని యనియు అభినవాదరమున దాని నంగీక రించెను. ఆ ఊరూద్వృత్తమును కర మావర్తింపజేసి యాచరించుట యుక్తము. తుదకు కటిచ్ఛిన్న కరణము కూడ కూర్పవలెను.

ఇట్లీ అంగహార విషయమున విస్తరముగా నింత చెప్పుట యావశ్యక మయినది.

## ౨౪. రేచితః

ధండవృశ్చిక వైశాఖాక్షిప్తార్ధస్వస్తికాదికం
షడ్విధం రేచితం వక్షఃస్వస్తికం గరుడప్లుతం
సర్పితం స్ఖలితోన్మత్తే ప్రసర్పితవివర్తితే
వినివృత్త వివృత్తార్ధమత్తల్లివ్యంసితాన్యథ ౨౫౫
లోలితం వృషభక్రీడం భుజంగాంచితసూపురే
తలసంఘట్టితాభిఖ్యం మయూరలలితాభిధం
రేచితాదినికుట్టాఖ్యం భుజంగత్రస్తరేచితం
ఇత్యేతాని సకృత్కృత్వా కరణాని చతుర్ష్వపి
దిఙ్ముఖేషు యథాశోభం యథాబుద్ధి యథారుచి ౨౬౦
మధ్యే మధ్యే ప్రయుంజానః శోభార్థం చక్రమండలం
ఉరోమండలకం కుర్యాద్యత్ర ప్రథమదిఙ్ముఖే
కటిచ్ఛిన్నాభిధానే చ సోయం రేచిత ఇష్యతే
కుతోయం మునినానుక్తప్రపంచ ఇతి చేచ్ఛృణు
రేచితం కరణం కుర్యాదితి యన్మునిరబ్రవీత్ ౨౬౫
క్వచిద్రేచితసంజ్ఞం తత్ కరణం నహి దృశ్యతే
అతస్తత్కరణం వాచ్యం యద్యద్రేచితహస్తవత్
యదత్రాక్షిప్తవైశాఖపూర్వకే రేచితే పునః
ఆహ కీర్తిధరాచార్యస్తద్భవేన్నాతిపేశలం
కరణైః పంచవింశత్యా రచితో రేచితోభిధః ౨౭౦
విచిత్రభేదసంకీర్ణో యతోఽన్యత్ర విశేష్యతే.

## ౨౪. రే చి త ము.

ఈ రేచితాంగహారమున ప్రధానముగా నిరువదియెనిమిది కరణములు కలవు. ఇవి వాని నామములు.

స్వస్తిక రేచిత—అర్ధ రేచిత—వక్షఃస్వస్తిక
ఉన్మత్త—ఆక్షిప్త రేచిత—అర్ధమత్తల్లి
రేచకనికుట్టక—భుజంగత్రస్త రేచిత—నూపుర
వైశాఖ రేచిత—భుజంగాంచిత - దండ రేచిత
వృశ్చిక రేచిత—వ్యంసిత—వివృత్త
వినివృత్త—వివర్తితక—గరుడప్లుత
మయూరలలిత—సర్పితక—స్ఖలిత
పరిసర్పితక—తలసంఘట్టిత—వృషభక్రీడిత
లోలిత—చక్రమండల—ఉరోమండల
కటిచ్ఛిన్నములు—

ఈ ఇరువదియెనిమిది కరణములలో తుదకు చెప్పిన ఉరోమండల కటిచ్ఛిన్నములు సర్వాంగహార సాధారణముగా సంప్రాప్తములయిన కరణములు. చక్రమండల కరణమనునది మధ్యేమధ్యే శోభార్థమై ప్రయోగింపదగినది. రేచితా స్వభావ సమాజముగా జెప్పదగిన కరణము నిరువదియైదు. ఏయే కరణములలో రేచితమున్నదో ఆయా కరణముల నన్నిటి నీ యంగహారమున ప్రయోగింప వలెనన్న నియమానుసారముగా నభినవగుప్తు డీ విధముగా కరణముల క్రమమును అభినవభారతిలో నిర్దేశించెను.

సర్వాధారమున రేచితాంగహారమున నుండదగు కరణముల నభినవగుప్తుడు నిరూపించిన విధముననె జాయసేనాపతి నిరూపిం

చెను. కాని అభినవ క్రమము వేరు. జాయన క్రమము వేరు ఇతరాంగహారములలో నంతట భరతాభినవామోదముతో నున్న కరణ క్రమమునె జాయన స్వీకరించి నిరూపించెను. ఈ రేచితాంగహారమున భరతు డుండదగు కరణముల నామముల నుల్లేఖించలేదు. నాట్యవిదు లభ్యూహింపదగునని యట్టి యభ్యూహమునకు వలసిన సూచనము లిచ్చెను. ఆ సూచ నానుసారమున అభినవు డభ్యూహించి కరణములకు నియతక్రమమును నిరూపించెను. జాయన నియతకరణములను స్వీకరించెనే గాని కరణముల క్రమమును స్వీకరింపలేదు. జాయనయు ప్రయోక్త కావున ప్రయోగములో తాననుసరించిన కరణక్రమము శోభాసంపాదకముగ నుండుటను గుర్తించి యుండును. భరతుడు ఈ అంగహారములో తుదకుండదగు కరణములను వాచా చెప్పెను గావున జాయన ఉరోమండల కటిచ్ఛిన్నములను క్రమమున జెప్పెను. జాయన ఈ అంగహారమున నుండదగిన కరణముల క్రమము నీ విధముగా నిరూపించెను. అన్యులన్యక్రమము ననుసంధానించుకొనుటను జాయన అంగీకరింప గలడు. అభినవుడు అంగీకరింపడని నా భావము. జాయన సూచించిన కరణము లిట్లున్నవి.

దండరేచిత- వృశ్చికరేచిత—వైశాఖరేచిత
ఆక్షిప్తరేచిత—అర్ధరేచిత—స్వస్తికరేచిత
వక్షఃస్వస్తిక—గరుడప్లుత—సర్పితక
స్ఖలిత—ఉన్మత్త—ప్రసర్పితక
వివర్తితక—వినివృత్త—వివృత్త
అర్ధమత్తల్లి—వ్యంసిత_లోలితము
వృషభక్రీడిత—భుజంగాంచిత—నూపుర
తలసంఘట్టిత—మయూరలలిత—రేచకనికుట్టక

భుజంగత్రస్తరేచిత–చక్రమండల–ఉరోమండల
కటిచ్ఛిన్నములు.

అభినవు డంగీకరించి నిరూపించిన విధమున నివియు నిరువది యైనకలవు. శోభార్థమై చక్రమండల మున్నది. తుదకాయోజిత ములు కావలయు ఉరోమండల కటిచ్ఛిన్నము లున్నవి. మొత్తము వానివలె నివియు నిరువదియెనిమిది యయినవి. రేచితపదఘటితము లయిన కరణములను జాయన ముందుగా కూర్చుటలో ప్రయోగించు టలో నౌచిత్యము భావించియుండును.

ఈ యంగహార స్వరూప రచనములో జాయన యిట్లు నిరూపించెను. ఈ యంగహారము నందు దండరేచితాది భుజంగత్రస్త రేచితము వఱకు గల పంచవింశతి కరణములను ఒకపర్యాయము ప్రయోగించునది. నాలుగు దిఙ్ముఖములందును యథాశోభము యథా బుద్ధి యథారుచి ప్రయోగించునది. శోభాసంపాదనమునకై కరణము నకు కరణమునకు మధ్యలో చక్రమండల కరణమును ప్రయోగింప వలెను. చక్రమండలకరణ కరణము విశిష్టశోభను సంపాదింపగలదు. కటిచ్ఛిన్న కరణాచరణ యోగ్యమయిన పరిధిమ దిఙ్ముఖమున ఉరో మండలకరణము కూర్పవలెను. ఇట్లిది రేచితాంగహార మగును.

భరతుడు రేచితాంగహార నిరూపణమున విస్తృతముగా ప్రతిపాదన మొనరింపలేదు. ఇతరాంగహారములకంటె నిందె కరణ ములధికముగా నున్నవి. దీనిని భరతుడు విస్తరముగా జెప్పవలసినదె. కాని దీనిప్రపంచిత మొనరింపలేదు. ఇందు హేతువేమి?

ఇది వినవలయు. హేతువు "రేచితం కరణకుర్యాత్" అని ముని యనెను. రేచిత మను కరణ మాచరింపవలయునని తదర్థము. నూటయెనిమిది కరణములను భరతుడె నిరూపించెను. వానిలో రేచిత

మను పేరు కల కరణములేదు. కావున తదర్థము నీ విధముగా భావింపవలసి యున్నది. ఏయే కరణమున రేచితహస్తము కలదో ఆయా కరణ మిచట రేచిత కరణ పదమున గ్రహింప వలసి యున్నది. అట్లు రేచిత హస్తములు కల కరణములు ఇరువదియయి దున్నవి. వానినిచట ఈ అంగహారాంగములుగా నిరూపించితిమి. ఇట్లి యభినవు డనెను.

కీర్తిధరాచార్యుడు ఇచటి రేచిత పదమున ఆక్షిప్త రేచితము వైశాఖ రేచితము సంగ్రాహ్య మని భావించెను. అది సుందరముగా లేదు. హస్త రేచితములు కల కరణము లనేకము లుండగా నా రెండిటిని మాత్రము గ్రహించుటలో నౌచిత్యము లేదు.

ఇ ట్లిరువదియయిదు కరణముల సంకలనమున రేచితాంగ హార ముండుట నిరూపిత మయినది. ఈ కరణము నానా విధములగు భేదములతో గూడి కొని యిట్లురమ్యముగా నున్నది. అందువలననె అంగహారములలో నిది విశేష విశిష్టమని భావింప దగియున్నది. దీని విచిత్రతావిశేషమును తదభిజ్ఞులు కీర్తించిరి. భరత నిరూపణము ననే దీని విశిష్టత స్పష్టమగుచున్నది.

ఈ అంగహార విషయమున అభినవగుప్తుని భావసారము నిట్లు గుర్తించుట యుక్తము.

హస్తమున రేచిత మొనర్చి పార్శ్వమునకు దెచ్చి రేచిత మొనర్పవలెను. మఱల నదే విధమున గాత్రము నమన మొనరించి రేచిత మొనర్పవలెను. రేచిత కరణ మొనర్పవలెను. ఉరోమండలము కటిచ్ఛిన్న మాచరింపవలెను. ఇది యంతయు రేచిత మను నంగహారమున నుండదగును అనుట భరతుని మూలము. ఇందు

౧. హస్తము రేచిత మొనరించుట
౨. పార్శ్వమును వంచి రేచిత మొనర్చుట
౩. మఱల నట్లె వంచి గాత్రము రేచిత చేయుట
౪. రేచితమను కరణ మొనరించుట

అను నాలు గంశములు ప్రధానముగా నున్నవి. వీని విషయమున నభినవభారతి యిట్లనుచున్నది. ఈ శ్లోకముచే హస్త రేచనము కల సర్వకరణములు సంగృహీతము లగుచున్నవి "రేచితం కరణం" అను నుపసంహారము ఈ భావమునకు తగి యున్నది. "రేచిత" అను ఏక వచనమును జాత్యేకవచనముగా గ్రహింపదగును. భరతు డిచట చెప్పిన రేచిత మను కరణ మేమి కలదు? అయినను భరతుడు చెప్పెను. ఇట్లు చెప్పుటలో నొక విశిష్ట భావమున్నది. సర్వకరణ ములు శ్లిష్టములగుటచే స్వబుద్ధి విశేషమున వాని నాలోచించి చిత్త ముగా యోజన మొనరించుట యుక్తము. కావుననె యీయంగ హారము విచిత్రభేద సంకీర్ణము. ఇట్టిది విచిత్ర మగుట నితరులు నిట్లు కీర్తించిరి.

"పంచవింశతివిచిత్రమాతృకా
ప్రక్రమేణ వివిధం వ్యరీరచత్
రేచితాంగహారణం మహేశ్వరో
గేయమార్గమివ సప్తభిః స్వరైః

సప్తస్వరములచే గేయమార్గమును వలె మహేశ్వరుడు పంచవింశతి విచిత్రమాతృకాప్రక్రమమున రేచితాంగహారమును వివిధముగా రచించెను. ఈ అంగహారమున పంచవింశతి కరణములను వైచిత్ర్యయోగమున ప్రయోగింపవలెను. నాలుగు దిశలందును పంచవింశతి సమాప్తమగువఱకు ప్రయోగింపదగును. మధ్యమధ్యలో

వై చిత్ర్యోత్పాదనమునకై చక్రమండలమును ప్రయోగింపవలెను. ఇట్లిందలి కరణ పరంపర చక్రమండల కరణమున వ్యవహితమగును. విచిత్రమగును. సుందరమగును. ఈ అంగహారము విచిత్రముగా సంభావిత మయినందున నింతగా వ్రాయవలసి వచ్చినది. ఆస్తాం.

౨౫. విష్కంభాపసృతః

నికుట్టకార్ధనికుట్టాఖ్యే పశ్చాదంగద్వయేన తు
భుజంగత్రాసితాభిఖ్యభుజంగత్రస్తరేచితే
తత ఆక్షిప్తకం కుర్యాదురోమండలసంజ్ఞికం
కటిచ్ఛిన్నమిహ త్వంగపర్యాయేణ లతాకరౌ ౨౨౫
యస్మిన్నేష సమాఖ్యాతో విష్కంభాపసృతాభిధః

౨౫. విష్కంభాపసృతము.

దీనిలో నీ కరణము లున్నవి నికుట్టకము, అర్ధనికుట్టకము, భుజంగత్రాసితము, భుజంగత్రస్త రేచితము, ఆక్షిప్తకము, ఉరో మండలము, కటిచ్ఛిన్నము నసి. ఇట్లు కరణసప్తకము విష్కంభాపసృ తాంగహార స్వరూపము. నికుట్టక మర్ధనికుట్టక మను రెండు కరణ ములను భరతుడు కుట్టిత శబ్దముననె సాధారణ్యమున గ్రహించెను. ప్రథమమున నికుట్టకము ప్రయోగించి యనంతర మర్ధనికుట్టకము ప్రయోగింపవలెను. పిమ్మట భుజంగత్రాసితము భుజంగత్రస్త రేచి తము ప్రయోగింప దగును. ఈ రెండును అంగపర్యాయమున ప్రయోగ యోగ్యములని జాయన సూచనము. భుజంగ త్రస్తరేచిత కరణము మాత్రమె అంగపర్యాయమున ప్రయోగ యోగ్యమని అభినవభారతి యనెను. "రేచితేనతుహస్తేన పతాకం హస్తమాది శేత్" అని భరతవాక్యము. రేచితమగు హస్తమున పతాకహస్త మును నిర్దేశింప వలెనని భావము. దీనిలో రేచిత హస్తపదమున భుజంగత్రస్తరేచితము సూచితమయినదని పతాకాగ్రహణమున నీ

కరణమునకె అంగపర్యాయమున ప్రయోగముండునని అభినవభావమై యుండును. భుజంగ త్రాసిత కరణమునకు భుజంగ త్రస్తరేచిత కరణమునకు సన్నిహిత సంబంధమున్నందున జాయన రెండు నంగపర్యాయ ప్రయోగయోగ్యము లని భావించుటయు యుక్తము. అనంతరము పూర్వాంగహారములలోవలె ఆక్షిప్తకాదిత్రయ ముండును. తుదినున్న కటిచ్ఛిన్న కరణమున మాత్రము లతాహస్తమొక్కటి పర్యాయమున ప్రయోగము పొందును. "పర్యాయేణ ఏకోలతాహస్తః" అని అభినవుడు. జాయన రెండు లతాహస్తములు పర్యాయమున ప్రయోజ్యము లని భావించెను. ఇట్లిది విష్కంభాపసృతాంగహార మగును.

## ౨౭. అ లా త:

విధాయ స్వస్తికం యత్ర వ్యంసితం ద్విః సమాచరేత్
అనంతరమలాతాఖ్యమూర్ధ్వజాను నికుంచితం
అర్ధసూచివిక్షిప్తముద్వృత్తాక్షిప్తకే తతః
కరిహస్తం కటిచ్ఛిన్నమలాతోఽసౌ నిగద్యతే. ౩౮౦

## ౨౭. అ లా త ము.

దీనిలో నీ కరణము లున్నవి. స్వస్తిక కరణము వ్యంసితము మరల, వ్యంసితము అలాతకము ఊర్ధ్వ జానువు నికుంచితము అర్ధ సూచి విక్షిప్తము, ఇట్లివి పండ్రెండు కరణములు. మొదట స్వస్తిక మాచరించి వ్యంసిత కరణములు రెండు ప్రయోగింపవలసి యున్నది. గావున వాని మధ్యలో స్వస్తికమును కూర్చవలెనని అభినవుని నిర్దేశము. దీనితో కరణ త్రయోదశక మిందు ప్రయోజ్య మగును.

స్వస్తిక కరణ మాచరించి "వ్యంసితౌచకరౌపునః" అని భరతుడనిన విధమున రెండు వ్యంసితము లాచరింప వలెను. అచటి ద్వివచన మిందు నిదానము. పునఃశబ్దమును నిదానము. స్వస్తిక వ్యవధానమున వ్యంసితమునకు ద్విఃప్రయోగము చెప్పినట్లయినది. ఇక

వరుసగా అలాతకము ఊర్ధ్వజానువు నికుంచితము అర్ధసూచి విక్షిప్తము ప్రయోజ్యములు ఆక్షిప్త పాద మాక్షిప్త హస్త మాక్షిప్తగాత్రము కల ఉద్వృత్త కరణము కటిహస్తము కటిచ్ఛిన్నము నుండగా నిది అలాతకాంగహార మయినది.

౨౭. ఉద్వృత్తః

నూపురాఖ్యమథాంగాఖ్యం భుజంగాంచితకం తతః
గృధ్రావలీనకం పశ్చాద్విక్షిప్తోద్వృత్తయోర్ద్వయం
ఏకేనాంగేన కృత్వైతత్పరేణాపి సమాచరేత్
సూచినామ నితంబాఖ్య లతావృశ్చికసంజ్ఞితం
కటిచ్ఛిన్నాభిధానం చ యత్రోక్తస్స ఉచ్యతే. ౭౮

౨౭. ఉద్వృత్తము.

ఇందీ కరణము లున్నవి. నూపుర పాదము భుజంగాంచితకము గృధ్రావలీనకము విక్షిప్తము ఉద్వృత్తము సూచీపాదము నితంబము లతావృశ్చికము కటిచ్ఛిన్నము నని తొమ్మిది కరణములు. వీని యోజనములో కొంత విశేషము కలదు. ప్రథమమున నూపుర పాదమాచరింప వలెను. సవ్యవామహస్తములు ప్రలంబితములుగా నుండవలె నని భరత వచన మున్నది. సవ్యవామగ్రహణమున పర్యాయశః ప్రయోగింపవలె నని హస్తములన్న ద్వివచనమున యౌగపద్య మావశ్యక మని సూచిత మగును. కావున భుజంగత్రాసితము భుజంగాంచితము గృధ్రావలీనకములు నుండదగునని సూచితము. జాయపతి భుజంగత్రాసిత ముండుట చెప్పలేదు. అభినవుడు చెప్పెను. అనంతరము విక్షిప్తము ఉద్వృత్తము ప్రయోజ్యము కావలెను. ఈ విక్షిప్తమును ఒక యంగమున నాచరించి యితరాంగమున గూడ నాచరించునది. ఇట్లంగములచే పర్యాయక్రమమున నాచరించుటచే

రయోగవిక్షేపముండును. కావున తదనుసంధానమునకై యుద్వృత్తము నాచరించునది. పిమ్మట త్రికపరివర్తనమున బద్ధచారీవిధానమున సూచికరణము నితంబకరణము నాచరణీయము. తుదకు లతావృశ్చికము కటిచ్ఛిన్నము కూర్చునది. అప్పుడది ఉద్వృత్తాంగహారము.

౨౮. అర్ధనికుట్టకః

నూపురాఖ్యవివృత్తాఖ్యే నికుట్టార్ధనికుట్టకే
రేచకాది నికుట్టాఖ్యం పార్శ్వపూర్వనికుట్టకం
అర్ధరేచితకాభిఖ్యం పశ్చాద్వృశ్చికకుట్టితం
అతః పరమురఃపూర్వం మండలం కరిహస్తకం
కటిచ్ఛిన్నం చ యత్ర స్యాదయ మర్ధనికుట్టకః ౭౯౦

౨౮. అర్ధనికుట్టకము.

దీనిలో నూపుర పాదము వివృత్తము నికుట్టకము అర్ధనికుట్టక కరణము, రేచకనికుట్టితము, పార్శ్వ నికుట్టకము, అర్ధరేచితకము, వృశ్చికకుట్టితము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నము అను పదునొకండు కరణము లుండును. ప్రథమముగా త్రికవలనము కల నూపురపాద మొనరింపవలెను. పిమ్మట ద్రుతాక్షేపమును పాదానుగహస్తమును త్రికపరివర్తనమును భరతుడు సూచించినందున దానిచే సూచితమగు వివృత కరణ మొనరింపవలెను. హస్తపాదాక్షేపము త్రికవివర్తనము హస్తరేచనము వివృతము నందున్నది. అనంతరము కరపాద నికుట్టనమును భరతుడు సూచించెను. కావున కరపాద నికుట్టితము కల కరణములను గ్రహింపవలె నని అభినవభారతి చెప్పినది. తదనుసారమున నికుట్టకార్ధ నికుట్టక రేచక కుట్టితపాద నికుట్టకార్ధ రేచిత వృశ్చికకుట్టితములు గ్రాహ్యములు ప్రయోజ్యములు నగును. అనంతరము పూర్వమువలె ఉరోమండలాది త్రికముండును. ఇట్టిదిది

అర్ధనికుట్టి తాంగహారము. ఈ అంగహారము భరత వేదమున చివరి అంగహారముగా నిరూపిత మయినది.

### ౨౯. ఉద్ఘట్టితః

కృత్వా నికుట్టకం యస్మిన్ ఉరోమండలమాచరేత్
నితంబకరిహస్తాఖ్యకటిచ్ఛిన్నాని చ క్రమాత్
తముద్ఘట్టితనామానమంగహారం ప్రచక్షతే

### ౨౯. ఉద్ఘట్టితము.

దీనిలో నికుట్టకము ఉరోమండలము నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము నను నయిదు కరణములు కలవు. ప్రథమమున నికుట్టక కరణము ప్రయోగింప వలెను. ఈ కరణమును భరతుడు కరము పాదము ఉద్వేష్టితాపవిద్ధముగా నుండుటగా నీ లక్షణమున సూచించి నందున, అదే విధమున వామపార్శ్వమున గూడ నికుట్టకము కూడి యుండవలయు ననుటచే నీ నికుట్టకమును పర్యాయశః అంగద్వయ మున ప్రయోగింప వలసి యున్న దని అభినవుడు సూచించెను. అది భావగ్రాహ్య మని జాయపతి చెప్పలేదు. పిమ్మట పూర్వాంగహార ములలో వలె ఉరోమండలాదు లుండుట ఆవశ్యకము, సభ్యసముచిత మును. ఇట్టిదిది ఉద్ఘట్టి తాంగహార మగును.

### ౩౦. వృశ్చికాపసృతః

లతావృశ్చికమాధాయ విదధీత నికుంచితం
మత్తల్యథ నితంబాఖ్యం కరిహస్తమతః పరం ౨౯॥
కటిచ్ఛిన్నం చ యత్రాయం వృశ్చికాపసృత స్మృతః
నితంబమపహాయాత్ర వదంతి భ్రమరం పరే.

### ౩౦. వృశ్చికాపసృతము.

దీనిలో లతావృశ్చికము నికుంచితము మత్తల్లి నితంబము కరిహస్తము కటిచ్ఛిన్నము అను కరణషట్క ముండును. ఈ అంగ

హారమున నుండదగిన కరణములను భరతుడు క్రియాద్వారమున సూచించెను. వాని నభినవుడు వివరించెను. జాయసేనాపతి నిరూపించెను.

"వృశ్చికం చరణం కృత్వా లతాఖ్యం హస్తమేవ చ
తమేవ చ కరం భూయో నాసాగ్రే సన్నికుంచయేత్
తమేవోద్వేష్టితం కృత్వా నితంబం పరివర్తయేత్"

అని భరతవేదములోని రీతి వృశ్చిక చరణము లతాహస్తము లతా వృశ్చిక కరణమున నుండు గావున నది యిచట ప్రథమ ప్రయోజ్యము ఆహస్తము నాసాగ్రమున నున్న నికుంచితకరణము ప్రయోజ్యము. అది యుద్వేష్టిత మగుట మత్తల్లి కరణమున నుండుటచే నది ప్రయోజ్య మగును. ఇటుపై నితంబ కరిహస్త కటిచ్ఛిన్నములు పూర్వమువలె యోజనీయములు. కొందరు నితంబమును విడనాడి యిచట భ్రమర కరణముండుటను చెప్పిరి. ఇట్టిదిది వృశ్చికాపసృతాంగహారము.

## ౩౧. స్వస్తికరేచితః

యత్ర కుర్వీత వైశాఖరేచితాభిఖ్యవృశ్చికే
స్యాదర్ధనికుట్టాఖ్యకర్మ పర్యాయశః కృతః
కటిచ్ఛిన్నం లతాహస్తయుతం స్వస్తికరేచితే ౮౦౦

## ౩౧. స్వస్తికరేచితము.

ఈ అంగహారములో వైశాఖరేచితము వృశ్చికరేచితము మఱల వైశాఖరేచితము వృశ్చికరేచితము, అర్ధనికుట్టకము, కటిచ్ఛిన్నము నని ఆరు కరణము లున్నవి. మొదట హస్తపాద రేచనము కల వైశాఖరేచితము ప్రయోజ్యము. పిమ్మట వృశ్చికరేచితము. "పునస్తేనైవ యోగేన" అని భరత వచనముండుటచే వైశాఖరేచిత వృశ్చిక రేచితములను మఱల నాచరించుట యుక్తము. అనంతరము నికుట్టక కరణమును సవ్యాపసవ్య విధానమున పర్యాయశః

ఆచరింపవలెను. అనంతరము వామదక్షిణ కృతములైన లతాహస్తములు నృత్తహస్తములు ప్రయోజ్యములు. తుదకు కటిచ్ఛిన్న ముండును. ఇట్లిది స్వస్తిక రేచితాంగహార మయినది.

### ౩౨. పరివృత్తకరేచితః

కృత్వా యత్ర నితంబాఖ్యం తతః స్వస్తికరేచితం
విక్షిప్తాక్షిప్తకాభిఖ్యం లతావృశ్చికసంజ్ఞకం
ఉన్మత్తకరిహస్తాఖ్యే భుజంగత్రాసితాభిధం
ఆక్షిప్తకం నితంబం చేత్యేనాని పరివృత్త్య చ
భ్రమరేణ చ కుర్వీత పరాఙ్ముఖతయా స్థితః ౧౦౫
తథా పార్శ్వముఖః కుర్యాత్పార్శ్వాంతరముఖస్తథా
కరిహస్తకటిచ్ఛిన్నే తతః ప్రథమదిఙ్ముఖః
అంగహారా మయాఖ్యాతాః పరివృత్తకరేచితే

### ౩౨. పరివృత్తకరేచితము.

దీనిలో పదునొకండు కరణము లున్నవి. నితంబము స్వస్తికరేచితము. విక్షిప్తాక్షిప్తకము, లతావృశ్చికము, ఉన్మత్తము, కరిహస్తము, భుజంగత్రాసితము ఆక్షిప్తకము నితంబము, కరిహస్తము కటిచ్ఛిన్నము నని, వీని యోజనమున విశేషము కలదు. కరములను శిరముపై నుంచుట కల నితంబ కరణమును ప్రథమముగా ప్రయోగింప వలెను. కరములు స్వస్తిక విచ్యుతము లగుట కల స్వస్తిక రేచితము. రెండవది సవ్యహస్తమును గాత్రమును నమన మొనరించి రేచిత మొనరించుట. కల విక్షిప్తాక్షిప్త కరణము మూడవది. లతా హస్తముల నొనరించుట కల లతావృశ్చికము నాల్గవది. వక్షః స్థిత హస్తము రేచితమగుట కల ఉన్మత్త కరణ మయిదవది. అనంతర మారవది కరిహస్తము. ఏడవది భుజంగత్రాసితము. ఆక్షిప్తకరణ మెనిమిదవది. నితంబకరణము తొమ్మిదవది. ఇట్లే కరణములను

పరివర్తనమున పరాఙ్ముఖముగా నుండి భ్రమర విధానమున నాచరింప వలెను. వీనిని పార్శ్వముఖముగా నాచరింప వలెను. పార్శ్వాంతర ముఖముగా నాచరింప వలెను. అనంతరము కరి హస్త కటిచ్ఛిన్న ములను ప్రథమ దిఙ్ముఖముగా నుండి యాచరింప వలెను. అంగ హారము లన్నిటి యందును కరిహస్త కటిచ్ఛిన్నములను చివరి రెండు కరణములు కాక మిగిలిన కరణముల నన్నిటిని వర్తన మొనరింప దగును. వాని నన్నిటిని చతుర్దిఙ్ముఖము లందు ప్రయోగించి చివరి కరణద్వయమును. సమ్ముఖముగా నుండి ప్రయోగింప వలెను. ఇట్లీ విధముగా పరివృత్తక రేచితము నిరూపిత మయినది. ఇది యిట్లు నిరూపితము కాగా నిప్పటి కీ ద్వాత్రింశ దంగహారములు నిరూపితము లయినట్లు భావింప వలయును. సర్వాంగహారములను నే నిట్లు నిరూ పించితిని. భరతభావానుసారమున అభినవగుప్త భావానుసారమున వీని నిట్లు విశదముగా నిరూపించితినని భావము. భరతుడు సంకీర్ణ ముగా జెప్పగా నే నసంకీర్ణమునా తాలమాన రీతి ననుసరించి చెప్పితి నని, నా మైక దేశమున నున్న వానిని విశదముగా నిరూపించితి నని తాత్పర్యము.

అ ం గ హా రా ణా మ న ం త తా.

క్రమవ్యుత్క్రమతో యోగాత్ కరణైరితరేతరం
ఏతేషామంగహారాణామస్తు నూనమనంతతా ౮౧౦
తథాపి జనితానేతాన్కరణైర్మిత్రసంధిభిః
పశ్యన్ దృష్టఫలాధిక్యమూచే పరిమితాన్మునిః

ఇప్పటికి ముప్పదిరెం డంగహారములు నిరూపితము లయినవి. ఇవియిన్ని అనికాదు. ఇవియెన్నికాని కావచ్చును. వాని సంఖ్యానము శక్యముకాదు. అంగహారములలో కొన్నికరణములు వరుసగా నిరూపితము లయినవి. అట్టి క్రమయోగమున గలుగు

నంగహారములు కొన్ని యిచట నిరూపితము లయినవి. వీనిని వ్యుత్క్రమమున కూడ కూర్పవచ్చును. అప్పుడు మరికొన్ని అంగహారములు కలుగును. కరణముల పరస్పర సంబంధమున నంగహారము లనంతము లగును. పరస్పరము సంగతము లయిన సంధానము కల కరణములచే నుత్పన్నము లయిన అంగహారములను ముని ముప్పది రెండని పరిమితముగా జెప్పెను. కరణమునకు కరణమునకు తగిన సముచిత సంబంధమును భావించి అట్టి మిత్రసంధికల సంధిమిత్రతకల కరణములనె చెప్పి అవికల అంగహారములనే ముని చెప్పగా నివి ముప్పది రెండయినవి. ఇంకనివి దృష్టఫలము లయిన అంగహారములు. అదృష్టఫలములయిన అంగహారము లెన్నియో కలవు. ఈ నిరూపించిన అంగహారములు దృష్టఫలములు అధికముగాను పరంజనాత్మకములు అని యనుటయు కాని ముప్పది రెండనుట పరిగణనము కాదు. వీని యందు దృష్టఫల మధికముగా నుండుట భావించి భరతముని వీనిని మాత్రమె చెప్పెను.

### కరణసంఖ్యయా అంగహారనియమః

విష్కంభాపసృతోన్మత్తస్ఖలితాహ్వోఽపసర్పితః
మదాద్విలసితాహ్వాశ్చ సప్తభిః కరణైర్మతాః
సూచీవిద్ధాఖ్యవిష్కంభపరిచ్ఛిన్నాపరాజితాః ౪ ౧౯
ఉద్వృత్తసహితాశ్చైతే నవభిః పరికీర్తితాః
కరణైస్తు చతుస్సంఖ్యైర్భవేత్స్వస్తికరేచితః
విద్యుద్భ్రాంతపరావృత్తవృశ్చికాశ్చాపసృతాభిధాః
షట్సంఖ్యైః పంచవింశత్యా భవేదాక్షిప్తరేచితః
వైశాఖరేచితాలాతపరివృత్తకరేచితాః ౪ ౨౦
అర్ధపూర్వనికుట్టశ్చస్యురేకాదశభిః పునః
ఉద్ఘట్టితాపవిద్ధాఖ్యౌ పంచభిః పరికీర్తితౌ

స్థిరహస్తాఖ్యపర్యస్తమత్తాక్రీడాభిధాస్త్రయః
భవంతి దశభిస్త్వష్టావింశత్యా రేచితః స్మృతః
సంభ్రాంతః పంచదశభిః శేషాస్త్వష్టాభిరీరితాః ౮౨౯
కరణద్వితయావృత్త్యా షడ్భిః స్వస్తికరేచితః
ద్వయోరావృత్తితః సప్తవింశత్యాక్షిప్తరేచితః
మత్తాక్రీడేఽధికం చైకం భ్రమరాభ్యాసతో మతం
వ్యంసితార్ధద్వయాభ్యాసాన్నవభిశ్చాపసర్పితః
ద్వయోరభ్యాసతః పార్శ్వస్వస్తికో దశభిః స్మృతః ౮౩౦
ప్రయోదశభిరుద్వృత్తే ద్వయావృత్త్యాధికం ద్వయం
ద్వితయాభ్యాసతోఽష్టాభిద్విద్యుద్భ్రాంతాభిధో భవేత్
వ్యంసితావృత్తకం త్వేకమధికం స్యాదలాతకే

### అంగహారనియమము.

ఆయా అంగహారముల స్వరూప నిరూపణములో నేయే కరణము లుండునో యిదివరలో నాయా స్థలములలో స్పష్టముగనె ప్రతిపాదిత మయినది. అంగహారములలో నన్నిట కరణము లేకవిధమున నుండవు. నియత సంఖ్యతో నుండవు. ఏయేఅంగహారమున నెన్ని యెన్ని కరణము లుండునో యీ ప్రఘట్టమున విశదమగును. ఎన్ని కరణము లుండు నదియు నంగహార వ్యాఖ్యారంభమున సూచిత మయినది. లక్షణకారుడు నిరూపించిన కరణముల లెక్కింపగా కరణసంఖ్య నిశ్చితముగా తెలియును. అయినను ఉక్తార్థసంగ్రహముగా నిచట కరణ నియమము సూచితమగును. నిరూపితములలో కతిపయాంశములను పృథక్కరించి చూపుటయు నిచటి భావము.

౧. ఈ అంగహారములలో సప్తకరణము లుండుట సమ్మతము.

విష్కంభము—అపసృతము—ఉన్మత్తము
స్ఖలితము—అపసర్పితము—మదవిలసితము

౨. ఈ అంగహారములలో తొమ్మిది కరణము లుండుట పరికీర్తిత మయినది.

సూచీవిద్ధము—విష్కంభము—పరిచ్ఛిన్నము
అపరాజితము—ఉద్వృత్తము.

3 ఈ అంగహారములో నాలుగు కరణము లుండుట సమ్మతము.

స్వస్తిక రేచితము

౪. ఈ అంగహారములలో నాలుగు కరణము లుండుట అభీష్టము.

విద్యుద్భ్రాంతము—పరావృత్తము వృశ్చికము—అపసృత

౫. ఈ అంగహారములో ఇరువదఐదు కరణములుండుట అభీష్టము.

ఆక్షిప్త రేచితము

౬. ఈ అంగహారములలో పదునొకండు కరణము లుండును.

వైశాఖ రేచితము—అలాతము—పరివృత్తక రేచితము
అర్ధ నికుట్టము.

౭. ఈ అంగహారములలో ఐదు కరణము లుండును.

ఉద్ఘట్టితము—అపవిద్ధము.

౮. ఈ అంగహారములలో పది కరణము లుండును.

ఉస్థిరహస్తము—పర్యస్తము—మత్తాక్రీడము

౯. ఈ అంగహారములో ఇరువదిఎనిమిది కరణము లుండును.

రేచితము.

౧౦. ఈ అంగహారములో పదునైదు కరణము లుండును.

సంభ్రాంతము.

౧౧. ఈ అంగహారములలో ఎనిమిది కరణము లుండును.

స్వస్తిక రేచితాంగహారమునందు రెండు కరణముల నావర్తింప చేయగా స్వరూప మేర్పడును. మొదటి నాల్గుకరణములు కూడి ఇం దారు కరణ ము లయినవి. ఆక్షిప్త రేచితమున రెండు కరణములు ఆవృత్తి పొందగా ౧౦+౨=౧౨ కరణము లయినవి. మత్తాక్రీడ మను అంగహారమున భ్రమరకరణ మావృత్తము కాగా నొకటి యధికమై ౧౧ కరణము లయినవి. అపసర్పిత మను నంగ హారము వ్యంసిత కరణా వృత్తి వలన ౯ కరణములు కలదగును. పార్శ్వస్వస్తిక కరణముస రెండు కరణము లావృత్తము లగును. అందు పది కరణము లుండును. విద్యుద్భ్రాంతమున రెండు కరణము లావృత్తము లగును. అలాత కాంగహారమున వ్యంసిత కరణ మావృత్తము కాగా నొకటి యధిక మగును. ఆయా అంగహారము లందలి కరణముల సంఖ్యానించి చెప్పుట వానివాని విశిష్టతానూచకము.

మా న తా లా ది వి శే షాః

ద్విగుణై ర్ద్విగుణై స్తద్వజ్జారారభ్య కరణాష్టకాత్
చతురశ్రప్రమాణాః స్యురంగహారాః ప్రకీర్తితాః ౮౩౫
షట్కాదారభ్య కథితాః త్ర్యశ్రమానా స్తథాలిధ్దైః
న్యూనత్వం దృశ్యతే యత్ర ప్రోక్తసంఖ్యాసు కుత్రచిత్
కుర్వీత పూరణం తస్య క్రియాభ్యాసేన కుత్రచిత్
ఆధిక్యం దృశ్యతే యత్ర ప్రోక్తసంఖ్యాతిలంఘనాత్
తత్ర తాలకలాయత్యా సంధానాత్సమతాం నయేత్ ౮౪౦

మా న తా లా ది వి శే ష ము లు.

ఎనిమిది కరణములు కల అంగహారములు, అంతకన్న నధికముగా కరణములు కల అంగహారములు కొన్నికలవు. కొన్ని కరణములను ద్విగుణమొనరింపగా నట్టి అంగహారములు కలుగును.

కరణాష్టకము కరణషోడశకము కల అంగహారము లున్నవి. కరణా ష్టకము నుండి యధికముగా కరణములు కల అంగహారములన్నియు చతురశ్రతాలమానమున నుండు నవి యని ప్రకీర్తితము లయినవి. ఆరు మొదలుగా కరణములు కల అంగహారములు త్ర్యశ్రమానమున నుండు నవి యన నృత్తవిదు లనిరి. ఎచటనేని కొన్ని కరణములలో న్యూనత్వము గోచరించునేని పూరణ మొనర్ప దగును. ఒక్కొక కరణ క్రియను ఆవృత్తముచేసినచో క్రియాభ్యాస మొనరించినచో నట్టి పూరణము లభించును. కొన్ని యంగహారములలో నిరూపిత సంఖ్యాతి లంఘనమున ఆధిక్యము గోచరించునేని అచట తాల విధానానుసంధానమున సమత్వమును సంపాదింప వలెను. అభినవ గుప్త పదాను సంధానమున నీ విషయ మిదివరలో నిరూపితము. ప్రకృతమును పరిమితముగా నిరూపిత మయినది. అభినవోక్తుల నమున్నగాని భరతగుప్తము విశదము కాదనుట ప్రత్యంశమునను స్పష్ట మగుచునే యున్నది.

అంగహారసంఖ్యానియమః

అనంతతాంగహారాణాం కరణానాం వికల్పనాత్
కథం ద్వాత్రింశదుద్దిష్టా ఇతి చేచ్ఛృణు కథ్యతే
అంగాని పూర్వరంగస్య ద్విధా భిన్నాని షోడశ
తేషు ప్రత్యేకమేకస్య ప్రయోగాత్కేచిదూచిరే
అన్యే చతసృణాం తత్ర వర్తకీనాం ప్రవేశతః ౮౪౫
పిండీరేచకసంభూతం న్యాసాపన్యాసకైస్సహ
ప్రతిప్రయోగమష్టస్యురితి ద్వాత్రింశకంజగుః
వింశతిర్గీతకాంగాని చతుర్భిరధికాని చ
ఆసారితాని చత్వారి వర్ధమానకహేతవః?
వస్తు త్రివిధమేకైవ పాణికేతి పరే విదుః ౮౫౦

బ్రహ్మణో గీతివై చిత్ర్యాత్ ద్వాత్రింశచ్చేతి కేచన
వయం తు శివయోరిష్టాః దృష్టాదృష్టఫలప్రదాః
మహేశ్వరేణ గదితా ఇయంత ఇతి చక్ష్మహే

అంగహార సంఖ్యానియమము.

అంగహార నిరూపణారంభములో అంగహారముల సంఖ్యా విషయమున నానాభావములు వ్యాఖ్యానములో నిరూపితములయినవి. వానినిచట సంగ్రహించి నిరూపించుట యావశ్యకము. అంగహార సంఖ్యా నియమమున మొదట నిచట ప్రశ్నయున్నది. ఆ ప్రశ్న సమాధాన రూపముగా నానావాదుల వాదములు తుదకు జాయసేనాపతి నిశ్చితభావము నిందు నిరూపిత మయినది. ఈ సర్వభావ వ్యూహమునకు శ్రీమదభినవగుప్త పాదదర్శనమె మూలనిదానము.

ఆయా అంగహారములలో నాయా కరణము లుండుట నిరూపితమె. కొన్ని కరణము లుండగా కొన్ని అంగహారములు ప్రతిపాదితము లయినవి. మఱికొన్ని కరణము లుండగా మఱికొన్ని అంగహారములు కలుగ వచ్చునుగదా! కరణముల వికల్పనమున అంగహారము లనంత సంఖ్యాకములు కావచ్చునుగదా! అంగహారములలో కొన్ని కరణము లావృత్తములగుటయు నున్నది. అట్టి యావృత్తి విధానమును గూడ అంగహారములలో నాయోజితము చేయవచ్చును కదా! త్ర్యశ్రతాలమానమున షోడశకరణములే కలుగు నననేల? ఇంకను గలుగవచ్చును. అట్లే చతురశ్రతాల మానమున గలుగవచ్చును. ౧౦౮ కరణముల యోజనావిశేషమున నెన్నియేని అంగహారము లుదయింప వచ్చును. ద్వాత్రింశ దంగహారములె యని యన నేల? భరతుడు ముప్పదిరెం డంగహారములనే ఏల ఉద్దేశించెను? ఇందలి భావమేమి?.

ఇట్టి ప్రశ్న ముదయించగా నీ సమాధానమును ధారణ మొనరింపవలసి యున్నది. "శతిచేచ్ఛృణు!" ఇట్లందువేని నిది వినుము!. అని శ్రీ జాయసేనాపతి యిచట వివిధవాదములను ప్రతిపాదించెను. తన భావమును చెప్పెను.

కొందరి ట్లందురు. పూర్వరంగమునకు సంబంధించినవిగా పదునారంగములు నిరూపితము లయినవి. అవి రెండు విధములుగా నయి ముప్పదిరెండగుచున్నవి. ఒక్కొక యంగమున కొక్కొక అంగహారము ప్రయోగించుట యను నియమమున నంగహారములును ముప్పదిరెండగుచున్నవి.

కొందరి భావ మీ విధమున నున్నది. నర్తకీమణులు నలుగురు ప్రవేశింతురు. నలుగురును పిండీ, రేచక, న్యాస, అపన్యాసకములను విశేషములతో ప్రయోగింపగా నొక్కొక ప్రయోగమున పదునారు అంగహారము లగును. త్ర్యశ్ర చతురశ్ర విధానమున ద్వాత్రింశ దంగహారము లయినవి.

కొందరిట్లందురు. గీతకాంగములు ఇరువదినాలుగు. ఆసారితములు నాలుగు. ఈ ఆసారితములు వర్ధమానక హేతువులు. వస్తువు మూడు విధములు. పాణిక ఏక ప్రకారము, మొత్తము ముప్పదిరెండు. వీని యనుసారమున అంగహారములును ముప్పది రెండయినవి.

కొందరీ విధమున నందురు. బ్రహ్మగీతి వైచిత్ర్యమున నివి యిన్ని యయినవి. ఇట్లిన్ని భావము లంగహారముల విషయమున సూచించిరి. ఇంకను కొందరు ఆయా సంబంధ సంఖ్యానమున ద్వాత్రింశత్త్వము నుపపన్నము చేయుటకు తమతమ భావములను నిరూపింప వచ్చును కాని;

మేము అంగహారముల విషయమున నిట్టి భావముతో నున్నారము. ఈ నిరూపితములయిన అంగహారములె ఉమామహేశుల కభీష్టములు. ఇవియె దృష్టాదృష్ట ఫల ప్రదములు. వీనినే మహేశుడు నిరూపించినాడు. మహేశ నిరూపితములగు వీనినే తండువు భరతునకు బోధించినాడు. భరతుడు నిరూపించిన వానినే మే మిందు నిరూపించినాము. ఇవి ముప్పది రెండె అనియే మేమును చెప్పెదము.

మత్తస్ఖలితసంభ్రాంతభ్రమరాలీఢశోభితం
పృథాల్లక్ష్మాంగహారాణామిదముద్యానసన్నిభం ౮౫౫

ఉద్యానసమానముగా నీ అంగహారముల లక్షణము నిరూపిత మయినది. ఉద్యానమున మత్త=మదించిన స్ఖలత=తొట్రుపడిన, సంభ్రాంత=భ్రమణము పొందిన భ్రమరములచే నాలీఢములై యుద్యానము శోభాయుక్తముగ నున్నది. మత్తస్ఖలితము, సంభ్రాంతము, భ్రమరము, ఆలీఢము అను అంగహారములచే నీ లక్షణము శోభితమై యున్నదని పూర్వమువలె భావరమ్యతను భావించునది.

## రే చ క స్వ రూ ప ం.

పాదహస్తకటీగ్రీవా రేచకాంశ్చతురో బ్రువే
ఉభయోతథ వైకస్య పాదస్య ధరణీతలే
ఆక్రాంతం గమనం పార్ష్ణేరంగుష్ఠాగ్రస్య చాన్వితం
సమనోన్నమనై రంతర్బహిశ్చరణరేచకః
త్వరితం హంసపక్షస్య భ్రమణం హస్తరేచకః ౮౬౦
హస్తస్య కేచిద్వ్యాషంతే విరలప్రసృతాంగులేః
కట్యాః సమంతతో భ్రాంతిః కథ్యతే కటిరేచకః
శిరోవినమనాద్భ్రాంతిః గ్రీవాయాః కంఠరేచకః

## రే చ క స్వ రూ ప ము

కరణాంగహారముల నిరూపణ ప్రసంగమున రేచకములను జెప్పవలసి యున్నది. రేచకములను నవి నాలుగు గలవు. ఇవి

కరణములకు అంగహారములకు నుపకరింప గలవు. మొదటిది పాద రేచకము, రెండవది హస్త రేచకము. మూడవది కటిరేచకము, నాల్గవది గ్రీవా రేచకము. ఈనాలుగు రేచకముల నిచటనిరూపింతుము. రెండు పాదములకు గాని యొక పాదమునకు గాని భూతలమున నిరంతరము గమన ముండుట, ఈ గమనము పార్ష్ణి భాగమునకు అంగుష్ఠా గ్రభాగమునకు సంబంధించి యుండుట, పార్ష్ణి భాగమునకు అంగుష్ఠాగ్రభాగమునకు అంతఃబహిః నమనము ఉన్నమనము పాద రేచకమన దగును. హస్త రేచన మీ విధముగా నుండును. హంసపక్ష రూపముగా నున్న హస్తము నకు త్వరితముగా భ్రమణ ముండుట చలన ముండుట హస్త రేచకము, విరలములు విస్తృతములు నయిన వ్రేళులు కల హస్తమునకు త్వరిత చలనము హస్త రేచనమని కొందరు భావించిరి. కటి రేచిత మిట్లుండును. కటి భాగమునకు అంతట భ్రమణ ముండుట కటిరేచితము. గ్రీవా రేచన మీ విధమున నుండును. శిరోవినమనము వలన గలుగు భ్రమణ ముండుట గ్రీవా రేచనము. ఇదియే కంఠ రేచకము. ఇట్టి నాలుగు విధములయిన రేచిత విధానములను గుర్తింప వలెను.

పాఠాంతరవిధేస్త్వేనం లక్షణం పఠ్యతే యథా
రేచితాఖ్యః పృథగ్భావే వలనే చాభిధీయతే ౧౮
ఉద్వాహనాత్పృథగ్భావాచ్చలనాచ్చాపి రేచకః
పార్శ్వాత్పార్శ్వానుగమనం స్ఖలితైః స్ఖలితైర్గతైః
వివిధైశ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే
త్రికస్యోద్వర్తనం చైవ కటీచలనమేవ చ
తథాపసర్పణం చైవ కటిరేచక ఉచ్యతే ౧౦
ఉద్వర్తనం పరిక్షేపో విక్షేపః పరివర్తనం

విసర్పణం చ హస్తస్య హస్తరేచక ఉచ్యతే
ఉద్వాహనం సన్నమనం పార్శ్వాత్పార్శ్వంచ సంగతిః
భ్రమణం చేతి విజ్ఞేయో గ్రీవాయా రేచకో బుధైః
"తతో యే తండునా ప్రోక్తాస్త్వంగహారా మహాత్మనా ౪।౬౩
తాన్వః కరణసంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్''
ఇతి వ్యాహరతో నూనమేవమన్యే మునేర్మతాః
కరణైరంగహారైశ్చ సహితా ఏప రేచకాః
పుత్రేణ చ మునేరేతత్ప్రోక్తం తుంబురుణా యథా
"అంగహారాదిమధ్యాంతకరణై రేచకాన్విదుః'' ౪।౪౦
"పాదరేచక ఏకః స్యాత్" ఇత్యాదే సంఖ్యయోక్తయా
అపి కేవలవైశాఖప్రభృతిస్థానకస్థితైః
ప్రయుక్తాః పుణ్యసంపత్తిహేతవో రేచకా ఇమే
నియమేన భవంతీతి నూనం మునిరసూచయత్
"రేచకైరంగహారైశ్చ నృత్యంతం వీక్ష్య శంకరం" ౪।౪౩
ఇత్యాపి బ్రువతా స్పష్టం తదేవ మునినా కృతం

ఇతి రాజాధిరాజగణపతిదేవ
గజసాధనిక జాయసేనాపతి
విరచితాయాం నృత్తరత్నావల్యాం
కరణాంగహారవివేచనం
నామ చతుర్థోధ్యాయః

భరతగ్రంథము నందలి రేచక విధానములను అనుసరించి యిప్పటికీ నాలుగు రేచితములు నిరూపితము లయినవి. రేచకముల నిరూపించుటలో భరత నాట్యవేదము నందు పాఠాంతరము కలదు. తదనుసారమున నీ నాలుగు రేచకముల నిచట నిరూపింతుము. ఇవి పాఠాంతర రూపములని భావించుట వలన అభినవగుప్తుడును వ్యాఖ్యా

వివృతి నిరూపింప లేదు. ఇచట నిరూపితము లయిన "రేచితాఖ్యః" మొదలగు పదిపంక్తులు భరతుని గ్రంథము నందలివి. వీని భావ మీ విధముగా గ్రాహ్యము.

పృథగ్భావముతో—వేరుగా నుండుటలో చుట్టు కొనుటలో వలనములో త్రిప్పుటలో రేచితపదము నుపయోగింతురు. ఉత్సాహము కలిగి యుండుట వలనను, పృథక్ స్థితి కలదగుట వలనను, చలన వలనములు కలిగియుండుట వలనను అవయవముల విన్యాస విక్షేపమును రేచకము అనుట యుక్తముగనే యున్నది.

పాద రేచకములో పాదముల వివిధములగు సంచలనము లుండును. స్ఖలిత చలిత పదములతో ప్రక్క—ప్రక్కలకు గమనము చేయుట పాద రేచక మగును. వివిధములగు పదవిన్యాసములు చిత్రవిచిత్రములుగ నుండును. అందుకొన్ని విన్యాసములు స్ఖలితములు. పదముల తొట్రుపాటందు గోచరించును. కొన్ని విన్యాసములు చలితములతో కదలికలతో నుండును. ఇట్టి విన్యాసములతో పార్శ్వపార్శ్వములకు జరుగుట గమించుట పాద రేచిత మని పరిభాషిత మయినది.

కటిరేచకము మరి యొకటి. ఇందు త్రిక ముద్వర్తిత మగును. త్రిక మన్నది పృష్ఠమున పిఱుదు భాగపార్శ్వము. పృష్ఠపీఠము తిరుగుళ్లు పడుట యిందుండును. కటి వలిత మగుట యుండును. కటివలన మనునది నియతమయిన మెలికగా నడుము వంపుసొంపు పిఱుదుల త్రిప్పుటలతో కటిసంచలనములతో జరుగుళ్ళుండుట కటి రేచక మగును.

హస్త రేచకము మూడవది. హస్తాగ్రముగా జెప్పబడిన హస్తము నిచట హస్తపదమున గుర్తింపవచ్చును. హస్తమునకు సంబంధించిన అయిదు విక్షేపము లిచట ముఖ్యములు. మొదటిది

యుద్వర్తనము. హస్తమును బోర్లించుట వెల్లకిల వేయుట లను వి వరుసలతో గూడిన వర్తనములతో నుండవలెను. పరిక్షేపము రెండవది. హస్తము నటునిటు విదల్చుట, విసరుట దీని స్వరూపము. మూడవది. విక్షేపము వేగక్రియతో దూరము విదల్చుట. నాల్గవది పరివర్తనము. నానాస్థితికములగు హస్తవిన్యాసముల మార్పు. అయిదవది విసర్పణము. విసర్పణము ప్రసర్పణము నొకటి ఏక స్థానమున నుండుట గాక స్థానాంతరమునకు జరుగుట. ఇట్లు హస్తము నానా విన్యాసములు కలదగుట హస్త రేచకము.

గ్రీవా రేచకము కంఠ రేచకము నాల్గవది. గ్రీవా రేచకమున ఉద్వాహన మనునది యొకటి యున్నది. ఇది కంఠధారణ స్థితిని సూచించు క్రియ. మరి యొకటి సన్నమనము. వంగియుండుట. మెడవంపులో నిది యున్నది. మెడ వంపు లనేకవిధములు. ముందు వెనుకలకు సన్నము అగుట పార్శ్వములకు సన్నత మగుట ఇంకను సవ్యమపసవ్యముగా మెడను త్రిప్పుట. ఇట్టివి గ్రీవాక్రియలు. ఈ క్రియలుండుట గ్రీవా రేచకము. ఈ విన్యాస విలాసముల ననుసరించి నాల్గు రేచకములను గుర్తింపవలెను.

ఈ చెప్పిన రేచక చతుష్టయము పాఠాంతరముగా నున్నది. అయినను లోకాదరము పొంది యుండుటచే నిందును సంగృహీతమయినది.

“తతో యే తండునా ప్రోక్తాస్త్వంగహారా మహాత్మనా
తాన్ వః కరణసంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్”

అను నీ శ్లోకము భరతనాట్యవేదమున నున్నది. దీని భావమిదివరలో నిరూపిత మయినను ప్రకృత సంగతికై యిట్లు భావ నీయము. భరతప్రయోగము చూచినపిమ్మట భువనేశ్వరుడు తండువును

పిలిచి "భరతున కంగహారముల ప్రయోగము చెప్పుము." అనినాడు. అనంతరము తండువు భరతునకు ప్రయోగ ముపదేశించినాడు. ఈ విషయమును భరతు డాత్రేయాది మునులకు తెలియజెప్పుచు నిట్లనెను.

"మహాత్ముడగు తండువు శివకథ నానంతరము ఏ అంగ హారములను నిరూపించెనో, వానిసి కరణ సంయుక్తములు సరేచక ములు నగు వానిని మీకు వ్యాఖ్యానింతును." అని యనిన భరతముని భావము నిట్లు గ్రహింప వలెను. రేచకములు కరణములతో అంగ హారములతో కూడియుండునవె ఇవి అంగహారములకన్న కరణముల కన్న వేరుగా కలవు. ఇదియె మునిమతము. మునిపుత్రుడగు తుంబురువును ఇట్లుచెప్పెను. "అంగహారాది మధ్యాంతకరణైః రేచకాన్విదుః" అంగహారముల ఆరంభమున మధ్యభాగమున అంతిమ భాగమున నుండదగు కరణములతో రేచకములు కూడి యుండును. ఇట్లె వీనిని గుర్తించిరి. ఇట్లె తుంబురువు ననుటచే కరణాంగహారములకన్న రేచకములు వేరుగా నున్నవనుట విశద మయినది. కాగా, రేచకములు వేరుగా నిరూపణీయములు. అవి నాలుగు. వీనినె మొదట నిర్దేశించితిమి. భరత గ్రంథములో వాని పాఠాంతరముండుటచే నవియు నాదర పాత్రములుగా నుండుట చే నిరూపించితిమి.

ఇచట నొక విషయము సంగ్రాహ్యము. రేచకముల జెప్పినప్పటి అభినవభారతిలో "అంగహారాభిధానాత్తు కరణై రేచకాన్విదుః" అను తుంబురు వాక్యము నిరూపిత మయినది. ఆపాఠము సరియగు నర్థ మిచ్చునది గా లేదని జాయసేనాపతి సూచించిన పాఠమె స్పష్టార్థ నిరూపకమని గుర్తించునది.

"పాదరేచక ఏకః స్యాత్" అనిభరతుడు రేచకకథనావసరమున ననెను. ఆశ్లోకమిట్లున్నది.

"పాదరేచక ఏకః స్యాత్ ద్వితీయః కటిరేచకః
కరరేచకస్తృతీయస్తు చతుర్థః కంఠరేచకః"

పాదరేచకము మొదటిది. ద్వితీయము కటిరేచకము, కటిరేచకము తృతీయము. చతుర్థము కంఠరేచకము. ఇందు భరతుడు "ఏకః ద్వితీయః తృతీయః చతుర్థః" అని సంఖ్యను నిరూపించెను. ఇట్లు సంఖ్యానిరూపణమున నిట్లు భావము సంగ్రాహ్యము కాగలదు. ఈ రేచకములను వేరుగా వైశాఖమండలాది స్థానకము లందుండి ప్రయోగింప వలెను. అట్లు ప్రయుక్తము లయిన ఈ రేచకములు నియతముగా పుణ్యసంపత్తి హేతువు లగును. అని ముని దీన సూచించెను. ఈ రేచకములు వైశాఖరేచితమను కరణమున సంగృహీతము లగుటనుగూడ భరతుడు సూచించె నని అభినవు డనెను. రేచకములు కరణాంగహారాంతర్భూతము లయినను ఇట్లు వీని నిర్దేశించుట "పృథగదృష్టార్థతాఖ్యాపనార్థం" వేరుగా వీనికి అదృష్టార్థత యున్నదని ఖ్యాపనము చేయుటకే యగును. ఈ రేచకములు సుకుమారగీతవాద్యప్రధానమయిన ప్రయోగమున ప్రయోగింపదగి యున్నవి. ఇట్లీ రేచకములు పుణ్యసంపత్తి హేతువులు.

ఈ యంశమును భరతుడు స్థలాంతరమున గూడ సూచించినాడు. రేచకములతో నంగహారములతో నర్తన మొనరించు శంకరుని చూచి సుకుమార ప్రయోగమున నర్తన మొనరించు గౌరీదేవిని చూచి నందిభద్రాదులు వీరభద్రాదులు పిండీబంధములు నాచరించిరి. మహేశ్వర చరితమును వారా విధమున ప్రయోగించిరి. మహేశ్వర చరితము నిట్లు ప్రయోగించు వారు ప్రయోగింప జేయు

వారును సర్వపాప విశుద్ధాత్ములై శివలోకము పొందుదురు. ఇది యంతయు భరతభావము. ఈ భావార్థసారము "రేచకములు పుణ్యసంపత్తిహేతువులు" అనుటను విశదము చేయుచున్నవి. ఇట్టిదిది సర్వమీశ్వర పరితోషకారి. ఈ అభిప్రాయమె మునికభీష్టమనుట సంగ్రాహ్యము.

ఈ నృత్తవిధి నాట్యాత్మక ప్రయోగముకన్న విలక్షణము అభినయ విధానమున సాక్షాత్కార కల్పముగ నాట్యరూపత లేదు. ఈ అభినయవిధిలో చతుర్విధాభినయ యోగము లేదు. రసభావముల ప్రాధాన్యమున లేదు. నర్తకీ వృద్ధి ననుసరించి గీతవాద్యనృత్తములకు యథేష్టముగా ప్రాధాన్య ముండును.

నృత్తరత్నావలీ వ్యాఖ్యానము సాహితీవల్లభాఖ్యానము
కరణాంగహారవివేచనము అను
చతుర్థాధ్యాయము



రాయలముద్రణాలయము — తణుకు.

# శ్రీ నృత్తరత్నావలీ

## ద్వితీయ భాగ

## విషయసూచిక

### ౫, ౬, ౭, ౮ అధ్యాయములు.

నితర తాలవిశేషములు—ఏకసరాది గతులు—స్వస్తికపూర్వములుకాగా భేదాంతరములు - గతుల అనంతత.

సప్తమాధ్యాయము.

౧. నృత్యారంభయోగ్యతిథులు — రంగభూమి - నాట్యశిక్షారంభమున విఘ్నేశ్వరాదిపూజ — శిక్షాపద్ధతి — శిక్షాయోగ్యకన్య — కన్యానేపథ్యము — శిక్షోపకరణము — దండికాలక్షణము — దండికోపయోగము — అభ్యాసక్రమము అభ్యాసమున గోచరించు నృత్తరహస్యములు - పాటసిద్ధి.

౨. భావప్రాధాన్యము - కరానుసారి-దృష్టిమనోభావరీతి — వాద్యపద్ధతి - మతంగముని బృహద్దేశివిశేషము — వాద్యపద్ధతిలోని శుద్ధచిత్రభేదములు—సమహస్తకృతి - నర్తకీప్రవేశము-పు[illegible]లము — శుష్కవాద్యము—యోజఖండయతి మొదలగునవి — తాలవాద్యములతో పాటములు — గీతము—లయచ్ఛేదము — ఆవృత్తి.

౩. చిత్రపద్ధతి—గీత సంబంధము—దేశీనృత్త భేదములు—పేరణి—పేరణి లక్షణము—సహాయులు—వారి ప్రవేశము—పంచ ౫ పేరణాంగములు—నృత్తకైవారఘర్ఘరాదులు—ఘర్ఘరమున ౭ పాటభేదములు—పేరణాంగము వికటముగీతము—

౪. పేరణిపద్ధతి—సమహస్తవాదనము—యతిరిగోణీ—శుష్కవాద్యము ప్రవేశము నర్తనము—కైవారాలాపము—ఘర్ఘరము గజ్జెలు పాదచాలనము—అంతరాదులు—గీతోచితయతి వాదనము—ఘర్ఘరీ వాదనము—ఆభోగగానము—గజరవాదనము—వికటనర్తనము—అన్యప్రబంధముల ప్రయోగము—

౫. దేశీ పద్ధతి—ఆతోద్యమేలనము—సమహస్తాదులు—నర్తకిరంగప్రవేశము-ముఖవాద్యము—పుష్పాంజలి-కాంస్యతాలనిషేధము—తగినతాలరీతులు ప్రేంఖణపద్ధతి—ఝెంకారాదులు— ప్రేంఖణనర్తనలక్షణము— సూచనర్తనము—శుద్ధసాలగభేదములు—నవ ౯ ప్రబంధములు—నర్తనప్రకారములు—తదుచిత సప్త ౭ తాలములు—

౬. రాసకనర్తనము-చతుర్విధబంధము-పిండీ ప్రభృతులు-పాత్రసంఖ్య—నేపథ్యము—ప్రవేశము—పాత్రప్రాశస్త్యవర్ణనము — రాసకోచితగీతము —

గీతార్థాభినయము-నర్తనమునప్రవేశనిర్గమాదివిశేషములు — చర్చలీనర్తనము నాట్యరాసకము—దండరాసకము—నర్తకీసంఖ్య— దండలక్షణము — దండస్థానమున చామరచ్ఛురికాదిధారణము—వాద్యవాద్యాది విశేషములు—దండమేలనము సకలవాద్యప్రబంధముల యుక్తత-

౨. శివప్రియవర్తనము — వాద్యనేపద్యములు— పాత్రలశివభక్తత— నారీనరులపాత్రత—గానము శివపరమగుట — శివోత్సవకర్తవ్యము—చింతునృత్తము—చింతుగానము—చిత్తునర్తనము — కంచుకనర్తనము— గతులు — వాద్యప్రబంధములు—కంచుకవర్ణనము—ఖాండికనృత్తము—

౩. వివిధరూపరుతాద్యనుకారము—హాస్యప్రాయత—వినోదపలము— పుటిసణీనృత్తము-చందాలనర్తకి-గానములుకిరాతరూపశివస్తుతిపరములగుట- వాద్యవాదనవిశేషములు—గత్యాదివిశేషము-పురుషుడును ప్రయోగింపవచ్చుననుట

౪. బహురూపనృత్తము— గ్రామ్యతానిషేధము—కోల్లాటనర్తనము— గడపైనృత్తము—దుష్కరత—చిత్రగోండలి— కుండలీనృత్తము — నర్తకలక్షణము— వాద్యబృందము—గాయకబృందము—సంప్రదాయము— బృందసంఖ్య— పంచవిధత—ఉత్తమోత్తమాదులు—కోలాహలము — ఉత్సవాదులలో ఉపయోగము-గాతృవాదకసంఖ్య—రంగమంటపము—త్రివిధత—నాట్యమండపవర్ణనము సభాపతి—సభ్యగుణములు.

అష్టమాధ్యాయము.

౧. ప్రేక్షాకాలము—సభాపతిసమాగమన వర్ణనము—నారీజనము—దీపనృత్యము—సపరివారసభాపతి— మంత్రిపురోహితాదులు — బృందవిన్యాసము— శుష్కవాద్యవాదనము—నర్తకీప్రవేశము— యవనికాచతుష్టయము — తద్ధారిణీ వర్ణనము—వారి అపసరణము—ప్రత్యపసరణము—నర్తకీసమ్మానము — బృందసమ్మానము—కవిసహృదయ సమ్మానము.

గ్రంథసమాప్తి.